శ్రీ

# రాణా ప్రతాపసింహ చరిత్ర



కర్త:
కవి సార్వభౌమ
దు. రాజశేఖర శతావధాని.

56.00



వెల రు. ~~4-00~~

శ్రీ

# రాణా ప్రతాపసింహ చరిత్ర

## రాజశేఖర కవి ప్రణీతము.

కవిత్వము ♦ తన్మయత్వము

---

## శ్రీ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి విపుల సమీక్ష.

---

ప్రస్తుత గ్రంథాన్ని ఆంగ్ల భాషా నిష్ణాతులు శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు మిక్కిలి మెచ్చుకొన్నారంటే నాబోట్ల లెక్కేమిటి? యీయన పేరు రాజశేఖరుడు. యీపేరు పరమేశ్వరునిదే కాని. ప్రస్తుత గ్రంథ రచనా సందర్భంలోవున్న కొన్ని ఘట్టాలనుబట్టి చూస్తే ప్రతాపసింహునికి పర్యాయ మేమో అని ప్రతి సహృదయునికీ గోచరిస్తుందని నానిశ్చయం. కవులలో తన్మయత్వం కలవారు కొందఱే వుంటారు. ఆధునికులలో యీ రాజశేఖరకవి తన్మయత్వంకల కవి అని రచన వ్యాఖ్యానిస్తూవుంది వుదాహరించ వలసి వస్తే గ్రంథంలో నూటికి 50 పద్యాలేనా వుదాహరించవలసి వస్తుంది. కనుక కొంచెం మాత్రమే వుదాహరిస్తాను.

మ॥ రవి యాస్తాద్రిని మొబ్బుగా కఖిల పారావారముల్ క్రుంగుఁగా
కవనీ చక్రము ప్రీలుగాక చెడుగా కాకాశ మయ్యుగ్ర భై
రవుఁడై లోకముఁ గాల్చుఁగాని లవముల్ రాణాప్రతాపుండు గౌ
రవముల్ గోల్పడి మర్త్యమాత్రునకు శీర్షం బొగ్గ దెప్పట్టునన్.

యీ మాటలు ప్రతాపుని మంత్రిన్నీ కులవృద్ధున్నూ పరమ పూజ్యుడున్నూ అయిన "సలుంబ్రా-కృష్ణసింహుడు" అగ్బరు చక్రవర్తికి సర్వసేనాధి

ఇవన్నీ బావమఱదిన్నీ అయిన మానసింహ రాజస్యున కిచ్చే జవాబులోనివి మానసింహుని తండ్రి భగవాన్దాసు తాత్కాలిక సుఖంకోసం తన కూతుర్ని (దిగ్దిగ్ధిక్) అగ్బరు చక్రవర్తికిచ్చి పెండ్లిచేసి—కులగౌరవాన్ని కాపాడు కొంటూ వనవాసం అనుభవిస్తూ వున్న ప్రతాపసింహుణ్ణికూడా తమతోపాటు చక్రవర్తికి లోబడవలసిందని రాయబారాన్ని తెచ్చిన సందర్భంలోనివి. ప్రతాపుని అభిప్రాయాన్ని వ్యాఖ్యానించే చిన్న పద్యంకూడా వొకటి వుటంకిస్తాను ... ........... .... ..........

ఈ రెండు చిన్న పద్యాలిస్తే యేం తేలుతుంది ఆయా పద్యాలున్న ద్వితీయాశ్వాసం 330 పద్యాలున్నూ వుదాహరిస్తే బాగా తృప్తి కలుగుతుంది. ప్రతాపరుద్రుడికి ప్రతాపసింహుడు దీటు మాత్రమే కాదు-హెచ్చు. ఇవి ఆకవికి లోపైనను, తన్మయత్వంలో-హెచ్చు. రోగడమాటలు ప్రతాప రాణావారి మంత్రివి. ఈమంత్రిని సర్వవిధాలా భీష్ముడే అని చెప్పడంలో అతిశయోక్తి కనపడదు. ఆ గ్రంథంలోవున్న పాత్రలన్నీ యే కళంకము లేనివిగా కవి చిత్రించి వున్నాడు. రాణాప్రతాపుణ్ణిన్నీ రాముణ్ణిన్నీ త్రాసులోపెట్టి తూస్తే ప్రతాపుడే అసిధారావ్రతంలో చాలా మొగ్గుతాడు. కుశలవులు రాముణ్ణి యెత్తి పొడిచారు. ప్రతాపుణ్ణే అయితే యెత్తి పొడవలేరనే తోస్తుంది. తగిన పదార్థానికి తగిన పాచకుడు లభిస్తే రుచి కలిగినట్లు ఈ రాజశేఖరకవివల్ల ప్రతాపుడి ప్రతాపం శోభించింది. యెక్కడ యెంతవఱకు వ్రాయడం అవసరమో అక్కడ అంతవఱకే వ్రాసి చదువరులకు విసుగులేని పద్ధతిని గ్రంథరచన సాగించడము సుఖసుఖాల పట్టు పడేదికాదు. ఆపద్ధతి ఈ రాజశేఖర కవికి లభించింది. ఈ గ్రంథంలో వచనాలు లేవు అన్నీ ఛందోమయాలే. సుప్రసిద్ధమైన పద్యాలే. సుమారు యెనిమిది రకాలు వాడబడ్డాయి. వుదాహరించవలసివస్తే చాలా స్థలం ఆక్రమిస్తుంది సీసపద్యం. ............ ..............

రాజశేఖర కవిగారి 'రచనలో, యెంతసేపు పరిశీలించినా పొల్లుమాటలు కనబడవు. కవిత్వం, మూడు వంతులలో వొకవంతు మాత్రమే

దరహంమీద, తెలుగు పదాలు కలదిగా వుంటుంది. తక్కిన రెండువంతులూ తత్సమ పదాలుగా వుంటాయి. కాని, ప్రసాదగుణ భూయిష్ఠంగా వుండే ధార కావడంచేత కదళీపాకంగా అందరికీ అందుబాటులో వుంటుంది.

ధారాళమైన ధారతో చదువరులకు చదివినకొద్దీ చదవాలనే కోర్కెని గలిగించే శైలిలో వున్నప్పటికీ అరః కట భారత-రామాయణాల మాదిరిగా సర్వే సర్వత్ర తెలిసింది కాకపోబట్టి వాట్లమాదిరిని ఈ కవిత్వం వ్యాప్తికి రాకపోయింది గాని, అలాగె కాకపోతే, ఈ రాణాప్రతాపచరిత్ర రామాయణం లాగ వ్యాపించ తగ్గది. ఈప్రతాపుడు రాముడికంటె ఏ సుగుణంలోనూ తీసిపోడు. ఈ రాజశేఖరకవి కవిత్వం రామాయణగాధ తెలుగులో రచించిన కవుల కవిత్వానికిన్నీ తీసిపోదు.

మ॥ అమరోద్యానమువోలె నెల్లెడ సమగ్రానందముల్ బెంచి లో
కముఁ గల్యాణపు మండపంబటు వెలుంగన్ జేయు స్వాతంత్ర్య ధ
ర్మ మహాదేవత మున్గెఁ గిల్బిష సముద్రంబందునన్ రక్త హ
స్తములన్ లేపిన లేచు లేవదణు మాత్రన్ రిక్త హస్తంబులన్.

నాలుగో చరణంలోవున్న "రక్తహస్త-రిక్తహస్త" శబ్దకూడిక మిక్కిలీ హృదయంగమం. యుద్ధభాగంలో ఈకవి కవిత్వం తిక్కన సోమయాజిని జ్ఞప్తికి తెస్తూ వుంటుంది.

ఉ॥ అస్తలి విక్రమించి భయదాహవశౌర్యుఁడు శ్యామసింహ భూ
భృత్తిలకుండు శీర్షకము భేదిల మోదును ఘాసు ఖడ్గ ము
చ్చ్రైత్తి వియత్తలంబులకుఁ ద్రెవ్వఁగఁగొట్టి హయంబుఁగూల్చ నో
రెత్తక వాఁడు మౌనము వహించుచుఁ బాటెను నేల దూఁకుచున్.

ఈలాటి పద్యాలు వరుస వెంబడిని వుదాహరించ వలసిన వున్నాయి కవి అపురాతనుడే అయినా కవిత్వం అపురాతనంగా వుండదు.

లయీ పుస్తకం వీరరస ప్రధానం. రాజపుత్రులకూ మహమ్మదీయులకూ, సంబంధించిన యుద్ధపద్ధతిని తెల్పేది. కవి మనఆంధ్రుడు. రాయలసీమ వాడు. ఇంటిపేరు దుర్భాకవారు. మహాక వెంకటాచల శాస్త్రుల్లు గారిని

మేము అడియారు ఆనేబిసంటు సభకు వెళ్ళినప్పుడు యిప్పటికి యేభై యేళ్ళ క్రిందట సందర్శించి వున్నాం. బహుశః ఆదుద్బాకవారున్నూ యీదుద్బాక వారున్నూ వొకరే యేమో. భవతు. మొత్తం కవి మహమ్మదీయులకు అను కూలించేవాడు మాత్రం కాదు, అయితే మాత్రం, రెండూ రెండుకళ్ళగానే చూచుకొని రచన సాగించాడు గాని, పక్షపాతంగా కలం నడపలేదు. అగ్బరు గుణాతిశయాన్ని శత్రువులచేత గూడ చక్కగా అనువదింప చేశాడు. సందే హం లేదు. కాని, యుద్ధవర్ణనలో మాత్రం రాజపుత్రుల యందు నలుసంత పక్షపాతంగా కల (అవశంగానే—అనుకుందాం) నడిచిందేమో' అని నాకు అనుమానం. ... బాహుబలాఢ్యులున్నూ, పౌరుష ప్రధానులున్నూ అయిన రాజపుత్ర వీరులు—లక్షలుకొలది మహమ్మదీయులతో వేలకొలదిగా మాత్రమే వున్న తాము సుమారు 25 యేండ్లు నిలిచి పోరాడి నిర్వహించ గలిగారన్నది పరమార్థం రాజపుత్రులది తమదేశంలో మట్టుకు తమ స్వాతంత్ర్యం నిల్పు కొనే ప్రయత్నమే కాని అగ్బరు చక్రవర్తి ప్రభుత్వాన్ని యీ దేశాన్నుంచి ఆసీమాంతం చెరుపుదామనే ప్రయత్నంకాదు. చక్రవర్తికో? తన గొడుగుతప్ప యింకోగొడుగెక్కడా వుండనేకూడదనే గౌరవాకాంక్ష. అవును. అతడు సార్వభౌముడు కదా' పాపం ఆబిరుదం అర్థవంతం కావాలంటే యింకోఘా రుడు తనకు మొక్కనివాడు వుండడంవల్ల కాదు. యీదోషం మహాసుభావు డైన అగ్బరుది కాదు. అది అతడు ధరించిన సార్వభౌమ బిరుదాని దనుకో వాలి. ఆయీ బిరుదే చాలా పోరాలు చేయించింది అగ్బరుచేత. గ్రంధకర్త ప్రతాపుణ్ణెంత చక్కగా కాపాడి దిద్ది తీర్చాడో అగ్బరు చక్రవర్తినికూడా అంత శ్రద్ధాభక్తులతో దిద్ది తీర్చి ధీరోదాత్త నాయకాగ్రేసరుణ్ణిగా ప్రకటించాడు. వాల్మీక్యాదులు రావణాదులను యింత చక్కగా చిత్రించనే లేదన్నా తప్పు లేదనుకుంటాను.

ప్రతాపుని గుణగనిబాతికి లొంగిపోయిన అబ్దురహీమాను మొదలైన పాదుషా మంత్రుల స్వామిభక్తిదృష్టిని యీ కవి బహు చక్కగా ప్రక టించాడు.

తే॥ మనుజపతిమౌళిమన్మధ మన్మధుండు
చైతకాశ్వముపైన సాక్షాత్కరించి
దివ్యదర్శన మిచ్చె నా తేజమునకు
నంజలి ఘటించి యాత్మోపహార మిడుదు.

అబ్దూరహిమాను అనే పెద్దమంత్రి అగ్బరు చక్రవర్తితో మహా సభలో మాట్లాడే మాటలను వివరించే పద్యాలు సుమారు 25టి దాకా వున్నాయి. ఆపద్యాలలో యిది వొకటి పద్యంలోవున్న చైతకం రాణాప్రతాప సింహానికి ప్రాణతుల్యమైన వాహనం అబ్దూరహిమాను యెంతటి సహృదయుడూ కాక పోతే తన్ను యుద్ధంలో యెదుర్కొనడానికై సర్వ సన్నాహంతో వచ్చిన (శత్రువు) ప్రతాపుణ్ణి అంత పేర్మితో తనప్రభువు సమక్షంలో నిర్దేశించ గలడా? యింకో పద్యంకూడా వుదాహరిస్తాను.

మ॥ అకటా! నీవటె ధర్మముల్ దెలిసి రాజ్యంబేలఁగా లేఁడొ, మ
చ్చికమై భూప్రజఁ బుత్రులంబలెఁ గృపా శ్రీఁ జూడఁగా లేఁడొ, పా
యక వర్ణాశ్రమ ధర్మ పద్ధతి తిరంబై నిల్పఁగా లేఁడొ, యెం
దుకు నాతండు స్వతంత్రుఁడై నిలువఁగాదో? యానతిఁ గోరెదన్.

ఇంత నిర్భయంగా నిష్పక్ష పాతంగా-చక్రవర్తితో - (చాటునా మాటునా కాదు) మహాసభలో - శత్రుగుణాలను వ్యాఖ్యానించే రాజకీయోద్యోగులు వుంటే వుంటారేమో కాని విని సహించడమే కాకుండా అభినందింపడంకూడా వున్న సార్వభౌముడు ఒక్క అగ్బరేకాని యింకొకడు లేడనే చెప్పొచ్చు రాణాప్రతాపసింహచరిత్ర అనే పేరుతో కవి దీన్ని రచించినా 'అగ్బరు చరిత్ర' అనే నామాంతరంతో దీన్ని పిలిస్తే పిలవవచ్చుననే నే ననుకొంటాను. నిజానికి అగ్బరు అట్టి మహానుభావుడో? కాడో? కాని గ్రంధకర్త రచన అతణ్ణినిషధయోగ్య - చక్రవర్తి శిరోభూషణంగా చిత్రించింది. బిల్హణుడేమన్నాడు? రావణాసురుణ్ణి దుర్మార్గుణ్ణి చేసినవాళ్లూ కవులే. రాముణ్ణి మహామహుణ్ణి చేసినవాళ్లూ

కవులే అన్నాడు. (విక్రమాంకచరిత్ర చూ) దాదాపు రెండువేల పద్యాలు యీ కవి యీచరిత్రలో లిఖించాడు. చేదస్తంగా పెంచిన ఘట్టం వకటి లేదు. ఋతువర్ణనకు గాని సూర్యోదయ—సూర్యాస్తమయాలకు గాని వొక్కొక్క పద్యంకంటె ఖర్చు పెట్టి నట్లు లేదు.

... ... . ... ... ....

ఈమాదిరి పద్యాలు సర్వత్రా వున్నాయి. చదువరులు చూచు కోవలసిందేగాని వుదాహరించవలసివస్తే వ్యాసం తెమలదు. సూత్ర ప్రాయంగా సుమారు పదేళ్ళకు పూర్వం యీపుస్తకాన్ని నేను చదివి యిచ్చిన అభిప్రాయం మూడు నాల్గు పంక్తులు మాత్రమే-దానికి యీ విమర్శనం భాష్యం వంటిదేకాని అన్యం కాదు. ...

ప్రస్తుత గ్రంథకర్త తురుష్క భాషాపదాలు చాలా వాడవలసి వచ్చింది. ఆయారాజుల నామధేయాలు దేశాలపేళ్లు పట్టణాలపేళ్ళు స్త్రీల పేళ్ళు సమస్తమూ ఆభాషలోనే వున్నాయి. వాట్లని మార్చడం యెట్లా? కొన్ని సంస్కృతభాషా సంపర్కం కలిగివున్నా తేజసింగు వగైరా అవిన్నీ అపభ్రం శంగానే వున్నాయి. అట్టి శబ్దాల విషయంలో గ్రంథకర్త బాధ్యుడు కాడని విజ్ఞు లెరిగినదే. యెన్నో లోకోక్తులు సమయోచితంగా రసోచితంగా యీయన వాడివున్నాడు. అందులో కొన్ని గోదావరీ మండలం వారికి అపరి చితాలు. అట్టిది ఒకటి చూపుతాను. యీలోకోక్తి "పాండవబీడు" ఈ ప్రాంతంలో "అయ్యవార్లంగారి నట్టిల్లు" పర్యాయంగా వుంటుందేమో అను కుంటాను. ఇది వాడినచోటు

గీ॥ వట్టి పాండవ బీడు మేవాడ సీమ!

సందర్భాన్నిబట్టి చూస్తే శుద్ధదరిద్ర ప్రదేశమనియ్యేవే తేల్తూవుంది. యింకా కొన్ని యిలాటివే వున్నాయి.

స్థాలీపులాకంగా ఈ రాజశేఖర కవి కవిత్వాన్ని గూర్చి కొన్ని మాటలు వ్రాశాను. ఈయన దేశభక్తి పరవశుడే కాని కులాచారాలయందు పట్టుదల కలవాడు. ఈ విషయం కవిత్వంలో సర్వత్రా గోచరిస్తుంది. సంస్కృత భాషలో కూడా మంచిప్రవేశం కనబడుతుంది. తెలుగు

మెట్రిక్యులేషన్ వఱకూ చదివిన పాఠశాలలోనే అభ్యసించి వుండాలి. కీ॥ శే॥ గిడుగు రామమూర్తి పంతులుగారు వొక్క క్షణముకూడా వ్యర్థం చేయకుండా జీవితాన్ని భాషకోసం వ్యయించిన నిష్కల్మష హృదయుడు. ఆయీ రాణాచరిత్రం ఆయన చూచివుంటే చాలా సంతోషించేవాడు. యెంతేనా వ్రాసేవాడు కూడాను. నాకు తెలిసినంతలో విమర్శించాను. యీనాటి ధన్య కవులలో యీయన చిటికెనవ్రేలి మీదికి వచ్చేవాడు గాని అల్లాటప్పావాడు కాడు.

శ్లో॥ కవిః కరోతి కావ్యాని లాలయత్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభం॥

మ॥ భగవంతుండగు రాజశేఖరుఁడు నీపట్లం గఁలాఁ డాంధ్రమం
దగణేయంబగు కీర్తి నీఁగల ప్రతాపాధీశచారిత్రముఞ్
సొగసొరీతి రచించి సత్కవుల మెచ్చుల్ హెచ్చుగాఁ గొంటి వెం
తగ వర్ణింతును రాజశేఖర కవీ! ధన్యుండ వీ వన్నిఁటఞ్

ᵒᵒᵒOOᵒᵒᵒ

# రాణా ప్రతాపసింహ చరిత్ర

=విశ్వనాథ సత్యనారాయణ=

---

"భారతము" దేశభక్తిని పెంపొందించునని రష్యను దేశస్థులు తమ భాషలోనికి అనువర్తించుకొను చున్నారట. భారతమున కాశక్తి యున్నచో "రాణాప్రతాపసింహ చరిత్ర"కును ఆశక్తి కలదు.

రాణాప్రతాపుఁడు పేరునకు రాజపుత్రుఁడు. ఆంధ్రుఁడు కాడు. ధర్మరాజాంధ్రుఁడా? కృష్ణుడాంధ్రుఁడా? రాముఁడాంధ్రుఁడా? శంకరుఁ డాంధ్రుఁడా! వారందఱు భారతీయులు. అందుచేత ఆసేతుశీతనగము వారి కథలు పాడిరి. అట్లే ప్రతాపుఁడును.

భారతము పూర్వకాలము కథనే చెప్పును. అందులో నున్న ధర్మముమాత్రమే మనజాతిది. ఆ విషయము ద్వాపరయుగము నాఁటిది. మన పరిస్థితులతో సంబంధము లేనిది. ప్రతాపసింహచరిత్ర మన ధర్మమునే గాక మనపరిస్థితులుగూడ చెప్పును. అగ్బరు చక్రవర్తితో పాతికయేండ్లు హోరాహోరి పోరాడి—స్వదేశము వదలి—కొండలలో గుట్టలలో నివసించి తిండిలేక గడ్డిరొట్టెలు తిని—దైవవశమున మఱల స్వాతంత్ర్యము సంపాదించిన మహాపురుషుఁడు,రాణాప్రతాపుఁడు. ఆయనకన్న ధర్మరాజాదులేమియు నెక్కువవారు కారు. వస్తురమ్యతకుఁగాని, కథా చమత్కారమునకు గాని, ఇందలి భిన్నపాత్రల భిన్నతా విశిష్టతకుఁగాని భారతమునకీ గ్రంథము తీసిపోదు.

వస్తు విటువంటిది. కవి-యెటువంటివాఁడు? వ్యాసునకు తిక్కన్నకు నెంత వీరరసావేశ మున్నదో యంత వీరరసావేశము గలవాఁడు. వెనుకటికి బ్ర॥ శ్రీ॥ చెళ్లపిళ్ల-వెంకటశాస్త్రిగారిని ఎవరో ప్రశ్నించిరట—"భాగవతము పోతన్నగారు వ్రాయనిచో, మఱి వ్రాయుటకు సమర్థు లెవ"రని. దాసుల పురుషోత్తమ కవియని వారే సమాధానము చెప్పిరట నన్నెవరైన భారతము లోని యుద్ధపంచకము తిక్కన్నగారు వ్రాయకయుండుచో మఱియెవరు వ్రాయఁగలుగుదురని ప్రశ్నించినచో నేను "రాజశేఖర - శతావధానిగా"రని సమాధానము చెప్పెద. ఈ గ్రంథములో చివరి నాల్గాశ్వాసములు యుద్ధము తప్ప వేఱే లేదు. యుద్ధవర్ణన మెచ్చుటచూచినను తిక్కన్నగారి రచనతోఁ దులదూగుచున్నది.

ఈ గ్రంథము అస్వతంత్ర జాతికొక స్మృతిగ్రంథము వంటిది. రాణాప్రతాపుని భద్రాకరణ ప్రతిజ్ఞ చూడుఁడు ............ ఈ ఘట్టము ద్వితీయాశ్వాసములో నున్నది. ఈ ఘట్టము చదివినచో పారతంత్ర్య జాతికి ఇది స్మృతిగ్రంథ మన్నమాట కర్థము తెలియును.

రాణాప్రతాపునకును, మహాత్మునకు గల సామ్యము - భారత జాతికి గల యస్వతంత్రత, మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపుపోరు - ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపుపోరు. ప్రతాపసింహుఁడు అక్బరును జయింప

వలెనని యుద్ధము చేయలేదు. పౌరుషశక్తితో గెలువవలెనని యాయనకు దెలియును. కాని పట్టి ధర్మము కోసము యుద్ధము చేసెను. భారత జాతీయ ధర్మము పరులకు లొంగిపోదు—చచ్చిపోరు—అని రుజువు చేయుటకే యుద్ధము చేసెను.

"కాన విజయంబు ముఖ్యంబు గాదు మనకు,

ధర్మ నిర్వహణంబు కర్తవ్య మిపుడు."

ఇది ప్రతాపుని యూహ. ఈఘట్టము చదువవలెను. నేఁటి సత్యాగ్రహమునకు ఆనాఁటి ప్రతాపుని యుద్ధధర్మమునకు భేదమే లేదు.

ప్రతాపీయులు—అన్నము తినలేదు—నీరుత్రావలేదు—నిదురపోలేదు. ఇది బలవంతము చేతగాదు—వ్రతముచేత.

ఈ కథకు మన కథకు వేయి పోలికలు. అన్నిటికన్న గొప్ప పోలిక అబ్దూరహిమాన్—ఈయన అగ్బరు చక్రవర్తి సర్వ సేనాని- వీర రసారాధకుఁడు- ప్రతాపునకు పృధ్వీసింహుఁడు వ్రాసిన యుత్తరము కవియైన యీ ముసల్మాను సేనాని వ్రాసిపెట్టినది. ఆయన యెంత వీరుఁడో యంత కవి. రవిధ్వజము—గరుడధ్వజముగా, కృపాణము —నందకముగా, కవచము పట్టుబట్టగా, హాల్దీఘాటు యుద్ధమున తనకు "ప్రతాప రాజనారాయణుఁడు దర్శన మొసంగెనఁట. అతఁ డగ్బరుతో ననుచున్నాఁడు. ఆ ప్రతాపుఁడు.....

మ॥ "అకటా! నీవలె ధర్మముల్ దెలిసి రాజ్యం బేలఁగాలేఁడో, మ
చ్చికమై భూప్రజఁ బుత్రులన్ బలెఁ గృపాదృష్టిఁ జూడఁగాలేఁడో, పా
యక వర్ణాశ్రమ ధర్మపద్ధతి తిరంబై నిల్పఁగాలేఁడో, యెం
దుకు నాతండు స్వతంత్రుఁడై నిలువఁ గాదో యానతీఁ గోరెదన్."

ఈరహిమానుఁడు మఱియు నసెను ఆ ప్రతాపునకు తాను సమకాలికు డగుటయే గొప్పతనమట ఇట్టి రహిమానులు నేఁటి పాశ్చాత్యులలో నెంతమంది లేరు ఆ పాశ్చాత్యులలో నక్బరు చక్రవర్తులే లేరు అక్బరు చక్రవర్తి ప్రతాపుని గురించి యిట్లనెను.—

"ఆ మహానాయక వతంసమా ప్రతాపు
డెన్ని గతుల యోజించిన నన్నుఁబోలు
కోటి సార్వభౌములు చేరి కొలువఁ దగిన
క్షాత్రనిధి యనుమాట వజ్రాల మూట"
"నాదు జీవితశేష మంతయుఁ బ్రతాపు
సేవ కడిపినఁగాని దుష్కీర్తి పోదు."
"మన బ్రతుకులు పోరులనె తెల్లవారిన వకటా."
ఇది అక్బరుయొక్క సౌశీల్యము..... ....
ఈకవి యఖండమైన క్రొత్త పలుకుఁబడులు గలవాడు.
"ఇతడు బాడబానలము పాదక్రమింగు మహా బలుండు"
"పిడుగుల్ వ్రేళ్ళ నణకు భయద శౌర్యులు"
"మొదలఁ నెత్తురు పంచుకొంచనుజుఁడై పుట్టొందె"
"ఒకకాడఁ జనియించు రెండుపువు లట్లొప్పారి"
"దురదృష్టం బది యెల్ల నాపయిని గంతుల్ పెట్టె"
"అక్బరు విజయరథము కాడిమోసిరి స్వాతంత్ర్య ఘనతమఱచి"
"పుడిసెం డూపిరి మేన నుండు వఱకుఁ బోరాడి"
"మూటలను గట్టి యాయువు బుజ్జికెత్తి
శాశ్వత బ్రహ్మకల్ప మీజగతి నుండుమో."

ఈ మొదలైన వనేకములు-ఇంక సందర్భానుసారముగ లోకోక్తులు మొదలైనవి కుప్ప తెప్పలుగానుండి గ్రంథము ఆంధ్రసరస్వతీదేవికి క్రొత్త భూషణముగా నున్నది.

ఈకవి రాజపుత్రయోధుల శౌర్యాదుల నెంత వర్ణించునో ముసల్మానుల శౌర్యాదుల నంతే వర్ణించును. హుమయూనుని వర్ణించుటయు, బేబరుపడ్డ కష్టములు వ్రాయుటయు నొక ముసల్మానుఁ కవి యెంత యభిమానముతో వ్రాయునో యీయనయు నట్లే వ్రాసెను. ఈ రచన భారతమును దలపించుచున్నది. ఉదయసింహునకు 25 మంది కొడుకులు — రెండవ వాఁడు సూక్తుడు — మూడవవాఁడు సాగరుఁడు — పెద్దవాడు ప్రతాప

సింహుండు - జగమల్లుఁడు మఱియొకఁడు. ఇతడు శౌర్యహీనుఁడు. ఇతనికి రాజ్య మీయవలయునని రాజు తన సరదారులతో చెప్పిపోయెను..

మ॥ 'కమలాప్తాన్వయమా! భవత్కృత మహాఘంబేమొ రాముండుపూ
ర్వము కొన్నేడులు మానియుండవలసెన్ బట్టాభిషేకంబు, చం
డమహీనాథుఁడు లేకయే చనియె నీ నాఁడీప్రతాపుండు స
ర్వము గోల్పోయెను దుర్బలుల్ జనకు లౌరా యెంతకున్ గర్తలో'

అని బంధుజనులు విషాద మొందిరి సలుంబ్రాకృష్ణుఁడు అచ్చటి తీర్పరి. రాజుతో 'సరే' యనెను కాని చివరకు ప్రతాపునే రాజాచేసెను. జగమల్లుఁ డభ్యంతర పెట్టెను. ఈ కవి చాలచోట్ల నన్నయగారిని పోలినట్లు వ్రాయును. రాజసూయమున సహదేవుఁడన్న మాటలకు, ఇచ్చటి సలుంబ్రా కృష్ణుని మాటలకు పోలిక చూడుఁడు.

"రాజాలన్ బొనరించు బాధ్యత సలుంబ్రా వారిదన్ మాట యీ
క్షోణిన్ గల్గిన వారెఱుంగుదురు, ఇచ్చోనేఁ బ్రతాపున్ మహా
రాజాగా నొనరింతుఁ గూడదను ధీరగ్రామణుల్ గల్గినన్
బాణిన్ బైకెగనెత్తుఁ డిప్పుడె యెదుర్పన్ వత్తు నత్యుద్ధతిన్."

జగమల్లుని త్రోసి, రాజని కృష్ణుఁడు ప్రతాపునే సింహాసన, మెక్కించెను.

"పరిఫుల్ల రుచిర సరసిజ పరంపరలు నెరపి నటు సదాభవనం బ
ప్పుర జనములనెమ్మోములఁబరమామోదమున నపుడు భాసిలుచుండెన్

ఇది మఱల నన్నయ్యగారి రచన, ఈ పట్టాభిషేకోత్సవ మంతయు ప్రబంధ సరణి నడచెను.

రెండవ కొడుకైన సూక్తుఁడు సలుంబ్రాకృష్ణునివద్ద పెంపఁబడెను. ప్రతాపుఁ డతనిని దనవద్దకు పంపుమనెను. శ్రీకృష్ణుఁడుపంపెను. "నాస్వామి స్నేహముప్రోలఁ దుచ్ఛములు సప్తద్వీప సామ్రాజ్యముల్"

వసంత కాలము వచ్చెను ఎల్లరాజులు ప్రతాపునకు కానుకలు పంపిరి. మఱల నన్నయ్యగారివలె వ్రాయుచున్నాఁడు.

మ॥ "తలపైనన్ మగటిమాతురాయి వెలుగొందన్ ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల, దొడ్డనునుతేజీ లెక్కి యోధాళి చెం

తల నేతేర, ప్రతాపసింహుం గొలువఁగా నానామహీమండ లేంద్రులు వేంచేసి రుగాది కానుకలు దొంతుల్ దొంతరల్ తెచ్చుచుఁగా.

అప్పు డందఱు వేఁటకుఁబోయిరి. ఈ వేఁటకుఁ బోయినపుడు రాజపురోహితుఁడైన హరభట్టుగూడ వెళ్లెను ఈ పురోహితులుగూడ వీరులే. రాజులకు ప్రాణములు ధారవోసినవారు ఐహికాముష్మికములకు చేయూత మైనవారు .

వేఁటయైన తరువాత కూర్చుండి మాటలాడుకొనుచుండఁగా నొక వరాహము వారి నడిమికి వచ్చెను దానిని అన్నదమ్ము లిద్దఱు సూక్తసింహుడు-ప్రతాపసింహుడు-తమ బాణములతో గొట్టిరి. నేను చంపితినన నేను చంపితినని తగవులాడిరి. సూక్తుఁడు ప్రభువుతో నన్నగారితో-వివాదము పెంచెను. సలుంబ్రా కృష్ణునిగూడ లెక్క సేయలేదు. హరభట్టు సూక్తునకు నీతి నుపదేశించెను. ఆ పురోహితునితో సూక్తు డిట్లు పొగరుబోతు తనము ప్రకటించెను.

"తనదౌ శక్తికి మీఱు కార్యములకుఁగా దార్కొన్నచో ముప్పు వచ్చును మాయిర్వురలోన నొక్కఁడు రిణక్షోణిఁగా మృతిఁగన్న మీరుసు రావచ్చును నేడ్వవచ్చు మఱి పౌరోహిత్యముఁగా జేయ వచ్చును లబ్ధిఁగా గొనవచ్చు నిప్డు చనవచ్చుఁగా దాఁటి దూరంబుగన్"

అంత హరిభట్టు వారి యుద్ధ మాపలేక వారి నడుమ తాను కత్తి పెట్టుకొని పొడుచుకొని చచ్చెను.

నాటి కష్టదశ దీర్పఁగా బూని యాత్మార్పణంబు నొనర్చెఁగా హరభట్టు త్యాగనిధియై ముల్లోకముల్ మెచ్చఁగన్."

అంత యుద్ధము సమసిపోయెను. "గురు రుధిరంబు దాటగను కూడదు" అని ప్రతాపుఁడుయుద్ధమును మానివేసెను సూక్తుఁడు దేశమును వదలి పోయెను. ఎచ్చటికి బోయెను?

"తా, నరిగెను ఢిల్లిత్రోవకు కులాంతకు లందఱు పోవు త్రోవనన్"

ఇచ్చటినుండి ప్రతాపుని శౌర్యాగ్నిరాశి మండి, యత్యుగ్రమై, పాతికయేండ్లు తగులబెట్టిన ఘట్టము. ఆశౌర్యము, ఆయుద్ధములు, ఆప్రతి

ష్టలు అవియన్నియు వ్రాసినచో పట్టరానంత గ్రంధమగును. ఈ కవి సార్వ భౌముడు ఈఘట్టము చిత్రచిత్రములుగా వ్రాసెను మొదటనే చెప్పితిని గదా "ఈ గ్రంధము యుద్ధపంచకమువలె నున్న"దని, ప్రతాపుఁడు దేశమంతయు బీడుపెట్టించి తన్ను సేవించు నందరిని వెంటఁదీసికొని కుంభల్మియరు దుర్గములో గూర్చుండును సలుంబ్రాకృష్ణుఁడు-భానుసింహుఁడు-మనస్సింఁహుడు శ్యామసింహుఁడు—తేజస్సింహుఁడు — రామచంద్రదేవుఁడు—భిల్లనాయకుఁడైన భీమచాంద్రుడు వీరందఱు తమతమ రాజభక్తులను తెల్పిరి. వారి రాజభక్తి తెలుపుటలను చదివియే చూడవలయును. ఈబైరాగిమైన ప్రతాపునకు-ఆమహారాజైన అక్బరునకు విరోధము. భోగసన్యాసమున—ప్రతాపుడు, రాజ్యతృష్ణచేత—అక్బరు, తన చేతిలో చిక్కిన మొగలు సైన్యమును ప్రతాపు డెన్నిసారులో వదలిపెట్టెను ప్రతాపుని యీ కట్టుదిట్టములు చూచి అక్బరు భయపడెను. ప్రతాపుని గెలువలేనవని కాదు, ప్రతాపుని మీదికి పోయినచో తన కండగా నున్న రాజపుత్ర సేనానులకు కోపము వచ్చునని, అతఁడు దీర్ఘదర్శి-అప్పటి కప్పుడు భేదము పుట్టుట కాకపోయినను భేదము పుట్టుటకు నొక పన్నాగము పన్నెను. .... ..

"ననుఁగడుఁ బేర్మిమైఁ గనుచు నాప్రియమలరఁ మదిమెచ్చి కన్య ని
చ్చిన ఘనమువంటివారి వెలిచేసి ప్రతాపనృపుండు పంక్తి భో
జనమున నైన నించుకయు నైపక తేలియకిచేసి చూచె మీ
ఘనరికు హాని వచ్చినను గగ్గవె నాకు విషాద వేదనల్"

ప్రతాపుఁడీ కులము చెడినవారితో భోజనము చేయఁడు. కులము చెడుట తప్పని ప్రతాపుని యుద్దేశము. ఒక జాతియొక్క జాతీయతలో వర్ణభేద మంతప్ఫూతమని వారి యుద్దేశము ..... .....తరువాత అక్బ రిట్లను చున్నాఁడు.

"మటి నాయొద్దను జేరు భూమిపతులఁ మర్యాదతోఁ జూడనో
ధరణీభాగము లీయనో పిలిచి బాంధవ్యంబు చేకూర్పనో
చిరమైత్రిఁ విహరింపనో నృపులు నఁ సేవించి చేదేమి మే
సిరికె తానింతటి మూర్ఖు మేమిటికిఁ దాన్చెఁ జెప్పఁగాఁ జాలుదే"

ఇంత రాజనీతి అక్బరు ప్రకటించెను. ఇట్టి రచన సామాన్య కవి చేయు నదికాదు. ఇది తిక్కనాదులు చేయఁదగ్గది మానసింహుఁడు ప్రతాపుని యొద్దకుఁబోయి అక్బరును గురించి యెంతయో పొగడెను. మానసింహుని వంశమునకు ప్రతాపుని వంశీయులు గురువులు. ప్రతాపుఁడు మానసింహుని పొగడిత విని అక్బరు రాజనీతి మానసింహునికి విఱిచి చెప్పెను.

"నిగూఢ మాతని మనోవ్యాపార లీలాగతుల్"
"అల్లుడై—దావమై—మామయైన తన్ను
వెలితి గననీక శ్రీ మహావిష్ణు వట్లు
భారతీయులు కొలుతు రణ భావమెఱిఁగి
అక్బరటు చేసె హేతు వన్యంబు గలదె."

అని చెప్పెను అంత చల్లగాఁ బాలించు నక్బరు రాజ్యములో షూర్జర దేశమున క్షామము. అక్బరొకవంక దిగ్విజయమును చేయుచున్నాఁడు ధనేశ్వరమ్మున సన్న్యాసులలో—సన్న్యాసులకుఁ బోట్లాటపెట్టి తానొక పక్షము చేరి, వారందఱిని నాశనము చేసినాఁడు యిందు ప్రతాపుని యొక్క ధర్మమన నేమో; నిజమైన రాజెట్లుండ వలయునో, ఆప్రతాపుఁ డెట్లు నిజమైన రాజో, ఈ ఘట్టమంతయు చదివినచోఁ దెలియును. ప్రతాపుడు ప్రకృతి బిడ్డ. భోగ విముఖుఁడైనరాజు. భోగాభిముఖుఁడైన రాజువలన లోకములో, గొంత భాగము తిండిలేకుండఁ బోవును.

"అకాపట్యము లాదరస్మితము లాయౌదార్య మావియ్య మా
మోకాల్ ద్రొక్కులు నాచమూ విభవ మా ముఱ్ఱొద్దు సేవించుటల్
నాకెత్తుక దలనొప్పి పట్టణము లన్నిక మీకు నెట్లుండునో
నాకీ కొండలువోలె సౌఖ్య మిడు శాంతస్థానముల్ లేవుపో!

ఇడ ప్రతాపమూర్తి అనిన, మానసింహుఁడు,
ఈ యేరిటు పాఱఁజొచ్చె నెదురీద నెవండు సమర్థుఁడౌ వృథా పౌరుష మున్న దంచు బడబాజ్వాలనంబును బాఱమ్రింగెదే!"

అన, ప్రతాపుఁడు ఒక చిన్నకథ (Parable) చెప్పెను. ప్రతాపుఁడు గాంధి వంటివాఁడు-యేసుక్రీస్తు వంటివాడు-మహర్షుల వంటివాఁడు

చివర కిట్లనెను. "నారాజ్య మరణ్యము-మేము సన్న్యాసులము మీయక్బరు నకు మమ్ము గెలువవలెనని పట్టుదల ఏమి"

"అప్రతిహతముగా నక్బ రొక్కఁడె యేల క్షితిని దేవుఁడు సృష్టి చేయలేదు. ప్రజ లతనిచేఁ జంపబడుటకుఁ బుట్టలేదు-రాజకన్యక లతని భోగ పరతకుద్దేశింపఁ బడగలేదు-అతని రాజ్యతృష్ణ ముందు సర్వజగత్తు "పారతం త్ర్యమున మునుఁగుచెల్ల పాడిగాదనుచు నక్బరెంత యెఱిఁగిన జగమున కంత మేలు"

చివరకు భోజనవేళ మానసింహునకు గోపము వచ్చెను. నిష్ఠురోక్తు లాడెను. మిమ్ము నాశనము చేసెదనని చెప్పి లేచిపోయెను.

ఇది యవనసేనతోఁ జేయు కదనమో స్వ
జనముతోఁ జేయు కదనమో శంకగలిగె"

ఈశంక ఆనాటినుండి ఈనాటివఱకు అట్లే యున్నది. ఈయుద్ధములో ప్రతాపుని సైన్యములు చెదరిపోయినవి. ప్రతాపుని తమ్ముడు సూర్తుఁడు ప్రతా పుడు అవతార పురుషుడని గ్రహించెను మఱల నన్నగారి వైపే చేరెను.

చివరకు తనబిడ్డ మోలుగడ్డితో జేసిన తినుచుండగా నడవిపిల్లి వచ్చి దానిని గిరి రొట్టె నెత్తుకొని పోయెను. ప్రతాపుఁడు చక్రవర్తి నాఱు నెలలు గడువు వడిగెను ఉత్తరమిచ్చిభిల్లుని పంపెను ఆయుత్తరమును చూచి యక్బరు పొందిన సంతోషమునకు మితిలేదు. అక్బరు సభలో పృథ్వీసింహుఁడు ఆ యుత్తరమును ప్రతాపుఁడు వ్రాయనే లేదనెను. వారును వీరును వివాదపడిరి. ఆయుత్తరము తెచ్చినభిల్లునితో పృథ్వీసింహునకు భార్యయు నిట్లనిరి.

"చెప్పుము చిత్తమిచ్చి యిదె శ్రీ నృపలోక జగన్నిరుంధు మాయప్ప ప్రతాపదేవుని ముఖాంబురుహంబున జంద్రబింబ మందొప్పెడి వెన్నెలట్లలరు నుత్తమమౌ దరహాసరేఖ తానెప్పటి యట్ల పాయక రహించుచు నున్నదె భిల్ల శేఖరా!

ఈపద్యము భాగవత పద్యమువలె నున్నది. కృష్ణుఁడు సుఖముగా

నుండెనా యని ధర్మరాజు అర్జును నడిగిన ఘట్టములోని పద్యమువలె నున్నది.

శ్రీ నృపలోక జగద్గురుండు-మాయప్ప-ప్రతాపదేవుఁడు"
ఇందు రసధ్వని వేయిమూర్తుల రూపు గట్టుచున్నది. హృదయము నుండి వచ్చిన భాష యనఁగా నిది. వట్టి యక్షరములుగా మాటలుగా గనిపించును గాని ప్రతాపుఁడుగా మూర్తి గట్టిన పృద్వీసింహుని స్వాతంత్ర్యాభిలాష యంతయు ధర్మ వీర రసమంతయు ఆమాటలలో నున్నది. ఇట్టి రచన మహా కవులే చేయఁగలరు.

అబ్దూరహిమాన్ వ్రాసిన యుత్తరము అతడు పృథ్వీసింహునితోఁ జేసిన సంభాషణ—ఆయుత్తరమును చదివితీరవలయును—అందులో కొన్ని భాగములు

"భరత ఖండంబు నుద్ధరింపఁగ జనించు
ధూర్జటివి నీవు రాజమాత్రుఁడవు గావు"
"తనదు నేల్బడి సంత హైందవ మహత్త్వ
మక్బ రంతయుఁగొను దొడ్డ యడితికాఁడు
"స్త్రీలఁ బురుషుల రాజ్యంబు దేశమెల్ల
విలుచు నీయక్బరను గొప్ప విలువకాఁడు

ప్రతాపుఁ డిట్టివాఁడు——ఇంక అక్బరు ఇట్టివాఁడు.

"ఈవు విశ్వప్రపంచమం దీశ్వరుని య
నంత లీలాగతులు గొనియాడె దెపుడు"
"విలువఁ గట్టుచు రాజ్యంబుఁ గొలుచు నక్బ
రెవరి గొప్పతనం బెంతొ యెఱుఁగు జగము."

ప్రతాపుఁడు మఱల యుద్ధమును ప్రారంభించెను. కొండలఁలో దాగి పొంచుచు పైఁబడుచు చీల్చుచు కలచుచు విటతాటనము చేయుచు త్రుటిలో చాటగుచు నిట్టి యుద్ధము చేసెను. (Guerilla warfare.)
అయినను గెలువలేక పోయెను. ప్రతాపుని దారిద్ర్యమున కంతు లేకపోయెను.

చివరకు ప్రతాపుఁడు దేశమే వదలిపెట్టి పోఁదలఁచెను.—భామాసాహి వచ్చెను. ధనమిచ్చెను—ప్రతాపుఁడు మఱల సైన్యము సమకూర్చెను. మఱల తన రాజ్యమంతయు గెలుచుకొనెను.

అంతయు నైనది. కాని, ఓయి ప్రతాపా శ్రీనృపలోక జగద్గురూః మాయప్పాః

సీ॥ అక్బరు విశ్వంభరాధీశ మౌళిది
ధనసేవ నీయది దైవసేవ
యాతని దెల్లప్పు డాత్మవైభవము నీ
యది నిరంతరము నాత్మావ బోధ
మతని కుండినదెల్ల నైహిక బలము ని
న్నాశ్రయించినదెల్ల నాత్మబలము
నతని దండఱ కన్ను లలరించు భోగంబు
నీది జగముమెచ్చు నిండుత్యాగ

గీ॥ మతఁడు జగము గెలిచె నాత్మ గెల్చితివి నీ
వాతఁ డితర జనుల నాశ్రయించు
నీవు స్వాశ్రయుఁడవు నీకు నాతని కెన
లేదు జగము క్రిందు మీఁదులైన.

ఇంక నొకమాట. ఈరసప్రవాహములో ప్రవాహము వెంటనే పోయి విమర్శించితిని. వేరొక గతిలేదు. కాని ప్రవాహము నడుమను, తీరము వెంటను, నంగుళ మంగుళమును గల దామరపూలు, కలువపూలు, నీటి బెగ్గురులు మొదలైన శోభలు పాఠకులే చూచుకొనుచు చదువుకొన వలయును. ఇది పరమోత్తమ గ్రంథములలో నొకటి.

•••○◯○•••

# విజ్ఞప్తి.

"శ్రీ రాణా ప్రతాపసింహ" కావ్యకర్తలు శ్రీ దుర్భాక రాజశేఖర శతావధానిగారు 30–4–1957 పరమపదించిరి. వారి లేఖినినుండి యింక నెన్నో కావ్య గుచ్ఛములచే పరిమళింపవలసిన భాగ్యము ఆంధ్రసారస్వత వనికి లేకపోవుట కెంతయు చింతించు చున్నాము.

ఆంధ్ర జనత నుండి "రాణా ప్రతాప" కావ్యము కావలెనను ఉత్తరము లెన్నియో వచ్చినవి. అట్టి కావ్యము ప్రజల కందుబాటులో లేకుండుట సంభావ్యము కాదని, వారి అల్లుడు కుమార్తెయు నగు శ్రీ M. అనంతరామ్ M. B. B. S, శ్రీమతి కామేశ్వరీ దేవిగారు ఈ కావ్యమును పునర్ముద్రణము చేయింప దలచి, ఆ కార్యభారమును నా కప్పగించిరి నేనును శ్రీ శతావధానిగారియందును, కావ్యము నందును నాకుగల గౌరవముచే సంతోషముతో అంగీకరించితిని. ఈ కావ్యము నిట్లు ముద్రింపించి యిప్పుడు వెలువఱచు చున్నాము.

ఈ కూర్పున మేము చేసిన మార్పు లేవియు లేవు. తృతీయ ముద్రణ ప్రతి ఆధారముగా కావ్యము ముద్రింప బడినది. పీఠిక ప్రథమ ముద్రణము లోనిది గ్రైకొన బడినది.

ప్రొద్దుటూరు,
1–8–58.

సి. వి. సుబ్బన్న శతావధాని.



—: కావ్యకర్త :—

"సాక్షాత్ప్రతాపో నృపోఽహం"

"శా॥ నే నెల్లప్పుడు భావనా బలమునన్ నీరూప నామ క్రియా
ధ్యానంబుల్‌గొని తన్మయత్వమున నన్యాకాంక్షలేకుండు, నీ
వే నేనైతినో, నేనె నీవయితో, రూపింపంగ రాకుండె, ని
త్యానందంబు ఘటించె నీకృతి ప్రతాపా! విశ్వలోకార్చితా!"

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహ చరిత్ర

## ప్రథమాశ్వాసము.

శ్రీనాథాబ్జభవాదు లెవ్వని మృదు శ్రీపాద పంకేరుహ
ధ్యానానందరసాబ్ధిఁ దేలి కృతకృత్యత్వంబుఁ బ్రాపింపుచుం:
ద్రా నీహార నగాత్మజాప్రియుఁడు నిత్యానందుఁ డారోగ్య వి
జ్ఞానశ్రీ లిడి చంద్రశేఖరుఁడు విశ్వంబెల్ల రక్షించుతన్.

సీ॥ అజ్ఞాతనయనుని యత్తవారిత్రైస
కలశ పాథోరాశి గర్భమందు
వజ్రమాత్రిక పంక్తి వెలువని పరువుగై
తేజరిల్లెడు మణి ద్వీపమందు
రవిరశ్మి నింత చొరంగనీని కదంబ
తరురాజ వనము మధ్యంబునందుఁ
బ్రాతసూర్య ప్రకాశసమానమౌ
చింతామణీ భద్ర సింహపీఠిఁ

గీ॥ త్రిదిశకోటి కిరీట సందీప్త రత్న
రాజి నీరాజిత పదాబ్జయై జగంబుఁ
బాలన మొనర్చు మాయమ్మఁ బ్రస్తుతింతు
రమ్య గుణధన్య శైలాధి రాజకన్య.

సీ॥ పుంజీభవించి యుప్పొంగి శైలములు శృం
గములెత్తి దివిని బ్రాకంగఁజనిన,
రంగదుత్తుంగ తరంగ సంఘములతో
నీరధి కలఁగి ఘూర్ణిల్లుచున్న,
హోమకుండముల నహోరాత్రముల నూర్ధ్వ
శిఖల నగ్ని తపంబు నేయుచున్నఁ
కులశైలములు పెల్లగిలఁ బ్రభంజనుఁడు జృం
భించి భీకరధాటి వీచుచున్న

గీ॥ శబ్దగుణరూఢి నవ్యయ సరణి నభము
విష్ణుపదమై తనర్చిన, వీసమైన
నేజనని శక్తిమాహాత్మ్యమెఱుఁగ; నట్టి
భవుని కొమ్మను మాయమ్మఁ బ్రస్తుతింతు.

సీ॥ ఏమహామహుఁడు సంస్కృతపాండితిని గొప్ప
పర్వతంబని నుతుల్ వడయఁగలిగె
నేఘనుం డాంధ్రమందెల్లపండితులచే
దిగ్దంతియనుచుఁ గీర్తింపఁబడియె
నేసద్గుణార్ణవుండెల్లెడఁ దర్కసిం
హుఁడటంచుఁ బెనుకీర్తినొందఁగలిగె
నేకళావిదుఁడు వైయాకరణుల నిట్టి
ఘనుఁడు లేఁడనుచు విఖ్యాతిఁగాంచె

గీ॥ నట్టి కందాళ్లవంశ సుధాంబురాశి
చంద్రుఁడైన దాసాచార్య సత్తముండు
గురుఁడు దైవంబు; తత్పద సరసిజములు
స్వాంతమున నెంచువాఁడ నపారభక్తి 4

మ॥ తననాదుం డొనరించు సత్కృతుల కుత్సాహమ్ము నన్ దోడు సే
యను గాక్షించి సహస్రహస్తముల శిష్యశ్రేణిఁ బోషింప నే
ర్చిన మత్సద్గురు మానినీతిలక మా "శ్రీరంగమాంబా మహా
జననీరత్నము" గొల్తు నెల్లపుడు సాక్షాదిందిరాదేవిగన్. 5

మ॥ తనసౌజన్యము సజ్జనుల్ పొగడ నిత్యంబుగా సదాచార వ
ర్తన మొప్పార, గురుండు దైవమగుచున్ బ్రహ్మోపదేశాది పా
వనకృత్యంబులు నాకొనర్చిన ఘనున్ బ్రఖ్యాతచారిత్రు మ
జ్జనకున్ వెంకటరామయార్యు మదిలో సద్భక్తి భావించెదన్.

గీ॥ "మాతృదేవోభవ" యటన్న మహితసూక్తి
మఱువరానిది; నిరతము మజ్జనని
దొడ్డ ముత్తైదువను మనస్తోయజమునఁ
గొలిచెదను సుబ్బమాంబ, సద్గుణకదంబ.

మ॥ నను గారామునఁజేర్చి యాంధ్రమున 'నోనామాలు' మెట్రిక్యులే
షనుపై నాంగ్లము నేరిపించి తనదౌ సర్వస్వ మర్పించి పెం
చిన కారుణ్యరసార్ద్రమానసుఁడు మా చిన్నయ్య 'సంజీవరా
యని దుర్భాకకులాబ్ధిసోముని మదిన్ ధ్యానింతు నెల్లప్పుడున్.

గీ॥ భారతీనాథు నపరావతారములనఁ
గావ్యజగము సృష్టించి లోకములు మనుపు
నన్నయాది కవీంద్ర మందారతరుల
నాంధ్రభాషాగురుల నిత్యమభినుతింతు.

గీ॥ ప్రకృతితత్త్వరహస్య సర్వస్వ మెఱిఁగి
నవనవోన్మేషమైన ప్రజ్ఞయుఁ దనర్పఁ
గృతులు విరచించి లోకోపకృతులు పెంచు
నార్య కవికోటి నిత్యవిద్యార్థిగణము.

గీ॥ నూతనోజ్జీవమిచ్చు ప్రాభాత దక్షి
ణానిలము సోకఁగా మేడపైన "టాడ్డు"
దొర రచించు రాజస్థాన చరిత మెత్తి
యొక్కనాఁడేను జదువుచు నున్నయపుడు."

సీ॥ సంస్కృతాఖండ భాషాకావ్య సాహిత్య
సామ్రాజ్య సర్వస్వ చక్రవర్తి,
యఖిలాంధ్రభాషా మహాకావ్యవిరచన
వ్యంగ్యవైభవ పట్టభద్రకీర్తి,

బహుళ విద్వద్బృంద పరిషదర్చిత పుష్ప
మాలా మనోహర మహితమూర్తి.
తేజంబు నెఱపు జ్యోతిశ్శాస్త్ర విద్యాంగనా
నవ్య రుచిర భావానువర్తి.

గీ॥ శత శతవధాన హర్షితా స్థాన దత్త
కనక జయఘంటికా సింహ కంకణ రవ
ముఖరితాశాంతసద్యశఃపూర్తి, సుకవి
సింహ బిరుదుండు వేంకటశేషశాస్త్రి.

క॥ చనుదెంచి నన్నుఁగని వం
దనమని వచియించి పిలువఁ దమ్ముఁడ రార
మ్మని కౌఁగిటఁజేరిచి చెం
తను నేఁగూర్చుండుమన నతఁడు కూర్చుండెన్.

గీ॥ స్వాంతమునఁ బొంగి పొరలెడు హర్షభరము
వికసిత ముఖాబ్జములపైన వెల్లివిరియ
మాటలాడితి మలపును మలపులేని
కుశల సంప్రశ్నములఁగూర్చి కొంతతడవు.

చ॥ చిఱునగ వాస్యసీమ వికసింపఁగ వేంకటశేషశాస్త్రి, "సో
దర! మును నన్నయాది కవి తల్లజులెల్ల పురాణసంతతుల్
సరస పదార్థ భావ గుణ సంభృతమై తగు మంచి శైలిలో
విరచన చేసియుండి రవి విశ్వజగన్నుతమై తనర్చెడున్. 15

క॥ పిదపఁ బురాణాంతర్గత
విదిత వివిధకథలు గొనుచుఁ బెద్దన్నాదుల్
పదునెనిమిది వర్ణనములు
గదియించి రచించి రఖిల కావ్యశ్రేణుల్ 16

ఉ॥ కాలముకొంత యిప్పగిదిఁ గావ్యయుగంబుగ సాఁగె; దానిలోఁ
బూలవనంబు లయ్యమృతపున్ సెలయేఱులు నిగ్గుటాణి ము
త్యాల బెడంగు మేల్గొడుగు లచ్చపు వెన్నెల సోగలో యనన్
జాలిన మేటికావ్యము లసంఖ్యముగా జనియించె వ్రేల్మిడిన్. 17

ఉ॥ ఆవలఁ గొన్నినాళ్లరుగ నంతట నంతట సారవంతమౌ
త్రోవలు తప్పి కాంతిచెడి దుర్గమ దుర్గములట్లు భీకరా
శీవిషమున్న పేటికల చెల్వునఁ గాననరాజ మాడ్కిఁ గా
వ్యావళులున్ వికాసగుణమంతయుఁ గోల్పడె బీడువోవుచున్.

క॥ పెక్కామడ కొక్కఁడుగా
నక్కడలిని గల్గు దీవులట్టులు కైతల్
చక్కఁగ లిఖింప వార్గల
రిక్కాలంబునను నొక్కరిరువురు పెద్దల్.

మ॥ ప్రతిభాపూజ్యులు వారువ్రాసిన మహాగ్రంథంబు లత్యంత పు
ణ్యాతమంబుల్ గద' వాని నట్లునిచి యన్యగ్రంథముల్ చూచినన్
మితియో మేరయొ యేమనన్ వలయు స్వామీ వద్దు చాల్ చాల్ సర
స్వతికిన్ వాఁతలు పెట్టినట్లలరుఁ 'బాపం శాంత' మిప్పట్టునన్.

చ॥ యతులు వనాళిఁ, బ్రాసములు నాయుధశాలల, లక్షణంబు ల
శ్వతతి, రసంబు వైద్యుకడఁ; బాకము వంటలలోన, నయ్యలం
కృతులు బడంతులందు, మఱి రీతులు రోఁతల, శయ్య మేడ, ని
ట్లతికిన కావ్యముల్ గనిన నయ్య యొడల్ దహియించినట్లగున్.

శా॥ తఃవిన్నాణము లెన్నియేని గల వాయీ యంశముల్ కొంతమే
రై వర్తించు ముసల్లపంటువది ముందైయున్నదన్ మాడ్కిఁ దె
ల్గైస్వ విశ్వం బగలించుచున్నయది యాహా' గ్రాంథికగ్రామ్య భా
షావాదంబు క్షణక్షణంబునకు హెచ్చున్ జొచ్చె నీ వేళలో.

గీ॥ దేశమంతటఁ బాఱు నదీమతల్లి
వంటిదగు వ్యావహారిక భాష; దాని
నచ్చటచ్చట దేశంబు నలముకొనిన
మంచియును జెడ్డయును నాశ్రయించియుండు.

ఉ॥ ఊరకభాషకేమిటికి నుత్తమ సంస్థితి గల్గు? దాన సం
స్కారబలంబు గల్గి యధికారము దాల్చిన ప్రాజ్ఞకోటి భా
షారచనంబుఁ బూని కృషిసల్పినఁ గల్గెడి; రిత్తబూనినన్
బారము ముట్టునే గజము పైఁజవుడోలు ఖరంబు మోయునే.

క॥ అంతస్సారములేక య
వాంతర భాషలను గల్గు పదజాలములన్
దొంతరగఁ గలుప బాసయుఁ
గంతులు గలవాని మేను కైవడిఁ బొలుచున్. 24

క॥ క్రమమునకు బాసలోనయి
యిముడమి, బుధకోటులెల్ల 'నెవరికి వారే
యమునాతీరే' యనుగతి
భ్రమగొని దెసలకును విఱిగి పారుదు రొక్కటన్. 25

ఆ॥ సరసశబ్ద మిట్టి సబ్బండు బాసలోఁ
దక్కఁబోవ దింకఁ దమవికొన్ని
లొల్లపాక వారితప్పులు మఱికొన్ని
యనఁగఁ దప్పుఁ గుప్పలై రహించు. 26

ఉ॥ భావకవిత్వ మొక్కఁడట; భావములేని కవిత్వమింక నాం
ధ్రావనిఁగాదికే యవని నైనను గల్గునె? కల్గెనేని యా
ప్రోవు కవిత్వమంచు బుధ పుంగవు లెంతురె? యేటిమాటలో
భావ మభావమౌ కవిత ప్రాణములేని శవంబు గాదొకో. 27

ఉ॥ పేరెదియైననేమి, మఱి పేరున యోగ్యత వచ్చునే? రసం
బూరెడు నట్టి కైతమదీ యుత్తమ; మన్య మయోగ్య; మెల్లెడన్
సౌరభ పూరముల్ దెసలఁ జల్లెడు తామరపూవుఁజూచి యే
పేరునఁ బిల్చినన్ గుణము వీసము హెచ్చునొ, లేక తగ్గునో. 28

గీ॥ అలరుఁదేనెల మఱపించు పలుకుఁబొందు,
పలుకుఁబొందుకుఁ దగినట్టి భావపుష్టి,
భావపుష్టికిఁ దగు రస వైభవంబు,
కూర్చు ధన్యుండె పో! కవి కుంజరుండు. 29

చ॥ పరువడిఁ బద్యకావ్యములు వ్రాయుట మోటదనంబటంట, నా
గరికత కెంతొ లోపమఁట, గద్యమొ గేయమొ సద్రసోత్తర
స్ఫురణను మించునంట, మఱి పొత్తము పెద్దదిగాఁగ నుండినన్
బరువఁట, చిన్నిపొత్తములు నాదెముఁ గూర్చునటంట, వింటివే. 30

సీ॥ భాషామహాదేవి వాహ్యాళి యొనరించు
మానిత నంతనోద్యాన చయము
సాహిత్యలక్ష్మి విశ్రాంతి కేర్పఱచిన
హాటక వివిధ సౌధాగ్రతతులు
బహుళ విద్యాధన ప్రకరంబు నింప దీ
పించు భాండాగార సంచయములు
బాగోగు బోధించి ప్రజ నుద్ధరించెడు
విజ్ఞాన సర్వర్వ వేశ్మవితతి
గీ॥ పద్యకావ్యసమూహ సౌభాగ్య గరిమ
మిట్టిదని వివరింపఁగా నెవ్వఁడోపు
లోకకల్యాణ విజయ నుశ్రీకదివ్య
పారిజాత ప్రసూనైక హారసమితి. 31

గీ॥ ప్రకృతసారస్వతస్థితి వఱలునిట్లు;
మాటవరుస కంటెనిగాక మనకు నేల
దానిఁజర్చింప" ననుచు మందస్మితంబుఁ
గొలుపు నాతని వదనమేఁ గలయజూచి. 32

గీ॥ "పూర్వకాలంపుఁ బాండిత్యపుంబ్రశస్తి
కావ్యముల యున్నతాదర్శ గౌరవంబు
గాలతవడ నిష్టపడనట్టి గొప్పసుకవి
వగుట నింతగఁ బరితాపమందె దీవు. 33

చ॥ తలకొకబుద్ధి, బుద్ధికినిదగ్గ తలంపు, తలంపులోపలన్
వెలువడు భిన్నభిన్నగతిఁ బెక్కులు యోజన, లింక నేగతిన్
బలుపుర కైకమత్య మదిపట్టు స్వతంత్రత ముఖ్యదైవమై
నిలిచిన నేఁటికాలమున నీహితబోధ మెవండు చేకొనున్? 34

చ॥ తెలివిగలట్టి దాలుఁడొక తీఱు వరించుచు మాతృభాషలో
పలఁ దగుజ్ఞాన మొందెడు ప్రబంధము లియ్యెడ నాలుగేనియున్
వెలువడ వెట్టిపాపమొకొ, నేర్చెడు విద్యయుఁజూడ, నూటికిన్
నలువదికన్నఁదక్కువ గుణంబులు వచ్చినవాఁడు నెగ్గెడిన్. 35

గీ॥ వాలి వాల్మీకి కేమికావలయు ననుచుఁ
గైక కైకసి చెల్లెలుగాదె యనుచుఁ
గర్ణుఁ డాకుంభకర్ణుని కడపటి కొడు
కగుఁగదా యని యడుగు విద్యార్థులుండ్రు.

ఉ॥ క్రూరమృగంబు, వాడియగు కోఱలు, పెద్దది తోఁక, యాఫ్రికా
తీరవనంబులన్ దిరుగు, దీనిని మర్త్యులు పట్టలేరటం
చాఱవ "ఫారమున్" జదువు నర్భకుఁ డొక్కరుఁ డావిభీషణున్
గూరిచి వ్రాసె; నెట్టులు కనుంగొననేర్చెద విట్టిరోఁతలన్.

క॥ ఇది యెంతగఁ జెప్పిన ను
న్నది; ప్రకృతము ననుసరింత; మస్మన్మనమం
దుదయించినట్టి కోరిక
నిదె తెలిపెద నాలకింపు మీ శ్రద్ధమెయిన్.

గీ॥ సప్తసంతానములఁ బ్రశస్తమయి ఖిలిము
గాని దొకకృతి యన్న సత్కవులమాట
కలికి పదియాఱువన్నె బంగారుమూట
రమ్యతరమైన రతనాల రాచబాట.

సీ॥ జ్ఞానంబునకు మూలసారమౌ నాత్మ కా
వ్యకవిత్వమని "వర్డ్సువర్తు" నుడివె;
సత్యంబునకు సౌఖ్య సంగంబు చేకూర్పఁ
జాలిన కళయంచు "జాన్స" ననియె;
నతుల సంగీతర సాత్మకంబయిన భా
వాలాపమనుచుఁ "గార్లైలు" తెలిపెఁ;
బ్రతిభావిలాసంబు వాక్యదేహంబుఁ దా
ల్చిన రూపమనుచు 'షెల్లీ' వచించె;

గీ॥ 'హడ్స'నాదిగ నెందఱో యాంగ్లకవులు
పద్యకవితకుఁ గల గౌరవప్రశస్తి
యట్టిదిట్టి దనంగ రాదని సహస్ర
ముఖముల నుతింప వినమొకో పూర్వమందు.

గీ॥ దేశభక్తియుతంబు నీతిప్రబోధ
కమ్ముఘనాదర్శమగు పద్యకావ్యమొకఁడు
సరసజనములుమెచ్చ రసంబు హెచ్చ
సృష్టిసేయంగ నిపుడు యోజించుచుంటి.

క॥ విరచించునెడలఁ గల్పన
పేరయకయును నతిశయోక్తి పెంపొందకయున్
జరిగినది జరిగినట్టులు
మెఱయుటచే దేశచరిత మెప్పు వహించున్. 41

క॥ అదిగా కార్యావర్తము
త్రిదశులకును బావనమగు దేశము; దానన్
బొదవెడు నృపులు మహేంద్రుని
మదిమెచ్చరు పుణ్యవిభవమాన్యతలందున్.

సీ॥ మేవాడ రాజ్యలక్ష్మీ పదాంభోజాత
ములను గొల్చిన దత్త పుత్రకుండు
బాలగోవింద విప్రస్వామి శిష్యుఁడై
తవిలి మ్రొక్కిన మేటి ధర్మమూర్తి
స్వర్ణరక్షాబంధ బద్ధుఁడై బూందీ మ
హారాజ్ఞి సేవించునన్నుఁగుదమ్ముఁ
డఖలప్రజాగణంబభినుతుల్ గావించు
రామసింహుని రాజరక్షకుండు

గీ॥ తీవ్రరుజ పెచ్చుపెరిగి బాధించుచున్నఁ
బ్రమటియు మేవాడ విడఁబోని దొడ్డమగఁడు
భరత ఖండాభిమాని సత్ప్రభువతంస
మూర్తముణి టాడ్డుదొర నిత్యమభినుతింతు.

మ॥ సరసాగ్రేసర చక్రవర్తియును నా 'స్కాట్లండు' సంవాసియున్
వరకారుణ్యా రసార్ద్రమానసుఁడు కర్నల్ జేమ్సు టాడ్పండితుం
డిరవై రెండగుసేంట్లు హైందవమునం దింపార నుద్యోగియై
చరియించెన్ గిరులున్ బురంబులును రాజస్థానదేశమ్మునన్.

ఉ॥ వీరరసార్ద్రమౌ కథలు వీనులు సోఁక నమస్కరించి పూ
జారతి వీరులన్ గొలుచు సజ్జనుఁడౌటను రాజపుత్ర ధా
త్రీరమణాళి సత్కథలు రేయుఁబవల్ గడియించి యాంగ్ల ధా
షా రమణీయకావ్యముగ శ్రద్ధమెయిన్ రచియించె నాతఁడున్.

సీ॥ సర్వసన్నుతము రాజస్థానదేశంబు
మాతృదేశము మించి మహితభక్తిఁ
గొలిచి తద్దేశ వాసుల బంధువులపోల్కిఁ
బ్రేమించుటను జేసి పృథ్వీజనులు
పాశ్చాత్యుఁడైన నెప్పటికి టాడ్దొర రాజ
పుత్రుఁడే యనుచు సమ్మోదమంది;
రతఁడును రాజపుత్రావనికొఱకుఁ బ్రా
ణములైన నిచ్చె చందమున మెలఁగె;
గీ॥ సమ్మహాత్ముండు వ్రాయు గ్రంథమ్మునందు
వీరరసతరంగములతో క్షీరజలధి
కరణి మాధుర్యములు పెంచు చరితలెన్నొ
కలవు కలవారియిండ్ల బంగారమట్లు.

శా॥ ఆకర్ణద్వయపావనంబగు చరిత్రాంశంబు లందెల్లఁ గ
న్నాకై దివ్యరసాలవాలమయి సత్య న్యాయ సంపూరితం
బై కన్పట్టెడి నాప్రతాపు చరితం బద్దాని నే గోస్తనీ
పాకంబొప్పఁగ నొక్క దొడ్డకృతిగా వ్రాయన్ బ్రయత్నించెదన్."

మ॥ అన "నీమాటలు వేదవాక్యము; లవశ్యంబిప్డు రాణాప్రతా
పుని గీర్తింపు; మతండు వీరజనతా పూర్వాభిగణ్యుండు; క
మ్మని నీకైతకు నమ్మహాప్రభుని ధర్మ శ్రీరతుల్ హాటకం
బునకున్ సౌరభపూరముల్ గలుపు సొంపున్ గాంచి వాసిన్ గనున్."

క॥ అని ప్రోత్సహించుమతి నని
యెను వెంకటశేషశాస్త్రి; యేనంతఁ బ్రతా
పుని చరిత కావ్యరూపముగను
వెలయింపంగ వ్రాయఁగా మొదలిడితిన్.

క॥ ఉత్తమ మితివృత్తము సము
దాత్తము చిత్తూరుపురి ప్రతాపుఁడు ధీరో
దాత్తుఁడు కైతము మెత్తని
దిత్తఱి మెత్తురని తలఁతు నెల్లబుధేంద్రుల్.

శా॥ నా ధారాళ కవిత్వమందుఁ గల విన్నాణంబు లట్లుండ, నీ
గాథల్ కర్ణయుగంబుఁ బట్టుకొని యాకర్షించు లోకంబు; వి
ద్యాధుర్యుల్ విని చిట్టి బుస్సనక యాహ్లాదరిత్రు; విశ్వైక కీ
ర్త్యాధారంబులు రాజపుత్రనృప శౌర్యావార్య హేలాకళల్.

శా॥ ఈపొత్తంబునఁ గొంచెమేనియు గుణంబెందేనిఁ బెంపొందఁ శ్లా
ఘాపీఠంబిది 'జేమ్సుటాడ్డు'దని లోకంబెంచి హర్షించుఁగా
దేపట్టైన వికాసమూఁది రసమెంతేఁ దక్కువైయున్న నా
లోపంబంతయు నాదిగాఁ దలఁప గేలుఁ మోడ్చి ప్రార్థించెదన్.

మ॥ వినవే మున్ను ప్రతాపుసంతతి మహావీరుండు లోకంబునన్
గనుపింపండని పూజ్యులెల్లఁ బలుకంగా; నట్టి రాణా ప్రతా
పుని గీర్తించెడుపట్ల నెట్లు కవనంబున్ సాఁగఁగాఁ జేతువో
నిను సేవింతు విరించిరాణి! సుమపాణీ! వాణీ! నన్నోమవే.

సీ॥ రచియించియుంటి వీరమతీచరిత్రంబుఁ
దిరుపతి వేంకటేశ్వరులు మెచ్చఁ
గృతి యొనర్చితిఁ జండనృపమౌళికథ దేశ
చరితముల్ శోధించి సరసు లలరఁ
దగఁగూర్చియుంటిఁ బద్మావతీవిజయంబు
వీరంబు హాస్యంబు వెల్లి విరియ
వ్రాసియుంటి సమగ్ర రామాయణము నాట
కములుగా విబుధలోకములు పొగడ

గీ॥ నిన్ని యొకయెత్తు మఱి ప్రతాపేంద్రుచరిత
మొక్కయెత్తు సుధారసంబొలుకుచుండ
నొక్కచూపెక్కుడుగాఁ జూచి యుద్ధరింపు
శైలరాజేంద్రకన్య! సౌజన్యధన్య!

# కృ త జ్ఞ త.

మా తండ్రిగారగు శ్రీ డి. రాజశేఖర శతావధానిగారికి రాణాప్రతాప సింహ చరిత్రమునందు అధికప్రీతి. ఈ కావ్యము నాల్గవ కూర్పు చేయింప దలచుచుండిరి. ఇంతలో వారు దివంగతు లగుటయు, మా వద్ద ప్రతులు లేక పోవుటయు, పలువురు కావలెనని యుత్తరములు వ్రాయుటయు జరిగినది. అప్పుడు మే మీకావ్యము ముద్రింపించ దలచితిమి ముద్రణ భారము శ్రీ సి. వి. సుబ్బన్న శతావధానిగారికి అప్పగించితిమి. ఈయన యెవరోకాదు. మా తండ్రిగారు "కామేశ్వరీస్తోత్రమాట" యందు

భక్త్యావిచింతయతి మత్కులశలం సమగ్రం
ప్రోత్సాహయ త్యుపచర త్యనుయాత్యజస్రం
యః స్వీవి సుబ్బన సుధీః కవి బాలధాను
ర్జీయాచ్చిరం ససుకవిత్వ నవప్రథాతః.

అని వ్రాసిరి. ఈయన మాతండ్రిగారికంత దగ్గరివాడు. అందుచేతనే యీ కార్యభారము వహించినాడు. తిరిగిమేము 'కృ త జ్ఞ త' చెప్పవలెననుకొను వాడునుగాడు. అయినను మాధర్మము మేము నిర్వహింపవలయును గదా!

మా తండ్రిగారికి అత్యంత ప్రీతిపాత్రమైన యీ కావ్యమును ముద్రింపించుటకు తోడ్పడిన శ్రీ సి. వి. సుబ్బన్న శతావధానిగారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

మదరాసు,
29—7—57

మన్నెము కామేశ్వరీదేవి.



సీ॥ స్తిమితమ్మై తుదల విచ్చి యుదార గంభీర కాంతు లీను వెడంద కనులతోడఁ
బరువంపు బుగ్గలపైన రెక్కొను మీసల వెలుంగు మోమువాలకముతోడ
వీరమహాలక్ష్మి విహరించు దుర్గమై విరిసిన బలితంపు టురముతోడఁ
దలయెత్తు వాఁడికుంతముఁ గేలనూఁది ధీరత యుట్టిపడ నిల్చు రాణతోడ
తే॥ సాదలఁ దుగాయి, వీర తేజోదుకీర్తు-వదనమునఁ గుంకుమాంకము, వజ్రవర్మ
మెండల వెలుఁగొందఁ గలయనీమూర్తిఁ గంటి! యెంత కళగలతండ్రివోయీ ప్రతాప!

— శ్రీ ఖాఖాసాహిత్య.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాజా ప్రతాపసింహ చరిత్ర

## ప్రథమాశ్వాసము

---

శ్రీమత్కందుకమట్లు గుండ్రమయి వారిన్ రెండుపా ళ్లాక్రపా
ల్భూమిన్ నిండియు నూఱునర్వదియుఁ గోట్లుఁగా మర్త్యు లొప్పారఁగా
వ్యోమంబంటు నగాధిరాజ నివహంబుల్ మీఱ విశ్వంబు శో
భామూల్యస్థితినొప్పు నీశ్వరు ననంతైశ్వర్యముల్ చాటుచున్. 1

సీ॥ కాంచన శృంగభాగము కిరీటము గాఁగఁ
గాశ్మీర మాస్యపంకజముగాఁగ
సింధు గంగానదుల్ చేఁదోయి గాఁగ నా
ర్యావర్తదేశం బురంబుగాఁగ
వింధ్యాచలేంద్రంబు బెడఁగు మధ్యము గాఁగ
గౌతమి కనక మేఖలయుఁగాఁగ
మలయ సహ్యాద్రు లడుగులు గాఁగ సింహళ
ద్వీప మంభోరుహ పీఠిగాఁగ

గీ॥ లవణ రత్నాకరము సరః ప్రవర మగుచుఁ
వెలుఁగు భారత దేశ లక్ష్మి సమగ్ర
భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవమ్ము
లిట్టివని వివరింపఁగా నెవరి తరము. 2

శా॥ జానొందన్ బహుళాంబు పూరము వనాశాళంబలల్ నింప స
స్యానీకంబు సమృద్ధమై యెదిగె భాగ్యస్ఫూర్తి హెచ్చింప ల
క్ష్మీనిత్యోత్సవ మందిరంబయి తనర్చెన్ విశ్వసర్వోన్నత
స్థానంబంది సమస్త వైఖరుల రాజస్థాన మవ్వేళలో. 3

సీ॥ ఇట్టిరాజస్థాన మెపుడు స్వతంత్రులౌ
జనపాలమణుల పాలనము వొందు
దేశంబు లిరువది దీపింప వెలుగొందు
వానిలోనెల్ల మేవాడదేశ
మగ్రగణ్యము; దాని యధిపతియగు వాని
'రాణా' యని జనులు ప్రస్తుతింతు
రతఁడు మతాధిపత్యమున నెల్లరకు జ
గద్గురుఁడగుచు విఖ్యాతిఁగాంచు.

గీ॥ నగరములలోనఁ గాశికానగర మట్లు
చిరయశముఁగాంచెఁ జిత్తూరు పురవరంబు
నచటి రాణాయు నందఱ నగ్రపూజ్యుఁ
డెల్ల సురలందుఁగాశి విశ్వేశుమాడ్కి.

సీ॥ హారావళీ పర్వతావళి విరివిగా
నింద్రనీల శిలల నిచ్చుచుండ
సాంబారు లూనీ విశాల ప్రదేశముల్
సహజమౌ లవణం బొసంగుచుండ
గను లెల్లెడల మరకతములు రత్నముల్
సౌవీరమును మంచి స్ఫటికములును
జంద్రకాంత శిలల స్వర్ణరౌప్యంబుల
నెడతెగకయె యెప్పు డిచ్చుచుండ.

గీ॥ భాగ్యము లొసంగి యేలిన వారియిండ్లు
బంగరుంగొండలట్లు చేయంగఁగలిగి
రత్నగర్భ యటన్న సార్థకపదంబుఁ
బడసి మేవాడ దేశంబు పరిఢవిల్లె. 5

శా॥ ఆవిర్భ్వోన్నత పుణ్యవైభవ యశోహారాళి హారావళీ
గ్రావోత్తంసము తూర్పునన్ సరసిజారామంబునన్ బొల్చు ల
క్ష్మీవామాక్షి బలె రాజధానియగుచున్ జిత్తూర్పురం బొప్పఁగా
మేవాడ్దేశము వీరఖండ మగుచున్ మించున్ ధరాస్వర్గమై. 6

సీ॥ సచరాచరప్రపంచప్రాణమగు సూర్య
భగవానుఁడాదిమ వంశకర్త
త్రిజగతీధానుష్క దీపకుండైనరా
ముని సుతుండు లవుండు మూలపురుషుఁ
డలయగస్త్యాశ్రమఖ్యాత మాబూగిరి
నేకలింగేశ్వరుం డిష్టదైవ
మతి పావనము లయోధ్యా వల్లభీసీమ
లాదికాలము నాఁటి యాటపట్టు

గీ॥ లాశిలాదిత్య కనకసేనాది రాజ
రాజపరమేశ రణ విహారప్రతిష్ఠ
ఖండఖండాంత నగర విఖ్యాతి హేతు
వట్టి మేవాణ్ణృపుల నెన్న నలవి యగునె. 7

మ॥ సమమైయొప్పు విశాలశైల శిఖరస్థానంబునన్ రాజపు
త్రమహీకాంతకు వజ్రభూషణమటుల్ రాణించు చిత్తూరుసం
ద్రము మధ్యంబునఁ గోడలేడు కొమరొందన్ భైకిఁగన్పట్టు దు
ర్గమ లంకాపుర పూర్వవైభవము జోకల్ జ్ఞప్తికిన్ దెచ్చుచున్. 8

గీ॥ ప్రక్కప్రక్కనఁ బదిబండ్లు వరుసగాఁగ
నరుగ ననువైన వైశాల్య మతిశయిలఁగ
నహిత దుర్భేదమగు గోడ లలరు కోట
లేడుచుట్టు చిత్తూర్పురి కెసఁగియుండు. 9

సీ॥ విపణిమార్గములతో వీధుల తుదినొప్పు
శివకేశవాలయ శ్రేణితోడ
నారామముల తోడ నపరంజి తాఁపిన
సముదార భవనాంగణముల తోడఁ

జతురంగముల తోడ నతి విశాలంబైన
వివిధాయుధాగార వితతితోడ
మణివితర్దికలతో మధుర నానాజాతి
ఫలమహీరుహ కదంబకము తోడ
గీ॥ సౌధములతోడ, బహుసరస్సమితి తోడ
రచ్చగమితోడ వారి యంత్రములతోడ
భరత ఖండైక లక్ష్మినివాస భూమి
నగరమాత్రంబె చిత్తూరు నగర వరము. 10

మ॥ వనితాశీలము నిల్ప శత్రువులఁ ద్రుంపన్ సేఁతు చిత్తూరు ద
ప్పిన నీలోకము శూన్యమంచుఁ గరముల్ వేయెత్తి ఘోషించెనో
యన సూర్య ధ్వజకోటు లెల్లెడ సహస్రాంశుల్ పిసాళించి న
ర్తన మాడున్ మృదులానిలంబు తమ మీఁదన్ సోఁక హేలాగతిన్ 11

సీ॥ నవ్వనేర్వక మున్నె క్రొవ్విన రిపుకోటిఁ
బాఱంగఁదోలి నవ్వంగ నేర్తు
కూర్చుండుటకు మున్నె క్రోధోగ్రశత్రు వ
క్షోదేశ మెక్కి కూర్చుండ నేర్తు
నడువకమున్నె చండ విపక్షమకుట సం
తతులఁ బాదము లుంచి నడువనేర్తు
పరువులెత్తక మున్నె పరిపంథి తతి నొంచి
తఱుముచు వెనువెంటఁ బరువ నేర్తు
గీ॥ రాడుటకు మున్నె ఘోర రణాంగణముల
నరిశిరంబులతో బంతులాడ నేర్తు
రౌర; చిత్తూర్పురి జనించినట్టి వారు
శైశవము దాఁటుటకు మున్నె శౌర్య మహిమ. 12

శా॥ ఇంద్రప్రస్థముగాదు ద్వారకయుఁగాదే కాశియున్‌గాదు ని
స్తంద్ర ప్రాభవకీర్తి శోభిత మయోధ్యా పట్టణంబేని గా
దింద్రోపేంద్ర సమానులౌ నృపులు తామేలంగఁ జిత్తూర్మహా
స్సాంద్రశ్రీలను గుత్తకున్ గొనిన యాచందంబు దీపించెడున్. 13

సీ॥ హారితమౌనీంద్రు పాదాబ్జాత యుగళికి
శిష్యుఁడై శుశ్రూషచేయఁ గలిగె
వ్యాఘ్రశైలంబు తాపసు కూర్మిఁగని ద్విధా
రా ఖడ్గమును బొంది రాణ మెఱసెఁ
బ్రమరుల గెలిచి 'భారత సూర్యుఁ'డని 'విశ్వ
• • • పతి' యని బిరుదముల్ పడయఁగలిగె
ఖాండహా రిస్పహా కాఫరి స్థానాది
యవనసీమలు గెల్చి యశముఁగాంచె
గీ॥ వందలకుఁ బైనఁ బుత్రులఁబడసి సూర్య
వంశమును నిల్పి సౌపర్వ పర్వతమునఁ
దపముఁ గావించి ముక్తి కాంతను వరించె
బప్పరావు మేవాడ్భూప వంశకర్త. 14

—• భరతఖండముపై యవనుల దండయాత్రలు •—

సీ॥ తమ యుపనదుల సంతతులెల్ల వెండి రే
కులువోలె నెల్లెడ నలముకొనఁగ
జహ్నుకన్యాసింధు సలిలపూరమ్ములు
సారతఁగూర్ప బంగారు పండు
రసఖండమై పచ్చరా బయలులమాడ్కి-
లలిత సస్యశ్యామ లంబునగుచుఁ
బిడికెఁడు చోటైన వెలిఁబోవనట్టి యా
ర్యావర్త బహుళ భాగ్యాంక కథలఁ
గీ॥ చెవులు చిల్లులువోఁబారసీక యవన
ఖాండహారిస్పహాసు బాగ్దాదు మొగలు
గజ్నిపతులు మిడుతదండు క్రమ్మినట్లు
దాడి వెడలిరి తండోప తండములుగ. 15

గీ॥ ఎనిమిదవ శతాబ్దారంభమునఁ గవీపు
'వాలిదు' తొలుత ఖాసిముఁబంపె నతఁడు
సింధుదేశమ్ము దాటి కాశీపురంబు
వఱకుఁ గలసీమ లన్నియుఁ బాడుచేసె. 16

మ॥ ఒకబాగ్దాదు నరేంద్రచంద్రుఁడు కవీప్ 'ఓమా'రబుల్‌హాసు సే
న కధీశున్ బొనరించి హైందవముపైనన్ బంపఁగా దూరమెం
చకయే యామడ యడ్డుగా నడిచి రాజస్థానమున్ జేరి భూ
ప కులారణ్యములన్ దహించె నతఁడున్ వైశ్వానరప్రాయుఁడై. 17

మ॥ ప్రళయాంభోధరపంక్తి చందమున గర్జల్ సేసి తత్సైన్యముల్
దళస్సై యా యజమీరుపై నడిచె దూలారావు తౌరుష్క యో
ధులు మూన్నాళ్లు బడల్ పడన్ మెలఁగి శ్రాంతుండై యబుల్‌హాసు ను
జ్జ్వలహేతి ప్రహతిన్ దెగెన్ రిపుజనోత్సాహంబు రెట్టింపఁగన్. 18

సీ॥ తత్పరిసరసైకతస్థలిపైఁ బోడి
బాలురతో నంతవఱకు నాడు
కొనెడు దూలారావు కొమరుఁ డేదేండ్లలా
టుఁడు తండ్రియు శిరంబు డుల్లి ధాత్రిఁ
బడుటఁ గన్గొని రక్తముడుకెత్తి చేరువ
భటుచేతఁగల పెద్ద బారటీఁటె
గుంజుకొం చరిగె చెంగున దాట్లిడుచు నబుల్
హాసు గుండియ లవియంగఁ దాఁకె

గీ॥ నిరువురును బోరి రొండొరు నిచ్చమెచ్చ
కంత లాటుఁ డరిన్‌గూల్చి యతనివెంట
నరిగె దివికి హితాహితులంద "ఈతఁ
డౌర యభిమన్యుపైచేయి" యని నుతింప. 19

సీ॥ లాటుఁడుత్తమ గుణాలయుఁ డమానుష వీర
పురుషమూర్తి యని యంచఱకుఁ దోఁచెఁ
జోహణు లాబాల శూరుని విగ్రహం
బులు రచింపించి దేవుని విధానఁ
బ్రతివత్సరము భక్తివఱల జ్యేష్ఠద్వాద
శీ దినమందుఁ బూజించు చుందు
రాలాటుఁ డనిచేయు నపుడున్న కాలి గ
జ్జెల నెల్ల జనులు దర్శించి పోదు:

—: గజినీ మహమ్మదు దండయాత్ర :—

ఆ॥ వె॥ రాదినంబు నుండి యీదినంబునకుఁ జో
హణ కులంబు వారలాత్మజులకుఁ
గాలి గజ్జియలను గట్టరు లాటుని
యెడల వారి భక్తి యెట్టిదొక్కొ.

సీ॥ భాగ్య సౌభాగ్య సంభావ్యముల్ సింధు మూ
ర్జర దేశములను వర్తకముఁ బెంప
'టైగ్రిస్' నదీ కృపీట పవిత్రమైన య
రాబియా పాలించు రాజలోక
మణి కలీఫ్ ఉస్మాను మఱి కలీన్ అలి యే
జీదు ఖొరాసాను క్షితిపమౌళి
యబ్దుల్ మలీకు సైన్య సముద్రములను బొం
గించి హైందవమును ముంచి తేల్చి

గీ॥ రటుపయిని హరూన్ అల్రిశ్చిదను కలీఫ్ అ
రాబియా మొదల్ కాశి పర్యంత మేలె
నవ్వల సెబాక్టజిన్ వచ్చె నతఁడు ప్రళయ
భైరవుని మహమ్మదుఁ దెచ్చె వానికొడుకు. 21

మ॥ తడ వింతేనియు లేక వీరభట సంతానంబు తన్గొల్చి వెం
బడిరా సింధునదిన్ దరించుచు మహమ్మద్ ఘజ్ని గజ్నీవిభుం
డడవుల్ గాల్చుచు భస్మమున్ సలుపుదావాగ్నిన్ బలెన్ బొంగుచున్
దుడిచెన్ భారత దేశ పట్టణము లందున్ గల్గు సర్వస్వముల్. 22

మ॥ కడుసౌభాగ్యము గల్గు రాష్ట్రముల వంకన్ సుంత కన్నెత్తి చూ
డఁడు బంగారము పండు నేలలను జూడండట్టై పేర్వాసిఁగాం
చెడు దేవాలయ లింగముల్ పేటికి గజ్నీ సౌధ సందోహ మె
క్కెడు సోపాన చయంబుఁ జేసె విహితుల్ కీర్తింప వేభంగులన్. 23

మ॥ అనయోత్సాహముతో మహమ్మదు చలంబారంగ సౌరాష్ట్రమం
దున విచ్చేయుచు సోమనాథపుర మందున్ సోమనాథేశ్వరా

ది నిలింప ప్రకర ప్రపూజ్యమగు జ్యోతిర్లింగ సంఘాతముల్
దునియల్ చేయుచు ద్రవ్యరాసులను దొంతుల్ దొంతులుల్ జేకొనెన్ 24

సీ॥ భువన వీరసమూహమున మేటి యనందంచు
యశమొందఁగనిన మహాఘుజుంటు
కొండపల్లెను మార్చి గొప్ప సామ్రాజ్య సం
స్థగఁజేయు రాజతంత్రజ్ఞమౌళి
కన్నకొడుకునైనఁ గడికండలుగఁ జీల్చి
ధర్మంబు నిలుపు నుదారబుద్ధి
విశ్వకళాశాల వెలయించి దేశదే
శముల విద్యను బెంచు జ్ఞానమూర్తి

గీ॥ కవుల పాలిఁటి ముంగిటి కల్పకంబు
విగ్రహారాధనము పైన వెగటు వలన
గజిని మహమదు దండెత్తెఁ గాక యున్న
నంతవాఁడెట్లు జనహింస కనుమతించు 25

గీ॥ ఇటులు పండ్రెండు మార్లు దండెత్తి వచ్చి
ధన కనక వస్తుతతిఁ గొని చనుచె కాని
భరతఖండంబు శాశ్వత వాసముగను
జేయఁదలపక నిజసీమఁ జేరుకొనియె. 26

—: ఘోరీ మహమ్మదు యాత్రలు :—

ఉ॥ ఆకడగంట్లు వాసి, భరతావని కొంతకుఁ గొంత కోట్లొనన్
బోకయముస్నె వేఱొక రిపుండు మహమ్మదు పేరివాఁడు ఘో
రీకులుఁ డాత్మవాహినులు క్రిక్కిరియంగను గోరుచుట్టుపై
రోఁకటిపోటునాఁ బ్రళయ రుద్రుని కైవడి వచ్చె నుద్ధతిన్. 27

శా॥ ఆకాలమ్మున సార్వభౌముఁడయి యార్యావర్తముల్ బృథ్విరా
జేకచ్ఛత్రముగాఁగ నేలె నతఁడయ్యింద్రాత్మజున్ బోలె సు
శ్రీ కల్యాణ పరాక్రమోన్నతుఁడు ఘోరీవంశజున్ దాఁకి చీ
కాకై పాఱఁగజేయ సైన్యముల నాయత్తంబు చేసెన్వడిన్. 28

గీ॥ చేరి హమ్మీర గంభీర సింహ నృపులు
కాకసన్ పర్వతమునుండి కాశిదాఁక
నూటయెనమంది క్షితిపుల మాటమాత్రఁ
బిలుచుకొని వచ్చి పృధ్వీశుఁ గొలుతు రెపుడు. 29

మ॥ అతితేజోబలధాముఁ డా సమరసింహక్ష్మాతలేంద్రుండు వ
దిత నానాజనపాలలోకుఁడగు పృధ్వీభర్తకున్ సోదరీ
పతి వజ్రాయుధకోటి మ్రింగఁగల మేవాడ్దేశ రాహుత్తులున్
గృతహస్తుల్ తనుఁగొల్వ వచ్చెనని కేకీభూత చేతస్కుఁడై. 30

గీ॥ భరతఖండంబు నాక్రమింపఁగఁ దలంచి
యేడుమాఱులు ఘోరిదండెత్తి వచ్చె
మఱఁదియును బావయును దాఱుమాఱు చేసి
యతని వెనుకకు నంపించి రాఱుమార్లు. 31

సీ॥ త్వార్వంశ భవులైన ధరణీతలేశ్వరుల్
పూర్వ మింద్రప్రస్థ పురిని సార్వ
భౌములై యేలిరవ్వారిలోన 'ననంగ
పాలుండు' కడపటివాఁ డతండు
పుత్రసంతతి లేక పుత్రికలను నిర్వు
రనుగాంచె మొదటిదానిని గనూజి
పీజపాలునకును బిదపటిదాని సో
మేశున కజమీరు దేశపతికి

గీ॥ నిచ్చె' వారికి జయచంద్ర పృథ్వివిభులు
గలిగి రయ్యనంగుఁడు కొంత కాలమునకు
వ్యాధి పీడితుఁడగుచు నిజాత్మజలను
మనుమలను బిల్చుకొని చెంత నునిచికొనియె. 32

గీ॥ ఒక్కనాఁడు పట్టాభిషేకోత్సవంబు
జరుప సామంత నృపుల నందఱును జేర్చి
యయ్యనంగుఁడు డిల్లి సింహాసనంబు
నెక్క మన నెక్కి కూర్చుండెఁ బృథ్వివిభుఁడు. 33

సీ॥ "ఇరువుర మేము దౌహిత్రులమైయుందు
మప్పనెల్లెండ్రకు నాత్మజులము
పదియు నెమ్మిది యేండ్ల ప్రాయ మందున్న నన్
వదలి యెనిమిదేండ్లవానిఁ బృథ్వి
సింహాసనాసీనుఁ జేయుట ధర్మ మీ
తని యధికార మే ననుమతింప
నాక్షేపణ మొనర్తు" నని ధిక్కరించి యా
జయచంద్రుఁ డేగెనాసభను వీడి

గీ॥ యతనివెంట నాబూపర్వతాధికారి
వ్యాఘ్రరాజేంద్రుఁడును బట్టణాధినాథుఁ
డసమబలుఁడు భోలాభీముఁడా క్షణంబ
కదలిపోయి రాస్థానరంగంబు వదలి. 34

సీ॥ తుహినాద్రినుండి సేతువుదాఁకఁ దనరు న
ఖండ భారతఖండ మండలంబు
సకల మేకచ్ఛత్ర సామ్రాజ్యముగ ధరి
త్రీ రాజ్య మేలెఁ బృథ్వీనృపాలుఁ
డావీరవరు సహస్రాదిక యుద్ధముల్
ధర్మసంస్థాపన తత్పరతయు
నతని సామంత ధరాధీశ్వరుల భూరి
పౌరుష విక్రమ ప్రాభవములు

గీ॥ చంద్రభట్టారక సుకవి చక్రవర్తి
వ్రాయు శతసహస్రాధిక గ్రంధమందు
రసనమృద్ధిని బర్వపర్వంబునకును
జీవకళ లుట్టిపడఁగ రంజిల్లు చుండు. 35

—: సంయుక్తా స్వయంవరము :—

చ॥ అమిత విశాలమై సిరు లనంతముగాఁగల కాన్యకుబ్జ రా
జ్యము మును దక్షిణాపథమునందును వ్యాపన మొందె రాజసూ

యము సల ధర్మనందనుని యవ్వల నీజయచంద్రుఁ డొక్కఁడు
క్కమిగిలి చేయనేర్చె నృపకోటి యొనర్ప సమస్త కార్యముల్. 36

గీ॥ అవలఁ దనపెంచు సంయుక్తయనెడు కన్య
పరిణయ మొనర్పఁగా స్వయంవరముఁ జాటి
సకల దిగ్దేశవర్తి రాజన్యులకును
బంపె వైవాహి కాహ్వాన పత్రములను. 37

సీ॥ తనకెకాదింక భూస్థలి రాజులకు నెల్లఁ
బెద్దయౌ రారాజు పృథ్వీరాజ
మౌళి కాహ్వాన మంపమి యట్టులుండ హా
స్యమునకై యొక పెద్ద యట్టచేత
నామహాప్రభు విగ్రహము రచింపించి నే
వకు దుస్తు లిడుచు నుద్వాహమండ
పము మహాద్వారంబు పరగడ మోడ్పుచే
తులతోడఁ దలవాల్చి నిలువఁజేసె

గీ॥ నల స్వయంవరాహూతులై యచటఁ జేరు
భూమిపతులెల్లఁ దుచ్ఛమౌ బొమ్మఁ జూచి
సంభ్రమాశ్చర్య చకితులై చాలఁ దడవు
నిలిచి రనిమేషులగుచు బొమ్మల విధాన. 38

సీ॥ "నృపమకుటములు తన్ని జనించె నామహా
భాగు సేవకుఁజేయఁబాడి గాదు
భువనోన్నత ప్రాభవుండైన మేటి యా
తని రెగ్గుచేయుట తగవుగాదు
రణరంగ ఫల్గుణ ప్రఖ్యాతి గల వీర
మౌళి నొప్పరికింప మేలు గాదు
శ్రీరమారమ ణావతారు జగద్వంద్యు
నవమాన మొనరింప నసుపు గాద

గీ॥ యతఁడిది యెఱుంగునేని దక్షాధ్వరంబు
రూపుమాయింప వెడలు రుద్రుఁడయి దూఁకి
జగము సర్వసంహారము సలుపుఁగాని
యోర్వఁడవమానలేశ మాయోధమౌళి. 39

క॥ అని వగచుచుఁ దమతమ యా
సనములఁ గూర్చుండి రవల సభయెల్ల మహా
జన నివహముచేఁ గ్రిక్కిరి
సెను బిదప ముహూర్తవేళ చేరఁగ వచ్చెన్. 40

మ॥ అతిలావణ్య విలాస విభ్రమ సురూపాయత్త దివ్యాంగనా
తతులన్ మెచ్చని లోకమోహినులు కాంతారత్నముల్ నల్వురున్
జతురస్వాంతలు కొల్చి వెంట నడువన్ సంయుక్త తారాగణాం
చిత జైవాతృక బింబమో యనఁ బ్రవేశించెన్ సభావేదికన్. 41

చ॥ కలకలలాడె నెల్ల సభకప్పుననుండియు వింతయంత్రముల్
జలజల రాల్చెఁ బూలు నృపసత్తములున్ జెలి గారవించి రాఁ
దలలను వాల్చుచున్ మృగమదంబు పునుంగు జవాది గంధముల్
వలపులఁ జల్లె నెల్లెడ సభాసదు లెల్లరు నుల్లసిల్లఁగన్. 42

సీ॥ జయచంద్రనృపమౌళి సంయుక్తతోడ ముం
దునకురాఁ బౌరోహితుండు నృపుల
వేఱువేఱుగఁ జూపి వారివారి సమగ్ర
పౌరుష ప్రాభవ వైభవములు
విపులంబుగా నిరూపించి వర్ణనచేసెఁ
గన్నె యొక్కనినైనఁ గన్నులెత్తి
కనుఁగొనకయె ముందుకై సాగి నృపపీఠ
ములు దాఁటి నడిచె విప్రుండు నవలఁ

గీ॥ గల మహామాత్యులను బ్రభువులను సైన్య
పతుల నుద్యోగులను జూపెఁబడఁతి ముందుఁ
కరిగె జయచంద్రుఁ డతిక్రుద్ధుఁడగుచు మంది
కొమ మహాద్వారమున కీడ్చుకొనుచుఁ బోయి. 43

మ॥ "ననుఁ దప్పించి మహేంద్రయోగ్యమగు నింద్రప్రస్థ సామ్రాజ్యమొం
దిన తుచ్ఛుండు గులామునున్ శరుఁడు పృథ్వీనాముఁ డవ్వాని బొ
మ్మను బెండ్లాడు "మటంచుఁ దోఁచెఁ జెలికంపంబొంది తద్ధాటి బో
రన నేలన్బడె సభ్యులందఱు మహోగ్ర క్రోధమున్ జెందఁగన్. 44

గీ॥ అవిర ళాత్మీయ పూర్వ పుణ్యముల రాశి
యెడతెగక తానువలచు వేయేండ్ల పైరు
ముందుఁగని లేచి సంయుక్త బొమ్మకు సుమ
దామమును వైచె సిగ్గునఁదలను వాల్చె. 45

సీ॥ పుష్పహారమునోఁక బొమ్మ తద్దయుఁ బెద్ద
ధ్వనితోడఁ బైన మస్తకమునుండి
పాదాగ్రమున దాఁకఁ బరియలై యందుండి
క్షణమున భువన విస్మయముగాఁగఁ
దలపైన వింత వింతల రంగుటీకల
కాంతార మబ్ధి భంగములు వోలె
నటునిటు తూగాడ నసమాన శతకోటి
మన్మథ సౌందర్య మహిమ వెలయ
గీ॥ ముందడుగు వైచుచును మహా పురుషమూర్తి
విమత సమవర్తి శ్రీమహావిష్ణు వట్లు
చారుమూర్తి పృథ్వీసింహ చక్రవర్తి
జగము లానందమొంద సాక్షాత్కరించె. 46

మ॥ అమృతాంశున్ గని పొంగు సంద్రముక్రియన్ క్ష్మాధీశు లానంద సం
భ్రమము లొచున్ జయనాదముల్ సలుప విశ్వత్రాత పృథ్వీంద్రుఁ డ
క్కొమఁ జేతన్ గొని యశ్వమెక్కెఁ 'యిదిగో గొంపోవుచున్నాఁడ ధై
ర్యము మీకుండిన నన్నుఁ 'దాఁకుఁ'డని డాయన్బోయె డిల్లీదెసన్. 47

మ॥ సమరోర్వీతల ఫల్గునుం డితఁడనన్ సత్కీర్తి దిగ్దేశ భా
గములన్ నిండిన యామహాప్రభువుఁ దాఁకన్ ధైర్యముల్ లేక స

ర్వమహీనాథులు వాని సాహసములఁ వర్ణించి తత్తన్నివా
సములన్ జేరఁ బ్రయాణమైరి త్రుటిలో సంరంభ శూన్యస్థితిఁ. 48

మ॥ 'అకటా! గర్వవిరోధి దుష్టుఁడు శరుండౌ పృథ్వీసింహుండు క
న్యకఁగొంచున్‌జనె మోసగించి! పెనువంతన్ నైపఁగాఁజాలఁ ద
ప్పక వానిఁ దెగటార్చి నాయుసురు నిల్పన్ బెట్టరే' యంచు నో
పికజాలన్ జయచంద్ర భూవిభుఁడు తబ్బిబ్బొంది వాపోయినఁ. 49

సీ॥ అబూధరాధీశుఁడగు జయత్ర్పమరుండు
ప్రబలుండు మండూరు వ్యాఘ్రరావు
కాన్యకుబ్జంబు లక్ష్మణసింగు విశ్వేశ
సింహవిభుండు కాశీధరాధి
పుఁడు మహోబానేత పూర్ణమల్లుండు ధా
రామహీపాలుండు రామసింహుఁ
డాలాయు నుదిలుండు నాజయచంద్రుండు
మదినమ్మ వాఁడిఁటి మాడుఘానుఁ

గీ॥ డొక్కొకరుఁ డైదువేల్‌మంది యోధులఁగొని
త్వరితగతి బయల్‌దేఱి రవ్వారికెల్ల
సర్వసేనాధిపతి యౌచు జగ మద్రువఁగ
ముందుఁ గదలె బోళాభీమ భూవిభుండు. 50

సీ॥ మూఁడునాళ్ల ప్రయాణమున డస్సియుండె, జో
హాణసేన దాని సంఖ్యయుఁ గొలంది
పైఁ జిచ్చుటెండ లోపల మండుకొనుక్షుధ
వీని మించుచుఁ గ్రొత్త పెండ్లికొమరి
తను సున్నితముగాఁగఁ గొనిపోవవలయు ధా
రము కాన్యకుబ్జ సైన్యము లపార
మవ్వాని నడపు నాయకులు పెక్కురు భీముఁ
డుద్దండతర విక్రమోగ్ర మూర్తి

గీ॥ గడియ ప్రొద్దుండు వేళకే కాన్యకుబ్జ
దళము ఢిల్లీసైన్యము డాసెదానిఁ దాఁక
వేగురు భటుల నిలిపి పృథ్వీ విభుండు
ముందు నడిచె యుద్ధము ఘోరముగను రేఁగె. 51

గీ॥ అహితులను నూర్లు వేలుగా నణఁచి ఢిల్లి
భటులు కడతేఱి రంద అవ్వలి దినంబు
వెడలి రారోషు లలమిరి పృథ్విసింగు
భట సహస్రద్వయము నిల్పి వఱచె నవల. 52

క॥ అరివీరభటు లనేకులఁ
బొరిగొని వారెల్లఁ దెగిరి మూఁడవనాఁడా
యిరువాఁగులు మఱలన్ డా
సిరి కాళిందీతటంబు చేరువ సీమఁ. 53

మ॥ అరుగుఁ దెంచెను యోగినీపురవరంబందుండి పృథ్వీంద్రు సో
దరుఁడున్ వీరుఁడు చంద్రరావు చమువుల్ తన్గొల్వ, రారోద్భటో
త్కరమున్ దాఁకె నతండు యుద్ధము మహోగ్రంబై విజృంభించె దాం
తరగా మగ్నెను రెండుపక్షముల యోధశ్రేణి నిశ్శేషమై. 54

ఉ॥ ఐదవనాడు పృథ్వి వసుదాధిపుఁ డాత్మపురంబుఁజేరి ని
త్యోదయ భాగ్యశోభన ముహూర్తమునందున విశ్వవైభవ
శ్రీదయివాఱఁ ద న్నభిలషించిన కన్యను బెండ్లియాడె స
మ్మోదముతో ధరావలయమున్ బరిపాలనఁజేసె దక్షతఁ. 55

సీ॥ అభిచార హోమంబు లాచరించెడువారిఁ
బిలిపించి నూర్లను వేలు నొసఁగి,
హంతకులను గూడి మంతనంబు లొనర్చి
లక్షలు లక్షలు లంచమిచ్చి,
పరిసర నృపకోటిఁ బురికొల్పి కోటానఁ
గోట్లిచ్చు పయి కుసికొలిపి పంపి,
రాజోత్సవముల మారణ యంత్రములు పన్ని
పొంచి ప్రేల్పించి చంపించ నెంచి

గీ॥ మొందఱనొ యాశ్రయించి యెన్నెన్నొ గతులఁ
గుట్రలు కుతంత్రములు వేసి కోర్కె-ల్లఁ
జెఱుచు జయచంద్రుఁ డొఱక కృశించుచుండె
నీర్ష్య తనుచేర్చువాని దహింప కున్నె. 56

సీ॥ ఇంకొక్క-మాఱు దం డె_త్తిరమ్మని యతం
డర్థించె ఘోరీమహమ్మదు విభు
నావార్త విని యసంఖ్య చమూతతులు కొల్వ
నరుదెంచె నమరసింహ ప్రభుండు
మూఁడుకోసుల దూరమునకేగి పృథ్వీందుఁ
డడుగులకును మ్రొక్కి- యతనిఁ దెచ్చెఁ
'గగ్గా'ర్నదీ తట క్ష్మాసీమ యవన సై
న్యం బుండె డిల్లి సైన్యములు వచ్చె

గీ॥ నాప్తులును దాసు జయచంద్రుఁ డాయవనులఁ
గదిసె నుదయ మయ్యెదిచూచి కదలి వెళ్లి
తండ్రి మృదుపాదములకు వందన మొసర్చి
యుదిలకొని మహారాజ్ఞి సంయు_క్త యపుడు. 57

సీ॥ 'భరత మహామహీస్వాతంత్ర్య ముడుప శ
త్రులు వచ్చి రదినిల్పఁ దొడరవచ్చె
నాప్రాణవిభుఁ డఖండ ప్రాభవుండు నే
నుండ వేర్వేఱ మీకుండఁదగునె
ధర్మపక్షము మాది దయచేయవయ్య పృ
థ్వీవిభు నర్ధాంగిఁ బిలుచుచుంటిఁ
జెడుగులే దీవు వచ్చిన సత్క-రించు నా
భ_ర్త నిన్ వైరము వదల దేని

గీ॥ నేగుము కనూజి కటులు పోవేని భార
తావనిని దాస్యమునఁ ద్రోయు నపయశంబు
ననుభవింతు వా చంద్రతారార్క-' మనుచు
మ్రొక్క-జయచంద్రుఁడును గడుఁ గ్రుద్ధుఁ డగుచు. 58

సీ॥ రమనీయ భారతఖండ సామ్రాజ్య సౌ
భాగ్యలక్ష్మి విధానఁబరగు మంగ
ళోదారమూర్తి సంయుక్త సాగిలపడి
యుండ భూదేవ మంత్రోక్తిపూత
కంధిజలాభిషేక పవిత్ర మామె మూ
ర్ధము నబ్టి వామపాదమునఁ దన్ని
'కదలి పో నాసముఖమున నుండకు' మంచుఁ
ద్రోసిన లేచి యాదొడ్డతల్లి
గీ॥ 'తెలిసినది విన్నవించితిదీన నీదు
హృదయము కఱంగకున్న నేనేమి సేతు'
నని కదలి వచ్చె నుభయ సైన్యములకును ర
ణంబు ఘోరంబుగా మూఁడునాళ్లు జరిగె. 59

గీ॥ సమరసింహుండు పడియె సైన్యములు చెడియె
రాజపరమేశ్వరుండు వీరప్రభుండు
పృథ్వీరాజేంద్రుఁడును ఢిల్లిరిపుల బారిఁ
బడిరి భారతదేశ దౌర్భాగ్యకలన. 60

సీ॥ 'నుత రమాఖండ భారతఖండ గగనాగ్ర
రంగ మధ్యాహ్న మార్తాండమూర్తి
బప్పరాయాన్వ యాభరణ షట్త్రింశన్నృ
పాలక కుల భూరివజ్రమకుట!
యరిగితే ననుఁబాసి చేఱవడె నాపృథ్వి
మఱఁద లెందరిగెనో యెఱుఁగరాదు
పదమూఁడు వేల్మంది భటులతోఁ గల్యాణ
సింగు నాపుత్రుఁడూర్జిత పరాక్ర
గీ॥ ముఁడు స్వయంవరమునకట్లు నడిచె దివికి
నిపటఁ బనియేమి మీరందఱేగు పిదప
నని పృథాదేవి వగచి విన్ననుగమింప
సమసితే శత్రుగజసింహ! సమరసింహ!'. 61

మ॥ తొలుతన్ సాయము చేసినట్టి జయచంద్రున్ దాఁకె ఘోరీయు; దు
ర్బలుఁడై రాజ్యము వాఁడు వీడిచనెఁ; దార్తార్ వీరులున్ వెంబడిన్
గలయన్ దూఁకిరి; దిక్కులే కతఁడు గంగావాహినిన్ దూఁకి య
వ్వలి కేగెన్; దలఁద్రుంచి చంపిరి రిపుల్ వైవస్వతప్రాయులై. 62

సీ॥ "ప్రార్థింతు వలవ దీపని" యంచు సంయుక్త
కొనకాళ్లఁబడి వేడుకొనిన వినక
ఘోరీని బిలిపించి కొంప కగ్గి ఘటించి
నృపచంద్రు సమరసింహేంద్రుఁ ద్రుంచి
పృథ్వీశు నట్టేటనిడి కుంకుమూడ్చి సం
యుక్త వైధవ్య సంయుక్తఁజేసి
యుర్వి యున్నంతకు నుగ్రాపకీర్తియై
రాజ్యంబు పారతంత్ర్యమున నడితె!

గీ॥ కటకటా! కోటియుగములు గడచుఁగాక
పృథ్వివిభువంటి రాజరా జెటులఁ గలుగు
భరతభూమి స్వాతంత్ర్యమెబ్బంగిఁ బొలుచుఁ
జెనఁటి జయచంద్ర! నిబిడ దుష్కీర్తి రుంద్ర! 63

గీ॥ "చెట్టుపైఁ బక్షిశిరమును జెండు" మనినఁ
బృథ్విరాజు మూఁడుశరంబులెత్తి పులుఁగు
గళము దానివెంటనె ఘోరీగళము ద్రుంచి
యాత్మహృదయమ్ము భేదించి యరిగె దివికి. 64

గీ॥ పృథ్వినృపమౌళి గృహము ఘోరిగృహంబు-
సమరసింహు గృహము జయచంద్రు గృహము-
నాల్గు గృహములు మొదలంట నాశ మయ్యె
దుష్టుఁడగు నొక్క దేశ విద్రోహి కతన. 65

క॥ కుతుబుద్దీన్ సేవక సం
తతివాఁడు సమర్థుఁ డగుటఁదగునని ఘోరీ
పతి భారతసామ్రాజ్యం
బతని వసము చేసి పోయె నాత్మనగరికిన్. 66

ఉ॥ జంబవిరోధి వైష్ణవ విశాలత భూప్రజ నేలి శాశ్వతో
జ్జృంభిత కీర్తిచంద్రికలఁజిమ్ముచు వాఁడు 'కుటుబ్ ; మినార్' శిలా
స్తంభము నొక్కదాని జయసంభృతమై పొలుపొంద నిల్పెవి
శ్వంభరఁ బొల్చు నయ్యదియు సప్తవిచిత్రము లందు నొక్కఁడై. 67

మ॥ పరిపాలించిరి వానివెన్క ధరణీభాగంబుఁ బెక్కుర్ నృపా
లురు! ఖిల్జీకులుఁ డొక్కఁడాదట జలాలుద్దీను దుస్తంత్ర ము
ష్కరుఁ డప్పుండిన ఢిల్లిరాజు శిరముఞ్ఖండించి యేత త్పురీ
వరముఞ్ జేకొని రాజ్య మేలఁ దొడఁగెఞ్ బట్టాభిషిక్తుండునై. 68

క॥ అవల నలాయుద్దీనను
యవనుండు పరాక్రమక్రమాటోపుఁడు పా
ర్థివుఁ డయ్యె దేశమంతయుఁ
దవిలి వసము చేసికొన సతఁడు గాంక్షించెఞ్. 69

గీ॥ సమరకోవిదుఁ డతఁడు మాళ్వమును దేవ
గృహమును విహారదేశమ్ముగెలిచి తృప్తి
పడక లయకాలరుద్రుని పగిది వెడలి
యల రణస్తంభపుర దుర్గమాక్రమించె. 70

మ॥ కమలాదేవి రతిస్వరూప యని యాకర్ణించి యాతండు సై
న్యముతో ఘూర్జరదేశ మేగి యనిలోనఞ్ దన్మహీనాథు జీ
వములఞ్బాపి లతాంగిఁ జేకొనియె! నాపై నాసియా మధ్య భా
గమునందుండియు వచ్చి ఢిల్లిపురి లగ్గల్ వట్టి రామోగలుల్. 71

మ॥ ఉరుశౌర్యంబునఁ బెక్కుమాఱులు నలాయుద్దీను మోగల్ రిపూ
త్కరముఞ్ యుద్ధములందు మార్కొనుచు నుగ్రక్కఞ్జేసి మోదించెఁబా
ఱిరి స్వస్థానముఁజేర వారు భరతోర్విఞ్ వీడి ఢిల్లీశుఁడుఞ్
ధరణీరాజ్యము వృద్ధిచేసికొను చందం బెంచుచుండెఞ్ మదిఞ్. 72

సీ॥ మేవాడరాజ్య లక్ష్మీనాథుఁడయిన ల
క్ష్మణసింగె బాలుఁడౌ కారణమున
భీమసిం గాతని పినతండ్రి ప్రతినిధి
యగుచు రాజ్యము నేలెనతఁ డశేష

బలశౌర్యయుతుఁడు సింహళరాజ్య మేలు హ
మీరశంకరుని యర్మిలి తనూజ
చతురబ్ధి వలిత విశ్వధరిత్రిఁగల తలో
దరులందు మేటి సౌందర్య రాశి
గీ॥ యైన పద్మినిఁ బెండ్లాడె నామె యశము
దేశమెల్ల నిండెను రాజ్యతృష్ణకన్న
సంగనాతృష్ణ యెక్కుడౌ యవనవిభుఁడు
తరుణిఁగోరి చిత్తూరిపై దండు విడిసె. 73

మ॥ ఒకసంవత్సర మాఱుమాసము లలాయుద్దీను దుర్గంబుపై
న్య కదంబంబులతోడఁ జుట్టుకొనుచుణ్ సంగ్రామముణ్ జేసి యం
చుక గెల్పొందఁగ లేక తీరని వ్యథన్ శోషిల్ల సాగెన్; లయాం
తకులై పోరిరి రాజపుత్రు లసమానక్షాత్ర దీక్షారతిణ్. 74

సీ॥ కడకుఁ 'బద్మినిఁజూప విడుతుముట్టడి' నని
యవనేంద్రుఁ 'డద్దంబు సందుఁజూడు'
మని రాజపుత్రకు లని రలాయుద్దీను
విచ్చేసి సతిఁజూచి వెనుక కరుగు
నప్పుడు భీమసిం గరిగె వీడ్కొల్పుచుఁ
గోటదాఁటఁగఁ దురుష్కులతనిఁ జెఱఁ
బట్టి 'పద్మిని నీయవదలెద' మని రేడు
వంద లాందోళికల్ బయలుదేఱె
గీ॥ వెలఁదిఁ గడసారి దర్శింప భీమసింగు
పంపఁబడె నాతఁ డశ్వంబుపైనఁ గోట
దూఱెః యవనుల్ విజృంభించి మూఁకిరపుడు
రాజపుత్రులు పోరి రద్భుతంబుగాఁగ. 75

మ॥ స్థిరమౌ సత్ప్రభుభక్తియుక్తి నిజరాజ్ఞీ మాన సంత్రాణ ధ
ర్మరసావేశము పొంగి పైఁబొరల గోరాసింగు బాదూలు సిం
గు రణాగ్రంబున వైరి వీరుల తలల్ గోటానఁ గోట్లున్ వసుం
ధరరాలన్ విహరించి రయ్యెడఁ గృతాంత ప్రాయులై యిద్దరుణ్. 76

క॥ వీరావేశము పొంగఁగఁ
దౌరుష్క భటాళిఁ దగిలి తలలు నఱకుచున్
గోరాసిం గనిఁ బడియెను
వారిధిఁ బడి యస్తమించు వనజాప్త క్రియన్. 77

క॥ బాదూలుసింగు బాలుఁడు
ద్వాదశ వర్షములవాఁడు తౌరుష్కుల శౌ
ర్యోదయుఁడై తునుమాడుచు
నాదిన మొక్కరుఁడె యింటికరుగఁగఁ గలిగెన్. 78

మ॥ అమితోత్సాహముతోడఁ బోరెనఁగఁగా నానాఁడు మేవాడ రా
జ్య మహాసౌధమునందు స్తంభముల యోజన్ బొల్చు లోకైక వి
క్రమ ధౌరేయుల నొక్కఁడేని మిగులంగాఁ బోక సంగ్రామ రం
గమునన్ వీరవిహారముల్ నెఱపి స్వర్గంబేగి రొక్కుమ్మడిన్. 79

చ॥ పడతులు వేవురున్ గొలువఁ బద్మిని వహ్నిని జొచ్చెఁ; వైరులున్
గుడులును రాజసౌధములు గోపురముల్ కొలువుల్ గృహంబులున్
బుడమిఁ బడంగఁ జేయఁ బురమున్ సిరి దప్పె గజంబులున్ జొరం
బడి కలఁపన్ గలంతపడు పద్మసరః ప్రవరంబు చాడ్పునన్. 80

మ॥ అనహల్ వారయి బూంది దేవగిరి ధారావంతులున్ ఘూరు వా
రును డాండూపుర మాజసల్మియరు గోగ్రన్ దేశముల్ పెక్కు లో
య్యన నొక్కొక్కఁడుగాఁ దురుష్క నరపాలాధీశ్వరున్ గొల్చి యా
తని రారాజుగ సమ్మతించెఁ బరతంత్రత్వంబుమైఁ గ్రుంగుచున్. 81

— అజేయ సింహుని పాలనము —

సీ॥ బహుకాలమునకుఁ బూర్వమున రాజస్థాన
వసుధయంతయు భిల్లవంశజులది
వారి దూరముతోలి బప్పరాయ నృపాలుఁ
డధికుఁడై మేవాడ నాక్రమించె
నదిమొదల్ భిల్లుల కారాజపుత్రుల
కణఁగని వైరాగ్ని యతిశయిల్లె

నొకరిదేశము పైఁస నొకరుఁడు దండెత్తి
పలుమాఱు పోరుట వాడుకయ్యెఁ

గీ॥ శైలవారా మహాటవుల్ కదిసి వేట
సలుపుచో వారువీరును గలిసిరేని
నిరు దెగల నాయకులను నిర్వురొ కడకు నొ
కరుఁడొ మడియుట తప్పక జరుగుచుండె. 82

సీ॥ చిత్తూరు రాజ్య మజేయసింహుం డేలు
చుండి యోలగముండి యొక దినమున
నాత్మజుల్ సుజన సింహాజిత సింహులఁ
బదునేను బదునాల్గు వత్సరముల
వారలఁ గని 'భిల్లపతిముంజుఁ డెనిమి దేం
డ్లకుముందు వనమున నన్నుఁ దాఁకె
వానిఁ దప్పుకొన నుపాయములేక య
త్తాడితి విడక వాఁడట్టి పోదివి

గీ॥ కుంతమునఁ గుమ్మెఁ దలనాటి గొప్ప గాయ
మయ్యె నాయాయువది గట్టిదగుట నెట్లొ
పురముఁ జేరితి నేటికి శిరము నిమురు
చో నిదిగొఁ బెద్ద గుంట చేసోఁకుచుండు. 83

క॥ నాఁ డదరిన యీగుండియ
నేఁడును దిటవూన దతఁడు నిదుఁర గనఁబడున్
వాడి సగమైతి ముంజుని
గూడిన వగఁ బయికిఁజెప్పుకొన లేకుంటిన్. 84

మ॥ చతురంగ ధ్వజినీపతుల్ గొలువఁగా సన్నాహ సర్వాయుధాం
చితులై ముంజుని గూడెమున్ దఱిసి తచ్ఛీర్షంబు ఖండించి యా
త్తతతో నాభయ ముజ్జగింపుఁ డనుచున్ దైన్యంబుతోఁ బల్కఁ డి
త్సుతులున్ లేనగ వాస్యబింబముల యందున్ బెల్లు తొల్కాడఁగన్.

మ॥ "తనియన్ బిల్లలఁ బాపలన్ గని ధరాధ్యక్షుండవై భోగ భా
గ్యనికాయంబులమాఁగి వృద్ధవగు నీవాసంద సంపత్తి నిం

టను గూర్చుండుచుఁ బెండ్లిపేరఁటము మాటల్ మాని దుర్వార మృ
త్యునిభుండై చను మూంజునిన్ దొడరఁ బొందో యంచు వేధింతువే. 86

ఉ॥ కాటికిఁ గాళ్ళు చాచితివి కావలెనన్నను మూంజుతోడి పో
రాటము నీవె చూచుకొను మాడకు కాఱులు నిన్నుఁ జూచినన్
బోటులుఁగూడ నవ్వెదరుపొమ్మ్మ" ని పల్కెరి చెంత నొక్కెచో
నాటలమున్గి పైవిషయమంతయు విన్న హమీరసింహుడున్. 87

ఆ॥ వె॥ ఆయజేయసింహు ననుజుని కొడుకు ప
దేండ్ల బాలుఁ డటకునేగు దెంచి
చేతనున్న చిన్న సింగాణితో బాణ
సమితితో ధరిత్రిఁ జాఁగి మ్రొక్కె. 88

క॥ 'ఒక యశ్వము నొక కుంతము
నొక ఖడ్గము నిచ్చి పంపుమో తండ్రీ! త
ప్పక చని నే మంజూని మ
స్తకముఁ దఱిగితెచ్చి యుంతుఁ జరణాబ్జములన్. 89

చ॥ అనుచు నుదారవీరరస మచ్చుపడన్ వచియించు చిన్న నం
దనుని నజేయసింగు గని "తండ్రి! భవద్వచనంబు కోటి నే
యును చని నీవు వైరిశిరమూడిచితెచ్చిన యంత సంతసం
బొనరెను నీవుపోవలవ దుండుము నాకడ' నంచుఁ బల్కెనన్. 90

మ॥ "ఇదె తండ్రీ! పలుమాటలే నెఱుఁగ రెండేమార్గముల్ నాకు నీ
మదవద్వైరిని ఖిల్లునిన్ దునిమి, తస్మస్తంబునున్ దెచ్చి నీ
పదముల్ చేర్చెద! లేనిచో మఱల మేవాడ్దేశమం దెంత నా
పదమున్ మోపక మారసీమల వసింపన్ దోదు" నంచాడుచున్. 91

గీ॥ అంతనొక ఖడ్గమొకకుంత మశ్వముఁ గొని
గాలి కన్న హమీరు శీఘ్రముగఁ బోయెఁ
జనె దినములు పక్షములు మాసములు గడచె
నతఁడు చనుతేరికిని జ్ఞప్తియందెలేదు. 92

సీ॥ కొన్నాళ్లకవ్వలఁ గొండలోయను గడి
యట్టి యాయుడ మూని యాశ్రితుండు
చేరరాఁగ నజేయసింహుండు నాతని
కొలువువారును జూడ్కిఁగొలిపి; రంత
నాహమీరుఁడు బల్లె మవనిపై నిడి తండ్రి
శ్రీపాదముల నమస్కృతి యొనర్చి
“గుఱుతింపు నీమూంజుశిర" మనె తేఁడు పు
త్రికుని ముద్దాడి యెత్తుకొని సింహ

గీ॥ పీఠ మెక్కించి తిలకంబుపెట్టి రాజు
పలిపి నిజపుత్ర యుగము దేశమ్మునుండి
తఱుమఁగొట్టె; ద్వితీయ పుత్రకుఁడు మడిసెఁ
గైలవారా గిరీంద్ర శృంగాటకమున 93

గీ॥ చుక్క తెగిపడ్డ కైవడి సుజనసింగు
వారిలోఁ బెద్దవాఁడు సత్పదము తప్పి
దక్కనున ఘోరలాంబ పాదములఁ బడియె
వాఁడెపో శివాజీరాజు వంశకర్త. 94

గీ॥ సింగపుం గొదమ విధాన సింహపీఠిఁ
జేరి కూర్చుండిన హమీర సింహభూమి
పాలకప్రవరుండు సంవర్త సమయ
ఘన ఘనాఘనగంభీర నినద మరల. 95

సీ॥ “ఖిల్లులు తఱచుగా వేఁటల కరుదెంతు
రని సాద్రి విపినమం దణఁగి యుంటిఁ
బందిఁ తఱుముకొంచుఁ బరివారములు లేక
మూంజుఁ దొక్కెఁడె వనంబునఁ గనఁబడె.
నడిగె “నీవెవ్వఁడ’ వని నన్ను ‘నీవెవ్వఁ’
డని యంటి ‘మూంజుఁడ’ ననెడు నంతఁ
దల నాదు ఖడ్గధారల నూడి యిలరాలెఁ
గుంతంబు కొనఁ దలఁగ్రుచ్చి యెత్తి

గీ॥ శీఘ్రముగ నీపదంబులుచేర వచ్చి
నాఁడె యన నెల్లరపుడు సంతసము నొంది
రీతిఁ దఱువదియును నాలుగేండ్ల దాఁకఁ
పాలన మొనర్చె నవల మేవాడసీమ. 96

చ॥ అతనికుమారుఁడున్ మనుమఁడౌ లఘుఁ, డవ్వల రాజులౌచు శా
శ్వత బహుళాభివృద్ధి కొనసాఁగఁగ నేలిరి దేశమున్; లఘు
క్షితిపతి 'జావురా' ఖనులసీసము వెండియు లోనుగాఁగ ధా
తుతతులఁ ద్రవ్వఁజేసి తఱితో ధనరాసులఁ జేర్చె మెండుగన్. 97

మ॥ జనకుం డాడిన యొక్క మాటకయి తత్సామ్రాజ్యమున్ దాని ప
జ్జను లావణ్యనిధానమై వెలయు హంసాదేవినిన్ వీడి, త
మ్ముని రారాజు నొనర్చి భీష్మచరితంబున్ దాఁ బ్రదర్శించెఁ జం
డనృపుం డీలఘురాజు పుత్రుఁడు ప్రచండప్రాభవోద్దండుఁడున్. 98

క॥ ముకుళుఁడు లఘురాజు కుమా
రకుఁ డాతని వెనుక నేలె రాజ్యము తత్పు
త్రకుఁడగు విదళిత రిపుహ
స్తి కుంభుఁడౌ కుంభనరపతిశ్రేష్ఠుండున్. 99

—• మహా రాణా కుంభుని పరిపాలనము. •—

మ॥ జనముల్ మెచ్చఁగ నేఁబదేండ్లితఁడు రాజ్యంబేలె: మేవాడ్ధరి
త్రిని నయ్యెన్బదినాల్గు కోటలను ద్వాత్రింశన్మహాసంఖ్య యీ
తనిచే నిర్మిత మయ్యె: నన్నిఁటఁగడున్ దార్ఢ్యంబు వైశాల్యమున్
గొని యవ్వీర వతంసుపేర నిలుచున్ గుంభల్మియర్ దుర్గమున్.

సీ॥ మాళవపతి మహమ్మద్ ఖిల్జి వార్ధి ద
రంగముల్ వలెఁ జతురంగ బలము
గొలువ ఘూర్జర రాజుఁ గూడి దండెత్తి రా
నొక లక్ష యుత్తమాశ్విక దళంబు
పదునాల్గు వేలుకాల్బలముతో నరుదెంచి
యెదిరించి వారి జయించి మాళ్వ
ధరణీశుఁ దన రణస్తంభంబునకుఁ గట్టి
కొనుచుఁ జిత్తూర్పురంబునకుఁ దెచ్చి

గీ॥ కాపుగా సైన్యముల నిచ్చికాన్క లిచ్చి
తగిన గౌరవ మిచ్చి స్వాతంత్ర్య మిచ్చి
యెదఁదఁ గరుణకుఁ జోటిచ్చివిడిచి పుచ్చెఁ
గుంభరాణా సమాను లీక్షోణిఁ గలరె. 101

మ॥ తన సంపూర్ణజయంబుఁ దెల్పఁగ జయస్తంభమ్ములన్ భక్తి పెం
పును సూచింపఁగఁ గోవెలల్ నిలిపె నాబూశృంగ శృంగాటకం
బున; వ్యాఖ్యాన మొకండు వ్రాసి యనయంబున్ గీత గోవిందమున్
జను లాలాలము నేర్వఁజేసెఁ గవితాసంధైక సంధాతయై. 102

గీ॥ కత్తి కలములచే రెండు గతులఁ గీర్తి
కాంతఁ గొలిచిన మేటి భూకాంతులందు
నింత దొడ్డవాఁడున్న వాఁడే యటంచు
క్షోణి జనులెన్న మనియె నా కుంభ నృపతి. 103

సీ॥ సాధ్వి మీరాబాయి సౌజన్య ధన్య కుం
భవసుంధరాధీశు పట్ట మహిషి
జగదేక పావిత్ర్య సంపద కీలేమ
పర్యాయపదము గోపాలకృష్ణు
నడుగులు తరఁచి భక్త్యావేశమునఁ బొంగి
యమృత గీతములు పెక్కాలపించెఁ
దన్మాధురుకిఁజొక్కి తలలూఁచి యాతల్లి
స్మరియింప నట్టి యన్నరులు లేరు
గీ॥ ద్వారకాపురి మొదలుగా వారణాసి
వఱకు దేవాలయముల గోపాలదేవు
గూర్చి కీర్తించి యాయమ్మ కూరుచున్న
చోటులను నేఁటికిని గూడఁ జూపుచుంద్రు. 104

—: రాణా సంగ్రామసింహుని పాలనము :—

మ॥ చరితార్థుండగు కుంభుపౌత్రుఁ డవలన్ సంగ్రామసింహుండు భూ
వరుఁడయ్యెన్ రణమన్నఁ బండుగు వలెన్ భావించు శౌర్యాఢ్యుఁ డీ
పురుషశ్రేష్ఠుఁడు పెక్కు ఘోరసమరంబుల్ చేసి వైరి క్షితీ
శ్వరులన్ గెల్చుచు దేశమందు నినిచెన్ సౌభాగ్య భాగ్యోన్నతిన్. 105

సీ॥ ఐదుపందలు కరు లక్షంబు లెనుఁబది
వేలు సామంతులు పెక్కుచుంది
యనుసరింపఁగ జయయాత్ర సాగించె నం
బరు మారువారు లోఁబడియె గ్వాలి
యరు లోఁగె సజమేరు చరణముల్ గొలిచె శ
క్రియుఁగాల్ని తలలొగ్గి ప్రియము నెఱపె
నారామ పురము చాందేరియుఁ బలుమేనె
గోగ్రోను దలవంచుకొనుచు నిలిచె
గీ॥ నయ్యె నంకితుఁ డాబూ ధరాధి నేత
బూంది దిగులొంది తత్కృపనొందె ముందె
చుట్టు గలదేశములను జేపట్టుకొనుచు
వసుధ సంగ్రాముఁ డేలె వైభవము తనర. 106

మ॥ ముజఫర్షాయను మాళ్వభూపతి బలంబుల్ గొల్వ పైకెత్తి రా
గడముల్ దాఁకెడు సింహమట్లు తఱుమంగా వాఁడునుల్ రాజ ధా
నిఁ జొఱంబాఱె విడంగఁబో కచట వానిల్ బట్టి చిత్తూరుఁ జే
ర్చె జగంబుల్ జయపెట్ట నమ్రుఁడయి యర్థింపంగ వీడెల్ వడిల్ 107

మ॥ స్థిరశౌర్యుండును డిల్లివిశ్వపతికిల్ సేనాని బాహేబ లో
ద్ధురుఁడౌ 'ఆలి' సమస్త సైన్యములతో దుర్గంబు రక్షించు చుం
డ 'రణస్తంభ పురంబు' పై నడచి కోటల్ గెల్చి పేరొందె నీ
భరతోర్విల్ దనకుల్ సముండొరుఁడు గన్పట్టం డటం చెల్లెడల్. 108

క॥ అమితబలులు యవనులు తం
డములయి జాక్సారిటీస్ తటంబులఁ గలదే
శమునుండియు భారత ఖం
డముపై దండెత్తి రాఁదొడఁగి రవ్వేళల్. 109

—: బేబరు దండయాత్ర :—

శా॥ ఛెంగిస్ఖానుకుమార్తె సంతతి జనించెల్ ముందు తైమూరు, స
ర్వాంగీణ స్ఫుటశక్తితో సమర ఖండాధీశుఁడై, దానఁ ద్ర

ప్తిం గాంచంగనుబోక భారత మహాదేశంబునుఁ గెల్చె, స
త్సంగుం డీతని రాజ్యమింతని వచింపన్ జాల రెవ్వారలున్. 110

శా॥ "టైమూర్లేము" ప్రపౌత్రు పుత్రుఁ డతిశిష్టస్తుత్య సౌజన్య లీ
లామందారము ద్వాదశాబ్దముల కాలంబందె "బేబర్" నృపుం
డై మోగల్ క్షితి నేలఁ బూని రిపుగోత్రాధీశులన్ దాఁకి యు
ద్దామ ప్రౌఢిని వారిఁ బోదఱిమి సంస్థాపించెఁ దద్రాజ్యమున్. 111

సీ॥ "జాక్సారిటీసు' శ్రేష్ఠతమంబె కాని జా
హ్నవియొ లోకైక పూజ్యతకు రావు
'టర్కి' ప్రశస్త మండలమౌనుగాని, యా
ర్యావర్త మమృత రసాత్మకంబు
'నమరఖండ' మతియోగ్యమకాని, ఢిల్లీ పు
రము స్వర్గమునకు స్వర్గమవు తాపు
తురకలు స్వజను లౌదురుకాని, భారత
ప్రజలు లోకోత్తర ప్రాభవాంకు

గీ॥ లింటనుండిన విశ్రాంతి యొసఁగుఁగాని
రామమాంధాత లేలిన భూమిగెలువ
ఘనతరైశ్వర్యములు గల్గి గణన గలుగు''
ననుచు బేబరు దండెత్తి యరుగుదెంచె. 112

శా॥ ఆకాలమ్మున ఢిల్లి పట్టణ నృపుండౌ యిబ్రహీంలోడి తా
నాకర్ణించుచు వీనిరాక దశలక్షానీకినుల్ క్ష్మాస్థలం
బాకంపింపఁగఁ జేరవచ్చి యని సేయన్ జొచ్చె బేబర్విభుం
డా కాలాంతకుఁడట్లు శాత్రవులఁ జెండాడెన్ మహోదగ్రుఁడై. 113

మ॥ గడియల్ మూఁడగు నంతలో రణము తగ్గన్ సాగె నాయిబ్రహీం
పడియెన్ సేనలు భిన్నభాండగతులన్ బ్రాపించె; బేబర్ మహీం
ద్రుఁడు ఢిల్లీపురి నాక్రమించుకొనె హిందూదేశ సర్వస్వ మ
ప్పుడు దాసోహ మటంచుఁ దత్పదయుగంబున్ గొల్చె నిర్వీర్యమై.

— సంగ్రామ సింహునితో - బేబరు యుద్ధము. —

మ॥ అరులన్ గెల్చుచు సార్వభౌముఁడయి రాజ్యంబేలి సంగ్రామ భూ
వరు సంగ్రామ తలంబునన్ గెలిచి మేవాడ్దేశమున్ జేకొనన్
ద్వరమై నుగ్రమృగేంద్ర వీర్యులగు యోధ శ్రేష్ఠులన్ గొల్వఁగా
నరిగెన్ బేబరు' సూర్యవంశమణి యుద్ధాయత్తుఁ డయ్యెన్ వడిన్. 115

సీ॥ డోంగరీశుఁడు బలోత్తుంగుం డుదయసింగు
రత్నసింహుఁడు సలుంభ్రావిభుండు
రణమల్ల నృపుఁడు మార్వారు నాయకమౌళి
మేత్రావిభుండగు క్షేత్రసింగు
ఝూలానృపాలుఁ డుజ్జయసింగు, సోనెగు
ఱ్ఱమహీంద్రుఁడై స యూరామదాసుఁ
డల ప్రమరుండు గోకులదాసు చంద్రభా
నుండు మాణిక్య చంద్రుఁడు శిలాదుఁ
గీ॥ డును, హసేనిబ్రహీం సాహితనయుఁ డొకఁడు
స్వామి సంగ్రామసింహు వెంబడిని బోరి
చచ్చుటో గెల్చుటో వేఱుజాడలే ద
టంచు సేనలతో వచ్చిరని యొసర్ప 116

సీ॥ రెండు వాహినులు కార్తిక శుద్ధ పంచమి
నా బయానా ప్రాంతమందుఁగలిసె
రాజ పుత్రస్థాన రాజు లందఱు వెంట
నడువ సంగ్రాముఁ డున్నత పరాక్ర
మము మీఱ యవనసైన్య ముఖాగ్రభాగంబు
చించి చెండాడి శోషిల్లఁ జేసె
బేబరు తనసేన వెనుకకుఁ ద్రిప్పి ద
న్యశ్రేణి బోటుకాచుకొని నిలిచెఁ
గీ॥ గ్రొత్తసేనలఁ దెప్పించుకొనియె నవియుఁ

లను బిరంగుల ముందిడికొనుచు మౌన
నియతిఁ బదునేను దినములు నిలిచియుండె. 117

శా॥ వీరావేశముపొంగి రక్తముడుకన్, వేమాఱు తత్తచ్ఛ మూ
వారంబున్ దరిఁజేరి బేబరు రణోపన్యాసముల్ చేసినన్
గారాత్మైనను దుల్లకుండె జయముల్గాంక్షించి యెన్నెన్నొ వ్యా
పారంబుల్ బొనరించి నిస్పృహ జనింపన్ డీల్పడెన్ బెల్లుగన్. 118

గీ॥ తన బలముఁ దూఁచు గెలుపుకై కనులు వాచు
నాప్తతతి నేచు దిగ్గన నట్టె లేచు
విసివి తలరాచుఁ జేతులు వెలికిఁజాఁచు
నకటః బేబ రెవ్వఁడు గాచుననుచుఁ జూచు. 119

సీ॥ తన ప్రయత్నము లన్నియును నిష్ఫలంబైన
దైవంబు స్మరియించి త్యాగ మెంచి
తా ననుదినమును ద్రాక్షారసముఁ ద్రావు
రజత సౌవర్ణ పాత్రముల నేల
విసరి తున్కలుచేసి పెంకులు బైరాగు
లకు బీదలకు యోగులకును బంచె
నాక్షణంబుననుండి యాసవ మనుచరుల్
దాను ద్రావక యుండమాని వేసె

గీ॥ నవలఁ దనయేలు బడినున్న యవనరాజ్య
ములప్రజల పన్నులొక కొన్ని తొలఁగఁజేసె
దైన్యమును భయమునె కాని ధైర్యమొసఁగు
పలు కొకండేని వినరాక పలవరించె. 120

మ॥ నెలలెన్నో గమియించెః బేబరు మదిన్ భీతిల్లుచున్ ఢిల్లి మం
డలమున్ దాటకయుండునట్లును బయానాసీమయున్ గొన్ని ల
క్షలు కప్పంబు నొసంగు నట్లు నిఁక సంగ్రామేంద్రుతో యుద్ధముల్
నిలుపన్ బోయెడునట్లు సంధికిఁ బ్రయత్నించెన్ మనస్ఫూర్తిగన్ 121

క॥ ఈయత్నము విఫలంబై
పోయెఁ దుదకు సామదానములఁ గాని పనిన్

జేయఁ దలఁచె యవన మహీ
నాయకుఁడును ద్రోహబలమునన్ మది నిచించున్. 122

గీ॥ స్వామి పదసీమఁ దెగి నిజప్రాణమైన
ధారపోయు పవిత్ర హైందవులయందు
నకటకట! శిలాదుఁడు గాక యన్నముఁ దిను
నాతఁ డెవఁడు స్వామి ద్రోహమాచరించు. 123

గీ॥ కడపటి దినంబు నిరు మొనల్ గలిసి నపుడు
బలముతో శిలాదుండు బేబరును గలిసె
నని తుముల మయ్యెఁ బెక్కుఁగాయములు తగిలి
యవల సంగ్రాముఁ డరిగె సైన్యములు విఱిగె. 124

మ॥ కడుఁదీక్ష్ణంపుఁ బిరంగి గుండొకఁడు హోకాలన్ బ్రవేశించె; మం
డెడు నుగ్రంపుఁ దుపాకిసోఁకి కనులూటన్ జెందె నెమ్మేనిప్పేఁ
బొడమెన్ గాయము లెన్న దిట్లు రుధిరమ్ముల్ జిమ్మి పుష్పించి యుం
డెడు బంధూక మహీజమున్ దెగడె క్షోణీనేత సంగ్రాముఁడున్. 125

మ॥ "చనఁ జిత్తూరికి గెల్పులేక" యని బుస్సాప్రాంత మందుండె; న
ప్పెను గాయంబులఁ జేసి శక్తిచెడి నిర్వీర్యంబునైదేహ మ
జ్జన నాథేశ్వరుఁ డొక్క వత్సరమునన్ స్వర్గస్థుఁడయ్యెన్ విక
ర్తనుఁ డస్తంగతుఁడైన కైవడిఁ బ్రజల్ దైన్యంబునన్ గ్రుంగఁగన్.

క॥ అరి రాజాంతరుఁడగు బే
బరు సంగర జయము నొంది భారత ధరణీ
శ్వరులకును రాజరాజయి
పరిపాలింపన్ దొడంగె వసుధా తలమున్. 127

చ॥ ఒకసమయంబు నందు హుమయూనును వ్యాధియు సోకి యంత కం
తకుఁ జెలరేఁగె, బేబరును "సగ్గాని నాసుతుఁగావు దేవ" యం
చకుటిల బుద్ధి వేఁడుకొనె నట్టులె వ్యాధియు వాని సోఁకి పు
త్రకుఁడును వ్యాధిఁ బాసె, నొకరాతిరి ప్రాణము వాసె బేబరున్. 128

క॥ ఘనశౌర్యుఁడు సంగ్రామిని
వెనుక నతని సుతులు రత్నవిక్రమ సింహుల్
మనుజేంద్రులై మహీతల
మును బరిపాలించి రధికమోదము తోడన్. 129

మ॥ అనలాస్త్రంబులు వాడినన్ జయము తథ్యంబంచు నావిక్రముం
డును గొన్నింటిని దెచ్చె వీరభటు లెంతో మూర్ఖులై 'వీనిఁజే
కొన మశ్వంబులనుండియున్ దిగము నీకున్ గూర్చు నెవ్వానినై
న నియోగింపుము వీనిఁబూన్ప' మని మందప్రజ్ఞులై యాడుచున్. 130

—♦ చిత్తూరు - రెండవ ముట్టడి ♦—

చ॥ పెడమొగమైన నన్యులను విక్రముఁడున్ నియమించె సేనలున్
జెడె నిరుపాయులై యొకరినిన్ మఱి యొక్కరు మెచ్చకుండ వీ
డుడుకుఁదనం బెఱింగి బహదూరను ఘూర్జర దేశ భర్తయున్
వెడలె మహాచమూ తతులువెంటఁ జనంగను జిత్తురిన్‌గొనన్. 131

మ॥ తనుశత్రుం డొకఁడిప్డు చిత్తురుపయిన్ దండెత్తునన్ మాట శ్రో
త్రములన్‌సోఁకిన రాజపుత్ర నృపతుల్ దౌదవ్వు లందుండి సై
న్యములన్ దోడ్కొని వచ్చి రొండొరువు లంతర్భేదముల్ లేక దెం
దములన్ జిత్తురనంగ నెంత యభిమానంబున్నదో వారికిన్. 132

సీ॥ రౌద్రకేసరి కేసరముల నుయ్యేల లూఁగు
నతిబలాఢ్యులు దేవరాధిపతులు
కులపర్వతముల డీకొని పిండిగాఁజేసి
యంబుధిఁ గలుపు ఝూలావనీంద్రు
లుంకించి తాఁకిన నుర్వీతలంబుపై
కెగిరించు సోనెగుర్జేశ్వరులును
ఫాలాక్షుతో మెడపట్టులు పట్టి గె
ల్వంగఁజాలిన హరవంశ్యమణులు

గీ॥ జగము సర్వసంహారంబు సలుపఁ గలుగు
నసమశౌర్యులు చోండావ దన్వయులును

నడచు సందర్భంబు లనఁగ సైన్యములఁ గొనుచు
వచ్చి చేరిరి చిత్తూరు పురవరంబు. 133

గీ॥ పదము వెన్కకు మఱల్పని పటు పరాక్ర
మైకధన్యులు గొలువ సురేశ మల్లు
సుతుఁడు "ఫాగ్జి" తరలి వచ్చె నితఁడు బాడ
బానలముఁ బాఱ్ఱమింగు మహాభుజుండు. 134

గీ॥ అఖిల జగముల లోని శౌర్యంబు ముద్ద
చేసి దుర్గంబునిండ నుంచినను గాని
క్రూరులగు పరంగుల పిరంగులకు ముందుఁ
దూఁచుకొన రాయి నిలుపుట దుర్లభంబు. 135

సీ॥ లాఁబ్రిఖాఁ బిరుద మలంకరించెను ప్రౌఢ
గోతులు త్రవ్వించి, కూరి మందు
వహ్ని రవుల్కొల్పి పగిలించె నీతండు
బహదూరుసాహి సేవలను దనుపు
బుడుతకీచు పరంగి ముందు 'వానోకుడిగా
మా' వెంట నరుదెంచె మందుగుండు
పరగించి యగ్ని పర్వతముపొంగిన యట్లు
పొంగించి బహుదుర్గములను గూల్చె

గీ॥ వైరి దుర్భేద మైన చిత్తూరికోట
దక్షిణపు గోడ డుల్లి రంధ్రంబు వడియె
నూర్జిత జగన్నుత పరాక్ర మార్జునుం డ
రాతులను దాఁకి యర్జునరావు మడిసె. 136

గీ॥ ఐదువందలు హర వంశ్య లతనితోడఁ
బడిరి మధ్యాహ్న మార్తాండు పగిది మండి
యరులఁ దాఁకి దుర్గారాయఁ డస్తమించె
నఖిల చోండావదన్వయు లనుసరింప. 137

గీ॥ ఆవల దేవరభటులు ఝూలాన్వయులును
జీవము లొసంగి రంత ఫాగ్జియు వచ్చి

ప్రళయ కాలాంతకుని బోలుభటులఁ గూడి
కదన మొనరించి పండె నాగండి దండ. 138

సీ॥ తరువాత రాజమాతయు జవాహిరిబాయి
రారోతుసుత తనుత్రాణ ఖడ్గ
ములనూని యాస్థలంబునఁ బోరిమడిసె, న
వ్వెలఁది కీర్తిని జరిత్రల సువర్ణ
పరమాక్షరముల వ్రాసిరి పూజ్యులాది నం
బంతలో దుర్గ మావంత యవల
విఱిగె లోపలి వీరవరుల సంఖ్యయుఁ దగ్గె
నుదయసింహ కుమారుఁడొకఁడు తప్ప

గీ॥ రాజ వంశమంతయు రణాగ్రమున మ్రగ్గె
నతని సురధాని రాయల కప్పగించి
వెలికి దాఁటించి మిగిలినవీరు లొక్క
స్థలము చేరిరి కార్యనిశ్చయము కొఱకు. 139

సీ॥ గందంపు మంచిచెక్కల నొక్కపోగువుగాఁ
గూర్చి తైలముపోసి కుప్పలుగను
గర్పూర రజము పైగప్పి యగ్నిరగిల్చి
వెలఁదులు పదమూఁడువేల పుంది
జలకంబు లాడి దువ్వలువలు సొమ్ములు
దాలిచి పూచిన తంగెడు లటు
వెడలి పెండ్లికిఁ బోవువిధమున గుంపుపై
చిఱునవ్వు మోముల సిరులు నింప

గీ॥ బంగరు సలాకలట్లు పావకునిఁ జొచ్చి
రీవెలఁదులఁ గర్ణావతీదేవి నడిపె
నామె యుదయసింహకుమారు సనుఁగుఁదల్లి
దుర్జయార్జున రాయనితోడఁ బుట్టు. 140

మ॥ తమ కాంతామణు లెల్ల వహ్నిఁబడి క్రమ్మందఁగా దేవరస్వామి దు
ర్గము నందుండిన యోధులన్ గొనుచు సూర్యద్వారముఁగా దీసి సిం

హూము మోడ్కొని వెలిఁ బోఁకి శాత్రవులు చీకాకొంద వర్తించి సై
న్యములన్ దానును సర్వహాన్యముగ సంతంబొందె నవ్వేళలో. 141

—• కర్ణావతీదేవి తనకు సాయపడుమని హుమాయూను నర్థించుట •—

చ॥ దురము భయంకరం బగుచు దుర్గము నిల్వదటంచుఁ దోఁచు ముం
దర నవరత్నసంతతులు దాఁపిన తోరము రాజ్ఞి ఢిల్లి భూ
వరుకడ కంపె; గష్టములువచ్చిన యప్పుడు రాజపత్ను లీ
కరణి నొనర్చి సాయమునుగాంచుట వాడుకయై తనర్చెడున్ 142

సీ॥ పరిసర గ్రామ సంవాసినులగు వెలం
దులు వేయిమంది యాతోరము నొక
పసకపుం బళ్ళెరంబున నుంచి పూపు ల
క్షతలను బెట్టి పూజల నొనర్చి
నడచుచు వెళ్ళి యందఱు ఢిల్లిఁజేరిరి
హుమయూను వంగదేశమున నుండె
నటకేగి దర్శించి రతఁడు హర్షించి హ
స్తమున రక్షాబంధనము నొనర్చి

గీ॥ "సారసదళాక్షు లార యీతోర మంది
నపుడె కర్ణావతీదేవి కన్న నైతి
నామె నాచెల్లె లుదయసిం గల్లుఁడయ్యె
వారినేమమె నానేమమై రహించు. 143

గీ॥ భువన వంద్యుండు సంగ్రామభూప మణికి
ముందు మాతండ్రి కూర్చినకుందు దీఱ
నతని దేవేరినిఁ గుమారు నాదరించి
నా మొగల్ వంశమును బావనం బొనర్తు. 144

గీ॥ అఖిల నృపులకుఁ బాదుసాయనుట కన్న
రాజపుత్ర మహాదేశరాజ మాత
కన్న యనుటయె కడుగౌర వాస్పదంబు
పయనమైం వత్తు బహుదూరుపంచి పుత్తు. 145

ఉ॥ స్ఫురదిందీవర నేత్రలార! యిదె నాపుణ్యంబు వర్ణింపఁగాఁ
దరమే! నేఁటివిపత్తు దీర్చుటకు నింద్రప్రస్థమేమైన భా
గ్య రమాకాంతము నాదు రాజ్యమయినన్ గాదేని నాప్రాణ మా
పరమోత్కృష్టగుణాఢ్య పాదము కడన్ భక్తిన్ సమర్పించెదన్. 146

మ॥ దర పుట్టించిన దాది నిందనుక నే తౌరుష్క భూపాలుఁడీ
భరతోర్విన్ బడయంగఁ జాలని కడున్ బ్రత్యేక మర్యాద సా
కరమైతిన్! భువన ప్రపూజ్యయగు నాకర్ణావతీదేవి స
చ్చరణాబ్జంబులు జన్మజన్మమును నే సద్భక్తి సేవించెదన్" 147

మ॥ అని యిత్యుత్తమ భక్తి భావరతితో నవ్వారి పాదంబులన్
దన శీర్షంబిడి మ్రొక్కి వీడ్కొలిపి యాధన్యాత్ముఁడున్ జైత్రయా
త్రను జాలించి యపార సైన్యసముదగ్రక్షిత్రి విస్ఫూర్తి ఘో
రన బ్రహ్మాండము వ్రక్కలై పడఁగఁ జేరన్ బాతెఢిల్లీ దెసన్. 148

మ॥ చని వైనంబునెఱింగి యక్కటకటా' సర్వంబునున్ మించి పో
యెను!దుర్గం బరిచేతఁ జిక్కెను' బలంబెల్లన్ నశించెన్' గృపా
ఖని నన్గోరిన దొడ్డతల్లియగు నాకర్ణావతీదేవి యే
మని చింతించెనొ! మందభాగ్యునకు నేలాదక్కు తత్సేవనల్. 149

మ॥ అకటా! సూర్యుఁడు వంశకర్తయఁట! క్షీరాబ్ధిన్ వలెన్ బూజ్యమై
యకలంకంబగు గొప్పవంశమఁట ధన్యాత్ముండు సంగ్రామ సిం
హు కుటుంబంబఁట! సుంత సాయపడఁగా నొక్కింత తాపున్నఁ దా
యక మత్కీర్తి వెలింగియుండు గద బ్రహ్మాండమైక సుస్థాయిగన్. 150

సీ॥ ఆతల్లి బదులు తదాత్మజుఁ గొలిచి దే
హము ధన్యమొనరింతు నని తలంచి
చిత్తూరుపురి విసర్జించి మూర్జరి మేగు
మని బహదూరున కాజ్ఞఁబంపె
నామూర్ఖుఁడు తదాజ్ఞ నౌదలఁ దాల్పక
సమర సన్నాహమున్ జరుప దొడఁగె!
బాదుసా తుదిలేని బలములతో దుర్గ
మును నాల్గువైపుల ముట్టడించె!

గీ॥ నా మహాసేనఁ జూచి, భయమంది రేవి
నీరు దోఁకు నుప్పవరేఁ గన్పింప శేగె
బలముతో బహారు మాహ్వమను షూర్జ
రము హుమాయూను జయించె సైన్యముల నుంచె 151

గీ॥ పూన్కి చెడి దేశములు వట్టిపోయి నట్టి
వెకలి విక్రమ సింహుని వెదకి తెచ్చి
సింహ పీఠిఁ బునఃప్రతిష్ఠితుని జేసి
దీవెసలు పోసి ఢిల్లికిఁ దెరలిపోయె. 152

సీ॥ జననమో పటుతురుష్క స్వపాల కులమున
భావమో రాజ్య సంపాదనంబు
ప్రాయమో సకల ప్రపంచంబు చనదని
పోరాడ వలసిన పూర్ణ వయసు
అరిది రాటస్థాన మాత్రక్షకము కాని
రాణి యర్థింప సోదరత్వ మూని
వంగభూమిని చనపని మాని యొక వేయి
మైళ్ళకు దెంచి ధర్మము వరించి
గీ॥ స్వకులు బహదూరు శిక్షింపి పంచి దేశ
మందు భయమును డించి సౌఖ్యంబు నించి
వట్టి చేతుల వెనుకకు వచ్చె నెట్టి
సరళ హృదయుండొ హుమయూను చక్రవర్తి. 153

—। మేవాడకు వనవీరుఁడు పాలకుఁడగుట ।—

మ॥ ఒకయేడాదిగ రాజ్యమేలొకసేనా లేపో యెల్లసేనాధినా
యకులన్ బాధల ముంచె నీకృతి సలుంబ్రాధీశుఁ డాత్మన్ సహిం
పక రాజ్యచ్యుతుఁజేసి విక్రముని మేవాడ్దేశ మేలంగఁ బూ
నికమీఱన్ వనవీరుఁ దెచ్చి నిలిపెన్ సింహాసనం బందునన్. 154

సీ॥ వనవీరుఁ డవని పాలన మహాత్రవము సే
య నుదయసింహుఁ గూల్పను దలంచెఁ

బున్నాయనెడి దాది ముందెంట్లొ నడివట్టి
యొకపూల బుట్టలో నుదయసింహు
నుంచి భటులవెంట నూరివెల్పలికంపి
తనపుత్త్రునుంచెఁ దద్థానమందు;
వనవీరుఁ డుదయసింహుని జూపుమని వచ్చెఁ
సతి నిజాత్మజుఁ జూపె నతఁడుపొడిచెఁ
గీ॥ బుత్త్ర శోకంబు దిగమ్రింగి పున్న వెడలి
స్వామి నొడినుంచి దేశదేశములు తిరిగి
వర్తకుం 'డస్సాసా' కడ వానిఁజేర్చి
సకల లోకైక విఖ్యాతి సంతరించె! 155

క॥ తను నెంత కాచి కుడిపినఁ
దనసుతుఁ బరుసుతుని కొఱకు దారుణ ఖడ్గం
బునఁజీల్పఁ గనిన వెలఁదుల
వినియుంటిమె పున్నదక్క వేఱొకదానిన్.   156

క॥ వనవీరుఁడు దాసీనం
దనుఁడును హంతకుఁడు సాహిదా సర్షుండౌ
జనపతి లేమి మహీ పా
లన మతఁడొనరింప నెగ్గులన్ గనకుండెన్.   157

—• ఉదయ సింహుండు రాణాయగుట. •—

సీ॥ పాలించె నతఁడు మేవాడ్దేశ మైదేడు
లొక వత్సరము వసంతోత్సవములు
సకలవైభవముల సాగు పిదప వన
వీరుఁడు సామంత విభులఁజేర్చి
గొనుఁడు ప్రసాద మంచని తొందరించె,న
లుం బ్రాధిపతి కోపలోహితుఁడయి
యఖిల ప్రజాగణం బభినుతుల్ నేయంగ
వాని సింహాన భ్రష్టుఁజేసి.

ఆ॥ వె॥ యుదయ సింహుఁడెచ్చి యుర్వీశ్వరుని జేసె
సోనెగుఱ్ఱ విభుఁడు సుగుణరాశి
యఖిలసింహుఁడు సుర నా కరుణాదేవి
విభవ యుక్తి నొసఁగి పెండ్లి చేసె. 158

సీ॥ ఏలయ రణక్షేత్రముల సర్వసేనాధి
నాథుఁడై యెవఁడు సైన్యముల నడుపు
నఖిల సామంత గోత్రాధీశు లెవ్వాని
యాజ్ఞ లౌదలఁ దాల్చి యవధరింతు
నృపమౌళి రాజధానినిదాఁట రాణివా
సము రాజ్య మెవని పోషకర నిలుచుఁ
బరమ శిశోదియాన్వయ భూపతుల నిల్వ
నడఁప నెవ్వఁడు సర్వాధికారి
గీ॥ యెవని యనుమతిలేక ధాత్రీశుఁ డష్ట
సవిపు లుద్యోగులెల్ల మాషప్రమాణ
మవనీ దానంబు చేయ యోగ్యతయె కాంచ
రతఁడు సామాన్యుఁడే సలుంబ్రాధినేత 159

మ॥ పదహూఁడేడుల చిన్ని లేవయసు మేవాడాధిరాజ్య భారంబునుఁ
గుదురై మోచేడు వీరులెందఱొ నిజాంఘ్రుల్ గొల్తురు డిల్లీశుఁడుఁ
సదయాంతః కరణుండు నేర్పుమెయి రాజ్యంబేలు నాసక్తి పెం
పొదవఁ బోక జడాత్ముఁడై యుదయసింహుండుండె భోగాప్తిమై. 160

మ॥ సమరోత్సాహము లేదు విక్రమకళాసంపత్తియుఁ లేదు దు
ర్దమ ధైర్యోన్నతి లేదు చిత్తురు మహారాజ్యంబు పాలింపఁ బూ
జ్యమయౌ సద్గుణమొక్కఁడేనియు రహించఁ బోదు వైయాఘ్ర గ
ర్భమునఁ మేఁక విధంబుగఁ బొడమె సంగ్రామేందుర గర్భమ్మునఁ.

మ॥ ఉదయాస్తాచల మధ్యగంబగు జగంబుల్ఖ్యాత లూఁగించె బె
ట్టిదుఁడౌ పుత్రుఁడు ఘోర సంగర కిరీటిప్రాయుఁడై కీర్తి సం
పద నార్జించెను తండ్రి యెట్లతఁడు మేవాడ్రాజ్య మందార శా
ఖిఁ దినఁజొచ్చిన పుప్పియట్లు పొడమెఁ గీర్తిఁ గళంకించుచుఁ. 162

చ॥ వరుసగ ముప్పదేం డ్లితఁడుపాలనముఁ బొనరించె నందులో
నిరువదియైదు శాంతముగనెట్టులొ సాఁగె ననంతరమ్మునన్
దరతరముల్ తపింపఁగను దారుణ ఘోర విపత్తు దేశముం
బొరిగొని గౌరవంబు నుడిపోవఁగఁ జేసె నరుంతు దమ్ముగన్ 163

మ॥ అనఘుం విక్రమసింహు ఘోరమణుఁ జేయన్గల్గి ఢిల్లీపురం
బున కేగెన్ హుమయూను వంగమున రాణ్ముఖ్యుండు సామంతుఁడై
చను షేర్ఖాను స్వతంత్రరాజ్యమును సంస్థాపింప యత్నించి నా
డను వార్తల్ విని పాదుసా వెడలె సైన్యాయత్తుఁడై వానిపై. 164

— రాజ్యచ్యుతుఁడై హుమాయూను కడగండ్లు పడుట. —

ఉ॥ అంతములేని సైన్యముల నంబుధిచాడ్పున నిల్పియున్న సా
మంతుని దాఁకి పోరుట ప్రమాదకరం బని సంధిఁగోరి వృ
త్తాంతమునంపె షేర్ఖుఁడు తానును సమ్మతిఁజూపెఁ గ్రుంకెఁ బ్రొ
ద్దంతట రెండు సైన్యములునచ్చట నిల్చెను నిద్ర నొందగన్. 165

చ॥ కొసరి కసాయి మేకలను గొంతులు గోయు విధాన మారియున్
మసఁగినయట్లు మృత్యువును నాలుక సాఁచిన భంగి డిల్లి సై
న్యసమితి పైనవ్రాలి తునుమాడఁగఁజొచ్చిరి నిద్రవోవు చుం
డు సమయమందె వంగసుభటుల్ తమనాథుని యాజ్ఞపెంపునన్. 166

మ॥ హుమయూ నంతటఁబాఱె ఢిల్లిదెస కత్యుగ్రుండు షేర్ఖాన్ స్వసై
న్యముగా వెంటనుఁదాఁకె నేమియును జేయన్లేక యందందు మా
ర్గమునన్ జిక్కిన వారిఁ జేర్చుకొని పాఱన్జొచ్చెఁ బాంచాల దే
శము డాయంగనె రెండు సైన్యములకున్ సంగ్రామ మయ్యెన్ వడిన్.

సీ॥ రణమంచు వినిన మరణమంచు బెదరి ది
క్మార్గంబులకుఁ గొంతమంది నడువ
సమదశాత్రవ పరాగము దృష్టిగతమైన
మది కలంగియుఁ గొంతమంది పాఱ
విమతసైన్యము దర్శనము దండధరదర్శ
నంబని యడలి కొందఱు తొలంగ

మొదటి పిరంగి చప్పుడయి నంతనె గుండె
లవిసి నీరయి కొంద అవలి కుఱుక

గీ॥ నా హుమాయూను త్రోవకో నడ్డమైన
జనులఁ జేర్చి చేకూర్చిన సైన్యమెల్లఁ
జేయి జారిన కడవమై ఛిన్న మయ్యె
షేరుఖాఁ ఢిల్లి పట్టాభిషిక్తుఁ డయ్యె. 168

మ॥ చమువుల్ లేక మహామహీవలయ రాజ్యంబూడిపోవంగ నా
హుమయూనుఁ వెనువెంటనే తగిలి లాహోర్‌దాఁకఁ బోనీక సై
న్యములఁ దోడ్కొని షేరుఖాను దటిమెఁ వాఁ డంతటఁ దేశ దే
శములఁ గ్రుమ్మరె నెచ్చటేనిఁ దలఁదాచఁ వచ్చు నంచాసతో. 169

మ॥ స్తిమితత్వంబు వహింపకేగి యొకచో 'షేకల్లి' యఁ బార సీ
కమహాయోగిని గాంచి యాతఁ డడుగంగాఁ దెల్పె నాత్మీయ వృ
త్తముఁ దత్సన్నిధి నున్న వానిసుత 'యుద్వాహమ్ము గావించు కొం
దు మహాభాగుని వీనినే నన నతండుఁ వానికిచ్చెఁ సుతఁ. 170

సీ॥ ఏలుటకు మహా మహీవలయము లేదు
కొలుపు సేయఁగ భటకోటి లేదు
కాంచనాదిక ధనగ్రామంబులును లేవు
సముదార దివ్యభోగములు లేవు
వసియింపఁగా దొడ్డభవనంబులును లేవు
తాల్ప ననర్ఘ వస్త్రములు లేవు
వాహ్యాళి యొనరింప వాహనంబులు లేవు
శ్రమ దీఱ గంట విశ్రాంతి లేదు

గీ॥ కేవలము హుమాయూఁ పడుక్లేశ మెంచి
మనసు గరగించు సౌజన్య మహిమ నెంచి
కోరి యర్ధాంగమును బంచుకొనియె నెట్టి
పావనాత్మిక యో హమీదా వధూటి. 171

మ॥ వనితఁ యోధులఁ గొంచు యోధపురికిఁ వచ్చెఁ దలఁదాఁప వ
ద్దనెఁ దన్నేత జసల్‌మియర్ ప్రభువు పొమ్మంచాడె మార్వార్ నృపుం

డును బంధింపఁగఁజూచెఁ గొన్ని నెల లిట్లుగా జెల్ల రారాజు పూ
ఱెను దూరమ్మైన సింధుదేశపు టెడారిక్ దైవముగా దూఱుచుగా. 172

సీ॥ వైశ్వానర జ్వాలజ్వాలా సమూహంబు
చిమ్మ సూర్యుఁడు ప్రకాశించు చుండ
నుర్వీతలంబెల్ల నుష్ణోఁతలూఁగ జ్వలిం
ఛించి వాయువు పెల్లు వీచు చుండ
సుడికట్టి మండుటిసుక లేచి మిన్నంది
ప్రాలి ప్రాంథుల ముంచివైచు చుండఁ
బెక్కు యోజనములువెడలిన నాల్కపైఁ
జేర్పఁ జుక్కయు నీరుచిక్క కుండ
గీ॥ నరులు దఱుమంగ ననుచరు లంత మొండ
స్వర్ణసౌధంబుల వసించి పరమ సుఖము
మీఱఁదగు నిండుచూలా·లెడారి యందు
నా హమీడాలఱాంగి యెట్లరుగ నేర్చె. 173

గీ॥ రాచఱిక మది బరువయ్యె రాజమౌళి
కనుచరత్వంబు బరువయ్యె ననుచరులకు
నున్న వారెల్ల బరువైరి యొంటియలకు
నొక హమీడ మాత్రము చలింపకయె నిలిచె. 174

మ॥ హుమయూ నెక్కిన యొంటెయుగా మడిసె నత్యుగ్రాతపవ్యాప్తిఁ గూ
రిమి భృత్యుండని యొంటె నిమ్మనుచు 'టార్డీబేగు' నర్థించెఁ గ్రూ
రమతిగా వాఁడు తిరస్కరించి చనె; నింద్రప్రస్థ రాజ్యంబుఁ బూ
ర్ణముగా నేలినమేటి నీరమున కన్నగా బల్చనయ్యెగా గటా. 175

గీ॥ తురక జేనికిఁ గష్టముల్ పెట్టెఁ గాని
పెక్కు విశ్వయత్నములు సల్పినను గాని
కానరాదయ్యె వట్టి వెక్కసము తక్క
నిండుదప్పి నార్పగ నొక్కనీటిచుక్క. 176

గీ॥ చూలుపండిన యా హమీడా లఱాంగిఁ
జిచ్చుటెండ కెడారిలోఁదెచ్చు పెల్లఁ

ఓఁపపిండెల క్రొమ్మావి మొుఁకె నకట !
తీవ్ర దావాగ్నిలో నీడ్చి తేచ్చుటయ్యె. 177

సీ॥ తడిలేక యెండి కొలుకుగట్టి నాల్క నా
భిసిరేఁ దిగగుంజు కొనుచుఁ బోవ
నెంతేనిఁ జలియించి హృదయకోశం బట్టె
కుత్తుక కెరతొట్టు కొనుచు రాఁగ
మెదడు నీరసమయిస్ప్రిదిలి పైత్యోద్రేక
మునను బ్రలాపసంధిని పెలార్ప
క్షితితలంబెల్ల మ్రింగినఁగాని తీరఁడో
దనిపించు మరణ వేదన కలంప
గీ॥ నున్న కష్టంబులట్టులే యుండ యవన
భటులు దాహమార్పఁగ నీరు పడయలేక
పిచ్చి యెత్తుచుఁ గేకలు వేసికొనుచు
బాఱి రెల్లెడ నిసుక యెడారినడుమ. 178

వ॥ కనిరాక బావివేఁకువను గన్నులపండువుగాఁగ! దాన మో
ట నిడి జలంబు దోలేదు నెడన్ వడి నెట్లను దోలుకొంచుఁ బో
వు నతని కొక్కచోఁబయికి బొక్కెనవచ్చెనటన్న మాటలున్
వినఁబడఁబోమిఁ బెద్ద రణభేరిని గొట్టు టవశ్యమై తగెన్. 179

సీ॥ అతిదాహమున నోరు భట్టె తెఱచియున్న
జనులు బొక్కెన నూతి కొనను నిలిచి
నిలువకమున్నె దానిపయిన్ బడి జలంబుఁ
ద్రావఁబోయిన యంతఁ ద్రాడు పెగుచు
బావిలో బొక్కెన పడె దానివెంటఁ గొం
దఱు నూతఁబడిరి కొందఱు మహోగ్ర
తాప మోర్వక సైకతస్థలిఁ బడి మ్రగ్గి
రికఁ గొందఱానూతి నెక్కి దూకి
గీ॥ రంతఁ గొందఱు చేది తోయమ్ముఁద్రావి
గుండె బరువెక్కి కూలిరి కొందఱెల్లొ

'యమరకోట'కు నాఁటి సాయంతనంబు
నడచి కన్గొని రచటి రాణాప్రహరీరు. 180

—• అగ్బరు జననము •—

మ॥ మనూజాధీశుఁడు వారినంచఱును సన్మానించె సౌఖ్యం బెల
ర్పను; నైదుర్ ఐది వందలుఱ్ నలువ దాపైనింక రెండైన యే
టను నాకార్తిక జీవవారము హమీడాబాను బేగంబు పు
త్రుని నీఁల్గాడె నుదాత్త లక్షణయుతుఱ్ దుర్వార తేజోన్నిధిఱ్. 181

శా॥ పెద్దల్ గోత్రజు లక్కుమారకునకుఱ్ బీర్తిఱ్ మహమ్మ జ్జలా
లుద్దీ నక్బరు నామముంచిరి హుమాయూఱ్ పాదుసా చూచి యా
ముద్దుంగుఱ్ఱని కీర్తివల్లి దెసలఱ్ బుష్పింపఁ గాంక్షించుచుఱ్
ముద్దల్ ముద్దలు పంచె నాప్తులకు సమ్మోదంబుమైఁ గస్తురిఱ్. 182

చ॥ తను గడుఁజేరఁదీసి తలదాఁచుకొనఱ్ నెలవిచ్చి పేర్మి నె
క్కొనఁగ మెలంగు నయ్యమరకోట నృపాలునియొద్ద నాత్మ మో
హనసతియౌ హమీడను నిజాత్మజు నక్బరు నిల్పి వెంట న
య్యనుచరు లేగుదేరఁగఁ బ్రయాణ మొనర్చె నతండు పెండియుఱ్.

మ॥ త్వరమై నాతఁడు పారశీకమును గాంధారంబు కాబూల్ వసుం
ధరలఱ్ జేకొనెఁ గాని రాజ్యము స్థిరత్వం బందకే సాఁగె; నీ
కరణిఱ్ దాఁ బదునాలుగేడులు కడుఱ్ గష్టంబులం బొంది వం
దురే; నీలోపలఁ గొన్ని మార్పు లచటఱ్ దోతెంచె ఢిల్లీపురిఱ్. 184

మ॥ అలషేర్ఖాఱ్ బలశౌర్యశోభితుఁడు రాజ్యం బెల్లఁ గౌశల్యముల్
వెలయఱ్ బాలనచేసె వాని పిదపఱ్ బృథ్వీపతుల్ చాల దు
ర్బలులుఱ్ గ్రూరులు నౌట రాజ్యమది స్థైర్యంబూడెఁ గొన్నేండ్ల క
వ్వల రాజయ్యె సికంద రీతఁడు సురాపాన క్రియాలోలుఁడౌ 185

మ॥ స్థితి యిట్లుండు టెఱింగి దండుఁగొని డాసెఱ్ దా హుమాయూను భూ
రతముం డుగ్రపరాక్రమక్రముఁడు బైరాంఖాను వచ్చెఱ్ జమూ
పతి పంద్రెండవయేటనున్న సుతుఁ డక్బర్ గూడ నేతెంచె ను
న్నతిమై యుద్ధము సాఁగె ఢిల్లిని సికందర్సా చమూపాళితో. 186

మ॥ కడులేఁబ్రాయపుఁ జిన్ని కుఱ్ఱఁడగు నక్బర్ ముందు నిల్చుండి యె
క్కుడు శౌర్యం బుసికొల్పి పూన్ప సుభటుల్ ఘోరంబుగాఁ దాఁకి ర
య్యెడ ఢిల్లీపతి యోడిపాతె విజయం బింపారఁ బట్టాభి షి
క్తుఁడునయ్యెఁహుమయూన్ నిజాప్తులనుసంతోషించి యుప్పొంగగన్

— అక్బరు సింహాసన మెక్కుట. —

సీ॥ షేర్మండలంబను స్నిగ్ధ సౌధంబున
హుమయూను కూర్చుండి యొక్కనాఁడు
పొత్తముల్ చదువు నప్పుడు ప్రార్థనము చేయు
కాలంబుఁ దెలుపుచు గంట మ్రోగె
వడివడి దిగిరాఁగఁదొడఁగె నాతఁడు నును
పై యున్న మెట్లపై నడుగు జాఱెఁ
బైనుండి క్రిందికిఁబడుట గాజు విధానఁ
దలయును వేయివ్రక్కలుగఁ బగిలె

గీ॥ నవలఁ బంజాబునందున్న యక్బ రటకు
వచ్చెఁ బదునైదువంద లేఁబదియు నాఱు
నగు శరత్తున నతనిఁ గల్యాణపురిని
ఢిల్లిపతిఁ జేసి రుర్వ్యోగులెల్లఁ గలిసి. 188

మ॥ ప్రవిశేష ప్రకట ప్రభావుఁడగు బైరాంఖాను క్షాత్త్రిక ధ
ర్మవిదుండాహుమయూను కోడలు సలీమాదేవిఁ బెండ్లాడి బాం
ధవుఁడై యక్బరు బాల్యమూడి తరుణత్వంబొందు నందాఁక రా
జ్యవిధానంబును నిర్వహింపఁదొడఁగెన్ సంరక్షకుండై తగన్ 189

— బైరాంఖాన్ విజయములు —

సీ॥ కాశ్మీరమందు సికందరుసాహి పై
న్యము ప్రోపుచేసి రణంబుఁ గోర
నచటఁ గాబూలులో నక్బరు ప్రతినిధి
తరుణంబు వీక్షించి తిరుగఁ బడఁగ
మాళ్వదేశాధీశమణి ఢిల్లిపైఁ బడు
టెప్పు డెప్పుడటంచు నేగురు చుండఁ

బులివంటి పోరిద హేముఁడు క్షణక్షణమును
దండెత్తి రా గాలు ద్రవ్వుచుండ
గీ॥ నల్ల కాబూలుకొఱ కేగ ఢిల్లి పోవు;
ఢిల్లికై చూడఁ గాబూలు చెల్లి పోవు
వెనుక నూయి ముందర గోయి ఘనుట యయ్యె
శౌర్యధనుఁడు బైరాంఖాను సైన్యపతికి. 190

క॥ తొలుత సికందరుసాహిని
గలియుచు బైరాముఖాను కల్యాణూ రణ
స్థలమున నోడింపఁగ నతఁ
డలఘుగతి శివాల కద్రు లందున డాగెణ్. 191

సీ॥ లక్ష పదాతి దళంబు కరుల్ వేయుఁ
దనవెంట నేతేర దండు వెడలి
హేముఁ డాగ్రాపురికేగి చేకొనిదాని
సవల ఢిల్లీపురం బాక్రమించె
బైరాముఖానుఁ డక్బరు ససైన్యముగ సి
ద్ధంబైరి పానివట్టంబు నొద్ద
నుభయసైన్యములకు యుద్ధం బెసఁగెఁ దురు
ష్కులు శత్రుసేన ద్రవ్యలుగఁ జేసి
గీ॥ హేము బంధించికొనుచు బైరాముఁ జేర్చి
రతఁడు కారుణ్యమును మానియక్బరుఁ గని
"శత్రుశేష ముపద్రవసమితిఁ దెచ్చు
శీఘ్రముగ వీనిమస్తంబుఁజెండు" మనియె. 192

శా॥ "నామేల్గూర్చి వచించు నీనుడిఁ దలఁడాల్పంగనొ గాని యీ
హేముం దోడినవాఁడు; పట్టువడినాఁ;డీనాఁ డవధ్యుండు; నా
కై మన్నింపు" మటంచు నక్బరనె; ఖడ్గంబెత్తి ఖండించె బై
రాఘుం దత్తటి హేముమస్త మిలపైరాలణ్ భటుల్ భీతిలణ్. 193

సీ॥ క్షాత్రప్రధాన నిశాత వర్తనుఁడౌట
నావేశ మదికొంత యలరుఁ గాని

బైరాముఖానుఁ దక్షుఁ డెక్కుడు గురువుల
వేర్వేఱ నియమించి వివిధ విద్య
లభ్యసింపఁగఁ జేసె, నాతని వేయి క
న్నులఁ జూచి వేయిచేతులను గాచి
ధరణి రాజ్యం బూర్జితము చేసెఁ గాబూలు
చేకొనె గాంధారసీమ గెలిచె

గీ॥ జౌన్ పురం బజమీర్ ప్రదేశములు గొనియె
గ్వాలియరు పట్టుకొనియె మార్వారు నొంచె
క్షణము విశ్రాంతిఁ గొనక రాజ్యములు గెలిచె
నక్బరున్నతి పరమ లక్ష్యముగ నుంచి. 194

— అక్బరు సమగ్ర రాజ్యాధికారము నొందుట. —

మ॥ అరుదెంచెన్ బదునెన్మిదేడులగు ప్రాయం బప్పు డక్బర్ వసుం
ధరఁ దానేలఁ దలంచె సేవకతతిన్ ద్రవ్యంబు నర్పించి సం
బర మొప్పారఁగ నాత్మరక్షకుని నా మక్కాకుఁ బంపించె ద
గ్గర సద్బారహిమాను దత్సుతుని వేడ్కన్ నిల్పి పోషించుచున్. 195

సీ॥ ఆజాను దీర్ఘ బాహార్గళయుగళుఁ డు
ద్యత్పద్మ పత్రనేత్రముల వాఁడు
ఘనసార్వభౌమ లక్షణ లక్షితుండు ప్ర
సన్నమనోహ రాస్యంబు వాఁడు
బలశోభితారోగ్యవచ్ఛరీరుండు సీ
రద సామ్యగంభీరరవము వాఁడు
శాంతిప్రధాన వర్చశ్శోభితుండు ద
యాపూర్ణ మృదు హృదయంబు వాఁడు

గీ॥ కష్టము సహింపఁగల ధైర్యగరిమ వాఁడు
వితరణ వికాసముల వాఁడు-వేయి నేల
భరతఖండ మేలిన సార్వభౌము లందు
నింతవాఁ డింక లేఁడనునంత వాఁడు. 196

సీ॥ అంచెలమార్చుచు నశ్వంబులను, స్వారి
యిరువదైదామడల్ పఱచియుండె
ఘూర్జరమ్మున దోఁవ గొప్ప బెబ్బులిరాఁగ
నద్దానిఁజేత జొప్పడఁచియుండె
విడక 'ఖండీరా' వనేడి మత్తకరినెక్కి
యైదామడలదూర మరిగియుండె
నాఁడు సింగము పిల్లలైదు మంచుబెడారి
యందుఁబైఁబడఁ బీచమణఁచి యుండె
గీ॥ నిరువురను దనసందిట నిఱికి కొనుచుఁ
గోట గోడలపై నెక్కిదాఁటి యుండె
నప్రతీప ప్రతాప ధైర్యములు దేహ
బల మితని సొమ్మనుచు మెచ్చ మెలఁగియుండె. 197

మ॥ భగవాన్దాసుఁ డొసంగె నాత్మసుత నక్బర్ నేత కుద్వాహ మం
దగరాడ్ధీరుఁడు వాని సోదరు సుతుండౌ మానసింహుండు వీ
ర గరిష్ఠుండయి ఢిల్లిఁ జేరి పరరాష్ట్రశ్రేణులఁ గెల్చి కీ
ర్తి గురుత్వంబు వహించి యక్బరుకడఁ దీపించె సేనానియై. 198

సీ॥ ముప్పాలుప్రజ హైందవులుగాన వారి సే
మము తన కెప్డు సేమమని తలఁచె
నని జయించుచుఁ బట్టుకొనినవారిని బాని
సలఁజేయు రట్టంబు నిలిపివైచె
యాత్రలకేగు భక్తావళితోఁ బన్ను
గొనరాదనుచు దానిఁ గొట్టివైచెఁ
జిరకాలముగను వేసెడు జుట్టుపన్ను న్యా
యవిరుద్ధమని దాని నవలఁ ద్రోసె
గీ॥ హైందవంబున యవనరాజ్యంబు నిలుప
నెన్నియత్నముల్ వలయుఁ దానన్ని .చేసె
మంచుమలనుండి కన్యాకుమారి దాఁక
వసుధ నెల్లఁ బాలింప నక్బరు దలంచె. 199

—/ అక్బరు - దిగ్విజయములు /—

క॥ కొనె మేత్రాదుర్గము, చే
కొనె గోగ్రోటన్ కోట యింక గోవిందవనం
బను దేశము గెలిచెను గో
టను నాగ్రాపురమునన్ దృఢమ్ముగఁ గట్టెన్. 200

క॥ శరణని మాళవపతి దరి
కరుదేరఁగఁ గూర్మిగని సహస్ర హయాధీ
శ్వర సేనాధిపగ సా
దరమున నాస్థానమున నతనిఁ జేర్చుకొనెన్. 201

క॥ తపతీనదిపైఁ గల బ్ర
హ్మపురంబును విజయగృహము నతిరయమారన్
నృపకుల దీపకుఁ డక్బరు
కృపకును లోనగుదు మనుచుఁ గ్రేశ్వరికె వడిన్. 202

క॥ రావలపిండి సమీపము
లో విలయాంతకునకైన లొంగని గక్కా
రావీరుల హావర ఘుడి
హోవఁగఁ బంజాబు దేశమును గెల్చుకొనెన్. 203

క॥ తూరుపుసీమల దృష్టిని
సారింప నడేల్కులుండు చానార్దుర్గ
ద్వారములు దీసి యక్బరు
భూరమణుని పాద కమలములు పూజించెన్. 204

క॥ నరసింగపూరు చౌరా
ఘరు మటిహోరంగబాదు క్రమమొప్పఁగ న
క్బరు పాదుసాహి చరణాం
బురుహంబులు శరణమనుచుఁ బొగడుచు నిలిచెన్. 205

క॥ 'రందో పిరోత్తము' యని
ఖాండీషు నృపుండు కాళ్ళు గడిగి తనూజన్

మండల రాజ్యంబు నృపా
ఖండలునకు నప్పగించెఁ గడు భక్తిమెయిన్. 206

గీ॥ చతు రనంత బలంబులు సందడింప
సింధు గంగానదుల మధ్య సీమలందుఁ
జైత్రయాత్ర పరంపరల్ సలిపి దిగ్వి
జయము సాగించె నక్బరు చక్రవర్తి. 207

—• చిత్తూరు-మూడవ ముట్టడి. •—

గీ॥ భరతఖండైక భాగ్యమై పరగు రాజ
పుత్ర రాజ్య 'మేలని వాని పొడవు వ్యర్థమె'
యని నడిపె సేన తద్వార మాగలేక
యురగనాయకు ఫణము లుబ్బ్రాఁతలాఁగె. 208

గీ॥ మహితధైర్యుండు తోడరమల్లు మేరు
శిఖరమల్లు ఖాసింఖాను; సింహ మట్టి
బిరుదుఁ 'ఖాన్‌ఖానను' పిటుగుల్ వ్రేళ్ల సలుపు
భయద శౌర్యులు నడిచి రక్బరును గొలిచి. 209

మ॥ అలఘుప్రాభవ కీర్తివిక్రమ యుతుండౌ మానసింహుండు, కోం
డలఁ బిండిన్ బడఁగొట్టు మేటి భగవాన్ దాసిందు నందున్న యో
ధులకున్ వృద్ధపితామహుం డిరువురున్ దోతెంచి; రీతండ్రి కొ
డుక్కులు దర్పించిన నడ్డుపాటు గలదే క్షోణీతలం బందునన్. 210

క॥ ఈమెయి నక్బరు నడుపు చ
మూమానం బింతయనఁగ బుద్ధిఁ జొరదు; బు
స్సా మొదలుగఁ బాండోలీ
సీమ వరకుఁ బదియుమైళ్ళు సేనలు నిండెన్. 211

సీ॥ జలధులంతటి సరస్సులు పెక్కులుండెఁ గ్రిం
దట వనాశానది నడచు చుండెఁ
దరుగని బహువిధ ధనధాన్య తతు లుండెఁ
బైరు కొత్తగ నెక్కి వచ్చు చుండెఁ
గోటలేడును జుట్టుకొని దృఢమ్ముగనుండె;
సప్తమహాద్వార సమితి యుండె,

గురుతరాయుధ పరంపర వెంతే నుండె, యో
ధ తతి చిత్తముల్లోఁదు ధైర్యముండె
గీ॥ నక్బరునకె కా దవ్వాని యబ్బకైనఁ
దగ్గక రణంబు సాగింపఁదగ్గ యన్ని
సాధనము లుండె, లేమి యెచ్చటను గలుగ
దుదయసింహరాణా లేమి యొకఁటి తక్క. 212

ఉ॥ అంగడి నున్నవన్ని శనియల్లుని నోరనటన్న మాట వా
సిం గనఁజేసి యయ్యుదయసింహుఁడు యుద్ధమటన్న భీతిచేఁ
గ్రుంగుచు 'రాజపిప్పలి'సి గోహిలువంశ్యులయొద్ద డాఁగె నై
నం గనరాదు లోపము రణం బొనరించెడు యోధకోటికిన్. 213

సీ॥ అల సలుంబార్ధీశుఁడగు సాహిదాసు శౌ
ర్యాన్వితుండగు దేవరాధిపతియు
ఝేలా ప్రభువు శుద్ధకీర్తి పుత్తన్నృపుండు
బేద్లా కొఠేరియా పృథ్వీవరులు
నింక మదేరియానృపతి మాడాసింగు
పావనాత్ముండు ఝాలా విభుండు
ఝాలూరిసేట ముళ్ళీరదాసు నోనె గు
ణేంద్రుఁడైన కరుణా సాంద్రరాజు
గీ॥ గ్వాలియరు దేశపతి లోసుగా మహీపులు
పగిలెడు పిరంగి గుండుకు వక్షమిచ్చు
ధైర్యహేమాద్రులు విశేషదళము లలరఁ
బోయి నిల్చిరి గెలుపో చావో యటంచు. 214

క॥ అల్ల యమభటుల గేరెడు
బల్లిదులగు భటులు గొలువవైరుల మనముల్
తల్లడిలఁగ వచ్చెను జయ
మల్లుఁడు రణరంగపార్థమహిత యశుండై. 215

సీ॥ ఇతఁడు మార్వార్మహీపతి మాళదేవుని
సుతుఁడు బాల్యమునందె శూరలోక

చూడామణియన విశుద్ధకీర్తిగడించెఁ;
దండ్రికీతనికి భేదంబువచ్చి
చిననాఁడు తనదేశమునువీడి వెడలెఁ; ఏ
తని భుజాటోప దుర్దాంతత విని
చిత్తూరిరాణాయుఁ జేయిచ్చి మన్నించి
బదనూరు సంస్థాన పతిగఁ జేసెఁ;
గీ॥ మహితధైర్యంబు వజ్ర వర్మంబు గాఁగఁ
దనదు రారోణ్మహా వీర తతులఁ బూన్చి
తగిలి బ్రహ్మాండమైనఁ ఖండిగ నొనర్చు
రౌద్రతరధాటిఁ గాలాగ్ని రుద్రుఁడితఁడు. 216
క॥ కృప నాదరించు చిత్తూర్
నృపచంద్రుని పనులు మేని నెత్తురుకండల్
విపులముగ ధారవోసి జ
రుపు స్వామిస్నేహ బంధురుల్ వీరెల్లన్. 217
సీ॥ సమర మనేకమాసములయ్యెఁ నక్బరు
పెక్కురు పనివాండ్రఁ ఖిలువ నంపి
దుర్గంబుక్రింద గోతులను ద్రవ్వించి చా
ప్పించి యగ్నిరజంబు పేర్చిలిపించెఁ;
జిత్తూరిసేన కాచిన నూనియలు శిలల్
గుప్పుచు వైరులఁ గూల్చుచుండె
యవనులు తలలపై శవకోటిఁ గప్పి దు
ర్గము క్రిందఁ ద్రోవంగఁ గడఁగుచుండి;
గీ॥ రెప్పుడును గాని యాగోడ లెచటఁగాని
పగులుటయుఁగాని సేనలోఁ బడుట గాని
తానరాదయ్యెఁ నక్బరు గడియ గడియ
కెటు లెటు లటంచు విసుగు నొందుటయ కాని. 218
సీ॥ ఉన్నమం దంతయు నొకమాటె పెక్కుతా
వులఁబోసి గూరి నిప్పును ఘటింప

నొకగని ప్రేలెఁ; ముందుండిన మొగలుల్
కూలిరి; గోడయుఁ గొంత యురలెఁ;
దానిలోఁ గొంద అంతమునొంది; రీవలా
వలివారు ముందుకుఁ గలయ దూఁకి;
రంత బ్రహ్మాండంబు నగలించు నొకపెద్ద
ధ్వనితోడ నొండొక గనియుఁ బ్రేలెఁ;

గీ॥ దాన యవన హైందవుల గాత్రములు గాలిఁ
గలిసె శతశస్సహస్రశః ఖండము లయి;
విఱిగె నొకగోడ; యచటఁ బెక్కుఱు యవనులు
హైందవులు చేరి; రయ్యె ఘోరాహవంబు. 219

క॥ రణరంగ మృగేంద్రులు చో
హణవీరులతోఁ గొటేరియా-బేడ్లా రా
ణ్మ్రలు లాసమ్మర్ద రణాం
గణమునఁ దెగి స్వర్గసీమఁ గట్టిరి గృహముల్. 220

క॥ హరవంశ్యుల నడుపుచు వీ
శ్వరదాసును దేవరాధి పతియును ఝూలే
శ్వరుఁడును బెండ్లికి నడచిన
కరణిని నని కేగి మడిసి కనిరి యశంబున్. 221

క॥ దురమున దూడాసింగును
గరుణాసాంద్రుండు వైరి గణ మస్త్రములన్
దరుగుచు రాసులు వోసిరి
పరలోక ద్వారసీమ వఱ కవ్వేళన్ 222

క॥ ఖండనశతఘ్నులనఁ దగు
చొండావ ద్భటులతో విశుద్ధ యశస్సాం
ద్రుండైన సాహిదాసుఁడు
ఖండితుఁడై యొరగె భటులు కళవళ మందన్. 223

క॥ చండనృపాఖండలు కుల
మండనుఁ డరిదండధరుఁ డమాత్యు డితండున్

బండినయెడ నీనాటి క
ఖండస్తంభం బొకండు గనసైయుండుఁన్. 224

.. పుత్త - యుద్ధము ...

ఉ॥ ఆవిధి సాహిదా సరుగ నాతని స్థానమునందు నెప్డు చోం
డావతుఁడెక్కెఁగావలయు నన్ విధి చొప్పున ఫారమెల్ల షే
ల్వావిభుఁడైన పుత్తపయి వ్రాలె వధూయుతుఁడై వివాహ తం
త్రావృతుఁడై సహస్ర వనితావృతుఁడై యతఁడుండె వేడుకన్. 225

మ॥ అకలంకంబుగ సాగె నాకబలి పుణ్యస్త్రీలు కళ్యాణ దీ
పకముల్ ద్రిప్పిరి పుత్తవరుఁడై పద్మావతిన్ గూడి వే
దికపై నుండెను వారి పాదముల దీప్తిన్ బెంచె ముత్యాల బా
సికముల్ మంగళ వేదమంత్రములు ఘోషించెన్ శ్రవఃప్రీతిగన్.226

సీ॥ అపు డొక్క సైన్యనాయకుఁ డరుదెంచి 'దే
వా! సాహిదాసుగా' రనుచు మ్రొక్కె
గని చివాలునఁ బీఠమున నిల్చి కర్తవ్య
మెఱుఁగుదు క్షణములో నరుగుదెంతు
నని యందుఁగలుగు స్త్రీ లందఱకును మ్రొక్కి
తల్లి దీవన లంది తరలి, సేన
కధిపతియౌచు సూర్యద్వారమున విజృం
భించుచు నాక్రొత్త పెండ్లికొడుకు

గీ॥ గొట్టియల మంచఁజొచ్చి గగ్గోలు పఱచు
బెబ్బులి విధానఁ దురకల పిండు నలికె
నామహోదాహు బాహు శౌర్యంబుఁ గాంచి
యుభయసైన్యంబులును దలలూఁచి నిలిచె. 227

మ॥ అనుగున్ గోడలిఁ బుత్త తల్లి గని "పద్మా! పుత్త యుద్ధంబు నే
యను వేంచేసె నతండులేని ధర శూన్యంబౌను నాపాలి కిం
టిన నేనుండను వానినే యనుసరింతున్ నీవున్ రమ్మ క
ల్గను బేర్పాసియు భర్తతోడిది గదా లోకంబు పద్మాక్షికిన్. 228

సీ॥ అనఁ బద్మ "తల్లి! సేజనియించు ప్రమదాన్వ
యమున ధీరులు పుట్టు వందలేదు
గర్భస్థ శిశువు సంగరమన్నఁ బలివోలె
వెలిమూకి రిపుల జృంభించి తాఁకు
సంగీతముసకన్న సామగానముకన్న
రణగర్జ మధురతరమ్ము నాకు
సెలవైన వెంట వచ్చెదనంచుఁ బలికి పు
ణ్యాంగనలను జేరి యక్కలార!
గీ॥ యనుమతింపుఁడు కదన కళ్యాణయాత్ర,
కనుచు మ్రొక్కిన వారెల్ల రతి విశాల
ధవళ నేత్రాబ్జముల బాష్పధార లొరసి
వెలఁదిఁ గౌఁగిటఁ జేరసి దీవెనలఁ గురిసి. 229

మ॥ అల చిత్తూర్పుర వీధులందు నిబిడం బై మూగి వీక్షింపఁ, వా
రలమోముల్ గని పద్మ 'యల్లదిగొ సూర్యద్వారముణ్ దాటి శ
త్రుల వక్షంబులపై నిజాశ్వఖురముల్ ద్రొక్కించె, నానాధునిణ్
గలయణ్ బోవలె నిల్వుఁడీ'యని నమస్కారంబులణ్ జేయుచుణ్,

సీ॥ ముద్దుమోమున నాణి ముత్తెపు బాసికం
బద్దంపుఁ జెక్కిళ్ల యందు మెఱుఁగుఁ
గాటుకచుక్కయుఁ గాళ్లఁ బారాణియుఁ
బసపువన్నియ పెండ్లి వస్త్రములును
సకలకల్యాణ భూషణరాజితోఁ దను
త్రాణంబుఁ దొడిగి హస్తమున ఖడ్గ
మలరఁ బ్రాణేశ్వరు నంద నిల్చుచు సత్య
సరకుసేసల నట్లు నటికె రిపుల
గీ॥ వెన్నముద్ద పిరంగియై వెడలి వచ్చె
హరిణశాబము బెబ్బులి యగుచుఁ దూఁకె
నబ్జినీలత బ్రహ్మాస్త్ర మగుచుఁ దాఁకె
నన రణ మొనర్చె నాపుత్త్రి యనుఁగుఁ బడఁతి. 231

ఉ॥ గాలికి సెండుటాకుగుమి క్రైవడి శాత్రవ వీర శీర్షముల్
వేలును నూఱులుఁ గగనవీధులలో నెగురంగఁజేసి ము
ప్పాలు తురుష్కయోధులఁ గృపాణము పాలొనరించుచుఁ మహా
కాళిక చాడ్పునఁ రణముఖమ్మునఁ ద్రిమ్మరెఁ బుత్తతల్లియుఁ. 232

గీ॥ పుత్తయు నవోఢ తల్లి యుద్వృత్తిఁ బోరి
దస్యుగళరక్తముల వసంతమ్ము లాడి
తల్లి చిత్తూరులక్ష్మి పాదముల నొఱిగి
సమసి రుభయ సైన్యములు బాష్పములు విడువ. 233

సీ॥ ధనధాన్య వసన వాహనము లియ్యఁగ వచ్చుఁ
గోరిన తిండి చేకూర్ప వచ్చు
గందంబు మెయినిండఁగా రాయఁగా వచ్చుఁ
బెక్కు భూషణములు పెట్టవచ్చు
దుదిలేని విద్యలు చదివింపఁగా వచ్చు
విభవంబు లెన్నేనిఁ బెంపవచ్చుఁ
గ్రిందమన్నని శిరమందుఁ జేర్పగఁవచ్చు
నమరాద్రి తెచ్చి యియ్యంగ వచ్చుఁ
గీ॥ గాని రణదుర్గ కర్పింపఁగన్న కొడుకుఁ
గోడలిని బంపి దీవించి తోడు వచ్చి
శత్రుశవ కోటిపై వీరశయన మందెఁ
బుత్త! నీతల్లి యెంతటి పుణ్యవతియొ. 234

సీ॥ పృధులప్రపంచ చరిత్రముల్ శోధింప
నం దెందఱెందఱో త్యాగనిరతు
లసమప్రతాప గుణైక శోభితులు దే
శారాధకులు సుంద్రు వారిలోన
నగ్రతాంబూల మర్యాదార్హులగుచుఁ బ
ద్మయుఁ బుత్తయును వానితల్లి పొల్తు
మేవాడనేకాక యీవిశ్వభరతఖం
డప్రజాగణ రక్తనాళములను

గీ॥ గట్టి కడపటి బిందు వొక్కండుగాని
పాఱుచుండ నీముప్పూర పరమ పవన
మహిత పావన నామముల్ మఱపులేక
తల ధరించుచుఁ బూజించి కొలుచు టొప్పు. 235

—: జయమల్లుని యుద్ధము :—

సీ॥ క్షాత్రధర్మైక నిశ్చలుఁడు వారోద్వంశ
జులకెల్ల ఘనయశోజ్యోతి యైన
జయమల్లుఁ డప్పలిక్షణమె సూర్యద్వార
సీమకు నడచెఁ జిచ్చువోలెఁ
బరసేనఁ దాఁకి కొబ్బెరకాయల విధానఁ
దలలు కుప్పలుగాఁగ నిలను రాల్చి
దక్షాధ్వర ధ్వంసదారుణ కృతిఁ బెంచు
వీరభద్రుఁడు వోలె వెలుఁగఁ జొచ్చె
గీ॥ "నకట! నాభాగ్యమను సూర్యుఁడస్తమించి
యూఁగె రణ; మీతనికి గంట వ్యవధి యున్న
సేన సర్వ సంహారంబుచేసి యుండు"
ననుచు నక్బరు వెఱగొందె నతని కృతికి. 236

మ॥ ప్రళయారంభమునాఁడు లోకములఁ గూల్పన్వచ్చు నారుద్రునిన్
దలఁపన్జేయుచు దుర్నివారబలవద్ధాటీ సమారంభుఁడై
యలమూర్ధ్య జ్జయమల్లమందర మమిత్రానీకినీ వారిధిన్
గలఁపన్ జొచ్చెనుగ్రొద్దు గ్రుంకి రణమంతంబందె నానాఁటికిన్. 237

చ॥ పలుచని పాలవెన్నెలలు పైనొలయన్ జయమల్లుఁ డాత్మ యో
ఘులఁ గొనుచున్ బరాహ్ణమున దుర్గము గూలినచోట రాలు సం
ధులనిడి బాగుచేయుటను దూరమునన్గని యక్బరయ్యెడన్
గాలిపెను గుండు; "సంగ్ర"మను గొప్ప తుపాకినిబట్టి పేల్చుచున్.

మ॥ పదితాగ్ని ప్రభలొప్ప మండుచుఁ గడున్ వేగంబ హృత్కోశమం
దది దూఱన్ జయమల్ల సూర్యుఁ డకటా! యస్తంగతుండై భయా

స్పద దుఃఖాంధతమంబునన్ విడిచె మేవాడ్ప్రపంచంబుః సె
ల్లిదళంబుల్ స్పృహతప్పి బెండువడి నేలల్వట్టె దైన్యంబునన్. 239

మ॥ అకటా! సింధుకు బ్రహ్మపుత్రకును మధ్యన్ గల్గు నీసర్వధా
త్రికి రారాజవు యుద్ధమాపు తటి రాత్రిన్ గార్యనిర్మగ్నుఁ జౌ
గ్యకృతిన్ జంపితి వెచ్చరింపకయె వీరవ్రాతశార్దూల నేఁ
టికి నీగొప్పతనంబు ధర్మమును బాటింపంగ లేకున్నచో. 240

చ॥ విలయకృశానుమూర్తు లిటు పెక్కురు నాదులు గూల ధైర్యముల్
నిలువక యోధు లందఱును నిల్చిరి జీవములేని బొందులన్
వలెఁ దరుణీజనుల్ పడిరి వహ్నిని సెన్మిదివేలు రాజపు
త్రు లపుడు తమ్ములమ్ముగొని తోడ వసంతము లాడి ముందటన్.

క॥ సూర్యద్వారము ధైర్యౌ
హార్యమ్మలై యపుడు దెఱచి యవనుల విజయా
వార్యాల సఱకుచుఁ దాము
శౌర్యము రాజిలఁగఁ బోరి సమసిరి వరుసన్. 242

—• చిత్తూరు పాడువడుట. •—

ఉ॥ కూలిరి వేవు రంగనలు కూలిరి సూర్వురు రాజబంధుపుల్
కూలిరి వీరపుంగవులు గొబ్బున ముప్పదివేలమంది య
వ్వేళను బెక్కువంశముల పెద్దలు గూలిరి త్వారువంశ్యుఁదౌ
గ్వాలియరీశుఁ డొక్కరుఁడె ప్రాణముతో మనియుండె నేమనన్ 243

సీ॥ సంవత్సరములు కష్టముచేసి గెలిచిన
చిత్తూరిలోఁ బ్రవేశించి యచటి
సౌధరాజములు ప్రాసాదంబులును గుప్ప
గొప్పకట్టడములు కూలఁద్రోసి
పెదపెద్దవగు రణభేరులు ఢంకాలు
గొని భవానీదేవి కోవెలఁ గల
స్వర్ణ దీపస్తంభ సమితియుఁ జిత్తూరు
నగరమ్ము ద్వారబంధములు గొనుచుఁ

గీ॥ గుంభదిక్స్తంభరాధీశ జంభవైరి
దగు జయస్తంభ మాదిగా నచట నున్న
పూర్వరాట విక్రమ చిహ్నముల నఖిలము
వీడ నక్బరు బగ్గము పాడు చేసె 244

గీ॥ తనకు లొంగక తపిలి మార్కొనిన రిపుల
కన్నివిధముల సాయమై రనుచు దుర్గ
వాసు లందఱ నెఱికి ముప్పదియు వేలు
పండువంటి సంసారముల్ పాడు చేసె. 245

మ॥ తనచుట్టుగా గల రాతిగోడ హిమవంతంబట్లు దుర్భేదమౌ
నని శత్రుల్ భయమంది పాఱ నొకవేయబ్దంబులున్ గీర్తిమో
సిన విఖ్యోన్నత పట్టణప్రవర మా చిత్తూర్ కటా! కాంతు లె
ల్లను గోల్పోవుచుఁ గాడుగా సిలిచెఁ గాలంబింక నెబ్బంగిదో. 246

సీ॥ చిగురైనఁ జిదుమ నొచ్చెడుచోటు ముప్పది
వేలమందిని గూల్పఁ జాలి తెట్లు
కఱవె భేరులు నీకుఁ గడుపునిండెనె ప్రాంత
తోల్మొక్కచే కాని దొరక గలదె
దివ్వెకంబముఁ గొంటె? తీఱెనే నీదరి
ద్రత కటా! ధూరి సామ్రాజ్య పతివి
కోట గెల్చితి గాక కుంభు జయస్తంభ
మేల కూల్చితి లాభ మేమి నీకు

గీ॥ గుడుల దివ్వెలార్చెడు పచ్చికూళ లైనఁ
జేకొనరె. చెట్లు చేయాడెఁ జిత్తురిపురి
ద్వారబంధముల్ గొనఁ జల్లపడెనె ఏనిలు
సరస గుణధామ యక్బరు సార్వభౌమ. 247

సీ॥ చిత్తూరు నగర లక్ష్మీభాగ్య సౌభాగ్య
మూనాఁటితోడనే యంతమొందె
నవల మేవాడ రాజ్యమున కయ్యాది రాజ
ధానియై విభవ మందంగలేదు

కోటల నెవరు బాగుపడఁజేయఁగ లేదు
భేరీ ధ్వనులు వినిపింప లేదు
పుడమితేం డ్లెప్పు డందడు గిడినదియు రే
దొకయింట దీపంబు సుండ లేదు

గీ॥ యవనపతి చేసి చనిన మహోపకార
మనుదినము చాటు చిప్పటి కన్లై భయద
మృగములకుఁ గంటకావృత వృక్షములకు
వాసమై యున్న! దెంతటి పాతకంబొ. 248

గీ॥ మహిమ చిత్తూరు నగర సామ్రాజ్య భవ్య
నాట కాభ్యంతరమున నీ నాఁటి కకట
కట్టకడతెర వ్రాల మంగళము వాడె
ననఁగ ధ్వని లేపుచుండు విహంగలతులు 249

క॥ పదునైదు వందలును న
ర్వదియెనిమిది నాఁగ సకల పరిభవముల కా
స్పదమని మేవాడ్ప్రజ లా
పదమును నేఁటికిని వినఁగఁ బాల్పడ రకటా. 250

సీ॥ అఖిలలోకముల దేవాసురాదుల నోమి
యజ్ఞాన బహుళ గాడాంధకార
మణఁచి కృతఘ్నుఘ్నుఁ డనుపేరు నెఱపు స
ర్వారాధ్యుఁడవు లోక సాక్షివైన
యో సర్వదేవాత్మకా సూర్యభగవానుఁ
డా! నీకులంబు ధన్యముగఁ జేయు
వితత ప్రతాప శోభితులు శిశోదియా
వంశసంభవులు నీ భక్తవరులు

గీ॥ విష్ణుపద మధ్యమున నీవు వెలుగుచుండఁ
బట్టపగలు నీ పేరిఁటి వాసరమున
వరితతుల కోడఁ జిత్తూరు పురము వాడు
పడఁగ నెట్లోర్చితో రూక్ష పరత మాని. 251

సీ॥ ఆరణంబున నక్క రజరామర ఖ్యాతిఁ
గను శౌర్యధను లిద్దరనుచు మెచ్చి
జయమల్లు పుత్త్రుల సత్కీర్తికై వారి
విగ్రహంబులు రచింపించి చిల్లి
లో మహాద్వారంబు సీమ నిర్వంకల
వాని రెండేన్గుల పైన నునిచి
హితులును బంధులు నేతేరఁజూపి వా
రల శౌర్యకథనముల్ దెలుపుచుండు
గీ॥ గొండ లట్లుండు నమ్మేటి కుంజరములు
వానిపై నున్న యుప్వీర వరులు నేఁటి
కట కరిగి చూచువారల స్వాంత సమితి
నెంత వెఱపు గూర్తురో దేవుఁడే యెఱుంగు. 252

చ॥ కదనము నిల్చిపోయెననఁ గ్రమ్మఱివచ్చి తటాకముఁ ముదా
స్పదముగఁ గట్టి పే రుదయ సాగరమం చిడి చేంతనే వసిం
చెదనని కట్టె ని ల్లుదయసింహుఁడు పేక్కురు కట్టి చేరి రం
దుదయపు రాభిధానమున నొప్పెఁ బురంబది వానిపేరిఁటన్. 253

క॥ చిత్తూరురాజ్య మంతయు
ముత్తునియలుగాఁగ నుదయ పురరాజమ స
ర్వోత్తమము చాలు నెంచని
యిత్తఱి నయ్యుదయసింహుఁ డేలెఁ దొడంగెన్. 254

క॥ సుతు లిరువదియైదుగురై
సతతము బహుపుత్రకులకు జనకుండని సం
స్తుతికెక్కెఁ గాని రాజ్యో
న్నతి కేమియుఁ జేయ డితఁ డనామకుఁ డగుచున్. 255

సీ॥ ఉదయసింహుఁడు పూర్వ మొకనాఁడు కొలువుండ
నొకకత్తి లోహకారకుఁడు తెచ్చె
నది పదనైనదోయని చూడ నొక పుల్లఁ
గొంచెము చివ్వఁ యందుంచెఁ గత్తి

యచటనుండిన సూక్ష్ముఁడై దేండ్ల బాలుండు
కత్తు లొరుల నఱుకఁగనే కాని
పుడకలు చివ్వ నేర్పడవంచుఁ దనదు హ
స్తముఁ జీల్చె దాన గొట్టమునఁ జిమ్మె
గీ॥ నట్లు వేడినెత్తురు గాఱి యచటిరత్న
కంబళం బంత రక్తసిక్తముగ నయ్యె
నంద ఱాశ్చర్యమగ్నులై రక్కుమారుఁ
దచలుఁడై చూపు తండ్రియాస్యమున నిలిపె. 256
మ॥ కడు లేఁబ్రాయమునందె యిట్టులు కఠోర గ్రౌర్యమ్ము నేమంటి మూ
ర్ఖుఁడు ప్రాయంబునునొందఁ దండ్రినగు నన్ గోధించి కంఠంబుఁ దీ
సెడు నేమో యను భీతి "నీతని శిరశ్ఛేదంబు గావింపుఁ డీ
ప్పు" డటంచాజ్ఞయొసంగెఁ జూపఱ మనంబుల్ తల్లడం బందఁగన్.
సీ॥ అధిపునాజ్ఞను శిరంబందుఁ దాల్చి మెలంగ
వలసిన సుభటు లాబాలుఁ గొనుచు
దక్షిణ దిశ నున్న దారుణాటవిఁ జేరి
వధ్య శిలాస్థలివాని నుంచి
తలఁదీయ యత్నించుతఱిని సూటిగ సలుం
బ్రాకృష్ణసింహ భూవరుఁ దచటికి
రాఁ దటస్థించి వారలను వారించి బా
లుని దన మందిరంబునకుఁ బనిచె
గీ॥ రాజధానినిఁ జేరి కార్యములు నడిపి
యుదయసింహుని గద్దించి యోర్పు నేర్పి
నాఁడు మొదలుగ నాత్మ నందనుని కరణి
సూక్ష్ము నెనలేని ప్రేమతోఁ జూచుచుండె. 258

— ఉదయసింహుఁడు జగమల్లుని రాజు చేయఁగోరుట. —

సీ॥ చిత్తూరి దుర్గంబువెడిన సాగ్గేండ్లకు
వసుధేశునకుఁ బెద్దవ్యాధి గలిగె

మఱఁదులు సచివ సామంత బాంధవ జనుల్
గనుఁగొన వచ్చిరొక్క దినమందు
నుదయసింహుఁడు వారినొద్దకుఁ బిలిచి "నే
మనఁజాలను నానోట మాటయున్న
యపుడె నావెన్క మీరాచరింపఁగఁ దగ్గ
పనులఁ దెల్పినను మేలనుచుఁ దోఁచెఁ
గీ॥ కొడుకు లిర్వదైదుగురు నాకును గలిగిరి
సూక్తుఁడు ద్వితీయుఁడై దేండ్లు చొచ్చినపుడె
చేరఁగొనిపోయి యాకృష్ణసింగు పెంచుఁ
బరమవాత్సల్యమున సలుంబ్రా పురమున. 259

గీ॥ చంద్రునినిండ జ్యోత్స్న యింపొంది నట్లు
నగవు మొగమునఁ గులుక నంతయుఁ గలఁగక
తన గళంబున వేఁడి రక్తంబు నైన
నేఱు పాఱింపఁగల కడుఁగ్రూరుఁ డతఁడు. 260

క॥ అదయుం డతఁ డిలువెడలుట
పదికోట్లని యుంటి వానిఁబార్థివుగాఁ జే
యఁదగునె దేశము సర్వం
బు దహించు నొకింత యనలమును లేకుండన్. 261

మ॥ మూఁడవవాఁడు సాగరుఁడు మూర్ఖులలోఁ బ్రథముండు నిర్వదొ
న్నేడులు వచ్చె నుండఁ డెపుడేనియు నాకడ, నాల్గు వేఁడి యే
నాఁడును ద్రవ్యమిచ్చి యయినన్ రణమున్ గొనితెచ్చిపెట్టు మే
వాడధరిత్రి నాకొఱవి పాలన చేసిన మీకు నచ్చునే. 262

చ॥ నరహరి వీఁడు నాసుతుల నాల్గవ వాఁడగు, మింటఁ బెట్టినన్
గురియదు వాన నేల నిడగోల్కొనఁబోవదు పైరు, పిల్చినన్
దరియఁడు చెంతకేగిన క్షణంబునఁ బర్విడు వట్టి యగ్గిడా
నరహరి గాఁడు ప్రాణహరినా కతఁ డియ్యిల నేల నర్హుఁడే. 263

సీ॥ సకలమేవాడ్మహీ చక్రభారముఁ దాల్చి
పాలింప వలసిన ప్రథమపుత్రుఁ

డాప్రతాపుం డెప్పు డతి సాహసికుఁడు యు
ద్ధంబన్న విందని తలఁచుచుండు
నొరులతోఁ బలుకఁడు పరులను బిలువఁడు
నవ్వఁడు నొవ్వఁడే నాఁడుగాని
యనుకొన్న పనిని జేసినదాఁక వదలఁడు
నామాట యనిన సుంతయును జెల్ల
గీ॥ దిల్లనక వాకిలనక రేయెల్లఁ దిరుగు
మన రిపులు భిల్లపతులతో మైత్రి సేయు
నిది పెదపిదాటు పల్లని వదలినాఁడ
నేమి చేయుదు నాభాగ్య మిట్టులుండె. 264

చ॥ ఇరువదియైదు మందికిని నిర్వది నల్వురు పుత్రు లిట్టు లుం
డిరి జగమల్లుఁ డొక్కఁ డిదినీదని నాదని కొంత కాపురం
బెఱిఁగిన బుద్ధిశాలి యెపుడింటనె యుండి సమస్తకార్యముల్
జరుపుచు నుండు నందఱను జక్కఁగఁ బిల్చియు మాటలాడెడున్. 265

చ॥ అదియును నాఁడవారని యనాదర మూనక యమ్మ యప్ప యం
చెద గరఁగన్ జరించు నెపుడేనియు శౌర్యము గీర్యమంచు నున్
వదరఁడు బైటఁ బోఁడు భయభక్తులు గల్గిన ప్రౌఢ సద్గుణా
స్పదుఁడని మీరెఱుంగుదురు వాని నొకించుక సేవ చూచినన్. 266

చ॥ కొడుకుల శ్రేయమున్ దలఁచి గొప్పగఁ దండ్రులు చెప్పఁగూడ దా
తఁడె సకలావనీభరముఁదాల్పఁగ యోగ్యుఁడు నాదు మాటలన్
బెడచెవిఁ జొప్ప కాదరముఁబెంచుచు నాదు ననంతరమ్ము మీ
రుడుగక సింహపీఠిపయినుంచుచు వానిని రాజుఁ జేయుఁడీ. 267

మ॥ మఱియొక్కం డధికారమంతయుఁ సలుంబ్రానాథుఁడున్ నాయ నం
తరమందున్ వహియించి యేర్పఱచు రాణా నొక్కనిన్ గాన ని
త్తఱి నాతో 'జయమల్లు భూపతిగ సంస్థాపింతు' నం చాతఁ డిం
దఱిలోఁ జెప్పుచుఁ జేతఁ జేయిడినచో నాయాత్మ శాంతిన్ గనున్. 268

మ॥ అనుచున్ బల్కెసఁ గృష్ణసిం గుదయసింహాధీశ్వరున్ నీయన
జ్ఞను బాలించిన మేటి భాగ్యమగు రాజస్థాన సింహాసనం

బునఁ జూతుగా జగమల్లుః నేకోఱ మనంబుగా జేరఁగా నీకుః దే
వుని ధ్యానించుచు శాంతినొందు"మని సంబోధించె నయ్యందఱా.269

చ॥ త్వరపడి కృష్ణసింగు వసుధాపతి మాటల నొప్పెనంచు నం
దఱును నతృప్తిఁగాంచి వగఁ దార్కొని కుందిరిః కాని, కత్తివా
దర కరణిగా బ్రతాపగుణ తన్మయుఁ డాపులిరాజు మ్రోల నె
వ్వ రిదియుఁగాదు కూడదని పల్కఁగనేర్తురు ధైర్యమూనుచుగా 270

మ॥ శిరముల్ వాల్చుచుఁ బ్రక్క ప్రక్కలకు విచ్చేసెగా మహామండలే
శ్వర సంఘంబుః ప్రతాపు మామయగు సాఝాలూరిరా 'వల్లఁడ
ద్దిరః రాజౌనను నాసలూఁదె' నని చింతించెగా మహారాజ్ఞియుగా
గరముగా శోషిలె బంధులందఱును బొక్కఁగాజొచ్చి రవ్వార్తకుగా.

మ॥ "అపురా! పుత్రులలోన జ్యేష్ఠుఁడు ప్రతాపాలంకృతుం డాప్రతా
పు వృథా చేసెనె రాజ్యహీనునిగ నీ భూమీశుఁః డాకృష్ణసిం
గవలీలగా దలమెట్టులూఁపె; నెటు చేయగావచ్చుః నెద్దినె న
న్న వెనగాగొట్టమునందుఁగట్టుఁడను చందంబయ్యె నేఁడెంతయుగా272

మ॥ "కమలాప్తాన్వయమా! భవత్కృతమహాఘంబేమొ రాముండు పూ
ర్వము కొన్నేడులు మానియుండ వలసెగా బట్టాభిషేకంబు, చం
డ మహీనాథుఁడు రేకమే చనియెః నీనాఁడీప్రతాపుండు స
ర్వముఁగోల్పోయెనుః దుర్బలుల్ జనకు లౌరాః యెంతకుగాగర్తలో."

చ॥ అని వగనొంది బంధుజను లంద అరుంతుదమౌ విషాద వే
దనలను బొంది కుందిరి పదంపడి నజ్జననాథు జబ్బు హె
చ్చెనుః మఱునాఁటికా యుదయ సింహుఁడు తాఁబరలోకయాత్రకే
గెను సుతులుగా సతీజనము కేవల దుఃఖపయోధి మున్గఁగగా. 274

చ॥ నియమ మొరండు బూర్వులు గణించిరి దానినిబట్టి ధారుణీ
దయితుఁడు సంత మొందఁగనె తచ్ఛవముగా గొనిపోవుచుగా నిజా
లయమునఁ జేర్చి వేదవిధులగా దలఁదాల్చుచుఁ బార లౌకిక
క్రియలు పురోహితుండు పొనరించెను తండ్రి కొనర్చునట్టులగా. 275

క॥ వరసౌధము నా చోకి న
గరులోఁ బట్టాభిషేక కార్యక్రమముల్

జరుగఁగఁ దొడఁగె ముహూర్తము
త్వరపడి జగముల్లుఁ దలరఁ దరియఁగ వచ్చెన్. 276

—• పట్టాభిషేకోత్సవము. •—

సీ॥ పన్నీరు పునుఁగు జవ్వాది యత్తరు దెచ్చి
యెల్ల వీథులయందుఁ జల్లి నారు
ప్రతిగృహాంగణము కంబముల రంభాస్తంభ
నివహంబులను దెచ్చి నిలిపి నారు
సౌరభం బొలుకు మందార మంజుల మాలి
కలు తోరణంబులు గట్టి నారు
భువనగురుం డొందుఁ బూర్ణ వైభవ మంచు
స్వాగతాక్షరములు వ్రాసి నారు.
గీ॥ దివ్యముగ రంగవల్లులఁ దీర్చి నారు
పెక్కెడలఁ జల్వపందిరుల్ వేసి నారు
బీదలకు సన్నమేర్పాటు పెట్టి నారు
సిరులఁ జిమ్మంగఁ బురమెల్లఁ జేసి నారు. 277

సీ॥ సౌభాగ్యలక్ష్మి కాస్థానమెక్కొ యనఁ
బలు విధాలంకారములను గూర్చి
నిత్యరమోత్సవ నిలయమై యలరారు
నాస్థానమండపం బలవరించి
సమ చతుష్కోణ విశాల వితర్దిపై
నవరత్న దివ్య సంతతులు గలిగి
కనకమయంబు నుత్కటకాంతిమంతమౌ
నొక్కసింహాసనం బొనర మనిచి
గీ॥ దాని కవ్వల శోభాప్రధానమైన
పీఠపఙ్క్తులు వరుసగాఁ బెక్కు నిలుప
నింద్రుని సుధర్మయో యననెసఁగె సుప్ర
ఘాస్థలమ్మగు రాణా సభాస్థలమ్ము. 278

గీ॥ సమచతుష్కోణ వేదికాంతమునఁ దూర్పు
కోసను సింహాసనమునకు వెనుక నొక్క
వేయి యపరంజి కిరణముల్ వెలుఁగ నలరె
నతిత రానందదంబు సూర్యధ్వజంబు. 279

సీ॥ గ్వాలియర్‌పతి మొదల్‌గాఁగలిగిన రాజ
పరమేశ్వరులు కుడిప్రక్కఁ దనర
జిత్తూరురాణాల సేవించు సామంత
జనపతుల్ వామ పార్శ్వమున వెలయ
నున్నతోద్యోగ సంపన్నులై ఘూరులౌ
రాజబంధులు వెన్కప్రక్క వెలుఁగఁ
గవులు దైవజ్ఞులు గాయకుల్ చారణుల్
సింహాసనము ముందుఁ జెలఁగు చుండ
గీ॥ బహుళ సంఖ్యాకులగుచు భూప్రజలు వికసి
తాస్యములతోడ వచ్చి యందందు నిలువ
నిత్యకల్యాణ మందిర నియతి నొప్పి
యాసనామందిరం బప్పు డందగించె. 280

—• జగమల్లు సింహాసనము నెక్కుట •—

మ॥ అరుదెంచెన్ జగమల్లుఁ డందమగు స్వర్ణాలంకృతుల్ మేన న
చ్చెరువున్ గొల్పఁగఁ దాల్చి; యాక్షణమునన్ సింహాసనంబెక్కి భా
స్వర శోభాకర రాజదండమును హస్తమ్మందుఁ గీలించి 'యం
దఱు నన్గొల్వఁడు మీకు నెల్లరకు రాణాస్థితి నే నిత్తటన్' 281

మ॥ అని యెంతో యధికారయుక్తవలె సందాసీనుఁడౌ వాని బో
రన దూరంబుననుండి చూచుచు నలుంబ్రాకృష్ణసింహ ప్రభుం
డనువౌ మాటల 'సింహపీఠ మిది వత్సా! నీదిగా దాప్రతా
పుని, దవ్వీరుఁడు వచ్చు లేచి యిటు నీవున్ రమ్ము దూరమ్ముగన్.

క॥ అదియు నృపుఁడు కాఁదగువాఁ
డుదయం బభిషేకమై ముహూర్తము చరియన్

గదియఁదగు సింహాపీఠం
బిది తగునే ముందె వచ్చి యిటు కూర్చుండఁగన్ 282

మ॥ అని పల్కన్ జగమల్లుఁ "డేమనెద హాహా! నాఁడు మాతండ్రి చె
ప్పిన యాచొప్పున సమ్మతించియును నీవేళన్ ననున్ లేపి పొ
మ్మని యెట్లాడెదు! ధర్మసూక్ష్మముల నావంతైనఁ బాటింప! వె
వ్వని రాజున్ బొసరించెఁ దండ్రి యతఁడే పాలింప నర్హుండగున్. 283

ఉ॥ ముప్పదియేడులేలిచనె భూమిని! దండ్రి యనుజ్ఞ గాక నీ
విప్పుడు చెప్పినన్ వినెదనే యివి యేటికి వెఱ్ఱి మాట లే
నొప్పను నన్నువీడి చను మూఱక వద్దని గద్దరింప నీ
కెప్పుడు గల్గె బాధ్యత యిసీ జగమల్లుఁడు నీ కలంతియే. 284

మ॥ అని కోపమ్మునఁ బల్కి నాతని సలుంబ్రాధీశుఁడున్ జూచి "నీ
జనకుం డక్కట! ధర్మమున్ విడిచి రాజ్యంబందు నిన్నుంచు మీ"
యన నాఁడో మఱునాఁడొ చచ్చు నపుడేలా యామహీనాథు నా
జ్ఞ నిరోధింప నటంచు మంచిదని శీర్షంబూఁచి దాఁటించితిన్. 285

మ॥ అటుగా కుండిన నాప్రతాపుఁ డఖిలక్ష్మాధీశ్వరుల్ గొల్వఁగాఁ
బటుదర్పంబున సార్వభౌముఁడగుచున్ బాలించు నన్ మాట నీ
కెటులన్ జ్ఞప్తికి లేదు? బంధువులు భూమీశుల్ హితుల్ భూజనం
బెటు మాన్పన్‌గల! రమ్మహాత్ముని బలంబేమంచు భావించితో. 286

మ॥ అతిపూజ్యంబని తండ్రియాజ్ఞకు శిరంబల్లొగ్గి కూర్చుండెఁ గా!
కతఁడే రేఁగిన దేవదైత్యులకు శక్యంబౌనె వారింప! నీ
చతురంభోనిధి సంవృతాఖిల మహీచక్రంబునున్ భస్మ సా
త్కృతమున్ జేయఁడె! కుయ్యో మొఱ్ఱో యనినన్ దిక్కుండునే పిమ్మటన్

సీ॥ జననమాదిగ వేయికనులతో నాతని
వీర వర్తనముఁ గన్పెట్టి యుందు
రవికులోద్భవ రాజ రాజ శిరోమణి
కాఁదగ్గ గుణకోటి గల దతనికి
మేవాడఖనిని జన్మించిన మణులలో
నింత తేజముగలదేది లేదు

చిత్తూరు రాజ్య లక్ష్మి భాగ్యవశమున
నేకలింగేశుఁడే యిట్లు పొడమె

గీ॥ నుర్వి రవిచంద్ర తారక లుండుదాఁక
నవతరింపఁబోఁ డట్టి మహాహుండు
కోటిబ్రహ్మాండములనైన గోట మీటి
పట్టభద్రునిఁజేతు నాప్రాణ మాన. 288

మ॥ అనిశోత్సాహ పరాక్రమస్ఫురణ రాజ్యంబేలెః సంగ్రామ సిం
హునివెన్కన్ బలహీనుఁ డయ్యుదయ సింహుం డెక్కరాకుండఁ దీ
వ్ర నితాంతాప్రతిమప్రతాపుఁడు ప్రతాపస్వామి సింహాసనం
బునఁ గూర్చుండియె యున్నఁ జిత్తురుపురిన్ బోఁగొట్టి యిట్లేడ్తుమే. 289

ఉ॥ ఏమని రాజ్యభారము వహించెనొ నాఁటనుగోలె ముప్ప లే
సీమకుఁ దెచ్చె యుద్ధమనఁజేలెడు గుండెలుగాఁగఁ బాఱె నూ
ఱామడ కాల మెట్లొచనె! నాతఁడు మేలనిపింతు వీవు నీ
తో మహిరాజ్యమాః కొఱవితోఁ దలగోఁకిన యట్టు లుండదే. 290

ఉ॥ ఇప్పటి దేశకాలముల నెంచిన, నప్రతిమాన శౌర్యుఁ డా
యొప్పులకుప్ప సర్వసుగుణోన్నతుఁ డింకఁ బ్రతాపుఁ డొక్కఁడే
తప్పక రాజుగాఁ దగిన దార్ఢ్యము గల్గిన బుద్ధిశాలి ని
న్నిప్పుడు నిల్పినన్ జెఱుతువేమియుఁ జేతికిఁ జిక్కకుండఁగన్. 291

ఉ॥ కాన మదీయబోధనముఁ గైకొని ప్రక్కకురమ్ము! మౌర్ఖ్యమున్
మూను మటన్న లోకమున మంచియుఁ జెడ్డ యెఱుంగనట్టి య
జ్ఞాని యతండు నీయుపలుసాఁగవు పొమ్మిఁక నెన్న వీడి యే
మైనను సింహపీఠి విడి యవ్వలికేఁగ నొకించు కేనియున్. 292

మ॥ జనకుం డాజ్ఞ యొసంగెః నక్కతన రాజస్థాన సింహాసనం
బునఁ గూర్చుండఁగ నేనె యర్హుఁడ ననుచ్ బోనాడుచున్ బ్రక్క కం
పిన సామంతులు భూజనుల్ కినిసి యిప్డే నిన్ను శిక్షింతు రా
క్కని పీఠిందఱ నేమి చేసెదవొ చక్కన్ జూతుఁగా కియ్యెడన్. 293

క॥ అని పెదవిపైన వ్రేలిడు
కొని యాశ్చర్యంబు ముదురుకొన సభ్యుల వం

కను దృష్టిని సారించుచుఁ
దన రాచఱికంపు ఠీవి దళము కొనంగన్. 294

శా॥ ఏమయ్యా! యిటు చూచుచుండెద రిదేమీ చోద్యా, మాడంగు లెం
తో మేలే! యొక యక్రమంబు తమకన్నుల్ చూడఁగా సాఁగ నీ
రేమో యీయన వ్రేల భీతిఁగొనఁగానేలా? యదల్పొండు మీ
కేమేఁ బ్రాణభయంబు గల్గినను నేనిందుండి కాపాడెదన్. 295

ఉ॥ ఈనిన సింహమట్లు పయి కీతఁడు దూఁకెడి నమ్మచెల్లి! వృ
ద్ధైన యొకండు తానె బలమంతగఁ జూపిన మీరు పల్వు రెం
తేనియుఁ బట్టు పట్టినను నెంతలు పుట్టునొ వ్రేలు వాఁచి రో
ఠైనను రోలు వాఁచినఁ గటా! మితియన్నమఱి మేరయుండునే. 296

—• కృష్ణసింహ ప్రభువు కోపోద్దీపితుం డగుట •—

మ॥ అని వీరమ్మన వెన్క నానుకొని సౌఖ్యాసీనుఁడౌ నాతనిన్
గని కృష్ణుం డసు మేలు తాతకును దగ్గన్ నేర్పు ధీశాలివౌ
మనుమం డైతివి వీర లందఱు నినున్ బట్టాభిషిక్తున్ బొన
ర్చి ననున్ దాఁకెడువారె నీకుఁ బలె వారిన్ వ్రేటియున్ సోఁకెనే. 297

శా॥ "రాణాలన్ బొనరించు బాధ్యత సలుంబ్రావారిదన్ మాట యీ
క్షోణిన్ గల్గిన వా రెఱుంగఁగల రిచ్చో నేఁ బ్రతాపున్ మహా
రాణాగా నొనరింతుఁ గూడదను ధీరగ్రామణుల్ గల్గినన్
బాణిన్ బై కెగనెత్తు డిప్పుడె యెదుర్పన్ వత్తు నత్యుద్ధతిన్. 298

మ॥ ఇది నాయింటికి నాదు వాకిలికినై యేఁజేయు కార్యంబె, యి
య్యది నన్ యోగ్యు సమర్థు భూధవుని జేయన్ నిత్యకల్యాణముల్
పొదలన్ రాజ్యము సౌఖ్యమున్ గనెడి పట్లున్ గానిచోఁ జెందు నా
పద లప్పాపము పెద్దపే రలరుటన్ వ్యాపించు మాటోంట్లనున్. 299

మ॥ పనియే మొక్కరితోడ నాకిఁక సలుంబ్రాకృష్ణుఁ డన్యాయముల్
తనమోప్రలన్ జరుగంగ నోర్వఁడని పెద్దల్ చేయు నాశీస్సు కే
వినయం బూనెద; నిన్నుఁ గాని మఱియున్ వేఱెవ్వరిన్ గాని మ
న్ననలన్ జేయఁ బ్రతాపునిన్ బతిగ సంస్థాపింతు మేవాడకున్. 300

ఉ॥ మెత్తని మంచి మాటలివి మేలని వైశమ లేవి రమ్మ లే
దిత్తఱి లేవనన్న నిను నెత్తుచు దూరము చేర్తు నన్న నా
యుత్తముఁ డింతయున్ గదలకుండినఁ గృష్ణవిభుండు చేతితో
నెత్తి మృగేంద్రపీఠివిడి యేగఁగఁజేసెను బట్టి త్రోయుచున్. 299

ఉ॥ త్రోసిన నేమిచేయుటకుఁ దోఁపక యాజగమల్లుఁ డీసునన్
రోసము తన్గలంప, వడిరోజుచుఁ గేసరిరాజు చేతిలో
గాసిలి దానిఁ దప్పుకొను కైవడిఁ గానని గొఱ్ఱెమోడ్కి నా
లో సభవీడి యశ్రుతతలోచనుఁడై చనె బీద మోముతో. 300

మ॥ అపురా! యెంతటి పూజ్యచిత్తుఁడొ సలుంబ్రాధీశుఁ డీవేళలో
నవకాశంబు లభించు మాత్రమున నన్యాయంబు వారించి నీ
క్కువ మేపారఁగ సింహపీఠముపయిన్ గూర్చుండ యోగ్యుండు భూ
వరవంద్యుండు ప్రతాపుఁడే యనియె నిర్దాక్షిణ్య చిత్తంబునన్. 301

మ॥ అమృతంబునన్ మలయాద్రి మందపవనం బద్దంబులన్ స్వచ్ఛ భా
వముఁ గోల్పోయినఁ బోవవచ్చును సలుంబ్రాకృష్ణ మాలిన్య లే
శమునన్ సోఁకదటం చెఱింగియు నజస్రస్వచ్ఛ మాధీరు చి
త్తమునన్ దప్పఁదలంచియుంటి మపరాధం బయ్యె నెంతేనియున్.

చ॥ వనితలఁ జేరి వంటయిలు వాయని యాజగమల్లు వీడి మా
మనసు హరించినట్టి యభిమానధురంధరు విక్రమైక వ
ర్తను రవివంశవర్ధనుఁ బ్రతాపు ధరాధిపుఁ జేయ నుండెడిన్
మనియెడుఁగాత మీతఁ డతిమానుషకీర్తి సహస్ర వర్షముల్ 303

కృష్ణసింహప్రభుపు సింహాసన మధిష్ఠింపరమ్మని ప్రతాపసింహు నర్థించుట.

మ॥ అని సామంతులు భూప్రజాళులు సలుంబ్రాధీశు వేనోళ్లఁ గీ
ర్తనముల్ చేయ 'ఘనాభిషేకము నొనర్పన్ రాద' మం చందఱున్
దనవెంటన్ గొని కృష్ణసింహవిభుఁ డాస్థానంబునందుండి భూ
ప నివాసంబును జేరి యచ్చటఁ బ్రతాపస్వామికిన్ మ్రొక్కుచున్. 304

సీ॥ కష్టసౌఖ్యము లొక్కగతిఁ జూతు యుద్ధం బు
గాదిపండుగ యట్లుగాంచు చుందు

సాహసికాగ్రణి సమర్థుఁడవు పరుల బా
ధలు సూపి యోర్వ నీతరము గాదు
వీరపూజ్యము నీయుదారత దేవ! నీ
తండ్రి మౌర్ఖ్యముగాఁగఁ దప్పఁ దలఁచి
జ్యేష్ఠపుత్రుఁడ వౌటఁ జెందఁగా వలయు మే
వాడ్దేశసామ్రాజ్య భరముఁ బాపి
గీ॥ మేనవును నెత్తి కెత్తు సమాయఁ దనుచు
నల్ల జగమల్లిన కోసంగుమనియె నప్ప
టంటి వాచేల యని తలయూఁచి యుంటి
నమయ మైనప్డు మాటఁ బొందమని తలఁచి. 305

శా॥ ఆరంభంబుననుండి నీవయిన నాయాశాభరం బెల్ల దై
వారున్; నాదగు విన్నపంబుఁగొని రాజ్యశ్రీని పోస్తంభ కే
శీరంగంబున నిల్పి ధర్మమున పాలింపన్ బ్రయత్నింపు పు
ష్పారామంబటు సౌఖ్యసౌరభములన్ వ్యాపింప దేశంబునన్. 306

మ॥ అని వాక్రుచ్చిన నాప్రతాపుఁడు సలుంబ్రాధీశు వీక్షించి మ
జ్జనకాభీష్టముఁ దీర్పకుండినను నాచంద్రార్క ముగాత్రప కీ
ర్తిని నేనొందనె ధర్మదూరగుఁడనై దేవేంద్ర భోగంబులన్
గనుకంటెన్ నిరుపేదనై మనుట యోగ్యంబంచు భావించెదన్. 307

ఉ॥ ధారుణి రాజ్యమున్ స్థిరమె ధర్మము దేవునియట్లు సుస్థిరం
బై రహియించు ధర్మమును నాదట మీఱఁగనోపఁ దండ్రికిన్
మారట తండ్రి వంటఱకు మాన్యుఁడ వీవొసరింప నాజ్ఞలన్
దూరము సేయ నోప నెటు తోఁపక చిత్తము తత్తరించెడున్. 308

చ॥ మృదుహృదయుండు నాజనకుఁడెప్పుడు నీదు మహాభుజంబె యా
స్పదముగ రాజ్యమేలెను భవత్కృప నంత తొలంగియున్న నీ
యుదయపురంబునున్ నిలిచియుండదు క్షేమము నిల్చియుండ వో
సదయ భవన్మహోపకృతి సర్వజగన్నుతి పాత్రమై తగున్. 309

చ॥ అని యెటుచేయఁదోఁప కిటులాడు ప్రతాపునిఁ జూచి దేవుఁడే
విను సృజియించె సర్వధరణీస్థలికిన్ బతిగాఁగ జ్యేష్ఠ నం

దనునిగ నీవు రాజగుట ధర్మము భూప్రజ యే యుదాత్త వ
ర్తను వరియించునో యతఁడె రాజుగనిల్చుట ధర్మమేకదా. 310

మ॥ అని కృష్ణప్రభుఁ డాడుచుండఁ గని యప్డందున్న సామంతులున్
జను లొక్కుమ్మడి నైకకంఠ్యముగ రాజస్థాప సింహాసనం
బునఁ గూర్చుండి ప్రతాపుఁడే నృపతియై పూర్ణప్రమోదమున్
గని పాలించెడుఁగాక నిర్మల యశః కల్యాణముల్ చేకురన్. 311

శా॥ మేమై కోరిన యీతనిన్ విడుచుచున్ మేలంచు నీవల్ల సు
త్రామున్ దెచ్చిన శౌరిఁదెచ్చెను సమాధానంబు మాకుంద దే
మో మమ్మందఱ నుద్ధరించు ననుచున్ ముందెంత కాలంబుగా
నో మాకున్నవి కోర్కులిప్డీతని నోహో! వీడఁగా నేర్తుమే. 312

ఉ॥ ఎప్పుడితండు రాజగునొ యెప్పుడు కన్నుల విందుగాఁగ మా
యప్పను జూతుమో యనెడి యాసలు కొండలువోలె నుండు నీ
యొప్పమి నేమియున్ బలుక నోడితి మింతకు నీప్రతాపుఁడే
తప్పక రాజు గావలయుఁ దప్పదు తప్ప దటంచుఁ బల్కినన్. 313

చ॥ కనుఁగొనియుంటివే ప్రజల కౌతుక మిందఱ కోర్కె త్రోసి వే
య నగునె సన్ముహూర్తము రయంబున డాసె శుభాభిషేకమున్
బొనరుతు సమ్మతింపు మని మ్రొక్కి వచించెడు కృష్ణసింహు ప్రా
ర్థనమును ద్రోయఁజాలక ప్రతాపుఁడు సమ్మతిఁ జూపె నయ్యెడన్. 314

పట్టాభిషేకము.

క॥ కొంగులముడి చెలరారఁగ
బంగరుపీఁటల పఘుండు పాటేశ్వరియున్
చెంగటనె యమరసింహుఁ డ
సంగనిధుఁడు గూరుచుండి రతిహర్షమునన్. 315

మ॥ హరభట్టారక ముఖ్య భూసురులు మంత్రానీకముల్ పల్కి బం
గరు కుంభంబుల నుండు వార్ధిజలమున్ గంగా పవిత్రాంబు ల
బ్బురమున్ గొల్వఁ బ్రతాపసింహునకునై మూర్ధాభిషేకంబు చే
సిరి సంపూర్ణ విశుద్ధ చిత్తముల నాశీర్వాదముల్ చేయుచున్. 316

సీ॥ సౌరభ సురభిళ వారిపూరమ్ముల
జలకంబుఁ దీఱిచి జిలుగుఁ బట్టు
వలువలు ధరియించి తలను ముత్తెపుసరుల్
కలకల లాడు పాగా ధరించి
విలువ వజ్రాల సొమ్ములు మేన నిడి సుగం
ధ ద్రవ్యములను గాత్రమున నలఁది
మందార కుసుమ దామము వక్షమునఁ దాల్చి
సూర్యదేవుని మ్రొక్కి స్తుతులొనర్చి
గీ॥ యేకలింగేశ్వరు పదంబు లెదఁ దలంచి
భక్తిమెయి భవానీదేవిఁ బ్రస్తుతించి
గురుల హరచంద్రభట్టారకులను గొలిచి
యాప్రతాపుఁ డాస్థానమునందుఁ జేరె. 31

క॥ పరిఫుల్ల రుచిర సరసిజ
పరంపరలు నెఱపి సటు సహాభవనం బ
ప్పురజనముల నెమ్మోములఁ
బరమామోదమున నపుడు భాసిలు చుండెన్. 318

సీ॥ దైవజ్ఞమణులు తదేవ లగ్నంబంచు
సమయంబు జూచి హెచ్చరిక చేయ
వేదభూసురులు దీవించుచు మను మంత్ర
ముచ్చైస్స్వనమున వాక్రుచ్చు చుండఁ
చారణుల్ పూర్వ మహీరమణాభిషే
కప్రసంగములు వేడ్కను బఠింప
వందులు జయజయధ్వాన పూర్వముగఁ బ్ర
తాపశబ్దమ్ము సందడిగఁ బొగడఁ
గీ॥ చంద్రభట్టారకుండు రసంబు గురియు
పెక్కు కల్యాణ వృత్తముల్ ప్రీతిఁ జదువ
నెంతసంతోష భరమొకో యెవ రెఱుఁగుదు
రందఱును మేను మఱచుచు నవశులైరి. 319

క॥ కలనాదము లలరఁగ, మం
గళ తూర్యము లెల్ల మ్రోఁగ, గాయకులును బా
టలు పాడ, నాప్రతాపుఁడు
కొలువున సింహాసనమునఁ గూర్చుండెఁ దగన్. 322

గీ॥ ఆమహోన్నత శుభ సమయమున హర్ష
సరభసములైన బహుళ హస్తములనుండి
యాసభాస్థలి నెల్లఁ బెల్లాక్రమించి
కురిసె మెఱుగారు బంగారు విరుల వాన. 323

గీ॥ బంగరుం బళ్లెరమున జవాది పునుఁగు
పచ్చకస్తురి మెదిపియుఁ దెచ్చి యాయ
నాప్రతాపుని వికసితాస్యంబు నందుఁ
దిలకమును సలుంబ్రాభర్త దిద్దెనపుడు. 324

మ॥ అమితోత్సాహములో ఫణీశ్వరుని చాయన్ వెల్గు దుర్దాంత ఖ
డ్గము మధ్యంబునఁ గట్టి రత్ననివహాక్రాంతంబునౌ రాజదం
డము హస్తంబునఁ జేర్చి హాటక కిరీటంబున్ దెసల్ నిండు తే
జముతోడన్ మిఱుమిట్లు గొల్పఁగను సంస్థాపించె మూర్ధమ్మునన్. 325

సీ॥ "అలఘు సలుంబ్రా మహారాజ్యమేలు న
పార చోండావ దన్వయమునకును
నేఁటి జీవత్ప్రతినిధిని శ్రీశ్రీ సలుం
బ్రాకృష్ణసింహ భూవరుఁడ నేను
వంశక్రమాగతాచార్య సర్వాధి కా
రోన్నతి నుదయసింహుని కుమారుఁ
డతి విక్రమోదారుఁడగు ప్రతాపుని మహా
జనులైన మీమ్రోల జగము మ్రోల
గీ॥ నీదినం బీక్షణంబు ధాత్రీశుఁ జేతుఁ
జంద్ర రవి పంచభూత నక్షత్ర గణము
లెంత వఱకుండు నీప్రభుఁ డంతవఱకు
నాయురారోగ్యములు గల్గి యలరుఁ గాక. 326

మ॥ అరుదౌ ప్రాభవయుక్తితోఁ, గళలతో, వ్యాపార సంపత్తితో
సిరితోఁ, బంటలతోఁ బదార్థములతో సేనా సమూహమ్ముతోఁ
బరమశ్రేయముతో ననారతము మేవాడ్దేశ సామ్రాజ్య మీ
పురుషశ్రేష్ఠుని యాజమాన్యమున నొప్పుఁగా విశ్వసంస్తుత్యమై. 327

మ॥ అనుచుఁగా బూవులమాలలఁగా గళమునందర్పించి సౌవర్ణ సూ
తన భూషాళి నలంకరించి "కడుశ్రద్ధాభక్తులఁగా గొల్చి భూ
జను లీభూపవతంసుఁ గొల్వుఁ'డని హస్తద్వంద్వముఁగా మోడ్చి సాఁ
గి నమస్కార మొనర్చి శీర్ష మిలపైఁ గీలించి ముమ్మాఱులుఁగా. 328

గీ॥ గొడుగు పట్టినట్టులు చల్వఁగూర్ప నేర్చు
రామరాజ్య మీతని దని ప్రచుర పఱుపఁ
బట్టిరి సితాతపత్ర మప్పట్లఁ గదలెఁ
జామరగ్రాహిణుల హేమ చామరములు. 329

గీ॥ భూధరేంద్రాత్మజను బోలు పుణ్య సతులు
దొడ్డ ముత్తైదువలు హస్త తోయజముల
వరుస బంగారు దీపాల పళ్లెరముల
తో నివాళించి రపుడు భూజాని నచట. 330

గీ॥ రత్నముల నొక్క కనక పాత్రమునఁ బోసి
హారతుల నెత్తి యంగన లవనిఁ బోసి
రవి వెలిఁగె నాకసము నిండ నలము కొనిన
వివిధ తారకా కోరక వితతి మాడ్కి. 331

ఉ॥ అంతట నొక్క రొక్కరుగ నాన్నృప శేఖరు పాద పంకజ
ప్రాంతముఁ జేరఁబోయి వినయ మ్మలరార నమస్కరించి సా
మంతులు భూజనంబులు క్రమమ్మున రత్నములుఁగా విభూషలుఁగా
దొంతరలాడఁ గాన్క లిడి తోరపు హర్షము లొంది రయ్యెడఁగా. 332

మ॥ హరభట్టారకుఁ డింద్రభట్టకవి వస్త్రాలంకృతుల్ వెట్టుచుఁగా
బరితోషింపఁగఁజేసి యల్లన నలుంబాస్వామికిన్ మ్రొక్కి యీ
చరణాబ్జంబులు నాకు సేవ్యములు మా చండక్షమానాథు శ్రీ
చరణంబుల్ వలె నంచుఁ జిత్తమున హర్షంబొప్ప నాసీనుఁడై. 333

శా॥ మందార ద్రుమ మంజరీ మధురిమా మాధుర్య సంపాది వా
క్సందోహం బలరన్ బ్రతాపవిభుఁ డాస్థానస్థ సామంత రా
ణ్మందారుల్ ప్రజలున్ జమూపతులు నానందాబ్ధి నోలాడుచున్
మందస్మేర ముఖాంబుజ ప్రభలతో మన్నించి యాలింపఁగన్. 334

మ॥ 'పువులన్ బూచి సమస్తభూతలము నవ్వున్ గొల్చెనన్ మాడ్కి నూ
త్నవికాసస్ఫురణంబు వెంటఁగొని చైత్రంబున్ బ్రవేశించె రా
జ్ఞివహంబుల్ ప్రజ లేగుదేరఁగ భవానీమాతకున్ బ్రీతిగాఁ
గ వరాహంబుల వేఁట లాడ నరుగంగా నెంచితిన్ గానకున్.' 335

మ॥ అని తేఁడాడిన గృష్ణసింహుఁడును 'దేవా!చైత్ర మాసోదయం
బున, నూత్నంబుగఁ బట్టభద్రు లయినప్డున్ వేఁటకై కానకున్
జను టాచారము తొల్తనుండియు! భవచ్చాపంబునన్ నేఁడు గూ
లిన సత్వంబులఁ బట్టి భావిఫలమున్ లెక్కింత్రు క్షోణీజనుల్. 336

—: సాగరసింహుఁడు ప్రతాపసింహు నాక్షేపించుట. :—

చ॥ ఇది శుభసూచనం బిపుడె యేగుద' మంచన నెల్లవారు నొ
ప్పెద మను నంత గోడపయిఁబిల్లి విధంబున దూఁకి సాగరుం
డెదురయి వచ్చి 'యేటిపని యెచ్చటి కేగెదు రాజ్యలాభముల్
కుదిరె నటంచు సంతసము గొప్పగఁ గల్గెనె నీకు నియ్యెడన్. 337

మ॥ అరరే యాజగమల్లుఁ డోఁదరిమి యన్యాయంబునై ధారుణీ
భరమున్ గొంటివి' మంచి చెడ్డ లవి చూఁపన్ లేదె యేచట్టపుం
బరిపాటిన్ వహియించి చేసితివి! వహ్వా' నేఁటి నీనేఁత యె
వ్వరికిన్ శక్తి యెసంగు వారె నృపులన్ భంగిన్ నిరూపించెదున్ 338

చ॥ ఇది కొఱమాలినట్టి పని! యింతటి దుర్ణయమున్ గనంగ నా
హృదయము నిల్వ లేదు! నిను నిందుల నుండియు నుంత యవ్వలన్
గదలఁగ నీను! నన్నుఁ గడగాఁ దొలగించి యభీష్ట కార్య మిం
పొదవఁగఁ దీర్చు మేను మనియుండిన సాఁగవు నీప్రయత్నముల్. 339

మ॥ అని యాతండు సరోషదృష్టిని సలుంబ్రాధీశ్వరున్ జూచి 'యే
మనఁగా వచ్చును నిన్ను!నేఁడిచట సన్యాయంబు నీవల్లనే

జనియించెఁగా జుమి యిప్పు డేమనుచు మెచ్చుకొఁజేతొ లోకుల విసి
యనదే నిన్గని స్వామిభక్తియనఁ గట్టా! యిట్టిదై యుండునే. 340

గీ॥ ప్రాసపూర్వాక్షరమునందు వలె సమస్త
గుణగణంబులు నీయందుఁ గొఱఁతలేక
యలర వలెఁగాక యిటుల నిన్ననుసరించు
నతని ననవేటికో సలుంబాధినాథ. 341

—• కృష్ణసింహ ప్రభువు సాగరసింహునకు హితం బుపదేశించుట. •—

చ॥ అనుచుఁ బ్రతాపుఁజేరఁజనునాతనిఁ గన్గొని కృష్ణసింహుఁ డీ
వనుజుఁడ వామహాప్రభున, కాయన నిందలలోన నిప్పు డీ
ట్లనుచు నిరోధముగా నలుపన్యాయమె? శత్రువు లెవ్వరిట్లు రా
దని యెదిరింప రియ్యదియు నార్యులుమెచ్చు పవిత్ర కార్యమే. 342

చ॥ కలకలలాడుచున్న సభఁగల్గిన లోకుల మోము లెల్ల మం
గలముల మాడ్కినైన విచె కన్గొను దారుణమైన నీదు మా
టలు వినినంత కోపము విడన్ జను నిత్తటి శాంత మూనఁగాఁ
గలిగిన మేలు సుమ్మిపుడు గడ్డము వట్టి వచింతు సాగరా! 343

మ॥ మనమందున్ గల క్రౌర్యమున్ విడుము నామాటల్ మదిన్నిల్పు పా
వన గంగాయమున వారిపూరముల విప్రశ్రేణి మూర్ధాభిషే
చనమున్ జేసిన యీమహాత్ముని పదాబ్జంబుల్ తలన్ సోఁక నొ
క్క నమస్కారము చేయు మీతఁడు నమస్కారార్హుఁ డెవ్వారికిన్.

క॥ సరళమతిన్ యోజింపుము
ఘోర వడకుము వినవె పితృ సమో జ్యేష్ఠ యనన్
గురుఁ డుదయసింహుతో ని
ప్పురుషవరుఁడు సముఁడు నీకుఁ బూర్వజుఁ డగుటన్. 345

చ॥ కలుగఁగజేయఁబోకు సుమి గందరగోళము విన్ము నీదు మా
ట లితని సద్గుణంబుఁ బొగడన్ దగు నిందకుఁ బన్కిరావు చే
తు లితని పాదముల్ నిలుపఁ దోరపుఁ బాఱుకలైనఁ జెల్లుఁ గ
త్తులుగొని తాఁక దోసమగుఁ దోఁచిన యంతయు నీకుఁజెప్పితిన్. 346

చ॥ అని వినయమ్మునుజ్ఞ నయము నాదర మొప్పఁగఁ గృష్ణసింగు ప
ల్కిన విని సాగరుండును జలింపక "ధర్మమొకండె నేను గో
రిన' దది వీడి వీను లలరించెడు నీతు లివేల తెల్పు మే
మనెదొ! ప్రలాప నీవిపుడు న్యాయము నిల్పెదొ ప్రక్కఁకేగెదో. 347

చ॥ స్థిరగుణమాన్యుఁ డయ్యుదయ సింహ మహీరమణాగ్రగణ్యుఁ డం
దఱను సమంబుగాఁ గనిన తండ్రి కుమారుల యోగ్యతాపరం
పరలనెఱింగి రాజు జగమల్లుని జేయఁగ నానతిచ్చె! నా
పరమపవిత్ర మానసుని పల్కును నిల్పుట పుత్ర ధర్మమౌ. 348

గీ॥ ఇరువదైదుగు రైన భ్రాతృవరు లందు
జ్యేష్ఠుఁడవు! ప్రపంచము త్రోవ లెఱుఁగు పోఁడ!
వనుచితంబని తోఁపక యనుజు సొమ్ము
నపహరించితి! వింత యత్యాశ తగునె. 349

సీ॥ కనుమూసి గుడ్డ కట్టిస దేమిలేదు స
మస్త భూప్రజయు సామంత నృపులు
పరికించు నెడఁ బట్ట పగటివేళను తండ్రి
"జగమల్లు రారాజు సలుపుఁ" డనుచు
గొంతెత్తి యనె! నందుఁ గూడిన వారెల్లఁ
దలలూఁచి రిపుడు నీ చెంతఁజేరి
ప్రియభాష లాడు నీ కృష్ణసింహుఁడు గాఁడు
చిత్తంబని కరంబు శిరము వంచె

గీ॥ నేఁడుగద రాజరాజుల నిర్ణయించి
దొడ్డ యధికార మితని చేతులకుఁ జిక్కె
మీర లిరుపు రేకితమున మెదిపి మెదిపి
కార్య మిటు త్రిప్పియుంటిరి కట్టకడకు. 350

చ॥ ఇఁక నొకపేయుమాటలఁ బనేమి యిచే జగమల్లు రాజుఁ జే
యక జనకాజ్ఞ మీఱుచు దురాశ ధరేశత సంగ్రహించు నీ
వకట! మదీయ వాక్యముల నాదృతి నుంతువె తల్లిఁ జంపు వా
నికిఁ బినతల్లి చేతులు గణింపఁ జివుళ్లను చొప్పెఱుంగవే. 351

ఉ॥ ముందొకఁడాడి వెన్కకును బోయి మఱొక్కగతిన్ జరింప నా
చందము లేదు నేనెఱుఁగ స్వాంతము విప్పివచింతుఁ దండ్రియా
జ్ఞం దలఁగాల్చి ఘోరమగు సల్పము మాజగమల్లు లేనిచో
నిందలు గల్గుఁ గష్టములు నీకును బెక్కులువచ్చు నివ్వెఱన్. 352

చ॥ అని బిరుసెక్కు చూపులను నందఱుఁ జూచెడు దమ్మునిన్ గనుం
గొనుచుఁ బ్రతాపుఁ 'డోకొమర! కూడునె తొందర మంచిపెద్దలన్
మనమున నిర్ణయించి జగమల్లుని యోగ్యత నెంచి పౌరు లె
ల్ల నుడువు మాటలెంచి యిటులన్ బొనరించితి సుమ్ముసాగరా. 353

సీ॥ ఎఱుగుదు నేమన మిరువ దైదుగురలో
జగమల్లునపుఁ దండ్రి మిగులఁగూర్చి
దెఱుఁగు దాలని వసుధేశుఁ జేయుఁడటంచు
మనతండ్రి నృపులతో ననిన తెఱఁగు
నెఱుఁగుదు నెదురాడ కెల్లరు మంచిదం
చొకమాటె యొడఁదల లూఁచుటయును
నెఱుఁగుదు జగమల్లుఁ డెట్టైన మేవాణ్మ
హోర్వి నేలెదనంచు నూఁగుటయును
గీ॥ విన్ని యెఱిఁగియె నాపైన నెనఁగు భార
మవలఁ జనె నంచు నాబూ శిఖాగ్రసీమ
నేకలింగేశు చరణ నాళీకయుగము
నెడఁదఁ గొలుచు నుపాయంబు నెఱిఁగియుంటి. 354

సీ॥ అతిపూజ్యుఁ డుదయ సింహక్ష్మావరోత్తంసు
కొడుకులలోఁ బెద్ద కొడుక నౌట
మారటతండ్రి సన్న్యాస్యుఁ దీకృష్ణభూ
జాని యానతి మీఱ రాని దగుట
సామంత మండలేశముఖు లేకగ్రీవ
ముగను సింహాసనం బునకుఁ గోరఁ
బ్రస్తుతస్థితిని నీపాలన లేకున్నఁ
జెడుదు మంచని పౌరు లడలు చుండ

గీ॥ నిన్ని కష్టసుఖంబులనెంచి యెంచి
విముఖమై యున్న మనసును వెనుకఁ ద్రిప్పి
యన్న! నేఁ బట్టభద్రుఁడనైతిఁ గాని
కోరి భారంబుఁ దలను నైకొనఁగ లేను. 353

చ॥ మన జనకుండు ధాత్రి జగమల్లున కిచ్చె నటంచు విస్మయం
తనె తొలఁగెన్ దలన్ గలుగు తద్దయు భారము నే స్వతంత్ర జీ
వనమును నెందుఁగాని జరపన్ గల దేవుఁడు కూర్మిఁ జూచెఁ బో
మ్మని మది నెంతయేనియును హర్షముఁ గాంచితి సుమ్ము సాగరా. 354

శా॥ ఈమేవాడ నివాసమున్ దవిలి నేనిందున్న క్షోణీజనం
బేమాడ్కిన్ దలపోయునో మది నటంచే పక్షి యా కేగి యా
ధామాసాహి పదాంబుజంబులకడన్ వర్తింపఁ గాంక్షించి యి
ప్డే మున్మందు ప్రయాణమున్ సలుపనుంటిన్ గంటకున్ ముందుగన్

ఉ॥ అప్పుడు కృష్ణసింహుఁడు ప్రజాలి నృపాలియు వెంటరాఁగ నే
ర్పొప్పఁగ వచ్చి యూర కిటులుండఁగ నేటికి లేచి రమ్ము నీ
విప్పృథివీతలంబుఁ గొని యేలవలెన్ జుమి నీవు తప్ప మా
యప్ప యొరుల్ మహీరమణులైనను రాజ్యము నిల్వ దీయెడన్. 356

చ॥ అని యభిషేకమున్ సలిపి యర్హగతిన్ సమలంకరించి సన్
గొని యిటు తెచ్చెఁ బౌరులును గూడదు కాదిఁక సింహపీఠమం
దున వసియింపుమీ యనినఁ ద్రోయఁగఁజాలక విజ్ఞులాజ్ఞ చే
సిన యటు సింహపీఠిని వసించితి దేశము నేమ మెంచుచున్. 357

మ॥ పరమోత్కృష్ట మృదు స్వభావుఁడు సలుంబ్రాస్వామి యీధన్యు భా
స్వరకారుణ్య కళా విశేషమున మేవాల్లక్ష్మి శోభాపరం
పరలన్ గోల్పడకున్న దిప్పటికి రాణ్మందారుఁ డిప్పుణ్యు సా
గరునిన్ దూఱుచు వేళ్ళుచూపి యఱువంగాఁ బాడిమే నీకిటన్. 358

చ॥ ఎఱుఁగకయుండు వాక్కొ పురుటింటిని బాపని దాదిఁ దండ్రినిన్
మఱువఁగఁజేసి యీభువనమాన్యుఁడు నన్నును నిన్నుఁ దమ్ములం
దఱుఁ గొని యంతవారలను దద్దయుఁ బెద్దలఁ జేసి పెంచె నో
క్కరుఁ డెదురైన నేఁటికిని గొంగిటఁ జేరుచుఁ దండ్రి భంగిగన్. 359

గీ॥ పుష్పమాల్యములఁ జేర్చి పూజింపు మనుచుఁ
దండ్రి పంపఁడె సూక్తు నాతఁడు చిరాయు
వై సలుంబ్రాపురమున సౌఖ్యమున మనుట
యెవరి బలమూని? యీదన్యు కృపనుగాక. 362

క॥ పౌరుల సేమంబును క్షో
ణీ రాజ్యము సేమములును నీసేమం బా
ధీరుఁ డెఱుఁగు! నెఱుంగఁగ
నేర! వతఁడె తల్లి దండ్రి నీకున్ నాకున్. 363

మ॥ మనముత్తాత యొకప్డు చండవిభుఁ డాత్మత్యాగమున్ జేసి త
మ్మునకై రాజ్యము వీడెఁ దజ్జనకుఁ డప్పూర్వజ్యున్ సలుంబ్రావిభున్
బొనరించెన్ దదుదార వంశము యశంబున్ బొంద జన్మించె! నీ
యనఘుండున్ మనరాతచండమునఁ బూజార్హుండు ముమ్మాటికిన్.

చ॥ హిమకరునందుఁ గందుఁ గలదీశు గళంబున నల్పెసంగుఁ బం
కము కమలంబు నంటుకొనుఁ గాని జగంబులు క్రుంగినన్ గిరీం
ద్రము లవి బెండు దేలినను ధన్యచరిత్రుఁడు కృష్ణసింహు స్వాం
తమునను గం దొకించుకయుఁ దొర్కొన నేరదు కోటి చెప్పినన్. 365

గీ॥ నేను నృపుఁడనై యీతని నెత్తిఁ బెద్ద
మకుట మిడుటలే దీఁకజగమల్లుఁ డవని
నాథుఁడయి తీయుటయులేదు నడుమఁ జిక్కి
పరులచే నాఱు మూఁడును బడుట తక్క. 366

చ॥ జనకుఁడు పెద్దకాలము రుజాపరిపీడితుఁడౌట నెట్టులన్
మనమున నిర్ణయించెనొ కుమారులలోఁ బ్రథముండు తండ్రి పో
యినపిదపన్ ధరావలయమేలుట యెందును లేదె! వైపరీ
త్య నియతి నేఁడు పుట్టెనె కటా! యిది లోకము పాడియే కదా. 367

చ॥ ఇది జనకోటి కిష్టమని యెక్కటి నిత్తటి సింహపీఠి ని
య్యదనను నీకు నొక్కనికి స్వాంతము సమ్మతిఁ గాంచకున్న నే
వదలుట యెట్లు సాధ్యమగు బాలక నే నిదె శక్తివంచనల్
గాదకొననీక కష్టపడి క్షోణిని నేల బ్రయత్న మూనెదన్. 368

—• ప్రతాపసింహుని సాగరుఁడు నిలువరించుట. •—

చ॥ అని మనసారఁగా గడు నయంబును వత్సలతానిరూఢి నె
క్కొనఁగఁ బ్రతాపసింహుఁ డనఁగోపము పట్టఁగలేక సాగరుం
"డనుజుఁడ వంచు మే ల్దలఁచి యాడిన నీతల కెక్కదయ్యె రా
జ్యనియతిముందు నీతులు విసంబుగఁ దోఁచెనె నేఁడు నీకిఁకన్. 369

సీ॥ బహుకాలముగను మేవాడ్దేశమేలిన
జనకుండు దీర్ఘ రుజాపరీతుఁ
డై యెట్టులో నిర్ణయ మొనర్చె నఁట నతఁ
డన్యాయవర్తనుఁడంట యణువు
మొదలుగ బ్రహ్మాండమును మ్రింగి త్రేఁచెడి
యీకృష్ణసింహుఁ డస్తోక ధర్మ
నిరతుఁడౌ నఁటమీర లిరువు రేకంబయి
ధర్మదేవత భారతంబు నుండి
గీ॥ లేవఁగొట్టంగఁ బుట్టు కలిస్వరూపు
లని తెలిసెఁ బట్టపగలు ప్రజాలి యెదుట
నింద్రజాలము నొనరించి యిట్టుల కినుఁ
ద్రామఁగలిగితి రేమనవచ్చు మిమ్ము. 370

మ॥ సదయుం డాజగమల్లునిన్ బిలిచి రాజ్యంబిమ్ము కాదేని నేఁ
గదసంబందునఁ దాఁకి లోక మలరంగా ద్వంద యుద్ధంబుఁ జే
సెద నీతోడ మదీయ మానసము కొంచెంబైన ధర్మంబు మీ
ఱదు ప్రాణంబు లశాశ్వతంబు లగు ధర్మంబే చిరస్థాయియౌ 371

మ॥ అవనీరాజ్యము నిత్తువో వివిధ శస్త్రాస్త్రంబులన్ దాల్చి యా
హవరంగంబున నన్నుఁ దాఁకెదవొ యీ యర్థద్వయంబందు నీ
వవలంబింపు మొకండు లేనియెడ శౌర్యస్ఫూర్తి నిట్టట్టులన్
లవమైనన్ గదలంగనీ నిపుడె తెల్పన్ బోలు నీభావమున్. 372

క॥ అని బిట్టుబిగిసి తనమో
మునఁ జూడ్కులు నిలిపి యుద్ధమును గోరెడు త

ముమ్మనిఁ గనుఁగొనుమఁ ప్రతాపుం
డౌ గాంభీర్యప్రధానుఁడై జనులు వినన్. 373

మ॥ "అడుగైనన్ గదలంగనీని శ్రమ మేలా రాచపుట్టొందు నే
వ్వఁడుగానీ రణమన్నఁ బండుగనుచున్ ధావించు నీయందఱున్
గడుహర్షంబునఁ దెచ్చి నాపయినఁ జక్కన్ నిల్పి రీ రాజ్యమున్
గడఁదోఁయన్ జన దట్టులౌట రణమే కర్తవ్యమై కన్పడున్." 374

మ॥ అని యప్పప్పుడె మధ్యమందున సలుంబ్రాధీశుఁడున్ గట్టియుం
చిన నాగేంద్ర సమాన ఖడ్గమునకై చేసాఁచె నాసాగరున్
గని సామంతులు భూపజానివహముల్ 'గట్టా' యితం డేడ వ
చ్చెనొ పిడ్గున్ బలె మామనోరథము భస్మీభూతమైపోవఁగన్. 375

చ॥ కనికర మన్న మాటను జగంబున నీతఁడు విన్నయట్టులన్
గనఁబడఁ డుండుఁజేరియు ఢిణంబు రణంబనుచున్ క్షణక్షణం
బు నడుపు స్థానమో సమయమో గ్రహియింపఁడు వాని కేమి గె
ల్చిన సకలావనీభరము చేపడు నన్న దురాశ తక్కగన్. 376

మ॥ అమిత ప్రాభవ మొప్ప నిప్పుడు సలుంబ్రాధీశుఁ డాస్యంబు నం
దమునొందన్ నెలకొల్పు నాతిలకమున్ మట్టారదే ద్వంద్వ యు
ద్ధము రానేల ప్రతాపుఁ డేటికి సమాధానంబు సూచింపఁ గ
ష్టములన్ దెచ్చె నితండు వద్దనుచు నాజ్ఞాపింపఁగా రాదొకో. 377

మ॥ కులశైలోపమ ధైర్యభూధవ శిరః కోటీర కోటీ మణి
జ్వల దారక్తరుచుల్ పదంబులు వహించన్ జూచియున్నట్టి క
న్నులతో దారుణ సంగరాంగణమునందున్ ఖడ్గముల్ చీల్పఁగా
వెలికిన్ సాఁకెడు క్రొత్త రక్తములనున్ వీక్షింప నానేమొకో. 378

మ॥ అని యిట్లంచు వచింపరాని ఏడుఁ జింతావేశ దైన్యంబులన్
గని దుఃఖింపఁగఁ గృష్ణసింగు రణమే కర్తవ్యమే వేఱు త్రో
వ నిరూపింపఁగరాదె యిప్పుడిపుడే పట్టాభిషేకంబు శో
భనమై సాఁగెను యుద్ధ మెట్లయిన నిల్పన్ ధావ్యమౌ నిమ్మెడన్. 379

చ॥ అనఁగఁ బ్రతాపసింహుఁడు "మహాత్మ భవద్వచనంబు మానసీ
యనియతి నొప్పు నైన నౌరుఁడాహవమున్ బొనరింపఁగోరి పి

ల్చినను నిరాకరింపఁగల లేఁతమనం బదిలేమి; కాని మీ
రనినటు లిట్టిసౌఖ్య సమయంబున నెట్లని యెంత కగ్గెడున్. 380

క॥ దండించుట క్రౌర్యమ్మగు;
దండింపమి దుర్బలతకుఁ దావగు; నవనీ
మందనగు నేఁటి సాస్థితి
యొండేటికి సున్నితముగ నున్నది తండ్రీ. 381

మ॥ సరి యీమంగళ వేళయందు రణమున్ సాగింప కొండొక్కఁడా
కరణిన్ గార్యముఁ దిప్పి యాతనిఁ దొలంగన్ జేతుఁబొమ్మంచు "సా
గర! చిత్తూర్పుర రాజ్యమెల్ల మదుదగ్రస్ఫార బాహాబల
స్ఫురణన్ రక్షణసేయ నెంచితి శుభంబుల్ నేఁడు సంధిల్లఁగన్. 382

మ॥ అనిశ ప్రేమ వెలుంగ సయ్యుదయ సింహాఖ్యావరుండీ మహా
వనిఁ బాలించె యశంబు గాంచెను; సలుంబ్రానాథుఁ డాలాత పో
యినవెన్కన్ దనకున్ లభింపఁగల ప్రత్యేకాధికారంబు పే
ర్మిని సన్నిధకుఁ దోడితెచ్చుచు ధరిత్రీనాథుఁజేసెన్ వడిన్. 383

మ॥ ఎవఁడో యొక్కఁడు రాజుగా నిలిచి యుప్పృథ్వీస్థలిన్ వాని శ
క్తివిశేషమ్మున నేలు టొప్పుఁ బ్రజ భక్తిన్ వాని యాజ్ఞాబలం
బవలంబించుట యొప్పు లేనియెడఁ జీకాకై విపత్కోటిచే
నవరుద్ధంబగు రాజ్య మెవ్వనికి వ్యాదై యేలఁగాఁ బూనినన్ 384

ఉ॥ ఓరువరాని కార్యమిది యోలక కావరమూని నీతి వి
ద్యా రమణుండు కృష్ణవిధు నాడితి నోరికి వచ్చినట్లు! నా
తో “రణ మాచరింపు” మని త్రుళ్ళుచు నాదు మహాధికార ధి
క్కారము చేయుచుంటి విఁకఁగాదు సహింప భవత్ప్రవర్తనల్. 385

—•• ప్రతాపసింహుఁడు సాగరసింహుని దేశభ్రష్టుఁగావించుట ••—

మ॥ నిను వీక్షించుచు నా ప్రజల్ సుగుణ నిష్ఠిత్రుల్ భవద్దుష్ట వ
ర్తనమున్ నేర్చిన నేర్పు కావున నినున్ దండింపఁగా నొప్పు వే
చను నాదేశము వీడియిప్డె పరరాష్ట్ర శ్రేణులన్ జేర నో
ర్చ నిమేషం బిటనాలసించినను శీర్షచ్ఛేదమున్ జేసెదన్. 386

మ॥ ఇది నాయాజ్ఞ బహిష్కరించితిని నిన్నీదేశమం దెచ్చటన్
మెదలన్ బోకన సాగరుండు నగి స్వామీ! చాల సంతోషమై
నది! రాజ్యం బిది యెంత తీపనుచు దెందంబందు దావించితో
విదితంబయ్యె సమస్త భూజనులకున్ బెక్కేల వాక్రువ్వఁగన్.

మ॥ ఇది నాయా రిది నాదు రాష్ట్రమనుచున్ హీనుల్ మఱిన్ దుర్బలుల్
మద సూహంతురు కాని విక్రమకళాలంకారులౌ వారి క
య్యుదయాస్తాచల మధ్యగం బయిన సర్వోర్వీతలంబున్ ముదా
స్పదమౌ కొంగుపసిండి వోలెఁ దమదై భాసిల్లు నెల్లప్పుడున్. 388

మ॥ పరమ ప్రాభవ సంపదల్ విడిచి మేవాడ్దేశ మందుండఁగా
నెరియున్ నామది నీవు శత్రుఁడగుటన్ నీవారలున్ శత్రులౌ
దురు నీకెప్పుడు గర్భశత్రుపులు మిత్రుల్ నాకు నట్లౌట మ
చ్చరణంబుల్ క్షణకాలముంచదుఁ జరించన్ నీదు రాజ్యంబునన్. 389

సీ॥ పనియేమి పరభూమిపతుల సీమల కేగ
మేవాడ నెపుడెప్డు మ్రింగుదునని
కనువైచియుండు నక్బరు ధరామండలా
ఖండలుం డాతని కడకుఁ బోదుఁ
ద్వద్వికట ప్రవర్తనమున నతనికి
మిత్రలాభముగల్గు మేర యెదవె
నిప్పుడ పయనించి యేగెద ఢిల్లీపు
రమునకుఁ గొన్నిదినముల లోన

గీ॥ హెచ్చరిక గల్గి రాజ్యంబునేలు చుండు
మిదియె శాశ్వత మనియుండకెప్పు డెవ్వ
డెచట నేరీతి నిన్ను జయించి దాని
నపహరించునో తెలియఁబోదజున కైన. 390

మ॥ అని గాంభీర్య మెలర్పఁగా బలికి యశ్వారూఢుఁడై పోయె నా
తని వీక్షించుచుఁ గొంతసేపటికి యోధశ్రేష్ఠులున్ బెక్కురున్
దనవెంటన్ జనుదేర నయ్యెడ నరణ్యప్రాంతమున్ జేరఁగాఁ
జనె వేఁటాడఁ బ్రతాపసింహుఁడు జనుల్ సంతోషమున్ బొందఁగన్.

ఉ॥ కొమ్ములులేని యమ్మహిషకోటులు తొండములేని భద్ర నా
గమ్ములుం నాఁగ నొప్పు పసిఁ గన్న మత్తమహావరాహపో
తమ్ముల నా ప్రతాపుఁ డతిదారుణ లీలల నేఁటులన్ శరీ
రమ్ములు గాడఁగాఁ బొడిచి రాసులు రాసులు వోసె నేలపై. 392

మ॥ అరుణాంశుచ్ఛట లీన నేత్రములు ఘోర్యాటోప మేపార సు
గ్రరసోద్రేకమునన్ బ్రతాపధరణీకాంతుండు సద్గాత్ర సం
భరితుం డెత్తిన యీఁటె దింపక మహామోహాతిరాతుం డటుల్
నిరతోదగ్ర విహారముల్ నెంపి ఖండించెన్ వరాహమ్ములన్. 393

మ॥ తగుసామంతులు వీరయోధమణులంతన్ వారి నొక్కొక్కికిన్
దగు చందంబున నొక్కచోఁ గదిసి కాంతారంబునన్ గల్గు నా
మృగసంతానములన్ క్షణంబునను భూమిన్ గూల్చి పెక్కింటిఁ గు
ప్పగఁ దామొక్కెడఁజేర్చి రారుధిరముల్ పాఱంగఁబెన్కాల్వలై. 394

చ॥ అరిదిజవంబు మీఱ మృగయారతి సాఁగఁగఁజేసి నిల్పి స
త్వరగతి లెక్కసేయఁగఁ బ్రతాపుఁడు గూల్చు వరాహపంక్తి యం
దఱు సమయించు సమ్మృగవితానము మీఱుటఁజూచి హర్షముల్
వఱలఁగ "మంచికాలమిదివచ్చు" నటంచుఁ దలంచి రందఱున్. 395

మ॥ శిపుముత్తైదువ ప్రీతి కేకలములన్ జెందాడి సామంత భూ
ధపులున్ యోధులు నూతనోత్సవ సముద్యత్కాంతులై భూమియున్
దివియున్ గ్రిక్కదలంగ నార్చుచుఁ గడున్ దేజంబు దీపింప ను
గ్రవనంబున్ విడి రాజధానినిఁ జేరంగాఁ బోయి రొక్కుమ్మడిన్. 396

సీ॥ చిత్తూర్పురము శత్రుఁ బేఁబడి రాజ్య భా
గము తద్ద పెద్దదిగాని యున్నఁ
దమదేశ సామంత ధరణీశు లొక్కొ రా
క్కరుపోలు యక్కరుఁ గలియు చున్నఁ
గడలేని యుద్ధసంఘర్షణంబులఁ దమ
దేశమంతయుఁ బిప్పిదేలి యున్నఁ
బరిపంథియో నభోభాగ భూభాగముల్
తలక్రిందు చేసెడి 'బలియుఁడైన

గీ॥ దమమది హరించు ఘనుఁడు దుర్దాంత తేజుఁ
డర్కకుల వర్ధనుఁడు సుగుణాంబురాశి
యాప్రతాపుఁడు రాజౌట హర్ష పరత
మించిమిన్నంది ప్రజ రమియించె నపుడు. 294

గద్య:- ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవర్ణావ్య నిర్మాణ చాతురీ ధురీణ, సుగుణ గణపారీణ, దుర్భాకవంశ్య దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయని గోత్ర పవిత్ర, సుజనజనానుగ్రహ పాత్ర, వెంకటరామార్య పుత్ర, కవి సార్వభౌమ - సాక్షాద్వీరప్రతాపాది వింశత్యధిక బిరుద విఖ్యాత, సుకవి రాజశేఖర, రాజశేఖరకవి ప్రణీతంబైన రాణాప్రతాపసింహ చరిత్రంబను పద్య కావ్యంబు నందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీ

రామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర

## ద్వితీయాశ్వాసము

---

మ॥ వరసౌఖ్యంబులకున్ నిరోధమగు నేర్పాటుల్ దొలంగించి సు
స్థిరతన్ బెంచు వ్యవస్థలన్ దిటముగాఁ జేకూర్చుచున్ సత్య ధ
ర్మరతుల్ మీఱఁగ రాజ్యమేలు కొనుచున్ రాణాప్రతాపావనీ
శ్వర మందార మొకానొకప్పుడు సలుంబ్రాభర్త నీక్షించుచున్. 1

{ సూక్తసింహుని రాజధాని కంపుమని ప్రతాపసింహుఁడు కృష్ణసింహు నర్థించుట. }

ప॥ "మొదలన్ నెత్తురు పంచుకొంచు మనుజుఁడై పుట్టొందె, నాపైన బా
ల్యదశన్ బైనను బ్రక్కనున్ బడుచుఁ దుల్యప్రేమతో మైత్రికా
స్పదమై వర్తిలె, సూక్తుఁ డొక్కత్రుటి నన్ బాయం డొకప్డైనఁ ద
ల్లిదరిన్ జేరఁడు ప్రాణ మొక్కఁడు నొడల్ రెండైన యట్లుండెడిన్.

గీ॥ రాము నుపమ నాయెడఁ బల్కరాదు గాని
తెప్పవాల్పక కనుపెట్టి రేయుఁ బవలు
ననుచరుండయి నన్గొల్చునపు డతఁడు ని
జంబు మూఁడుమూర్తులకు లక్ష్మణుఁడెసుమ్ము. 3

గీ॥ సూర్యవంశ ప్రదీపుఁడౌ సుతు విపత్తుఁ
బాపి కాపాడి తనుచు నీభవ్య యశము
నలుదెసలఁ బ్రాకె సూక్తుఁ డనంతకోటి
జన విజయ సూక్తుఁడగుచుఁ దేజమునఁ బెఱిఁగె. 4

గీ॥ అటఁ దడుగు మోపు సమయ భాగ్యమునఁ జేసి
యెంతకాలమొ సంతాన మెఱుఁగకుండి
కడుపు ఫలియించి కొమరులఁగనియె నీదు
దొడ్డయిల్లాలు జగము సంతోషమంద. 5

చ॥ ఎఱుఁగుదు రెంతొ సౌమ్యముగనేను వచించిన మౌర్ఖ్యమూని సా
గరుఁడు సభాముఖంబుననె కాఱులు ప్రేలుట దానఁ గోప వి
స్ఫురణను దేశమున్ విడిచిపొమ్మని పంపితిఁ గాని కూర్మి సో
దరు నెడవాటుచే మది యధాయదలై చనె నేమి తెల్పుదున్. 6

గీ॥ సూక్త నంపుము; చెంతనుంచుకొన నెంతు
నెచట నున్న నీవాఁడు గాఁదే యతండు
నేను మొదలుగ నీరాజ్యమెల్ల యుష్మ
దమృత హస్తాభిరక్షితంబగును గాదె 7

మ॥ అని యెంతేనిఁ బ్రతాపసింహుఁడను దన్నర్థింపఁగాఁ గృష్ణసిం
గను మోమున్ వికసింప "దేవ! నిను నిత్యంబున్ మహాభక్తి నె
క్కొనఁగాఁ గొల్చుటకన్న నొండుపని నాకున్ హర్షదంబౌనె యెం
దును నీయానతి వేదతుల్యమని తాల్తున్ నేను శీర్షమ్మునన్. 8

శా॥ నామాటొక్కఁడిదేల; నేను,సుతులున్ నాబంధులున్ నాసలుం
బ్రామాన్యావని రాజ్యలక్ష్మియును సర్వస్వంబు నీచేతిదే
యీమే నియ్యెలలోన నుండువఱ కిట్లే సాఁగినన్ జాలు; నా
స్వామిస్నేహము ప్రోలఁ దుచ్ఛములు సప్తద్వీప సామ్రాజ్యముల్. 9

గీ॥ వత్సరమున నార్నెల్లు తావక సమక్ష
మందు నేనుందు; నాసమయంబునందు
దేవ నీమృదు పాద రాజీవయుగము
సూక్తు వదనారవింద మేఁజూడఁ గందు. 10

చ॥ అనుచుఁ బ్రతాపసింహ వసుధాధిపసింహు ననుజ్ఞ నొంది శో
భనతర లక్షణాన్వితమువార్వము నెక్కి నిజాప్త యోధులున్
దను గొలువంగ నాత్మ సదనంబును జేరి లతాంగి సమ్మతిన్
గొని కొనివచ్చెసూక్తు రిపుకుంజరసింహుఁ బ్రతాపుజేరఁగన్. 11

గీ॥ తావియును బూవు వెరణి సోదరు లిరువురు
కలిసి రాగ రంపాతి సంకలనఁ బెరసి
యేకమతు లేక వాక్కులై యెల్ల రలర
నొండొరులు వాయ కొక్కఁడ్రై యుండి రపుడు. 12

— వసంతోదయము —

గీ॥ పల్లవ వ్యాప్తి పుష్పవద్వైభవంబు
ఫల నవోదయ ఘాతి కొమ్మలకుఁ గూర్చి
మాధవ గృహీతయుగు మధుమాస లక్ష్మి
యఖిల జగము పూఁదోఁట యట్లలరఁ జేసె. 13

— సలుంబ్రాకృష్ణసింహాదు లుగాదికానుకలు గొని వచ్చుట. —

మ॥ తలపైనన్ మగటాఁదురాయి వెలుగొందన్ ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల దొడ్డ నునుతేజీలెక్కి యోధాళి చెం
తల నేతేరఁ బ్రతాపసింహుఁ గొలువన్ నానా మహీమండలేం
ద్రులు వేంచేసి రుగాదికానుకలు దొంతుల్ దొంతరల్ తెచ్చుచున్. 14

శా॥ లోకైక స్థిర విక్రమక్రముఁడు సుశ్లోకుండు చందేళ వం
శాకల్పుండు శిశోదియాభిజన దుగ్ధాంభోధి చంద్రుండు ని
ర్భీకస్వాంతుఁడు స్వామిభక్తమణియన్ పేర్గన్న వాఁడా సలుం
బ్రాకృష్ణుం డరుదెంచె స్వామి చరణద్వంద్వంబు సేవింపఁగన్. 15

గీ॥ ధీరలోకైకమౌళి ఝాలూరి నృపతి
సోనెగుఱ్ఱ కులాంభోధి సోముఁడై స
ఘానుసింహుఁడు వేంచేసెఁ గానుకలుగఁ
జారు నవరత్న దివ్య భూషలను గొనుచు. 16

గీ॥ ముందుఁ జిత్తూరి రణమున భూమి వడఁక
మెలఁగు జయమల్ల సుతుఁడు దోర్బల యుతుండు
తేజసింగు రాఠోడ్వంశ దీపకుండు
తరలె బదనూరి నుండి ప్రతాపుఁ గొలువ. 17

క॥ ఝాలాకులేంద్రుఁడు మహో
త్తాలమగు సమాలుదాల్చి తపనీయ విభూ
షాలిఁగొని శ్యామసింహుఁడు
హేలాగతి స్వాద్రినుండి యేతెంచె వడిన్. 18

ఆ॥ స్వామిభక్తి యుగ్గు పాలతోమఱఁగిన
సావనుండు ధేలవార నృపతి
యరుగు దెంచె నప్పుడా మనస్సింహుండు
ంయుతేని మనసు కాన్కచేయ. 19

గీ॥ మదన మాధవు లటుగాఢ మైత్రితోడ
వెలయు బేడ్లా—కొఠేరియా పృథ్వినాథు
లాప్రతాప మహీంద్రు పాదాంబుజములఁ
జేరి సేవింప నెంచి వెంచేసి రపుడు. 20

మ॥ విమలారణ్యమనోజ్ఞవస్తువితతుల్ పెక్కుల్ రహింపన్ స్వతం
త్ర మహీరాజ్య రమాధురంధరుఁ డహార్యస్థైర్యుఁ డాపద్విప
త్సమద వ్యాఘ్రమహా కిరాతుఁడు కిరాతస్వామి యాభీమచాం
దమల స్నేహమెలర్ప వచ్చెను బ్రతాపాధీశ్వరున్ జూడఁగన్. 21

మ॥ తనసామంతుల గారవించి ముదమందన్ జేసి యాదాల్క మి
త్రుని భిల్లేశ్వరు భీమచాందుఁ గడు సంతోషంబు నొందించి మ
న్ననలన్ దన్పి ప్రతాపుఁడంతట నపర్ణాదేవికిన్ బ్రీతిగా
వనికిన్ బోవలె వేఁటలాడ" ననియెన్ వారంద"రౌనౌ" ననన్ 22

—॥ సామంతరాజ సహితుఁడై ప్రతాపసింహుఁడు వేఁటకు వెడలుట

సీ॥ చైతకింటపేడు నాజానేయమున మహో
దాత్తుండు రాణా ప్రతాపసింహుఁ
డాతనికిడ నుత్తమాశ్వంబు పైధీరుఁ
డినకోటి తేజుఁడా కృష్ణసింహుఁ
డితని చేరువ వాజినెక్కి గ్వాలియరు మ
హామహీనాదుండు రామచంద్రుఁ

దళనిష్క్రమణ సముద్ధత హాయాహుఢుండై
ఘూర శిఖామణి యూక్తసింహుం

గీ॥ దతని చెంతను ఘానుసిం గతని పొంతఁ
దేజసింహుం డీతని కుడిచెసను శ్యామ
సింహుం డతని పిఱుఁద మనస్సింహుం డవలఁ
దర తమ స్ఫూర్తి వెడలి రందఱును గలిసి. 23

మ॥ నుదుటన్ దొడ్డ విభూతిరేఖ కటియందున్ శాటి కంఠంబునన్
రుదురాకల్గల పేరులున్ ముఖమునందున్ బ్రహ్మ తేజోగతుల్
పొదలన్ రాజపురోహితాగ్రణి జగత్పూజ్య స్వభావుం డవా
ర్యదయుండౌ హరభట్టునున్ వెడలె దివ్యాందోళి కారూఢుఁడై. 24

చ॥ వెలిజిగివల్వలన్ దొడిగి శ్వేతహయంబులు నెక్కి యెప్పు క
త్తుల తెలికాంతి పుంజములతోఁ జను నాశ్వికు లొప్పి రయ్యెడన్
గొలకున గుంపుకట్టి చనుకోమల రాజమరాళముల్ వలెన్
బలుచని గాలిసోకుల శుభంబుగఁ దూఁగెడు పూలగుంపటుల్. 25

గీ॥ పణవ రవము భేరీధాంకరణ రవంబు
తప్పెటల బూరగొమ్ముల ధ్వానములను
బూరటిలి రోదసిఁ బగిల్చి సిరఘులను
గలఁచు గతి మిన్ను మన్ను నేకముగ మ్రోసె. 26

గీ॥ వనము వలయాకృతిగఁ జుట్టుకొనుచు నిలిచి
యలబలంబుల నొనరించి యల బలంబు
భీకరాట్టహాసములతోఁ బిలిచి పిలిచి
తట్టి తట్టి మృగాళి సంతతను లేపె. 27

గీ॥ భయద వార్షుక మేఘ గర్భంబు వెడలి
వివిధముఖములఁ బరతెంచు పిడుగు లట్లు
చిమ్మఁచీకట్లు క్రమ్మ వనమ్మునుండి
ఘాతుక మృగాళి నానాముఖముల వెడలె. 28

ఉ॥ ఎత్తిన హస్తయుగ్మముల నీఁటెలు ముందుకుఁ జాల్కఁబట్టి య
త్యుత్తమ మంజులాశ్వముల నూల్కొని పాఱఁగ హెచ్చరించి రే
కెత్తు మహోత్సవస్ఫురణ నెల్లరు నొండొరుఁ బిల్చుకొంచు రా
హుత్తులు ముందుకున్ వెడలి రుగ్ర మృగావలులన్ వధింపఁగన్. 29

చ॥ సకల దిశావకాశముల శాత కృపాణ సముజ్జ్వలాయుధ
ప్రకరముతోడ దూఁకు భటవర్గముఁ దప్పుకొనంగ లేక దా
మొకఁడును రెండు మూఁడిటుల నుగ్రమృగంబులు గుంపులై యొకా
నొక భటుమీఁదికిన్ గవియు చుండుట చూడఁగ వేడుకై తగెన్. 30

మ॥ ఒకపర్యాయమె యొక్కచోటనె మహాయోధుం డొకొక్కండు కుం
తకృపాణాదులఁ బర్వఁజేసి మృగసంతానమ్ములన్ గూల్చి యీఁ
టె కొనన్ వాని గుదుల్ గుదుల్ గొనుచు నట్లేవచ్చు నాదృశ్య మిం
చుకచూడన్ గనులున్న భాగ్యమనితోఁచున్ గాదె యెవ్వారికిన్ 31

వేఁట చాలించి కూర్చుండిన రాజపుత్ర సైన్యమధ్యమునకు
వరాహము వచ్చుట.

మ॥ తమకుంతంబులు దీర్ఘశూలములు వ్యర్థం బింతయున్ గాక సా
ర్థములై యొప్ప మృగంబులన్ దునిమి వీరశ్రేష్ఠు లక్కానన సా
శ్రమమున్ బోలె రచించి వేఁట నపుడేచాలించి రంతన్ వరా
హమొకం డయ్యెడ కేగుదెంచి జనమధ్యంబందు దూఱెన్ వడిన్. 32

మ॥ ధనురస్త్రంబులు బట్టి ఖడ్గములు చేతన్ దాల్చి యుత్సాహ వ
ర్ధనులై యెల్లరు చూచుచుండఁగ నమందస్ఫూర్తి నద్దానిఁ గూ
ల్పను శక్తుండు ప్రతాపుఁ డశ్వములపై లఘించి రాక్రోడమున్
జనియెన్ గుమ్మరసారె యట్లు భటులన్ బల్మాఱునున్ జుట్టుచున్. 33

చ॥ ఒక మొగమై పెనంగుచు మహోన్నత రోషము తోడ భీకరాం
బకములు పర్వఁజేసినను బందియు సక్షత భూరిగాత్రమై
సుకముగఁ బాఱుచుండె నిదిచూచి సహింపక వార లిర్వు రా
క్కొక రొక మోముగాఁ దిరిగి యుగ్రతఁ దాఁకిరి క్రోడ పోతమున్.

క॥ వెనుక ధనంజయ విక్రమ
ఘనుఁడగు శక్తుండు ముందుగా ఫాలవిలో

చస సప్పృథుండు ప్రతాపుఁడు
చని మోదరి సూరకము నిశాతాస్త్రములన్. 35

— సూక్తసింహుఁడు ప్రతాపసింహునితో వాదించుట —

క॥ ముడుచుకొని పంది పుడమిని
బడి నీల్గెఁ; బ్రతాపసింహ వసుధావరుఁ డ
య్యెడఁ జేరెఁ; దక్షిణమ సూ
క్తుఁడు దూఁకెను "బంది నాదితోలఁగు' మటంచున్. 36

క॥ "కాదిది నాచేఁ బడె; నీ
యేదు మొగము వగిలి కూలె; నిదె గనుఁగొనుమీ
నాదు దెస పురోభాగము;
నీది వెనుక; ముందుఁ దగులునే నీశరముల్. 37

గీ॥ అని విభుండన సూక్తుఁ "డయారె! పంది
యెపు డెచట నెట్లు తిరిగెనో యెవ రెఱుఁగుదు
రిందు నీదని వ్రాసితే యేమి గుఱుతు
నాది గాదన దృష్టాంతమేది" యనియె. 38

గీ॥ "పనికిమాలిన పందికై యన్నృప మాడె
దిలయుఁ గ్రుంగెనె యంభోసు లింకెననెనె
వెల గలుగు వస్తువేయైన వెనుకఁ బడెదె
కోటి యన్నృతములేనిఁ బల్కుటకుఁ గాని". 39

క॥ అని సిలుచున్న ప్రతాపునిఁ
గని సూక్తుఁడు 'పంది నేమిగాఁ దలచితివో
మును దానికై పెదా పా
ర్థునితోఁ బోరాడె శంకరుఁడు ఘోరముగన్. 40

గీ॥ తలఁపు లోకఁడైన లవము భేదమును రాదు
కౌస్తుభంబైనఁ జను జిల్లిఁగవ్వ మాడ్కిఁ
బౌరుషము మాట పట్టింపు వచ్చినపుడు
గడ్డిపోఁచయె మేరువై గణుతిఁ గాంచు. 41

శా॥ పలుకఁగా బూనిన విల్వనుఁగా గుఱిఁచి మేవాడ్రాజ్యముఁగాబోలఁగాఁ
గల భాగ్యం బిల లేదు; సోదరకృతఘ్నత్వంబునున్ మీఱఁగాఁ
గల పాపంబును లేదు; నీతులను బల్కన్వచ్చు; నెవ్వారు వా
రల తప్పుల్ గ్రహియింతురే! జనుల మర్యాదల్ కడుఁగా జిత్రముల్. 42

సీ॥ విశ్వస్తుతాఖండ విక్రమక్రముని సౌ
మ్మవని రాజ్యవిభూతియందుఁ బ్రబుధులు
మనకోన విక్రమ మహిమఁ బూజ్యుం డెవఁ
డతఁడె మేవాల్లక్ష్మి కర్త భర్త
కాని నీవాకఁడవే గళమునఁ బాశీఁగూ
ర్చిన భర్తగావు; నీఁగా బ్రమింగఁగలుఁగు
పోటరు లుండక పోరు; నీ నెత్తిని
బొడవైన యొక కొమ్ముపుట్టె నొక్కొ
గీ॥ యేను దప్పిన నీరాజ్యమేలు ఘనుఁడు
పుట్టఁడని యెంచినావు నీముఖమునందె
ప్రొద్దు పొడుచునె యిటు లేని పోని దురభి
మాన మూనితి; వీఁకనైన మానుటొప్పు. 43

క॥ పదికోట్ల మాటలేటికిఁ
గుదురుగ వాదంబు మాని క్రోడంబు నొసం
గుదువో నాతో మార్కొని
కదనము చేసెదవో తెల్పఁగావలె ననినఁగా. 44

చ॥ "కలఁగెనొ ప్రజ్ఞ లేక చెడుకాలమె వచ్చెనొ స్నేహ మెంతయుఁగా
వెలసిన యన్నదమ్ములకు నిప్పువిధాన మనోవిభేదముల్
గలిగెను జూచుచుండనె యకారణ వైరము లిట్టివే కదా
ప్రళయమువచ్చె:మాన్పఁగ నుపాయముదోఁపద యేమిసేతుమో.' 45

క॥ అని పుట్లకొలఁదిగా విస
మును గడుపులఁ బోసినట్టు పొగులుచు దృష్టుల్
మొనయించి రంద ఱొక మొగ
మునను సలుంబ్రాధినాథు ముఖ కమలమ్ముపై. 46

—• సలుంబ్రా కృష్ణసింహుఁడు సూక్తసింహునకు బుద్ధి చెప్పుట. •—

ఉ॥ ఆతఁడు లేచి సూక్తు దరియన్ జనుదెంచి "శిశోదియాకు లో
బ్భాతులు పూర్వజున్ గనిన మ్రొక్కఁగనేర్తురు కాని యెన్నఁడున్
నీతి తొలంగి తిట్టఁగను నేరరు; క్రొత్తలు తెచ్చి పెట్టి మా
చేతములన్ దహించితివి చెప్పెడి దేమిఁక నీప్రవర్తనల్. 47

చ॥ శివశివ! యెట్టిపాతకముచేసితి దేవుని దిట్టి కొట్టు దా
నవు లయినన్ మహోన్నత గుణంబులఁ బొల్చిన యగ్రజన్ము పా
దవనజముల్ భజించి నుతిఁదన్పుదురే గురుతుల్యు జ్యేష్ఠు ని
ట్లవినయబుద్ధివౌచుఁ దెగనాడుచు ధర్మముఁ బూది గల్పెదే. 48

మ॥ అనురాగాంబుధి స్వామికాళ్ళఁ బడుచున్ బ్రార్థించి మూన్నాళ్ళు నీ
వనుతాపమ్మునఁ గ్రాఁగి పస్తువడి ప్రాయశ్చిత్తమున్ జేయకుం
డిన మేవాడధరిత్రి నెందరిగినన్ నీవిందురా పూరుషుం
డనువారుందురె! యెవ్వ రోర్చెదరు కట్టా స్వామి ధిక్కారమున్. 49

మ॥ మనవంశంబున నెన్నఁడున్ గలుగ దీమర్యాద; యన్నన్న! నే
మని యన్నప్పుడె నాసమక్షమున నస్మత్స్వామి నిందించు నీ
వనుకంపార్హుఁడ వౌదె! వధ్యుఁడవు బాల్యంబందు నిన్నెత్తి పెం
చిన దోషంబున నోర్చుకొంటిఁ! గడునొచ్చెన్ జేవ మిప్పట్టునన్.50

—• సలుంబ్రా కృష్ణసింహునెడ సూక్తిసింహుఁడవినయముఁ జూపుట. •—

మ॥ అని వాత్సల్యముఁ ద్రుంపలేక యిటు న్యాయంబాడు నాకృష్ణునిన్
గని సూక్తుండను 'బిల్లికిన్ జ్వరమనంగాఁ జెల్లె. నీమాటలన్
వినఁగా నోపను; ప్రేలాప విధునిన్ నేమ్రొక్కఁగా నోపఁ బం
ది నెటుల్ వీడఁగనోప; నోప రణమెంతేనిన్ విసర్జింపఁగన్. 51

ఉ॥ గుట్టుగ మీర లిర్వురనుగూడుచు నాజగమల్లు బాధ్యతల్
మట్టిని బెట్టి రాజ్యరమలాగుబెఱుంగదె లోక! మందఱన్
గుప్పెడు తేలు 'ధర్మమిదిగో' నని చూపిన యట్టులయ్యె నీ
కిట్టటులాడె బుద్ధి కడువృద్ధవు నోరు మెదల్ప కుండుమీ. 52

మ॥ సిరి వీరున్ వెదకున్; ఘనుల్ బెదరి యిస్సీ! మూలలన్ దాఁగఁబో
రురుశౌర్యోజ్జ్వలు లిందుఁ గల్గ మగలం దొక్కొక్క మాతొక్కరె

వ్వరిసేఁ బూన్పుము చేండిపై చెదఁ బ్రతాపస్వామి మద్విక్రమం
బెఱుఁగుఁజ్ బైఁబడఁ డీవు సాయమయిరమ్మీ చూతునాయుద్ధతిన్. 53

మ॥ అని గర్వించెడు సూక్తునిన్ గని సలుంబ్రాధీశుఁ "డేమంటి ని
న్ననఁబాపం బిసుమంత యోర్వ గురుధిక్కారాఘమున్ నిన్నుఁ బెం
చిన వాత్సల్యమునైనఁ జూడక శిరశ్ఛేదంబు గావింతు ని"
ష్ఠని ఖడ్గంబుఁ గొనన్ బ్రతాపుఁడు రయంవారన్ సమీపించుచున్. 54

(ప్రతాపసింహుఁడు సలుంబ్రా కృష్ణసింహునకుఁ గోపోపశమనము చేయుట.)

మ॥ గురుతుల్యుండవు మాకు వంద్యుఁడవు సూక్తుండాడు గర్వోక్తులన్
దరుణాజ్ఞాత దశాతికోమలము స్వాంతం బెంతగా నొచ్చెనో
స్థిరకారుణ్య సముద్ర! వాని బదు లర్థింతున్ క్షమాభిక్ష యే
కొఱలేకుండఁ బ్రసన్నమూర్తివయి నాకున్ దర్శనం బీయవే. 55

గీ॥ గురుని దండన తన్ను మేల్పఱచు ననుచు
నెఱుఁగ కితఁడాడు సుడుల వందఱుఁగదోకు
వాఁడు నాచేత నిపుడు త్రోవకునువచ్చు
నస్త్ర మస్త్రేన శామ్యతియనెడు నట్లు. 56

క॥ అని సూక్తుఁ జూచి "కొమరా
కనుచుండనె యెంత వఱకుఁ గడపితి నుడులన్
నిను నీవెఱిఁగితొ లేదో
యనుచితమని నీకుఁ దోఁపదా యిపుడైనన్ 57

ఉ॥ తండ్రికిఁ బంగనామములు తద్దయుఁ దీర్చెడు పుత్రుఁడండ్రె పె
క్కం డొ్రకమంచి పేర్గొనుటకష్టము దుష్టుఁడటంచుఁ బేరు చే
కొండ్రవివేకు లూఱకయకూడిన పీరవరేణ్యు లింద తే
మండ్రనినైన నెంచ కిటులాడుచు నిందలఁ గట్టుకొందువే. 58

మ॥ జనక ప్రాయు మహాత్ముఁ గృష్ణవిభు సుస్వాంతంబు నొప్పించి న
న్నసురాగార్దు్రని జ్యేష్ఠు భూరమణు హాస్యంబాడ నుంకించి తిం
కను గర్విచ్చుచు మంచిచెడ్డల నెఱుంగన్ లేక యిట్లున్న నే
మని నీభావము నెంచఁగానగును గట్లాఁ యిట్లు వర్తింతువే. 59

గీ॥ గురు లమృత హస్తములతోడఁ గొట్టినపుడు
విసముగా నది తోఁచుట విలయమునకె
యొంచఱును గొట్టె దీవు నేఁడేల యిట్టి
తల విరుసు మాట లిపుడైనఁ దెలివిఁ గనుము. 60

మ॥ ఉరుశౌర్యుల్ మనసెత్తిపై నడచు వారున్నారు బ్రహ్మాండ ము
క్కుఱఁజేయంగల విక్రమప్రకటు లేలా నీదు గర్వోక్తు లిం
దఱిలోఁ దాడిని దన్నువాని తలపై దన్నం గలాఁడుండు నీ
గరువంబున్ సకలంబు దింపఁగల నొక్కండౌ నిమేషంబునన్. 61

గీ॥ అనిన ముంజేతి మణిఁజూడనద్ద మేల
కుడువఁబోయి కూరల రుచి యడుగ నేల
వేయి చేయిని గలుపు నీశీర్ష మెగిరి
యవలఁ బడకున్న ననుసూక్తుడనఁగఁ బోకు. 62

గీ॥ ఇంక నొక్కఁ డిందున్న వారెవ్వరైన
నందఱైనను నన్ను మార్కొందురేని
మిపుల హర్షించి ప్రళయ భైరవునిమాడ్కి
సర్వ సంహార మొనరింతు క్షణములోన. 63

—• హరభట్టారకుఁడు సూక్తసింహునకు నీతిఁ గఱపుట. •—

మ॥ అని మీసంబునఁ జేయి మోపుచును గర్వావేశముల్ జూపు సూ
క్తుని వీక్షించి బలాపసింహుఁడు కడున్ గ్రుద్ధాత్ముఁడై నెత్తికిన్
గనులెక్కన్ జుమి నీకు నిప్పుడె భవద్గర్వాంధతన్ డింతు ర
మ్మనునంతన్ హరభట్టు వారలను డాయన్ బోయి దీనాస్యుఁడై. 64

ఉ॥ నాయనలార! సూర్యకుల నాశకరమ్మగు ఘోరకృత్యమున్
జేయఁగ నుంటిరేల పగచే రిపులన్ సమయింపవచ్చుఁ గా
కీయెడ నన్నఁదమ్ము లిటులీసును రోసము సూని పోరు ట
న్యాయ మటంచుఁ బూజ్యు లనరా వినరా రణధర్మ పద్ధతుల్, 65

మ॥ ఒకకాడన్ జనియించు రెండు పువు లట్లొప్పారి మీరెప్డుఁ గూ
ర్మికినిన్ బేర్మికిఁ దావులై మెలఁగినన్ మిన్నంది మాబోంట్ల మూ

అక హర్షింతుము! కాని యుద్ధము లొనర్పఁగా బూనినఁగా మానసం
బకటా! వ్రియ్యాలు వ్రియ్యాలై చనదె! కట్టా!చూచియెట్లోర్తునో! 66

చ॥ అదియును నాశ్రితుండగుట నందఱు మెచ్చఁగ నిచ్చకంబులన్
వదరె నితండటంచుఁ దలఁపఁగావల; దింటి పురోహితుండ! న
భ్యుదయమె మీయెడన్ దలఁచు చుండుట కొత్తయుఁగాదు, క్షేమసం
పదఁ బరికింప నాకుఁ గడు బాధ్యత యుండు తెలుంగు లోకమున్ 67

చ॥ తరములకొద్ది మిమ్ము వసుధాపతు లంచని మేము, మమ్ములన్
గురుపులటంచు మీరలును గొల్చి పరస్పర భేదలేశముల్
పొరయఁగనీక కాలమును బుచ్చితి; మట్టులుగాన మిమ్ములన్
దరియు విపత్తు లేశమయినన్ మఱి మేరువుగాఁగనంబడున్. 68

ఉ॥ మంచియుఁ జెడ్డయున్ దెలుపు మాన్యులు లేరు; గతించెఁ దండ్రి;ప్రా
పంచకపద్ధతుల్ తెలియ ప్రాయముగా: దిఁక రాజ్య మెంతొ నా
రాంచితమౌ, రిపుల్ బలియు; రాహవ మర్మముగాదు; మిమ్ముఁబ్రా
ర్థించెదఁ దండ్రులార! వినరే' గురువాక్యము మీఱరాదనన్. 69

మ॥ వల దాత్మక్షయకారకంబయిన యీ వ్యాపార; మింటుండియున్
దొలఁగన్ బొం; డిది సోదరత్వమునకున్ దూరంబు; నాయానయున్
గల"దంచాడిన నవ్వి సూక్తులు 'నమస్కారంబుఁ గైకొంచు స
వ్వలకున్ బొండిఁక; నడ్డువచ్చి కలిగింపన్ బోకుఁ డాలస్యమున్. 70

గీ॥ అపజయ మొకజయమొ యొప్పందఁ గోరి
చావు బ్రదుకుల నున్నాము' మీవచించు
చప్పనగు మాట లూఁకొట్ట మొప్పఁబోవ
మేమిటికిఁ గష్టపడఁగ' నిం కేల వగవ! 71

మ॥ తనదౌశక్తికి మీఱు కార్యములకున్ దార్కొన్నచో ముప్పు వ
చ్చును; మాయిర్వురలోన నొక్కరుఁడు రణక్షోణిన్ మృతిఁగన్న మీ
రును రావచ్చుచు; నేడ్వవచ్చు! మఱిఁ బౌరోహిత్యమున్ జేయవ
చ్చును! లబ్ధిన్ గొనవచ్చు! నిప్డుచనవచ్చున్ దాటి దూరమ్ముగన్"72

క॥ అనిన హరభట్టు నిలువె
ల్లను నీరయి యడుగు నవ్వలన్ వైచి ప్రతా

పుని వంశము దీపముగాఁ
దన దృష్టులు వఱపె నాప్రతాపుం డంతన్. 73

క॥ గురుఁడనఁ దైవమన నె
వ్వరినైనను దెగడు వీనిపై నభిమాన
స్ఫురణము మాను; మెఱుంగవె
యరసికులన్ బలుకరింప నగు ముప్పనుచున్. 74

క॥ మలినమును జలముకైవడి
నిల నలమిన పాపసమితి నింకించు రణం
బు; లవశ్యము కరణీయం
బులు నృపవంశమునఁ బుట్టు పురుషుల కెల్లన్. 75

క॥ ఏవేళ కేదివచ్చునొ
యేవెరపునఁ బరిణమించు నెవరెఱుఁగఁగలా
రీవేళ మమ్ముఁ గూఁటిచి
భావమునను నొవ్వ కనుచుఁ బలుకుచు వెడలెన్. 76

—• సూక్తసింహ-ప్రతాపసింహు లొండొరు పోర యత్నించుట. •—

మ॥ "కమలాప్తాన్వయ మీదినం బపయశఃకాలుష్యమున్ బొంది పూ
ర్ణముగాఁగన్ జెడనున్న దీప్రశయమున్ దప్పింపఁగా నిప్డు మా
ర్గ మొకం డున్నదె తెప్పపాటదను మీరన్ బోయినన్ వీరి దే
హములన్ జేతికిఁ జిక్కనే యకట! వ్రియ్యల్ వ్రియ్యకై రాలవే. 77

మ॥ అని యందుండిన వారలందఱును దుఃఖావేశ దైన్యంబులన్
గని శోషిల్లఁ బ్రతాపసూక్తులు శితోగ్రస్ఫార ఖడ్గంబులన్
గొని వేగమ్మగఁ ద్రిప్పు చొండొరుల నుగ్గున్ సూచమున్ జేయ ముం
దున కొక్కుమ్మడి దూఁకి రేమనఁగనుండున్ మీది కార్యంబులున్. 78

—• హారభట్టారకుఁ డాత్మార్పణము గావించుట. •—

చ॥ మెఱుపు తటాలునన్ మెఱయుమెల్పున నాహారభట్టు తత్క్షణ
స్ఫురిత మనోవికాసమున భూరి కృపాణము నెత్తి వక్షమున్
బరియలుగాఁగఁ జీల్చుకొని వారల మధ్యను నేల వాచలుచున్
బొరిపొరిఁ బ్రాణముల్ విడిచె ముక్కున నోరను నెత్తు రొల్కఁగన్. [illegible]

మ॥ తన సేవించు నృపాలనందనులు కృ ర్థత్వంబుమై నొందొరుల్
దన నేత్రమ్ముల మ్రోల మార్కొనుచు నంతంబొందఁ జూడన్ సహిం
పని పుణ్యాత్ముఁడు నాఁటి కష్టదశఁ దీర్పన్ బూని యాత్మార్పణం
బు నొనర్చెన్ హరభట్టు త్యాగనిధియై ముల్లోకముల్ మెచ్చఁగన్. 80

మ॥ వనధిధ్వానగభీరఘోషము రహింపన్ ద్రొక్కుకున్ వచ్చి సూ
క్తుని వీక్షించి ప్రతాపుఁడున్ నినుఁ గనుంగొన్నన్ గడున్ బాపముల్
జనియించున్ గలుగంగరాని యిడుమల్ సంధిల్లె క్షీరాబ్ధిఁబో
లిన సూర్యాన్వయ మొందె నీకతన మాలిన్యంబు లీనాఁటికిన్. 81

ఉ॥ ఒత్తిడిచేసి కోరకుముయుద్ధము వద్దని కృష్ణసింహుఁడున్
నెత్తిన నోరు పెట్టుకొనినీకు వచించె వినంగనైతి వ
య్యుత్తము బోధమించుకయు నూఱక ప్రేలితి నేఁడు నీతలన్
గ్రొత్తలు పుట్టె మిట్టిపడికొంపకుఁ జేటును దెచ్చి తెంతయున్. 82

మ॥ సమరంబున్ బొనరింప నుండఁగ వశిష్ఠప్రాభవాఢ్యుండు పు
ణ్యామయుం డీహరభట్టు లా నుదయసింహక్ష్మాతలాధీశు చం
దమునన్ వంద్యుఁడు ముందు చూఁకి మనమధ్యంబందునన్ వ్రాలి జీ
వము లర్పించి త్యజించె దేహముఁ దృణప్రాయంబుగా నెంచుచున్ 83

చ॥ ఇతఁడును వేదరాశి శతవృద్ధు కుమారులభంగి నిన్ను నన్
సతతము వెంచె నిట్టి సుగుణవ్రతుఁడున్ బలియయ్యె నీదు మూ
ర్ఖతవలనన్ గనుంగొనుము కాలువ గట్టుచు నమ్మహాత్మ ర
క్తతతులు పాఱఁజొచ్చె నెటుకన్గొని యోర్చెద నిట్టిదృశ్యమున్. 84

మ॥ పలుకష్టమ్ములఁ గూడు నీళ్ళు గొన కీబ్రహ్మాండ మున్నంతకున్
దలక్రిందౌచుఁ దపంబు చేసిన గురుధ్వంసాఘ పుంజంబులున్
దలఁగన్ బాఱునె తన్మహానలశిఖల్ దర్పించి నిన్నున్ సనున్
గులమున్ దేశముఁ గాల్పవే యెటుల నాకున్ దప్పు నిప్పాపముల్ 85

చ॥ గురురుధిరంబు దాఁటఁగనుగూడదు కావున నిప్డు నేను సం
గరమును మానుటన్ బ్రదుకగల్గితి నీవిఁక నాదు రాజ్యమున్
ద్వరగఁ ద్యజించి యిష్టమగుతాపునకున్ జను మాలసించినన్
శిరము నిమేషమాత్ర ధరణిన్ బడు నంచు వచింప సూత్తుడున్. 86

—• ప్రతాపసింహుఁడు సూ_ర్యసింహుని దేశభ్రష్టుని గావించుట. •—

మ॥ "హరభట్టారకమూ_ర్తి పుణ్యతముఁ డయ్యాచార్యుఁ డిట్లాటకుఁ
నెరియుఁ నామది కాన నేఁడు రణముఁ న్వేఁగోరఁ భీతిల్లి నే
నరుగఁ మానితినంచు వెంచకుము; నీయౌద్ధత్య బాహాబల
స్ఫురణఁ వమ్మొనరింపకుండినను నేసూ_ర్యుండనే కాదుపో. 87

చ॥ ఇరువుర నెవ్వరో యొకరుఁడీజగతిఁ విడు నంపకుఁ బర
స్పర ముఖదర్శనంబు కొనసాఁగక యుండెడుఁగాత ఘోరసం
గరములఁదప్ప ప్రాణముసుగాచి మెలంగు మటంచుఁ బల్కి తా
నరిగెను ఢిల్లిత్రోవకుఁ గులాంతకు లందఱు పోవు తావుకుఁ. 88

మ॥ "సమయఁజేసి కృతాఘపుంజములఁ బశ్చాత్తాపదీప్తాగ్ని శు
ద్ధమతిఁ వచ్చినఁ జోటులేదనదు వాత్సల్యాంబువారాశి కో
పము జన్మింపని దొడ్డతల్లి మనమేవాణ్మాత దాక్షిణ్య హ
_స్తము పైఁగప్పు శతాపరాధికయినఁ సద్భక్తిఁ ప్రార్థించినఁ." 89

మ॥ అని తా నింటికి వెళ్ళి యయ్యుదయసింహస్వామికిఁ బోలె న
య్యనఘాచార్యున కంత్యసంస్క్రియలు చేయఁ బంచి యాత్మోప శాం
తిని బెంపఁ జప హోమదానములు సంధింపఁ మొదల్ పెట్టి య
జ్ఞననాథాగ్రణి యిచ్చెఁ దత్సుతునకుఁ సారాగ్రహారంబులుఁ. 90

గీ॥ హరగురుం డనంతత్యాగ మాచరించి
నట్టియెడ నొక్క సత్రంబు గట్టఁ బనిచె
శాశ్వతాన్న దానంబును జరుపఁదలఁచి
దుర్మరణదోష మతనికి దొరయకుండ. 91

క॥ ఆమఱునాఁడు కిరాత
గ్రామణి సామంత నృపులుగ్వాలియరు మహా
భూమీశ్వరుఁడు ప్రతాప
స్వామికడకు వచ్చి రతని సందర్శింపఁ. 92

మ॥ పసఁజెన్నారు చిరత్నరత్నతతి శోభల్ గుల్కు క్రొమ్మేడ పై
నసమానంబగు వ్యాఘ్రచర్మమున నధ్యాసీనుఁడై రాజయో

గసమాధిస్థితినున్న భూపమణియుఁ గన్నెత్తి వీక్షించి చెం
త సమాసీనులు గండటంచుఁ గనుసన్నన్ జేసి యత్యాదృతిన్. 93

—• ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట. •—

సీ॥ "తనదేశలక్ష్మి సంతత భోగభాగ్యయై
భవములఁ దులదూఁగ వలయుననుచుఁ
దనప్రజ ఈతిబాధలులేక బహువిధై
శ్వర్యంబులు వహింప వలయుననుచుఁ
దనయిల్లు పూర్వాగత ప్రతిష్ఠాభరం
బుల వృద్ధినొందంగ వలయుననుచుఁ
దనపేరు పరుల నిందల కాస్పదం బీక
స్వచ్ఛమై యెపు డుండవలయుననుచు

గీ॥ వసుధపై జన్మ మెత్తిన ప్రతిమనుజుఁడు
జీవితమునిండ యత్నంబు చేయుటొప్పుఁ
గాని మనదేశ మందభాగ్యమునఁజేసి
యదియుఁ దలపోయ దుర్ఘటంబై రహించె. 94

మ॥ కనుఁ డా మధ్యధరాసముద్రము మొదల్ కాబూలు పర్యంత మొ
ప్పిన విస్తారసమస్తదేశముల వ్యాప్తిన్ చన్న తౌరుష్క భూ
పనికాయంబులు పూర్వ మేడవశతాబ్దంబాదిగా భారతా
వని కేతేరఁగొడంగె నాహవకళాప్రత్యగ్ధి దుర్వారమై. 95

క॥ ఎఁబేఁట వారు లక్షలఁ
గోటులుఁగా సైన్యములనుగొని వచ్చి మహా
ధాటికి భారతదేశము
బీటలువారిన విధంబువెలి బొసఁగూర్చున్. 96

సీ॥ అఖొరాసా నిప్పహో నాఫగనిస్థాన
మా బెలూచిస్థానమా యిరాను
బర్కి యిరాకు బాగ్దాదు మెసపొటోమి
యా శిరియా సీమలందునుండి

వసుధ యీనినయట్లు బహుసంఖ్య గలుగు యా
పనవీరభటకోటి బయలుదేఱి
పలు శతాబ్దములుగాఁ బరతెంచి పైఁబడి
భరతఖండంబు డీల్పడఁగఁజేసె

గీ॥ నందనోద్యానమట్లు లుండంగఁ దగిన
భూమి పారతంత్ర్యమహాబ్ధిమునిఁగి కలుష
వ్యాధు లీతిబాధలు గల్గి బలము తఱిగె
మన భరతఖండ పాపమేమని వచింతు. 97

సీ॥ కోటిసూర్యప్రభాంకుండు పృథ్వీసార్వ
భౌముఁ డీయవనులబారి మడిసె
సర్వజ్ఞతుల్యుఁ డానమసింహ నృపుండు
తురకలతోఁ బోరితొలఁగెఁ దసుపు
సమవర్తిమూర్తి దుర్దమశౌర్యుఁడౌ హమీ
రాయు పున్నంత కావహ మొనర్చెఁ
గుంభుండు రాజ దిక్కుంభి తదర్థమై
తనజీవితము నెల్ల ధారవోసె

గీ॥ నింక సంగ్రామసింహ భూమీశ్వరాదు
లప్రతీప ప్రతాపులు యవనసేన
నాపి మెండొడ్డి దేహంబు ప్రాణములును
గోరువెట్టి స్వాతంత్ర్యంబు గొలిచి రపుడు. 98

మ॥ ఒకనాఁడా యొకమాసమా మఱియుఁదానొక్క బ్దమా వేయి యేం
డ్లకుఁ బైనయ్యె మహమ్మదీయసుభటుల్ లక్షోపలక్షల్ లయాం
తకులై పైఁబడసాఁగి యెంత జనబృందంబున్న మేవాడ మా
తకునైనన్ దలముక్కలై బ్రదుక సాధ్యంబంచుఁ దోఁపించదే. 99

శా॥ ఒడ్డారించుచు సైన్యముల్ గొని యలాయుద్దీను చిత్తూరు పై
నొడ్డెన్ ముట్టడి వానిధాటికి జగంబూటాఁడె వాఁడెంతఁగాఁ
జెడ్డల్ చేసెనొ దేవుఁడే యెఱుఁగు నిస్సీః ధర్మమో సత్యమో
యడ్డంబుండునె నాస్తికాధముల దుర్వ్యాపారముల్ మాన్పఁగన్. 100

మ॥ అరుదెంచెన్ బహదూరుసాహి బహు సైన్యానీకముల్ గొంచుఁ జి
త్తూరుపైనన్ బ్రళయాగ్నిబోలె నతఁ డుద్యోతించి దుర్గంబు రూ
పఱ వహ్న్యస్త్రములన్ నిగుడ్చుచు స్వరూప ధ్వంసమున్ జేసె వీ
రరసాంభోనిధు లెందఱో మడిసి రౌరా! నాఁటి యుద్ధంబునన్. 101

గీ॥ అ లలాటాక్ష మూర్తులోయనఁదగు హర
కులజు లైదువందలమంది కొలుచుచుండ
మర్జయుఁడు మాపితామహితోడఁ బుట్టు
రణము సాగించి యర్జునరావు మడిసె. 102

సీ॥ నాదు ముత్తాత చండనృపాలు సంతతి
వాఁడు దుర్గారావు ప్రళయభైర
వాకారుఁడై వైరు లడలిపాఱఁగఁ దోఁరి
పడియెఁ జోండావ దన్వయులఁగూడి
యాపైన వచ్చి మాయవ్వ జవాహిరి
బాయి గాయంబులు వేయుఁగాఁగ
మహిషాసురేశ్వర మర్దనివలె రేఁగి
విమతుల నోర్చి ప్రాణములు విడిచెఁ

ఆ॥ బదియుమూఁడు వేలుపడఁతులు గొలువఁ గ
ర్ణావతియును నాదునాయ నమ్మ
రోహితాశ్వశిఖల జోహారు గావించె
నిట్టి వీరమూర్తులెందుఁ గలరు. 104

సీ॥ కడకు మూఁడవమాఱుగా నక్బ రేతెంచె
నంతము లేని సైన్యములఁ గొనుచు
వీరులందఱు గూడి విశ్వపూజ్యంబైన
చిత్తూరుకోట రక్షింపవచ్చి
రల పరంగుల పిరంగుల మ్రోల దుర్గంబు
గాజువిధాన వ్రక్కలయి కూలె
మేవాడ వీర లక్ష్మీవజ్రమకుటముల్
జయమల్ల ముఖ వీరసమితి మ్రగ్గెఁ

గీ॥ గనుదెఱచి కాపురని కూయఁగాఁ దెలియని
శిశువు లాదిగ జగదేక జేతృశౌర్య
పరులవఱ కందరను బట్టి నరకె నక్బ,
రెటులు చిత్తూరు రమ తల యెత్తి బ్రదుకు! 104

గీ॥ ఆచతుశ్శాల లాభవ నాంగనమ్ము
లాజయ స్తంభతతులు దే వాలయమ్ము
లూఁచముట్టుగఁ జెడియెఁ జిత్తూరు పురము
కాడుగా మాఱి పాండవ బీడు దేలె. 105

సీ॥ తలపైనఁ గొమ్మున్న ధైర్యమేరువులు ఝూ
లావనీంద్రుల సేవ లడఁగిపోయె
నహిరాజు కోఱల సైన్యఁ బట్టి పెకల్చు
చోహాణ బలములు చొప్పుదప్పెఁ
బాతాళ మఱచేతఁ బగిలించు ప్రమర లే
వలన నుర్కిరొ సుంత తెలియరాదు
గగనధాత్రుల నేకముగఁ జేయఁజాలిన
రారోద్కులంబు పే ర్మఱువసయ్యెఁ

గీ॥ నల చతుర్దశ లోకముల్ గలిసెనేని
సమయఁజేయు చోండావతుల్ సన్నగిలిరి
నలుగు రెదిరించినను దాఁకి నిలువరించు
పోఁడిమికిఁ దప్పి మేవాడ వాడు దేలె. 106

ఉ॥ వైరులు మాసమాసమును బైరులఁ గోసెడు నట్లు వీరులౌ
నూఱులు వేలు గోయఁగ, మనోజ్ఞ సువర్ణ శలాకలట్టు లం
గారశిఖాచయంబులను గాలుచు వేలకు నేలు స్త్రీలు జో
హారులు చేయ, దేశ మకటా, జనశూన్యము గాక నిల్చునే! 107

సీ॥ తనదు కండలును రక్తము క్రుమ్మరించి మే
వాడ్మాత వీరసౌభాగ్యలక్ష్మి
యొకవేయి యేండ్లుగానోర్చె నోర్చుచునుండె
శాత్రవతతిపోటు సడల దయ్యెఁ

దద్ఘాతములకు నాతల్లి శరీరష్ము
కుమ్మెలు పోవుచుఁ గుట్టుపట్టె
నుపచారశతములఁ నొచ్చుపెట్టదు చిక్కి
విద్రుపల్లై శల్యావశిష్టమయ్యె
గీ॥ నమ్మహామాత గతి తలఁపైనయప్పు
డొడలు పరవశమై రక్తముడుకు లెత్తుఁ
గడుపు చుమ్మలు చుట్టు నేకరణి నామెఁ
దేర్తునని రేయుఁబవలు చింతించుచుందు. 108

మ॥ తనలోకావన కచ్ఛవాహాన్వయము పాతాళంబునన్ గ్రుంగఁ బు
త్రిని ఢిల్లీశున కిచ్చి వియ్యమును బ్రీతిన్ గూర్చి తత్పుత్రు నా
తని కర్పించెను మానసింహు భగవాన్ దాసుండు తొల్దొల్త నే
మని వర్ణాశ్రమ ధర్మపద్ధతి తిరంబై నిల్చు లోకమ్మునన్. 109

సీ॥ తనయంతరాజు లేఁడనిపించి విస్తార
భూమి మార్వారేలు భూపమౌళి
యుదయసిం గక్బరునెదురేగి తోడ్తెచ్చి
తనరాజ్యలక్ష్మి స్వాతంత్ర్యలక్ష్మి
నొసఁగుచు సోదరీయోధభాయి నొసంగి
యేకసహస్ర హయేశుఁడయ్యె
ననుజుని జంద్రసేనుని నిజాత్మజు శూర
సింహు ఢిల్లిని సేవచేయఁ బనిచె
గీ॥ బదులుగా నక్బరొకకొన్నిపల్లె లియ్య
నతని సామంతుఁడగుచు రాజ్యంబొనర్చు
ధీరుఁడెవఁ డధీరుఁడెవండు వీరనృపులె
సిగ్గుచెడి నక్బరూటి హసించి నపుడు 110

మ॥ బికనీరీశ్వరుఁడున్ జసల్మియరు పృథ్వీనాథుఁడున్ వారి క
న్యకలన్ ఢిల్లికిఁ గానుకన్ గాఁబనిచి సేనాధీశ సామంతులై
సుఖమున్ గోరుచు నక్బరున్ గొలువఁగాఁ జొత్తెంచి రిల్లెందతో
యకటా! సోదర భూపతుల్ చెడిరి హేయంబైన దాస్యమ్మునన్. 111

మ॥ వడకించెన్ సచరాచరావనిఁ బ్రతాపస్ఫూర్తిఁ జిత్తూరు ము
ట్టడియ ప్రద్యుమ్నరావు; ఘోరధనుఁ డిష్టశ్రేష్ఠుఁ డమ్మాన్యు పు
త్రుఁడు మాతండ్రికి మేనమామకొడుకెంతోకూర్చు వాఁడయ్యు నన్
విడి ఢిల్లీశ్వరుఁ జేరె' నీకథలు విన్పింపంగ సిగ్గయ్యెడిన్. 112

మ॥ దురదృష్టంబదియెల్ల నాపయిని గంతుల్ వెట్టెఁ గాదేని సా
గరుఁ డప్పద్మహితాన్వయం బపయశఃకాలుష్య మొందంగ న
క్బరు పాదాబ్జముఁగొల్వ నేలచను హృద్బంధుల్ హితుల్ సోదరుల్
పరునిన్ జేరిరి మందభాగ్యమున కెబ్భంగిన్ వగన్ గాంతునో. 113

మ॥ అకటా! సూక్తుఁడకారణంబుగనె కయ్యంబెంచి వాదాడి ఢి
ల్లికి పేంచేసెను నిన్న; శత్రుజనపాళిన్ దున్మి తూఁటాడు సిం
హకిశోరంబులు తమ్ము లిట్లగుటకై యస్మ న్మనంబెట్టి బా
ధకు లోనయ్యెనొ దేవుఁడే యెఱుఁగు నిద్రన్గాన రేయంతయున్. 114

సీ॥ సువిశాల దుర్నిరీక్ష వికాస మక్బ రా
స్థానరంగ ప్రధాతతికి బ్రమసి
యాశ్రయించినవారి యాసలన్నియుఁదీర్చు
నతని వింతగు వదాన్యతకు నలరి
తమపేరు జగమునంతకుఁ బెద్ద రారాజు
పేరుతో జతగూడు పెంపునెంచి
కనకసౌధాగ్ర భాగములందుఁ చెరలలో
విహరించు తురక బిబ్బీలఁ దలఁచి
గీ॥ సేతు శీత నగాంతరసీమఁ గలుగు
మనుజపతులెల్ల మతిచెడి కనులు తిరిగి
విడని పేరాస నక్బరు విజయరథము
గాడి మోసిరి స్వాతంత్ర్యఘనత మఱచి. 115

మ॥ కనుసన్నన్ సనుఁగొల్చు భూపతులు మోగల్ తేని గుఱ్ఱాలు గా
యను వెంచేసి రనేకదుర్గ వితతుల్ హారావళీ పర్వతా
వనిదక్కన్ రిపుచేతఁజిక్కెఁ జముపుల్ వమ్మయ్యె భాండారముల్
ఘనశూన్యంబు లికెట్లు నిల్పనగు స్వాతంత్ర్యంబు మేవాడకున్. 116

సీ॥ స్థానమా విశ్వవిశ్వంభరాదేవికి
వజ్రభూషణము మేవాడసీమ
యన్వయమా జగదారాధ్య దశదిశా
వ్యాప్తకీర్తి యుతంబు భానుకులము
పూర్వులా లోకైక పూజ్యు లిక్ష్వాకు హ
రిశ్చంద్ర మాంధాతృ నృపతిమణులు
ప్రజలా జగజ్జైత్ర పరిపూర్ణవిక్రమ
ప్రాభవోద్దాము లా రాజపుత్రు
గీ॥ లాత్మలో క్షాత్రగుణ మణువంతయైనఁ
గలుగువాఁడెవఁ డుఱక గాజులు ధరించి
చల్లఁగా నింటఁగూర్చుండ సాహసించుఁ
దనదు సర్వస్వ మర్పింపఁ దలఁచుఁగాని. 117

సీ॥ క్ష్మాగోళమును ముంచు గాఢాంధతమసంబుఁ
గర దివ్వెతో నార్పఁ గడఁగునట్టు
లత్యగాధము సాగరానంతజలముల
కేతమ్ము వేయ నూహించునట్లు
వసుధ బొగ్గుగఁగాల్చు ప్రళయాగ్ని హోత్రంబు
గన్నీటిచే నార్పనున్న యట్లు
క్షయకాలమున రేఁగు సప్తమారుతధాటిఁ
దేటి రెక్కల నార్పఁదిపురునట్టు
గీ॥ లని జగము నన్నుఁ బరిహాసమాడుఁగాక
యొక్కటిని నిల్చి బలమెల్ల నెదురువెట్టి
విధికి మాఱొడ్డి స్వాతంత్ర్య విజయలక్ష్మి
యడుగులకు నిత్తుఁ ముత్యాల హారతులను. 118

గీ॥ ఎట్టి బ్రహ్మప్రయత్నంబునేనిఁ జేసి
యుదయపురలక్ష్మికిఁ గిరీటముంతుఁ దలను
గాక దైవోప హతుఁడనై కడిమిచెడిన
రక్తతతిఁ గూర్తు రతనాల రావిరేఁక. 119

శా॥ నా కోర్కింపుకయైనఁ గష్ట మెదురైనన్ మేరువున్గాఁగఁ జీ
కాకున్ జెందు మృదుస్వభావులరు' మీయాశీస్సు శ్రీరామ ర
క్షాకల్పంబగు ధర్మసూక్ష్మముల నీసందిగ్ధ కాలమ్మునన్
నాకున్ జెప్పి కృతార్థుఁజేసి కడుఁబుణ్యం బొందఁబ్రార్థించెదన్" 120

క॥ అని వెండికొండ సింహా
సనమున శివుఁబోలె శాంతిసదనంబగు స్వా
మినిఁగని భక్త్యావేశం
బునను సలుంబ్రా మహీశ పుంగవుఁడంతన్. 121

—: సలుంబ్రా కృష్ణసింహవిభుఁడు తన నిశ్చయము నెఱింగించుట. :—

మ॥ "ఇవియున్ వీరరసాబ్ధి వీచికలుగా నీమాటలున్గావు; హైం
దవమందెంచును సత్యధర్మములు సంస్థాపింప మేవాడ భా
గ్యవిశేషంబునఁ బుట్టువున్ గనిన సాక్షాద్విశ్వనాథుండవౌ
దువు మర్త్యుండవు గావు నిన్గొలుచు టెంతో మాకు శ్రేయంబగున్. 122

మ॥ తెలియున్ దేశము నాదు స్వామిపద భక్తిస్థైర్యలీలల్ చతు
ర్జలరాశి ప్రమితావనీతల మహాసామ్రాజ్య మర్పింప దా
పలికాలన్ దగులంగ నొల్లను భవత్పాదాజ్ఞముల్ భక్తిమైఁ
దలపైనన్ ధరియించి నామనుగడన్ ధన్యంబు గావించెదన్. 123

గీ॥ నాదు భటులు దుర్గములు ధనంబు రాజ్య
రమయు నర్పింతు మఱియు నా ప్రాణమిత్తుఁ
దండ్రి నీదు స్వాతంత్ర్య రథంబు మోయఁ
గుడిబుజం బప్పగించుట గొప్పయగునె. 124

మ॥ తమ గర్జారవధాటి నెల్లెడల గోత్రక్ష్మాధరశ్రేణి ఖం
డములై తెళ్ళఁగఁజేయు దోర్బలులు చోండావ స్త్రీ హావీర సిం
హములన్ దోడ్కొనివచ్చి నిల్పెద విపక్షారణ్యముల్ గాల్చి భ
స్మము గావింతురు సమగ్ర విక్రమకళా సంరంభ పారీణతన్. 125

మ॥ పదివేలేన్గులయంత దార్ఢ్యమున మద్భావంబు నీపాదముల్
గదియున్ నిక్కము దేవదానవులు లాగన్ జూచినన్ గుంతయున్

గదిలఁబో! దనిలోన శత్రులను మర్దింపఁ జేతుఁ గాదేని నీ
పదపద్మంబుల మ్రోల వ్రాలివిడుతున్ ప్రాణంబులో యీశ్వరా. 126

మ॥ తనువుల్ నశ్వరముల్; విశుభ్రయశమున్ ధర్మంబు సుస్థాయియై
తనరారున్; వెనుకంజ వేయకు పవిత్రంబైన దీకార్య మే
యనుమానంబును లేదు; వేగమె రణప్రారంభమున్ జేయుమీ
నిను సేవించెద నీకు ముందు రిపుపంక్తిన్ జించి చెండాడెదన్. 127

—• భానుసింహుఁడు ప్రతాపసింహుని తోఁ దన నిర్ణయముఁ దెలుపుట. •—

గీ॥ అనుచుఁ గేల్మోడ్చి విరమించు నతని మాట
నందుకొని భానుసింహుఁ డోయధిప! మాకు
స్వామిభక్తియె రక్తరూపమునఁ బాఱు
ని న్ననుసరింప కేరీతి నిలువఁ గలము. 128

సీ॥ స్వామి స్వాతంత్ర్య ప్రభామనోజ్ఞంబు నీ
వదనమ్ము భువనసేవ్యమ్ముగాదె
యకలుషస్వామి భక్తికిని మాచిన్ని రా
ష్ట్రమ్ములు పూర్వకాలమ్మునుండి
సూతికాగృహముల శోభఁ జెన్నారు నిం
దుకుఁ దోడుగా నీమనోజ్ఞ నామ
సంస్మరణంబు దుస్సాధ దుర్భేద దు
ర్గముగాఁగ మమ్ము రక్షణము సేయుఁ
గీ॥ గంఠమునఁ బ్రాణవాయువుల్ గలుగుదాఁక
ముందునకె గాని వెనుకవైపునకుఁజూడ
మరుల కరవాలములు పూలసరము లట్టు
కంఠములు కౌఁగిలించిన కాలమందు. 129

చ॥ ముదుసలినైన మోగలు చమూవిసరంబు ముఖంబు భూస్థలిన్
గదియుచుఁ జీల్చు నాగఁటి వగన్ బగిలించుచు రెండుపాయలై
చెదరఁగఁజేతు బాణములుచిచ్చఱ పిడుగులువోలె వైతుఁ గ
ల్గదు లవమేనియున్ బిఱికికండ మదీయ శరీర మందునన్. 130

ఉ॥ క్రూరతురుష్క సంతతులకుఁ మఱి నీకు ఘటిల్లు నామహా
భారత యుద్ధరంగమున ఫల్గున తుల్యుఁడవౌచు నీవు వె
న్నారఁగ నీపదంబులు హృదబ్జతలంబున నిల్పి మత్స్య ధా
త్రీరమణుండొకో యన నరిప్రతతిన్ గడతేర్తు నాజిలో. 131

మ॥ దివియున్ భూమియు నొక్కఁడై పడిన నాదేహంబునన్ బ్రాణవా
యువు లున్నంతకుఁ గన్నులెత్తి యహితుండొక్కండునిన్‌జూడఁగా
నవకాశంబు నొసంగఁబోవ; సముద గ్రాటోప మేపార న
య్యవనాంభోనిధిఁ ద్రచ్చివైచెద జగం బానందమున్ బొందఁగన్ 132

క॥ వినిపింపనేల పెక్కులు!
నినుమ్రొక్కి వచించువాఁడ నీప్రాణము వె
న్కను మాప్రాణంబులు ముం"
దనిన మనస్సింహుఁడప్పు డందఱు వినఁగన్.

—: మనస్సింహుఁడు తన యభిప్రాయము వెల్లడించుట. :—

పి॥ "ఝాలాన్నృపతులు శౌర్యో
త్తాలులు పరిపంథి గహన దహన జ్వలన
జ్వాలాభు లనెడు కీర్తిని
నేలఁగలుప సాహసింతు నే! నీమ్రోలన్. 134

సీ॥ శూరులౌ గ్వాలియర్ సోనెగుత్తేశ్వరుల్
ద్రుపద మాత్స్యక్షితీంద్రులును గాఁగ
సకలసంగరమర్మ సర్వజ్ఞమూర్తి యా
భీమచాందును యదు స్వామిగాఁగ
శ్రీసలుంబ్రాకృష్ణ సింహుఁడు దోర్బలో
ద్దండ సాహసు డు భీముండుగాఁగ
దేజసింహుఁడమాను షాజేయ విక్రమ
గురుకీర్తిఘనుఁడు ఫల్గునుఁడు గాగ
గీ॥ శ్యామసిం గేను కవలమై యుండ నుండ
ధర్మరాజనై నిలచి స్వాతంత్ర్యరథము

స్వర్ణజయఘంట మ్రోయించి జయము గాంచి
ధర్మసంస్థాప నాచార్యతను వహింపు. 135

గీ॥ దస్యు శవకోటిపైన మద్భటులు నేను
దనువులను వాల్చి నీవు స్వాతంత్ర్యలక్ష్మి
కలవఱచు రత్నదేవాలయమ్ముఁ జేరఁ
బరచఁగల మయ్య కనక సోపానపంక్తి. 136

మ॥ పనులెల్లన్ సమకూరె మీవినయసేవల్ తృప్తి సంధించె స్వ
స్వనివాసంబుల కేగుఁ డంచు భవదాజ్ఞల్ వచ్చుదాఁకన్ దినం
బును భూశయ్యయు నేకభుక్తము వ్రతంబున్ బూని వహ్నిన్ జొరుం
డనినన్ దక్షకుఁ బట్టుఁడన్న వెనుదీయన్ దోము రాజేశ్వరా. 137

—• శ్యామసింహుఁడు తన నిశ్చయ మెఱిగించుకొనుట. •—

క॥ అని వచియించిన నుగ్రా
శనితుల్యుఁడు శ్యామసింగు సాద్రీశ్వరుఁ డో
యినవంశాభరణా నా
యనుజుని మార్గమునె నేను ననువర్తింతున్. 138

ఉ॥ ప్రాణము తీపుగాదు కరవాల భుజంగికిఁ గ్రూరశాత్రవ
ప్రాణసమీర మిచ్చి విజయంబు యశంబు గడించి నిత్యక
ల్యాణము లొందు టొక్కఁడు: మహాహవ రంగములందు వ్రాలి ని
ర్యాణమునొందు టొక్కఁడు పరాక్రమపూజ్యము రాజకోటికిన్. 139

సీ॥ విశ్వంబు నగలించు వేడి పిడుగులనైనఁ
బుష్పులవలె శిరంబున వహింతు
శేషాహిపతి నైనఁ జేనెత్తి ముత్యాల
హారంబువలెఁ గంఠమందుఁ దాల్తు
హిమవత్కుధరశీర్ష 'మెవరెస్టు' పైనుండి
దూఁకెదఁ బాతాళ లోకమునకు
నాత్మగర్జాస్ఫూర్తి నడవి మార్మ్రోయించు
మృగరాజు నశ్వమ ట్లెక్కనేర్తు

గీ॥ సూర్యరతౌరుష్కృతతుల నీ పోర్చిలఁ బట్టి
కసిమసఁగ నేర్తు మననేర్తుఁ గాని నిన్ను
విడువ నేర్తునె: ప్రాణముల్ విడిచి యైన
నరుణ కేతన చ్ఛాయలఁ దిరుగ నేర్తు! 140

మ॥ మిడియెండైనను నర్ధరాత్రమయినన్ మిట్టైన గుంటైన నె
క్కుడు వాఁడైనను లొచ్చువాఁడయిన మీకున్ దోఁచినట్లాజ్ఞ పె
ట్టుఁడు! ముందున్ మఱి వెన్కచూడకయె పిడ్గున్బోలె వైరివ్రజం
బడఁగన్ దాఁకెదఁ! జూడు' వేయునుడులేలా ముందుఁగార్యంబులన్.

మ॥ కడప్రాణంబులు బొంది వీడి చనుదాఁకన్ నిన్ను సేవింతు! నె
క్కుడు దర్పోన్నతి సంగరాంగణములన్ ఘోరారి సంఘంబులన్
దొడరన్ బోయెద; వీడ కందఱను గొంతుల్గోసి తద్రక్తముల్
మడవల్ గట్టెద! దేశమంతట యశో మందారముల్ పెంచెదన్" 142

క॥ అని వచియింపఁ బ్రతాపుఁడు
తన చెంతను ధైర్యపర్వతమువోలె వసిం
చిన బటిసూర్ నరపతిఁ జూ
చిన వదనం బెత్తి తేజసింహుం డంతన్. 143

—• తేజసింహుఁడు తన తెలం గెలింగించుకొనుట. •—

మ॥ "అవనీభారము హెచ్చి ధర్మములు వ్యత్యస్తంబులై పోవఁ బూ
ర్వవికాసం బలరింప నీశ్వరుఁడు సర్వజ్ఞుండు మీవంటి మా
నవమూర్ధన్యుల రూపమొంది యిల జన్మంబెత్తు! నీదర్శనా
దివిశేషంబులు లోక మంతటికి సంధించున్ మహాశ్రేయమున్. 144

సీ॥ ఒకయెత్తు నీవు వేఱొకయెత్తుగా దైవ
కోటి నిల్పిన నిన్నె కోరుకొందు!
స్వామి యీ నీ పద ద్వయి విశ్వపూజ్యంబు!
నడుమ త్రోవను నీవు నడచు నప్పు
డడుగు సోఁకిన ధూళి యణుమాత్రమంటిన
నఖిలలోకముఁ గాల్చు హాలహలము

చేఁదంతయునుదగ్గి శీతమై తీయనై
నిమిషమ్ములో నమృతముగ మాఱుఁ
గీ॥ ద్వత్పదము లెంత కొలిచినఁదనివి లేదు
నీయనఘనామ మెంత ధ్యానించుచున్న
విసుగు గనుపింప దింకను విడక కొలువ
ధ్యాన మొనరింపఁగాఁ గోర్కె యగునుగాని. 145

సీ॥ ధర్మసంస్థాపనార్థము ధాత్రి మెలఁగు దే
వా! యేకిలింగాపరావతార
పదినూఱులేండ్లు యావననృపుల్ భరతఖం
డమునకుఁ గూర్చ బన్నములు వాని
వారింపఁగాఁ బూర్వవీరుల త్యాగంబు
ప్రస్తుత కార్యకర్తవ్యములను
నెఱిఁగించుచో నీదుమృదులాతిమృదుల భా
వం బెంతనొచ్చె దైవమ యెఱుంగు
గీ॥ వినుకొలఁది చిచ్చుదరికొన్నవిధము తోఁచె
సైన్యబల మల్పమని కాని చాలియున్నఁ
దలను బూవాడ కింట నిన్నిలిపి నేనె
రిపుల సర్వనాశన మాచరించి యుందు. 146

సీ॥ భువనపావన నీవుపూనిన కృతి జగ
ద్వంద్య మందఱము చోద్పడఁగఁ గలము
రణ మహోత్సాహ వర్ధనమైన సుముహూర్తి
మెంచి సూర్యధ్వజంబెత్తి నిలుపు
కలికి బంగరు చిఱుగజ్జెల మ్రోత మో
గలులు యామ్యమహిమషకంఠకాంస్య
ఘంటా నినాదంబుగా వినెదరు గాక
ధ్వజము చుట్టుందుము బలిసి కొలిచి
గీ॥ పులులఁ బోలిన చరణ దాసులము మేము
కడకు మేవాడ నొకచిన్న కత్తిపట్టు

మగనిసుపు గల్గ సది రాల కెగురుఁగాక
యమరులు నుతింత్రుగాక! నీ విమల యశము 147

సీ॥ "పార్థివం బిత్తు రా ష్ట్రమునిత్తు ధనమిత్తు
రాణాసు విడనాడి రం" డటంచు
ఢిల్లీపురంబునుండి దినంబు వచ్చు లే
ఖల నొక్క కొట్టంబుఁ గప్పవచ్చుఁ
ద్యాగై కమూర్తి ధర్మావతారా నీము
ఖము నొక్కమాఱు దూరమున నుంచి
కనుపించుగాఁగఁ జూచిన వాఁ డెవండైన
నీ నీచతరమార్గ మెట్లు సొచ్చుఁ
గీ॥ బ్రాణములతోడ నిన్నెడఁ బాయఁ గలుగు
వాఁడొకఁడు లేఁడు నీదు సేవకులలోనఁ
జెంతఁ జింతామణిని వీడి చిల్లిగవ్వ
కెగుబుజము చూప నెవ్వాని మొగమువాఁచె 148

సీ॥ హారావళీ భూధ రావతంస ప్రాంత
సానురాగము యజ్ఞ శాల గాఁగఁ
దా వనాత్ముఁడు చంద్ర భట్టారకు కవిత్వ
ధారలు వేద మంత్రములు గాఁగ
నెల సలుంబ్రాది కిరా తాధీశు లసమాన
విక్రమక్రములు బుత్విజులు గాఁగ
శార్ఙసన్నిభ బల స్థైర్యశోభితము నీ
పటు మహాధనువు యూపంబు గాఁగఁ
గీ॥ బ్రబల యవనసేనలు పశు ప్రతతిగాఁగ
యాయజూకుఁడవై దీక్ష నవధరించి
సవనమును దీర్చి జగము ని ర్యవనముగను
జేసి త్రైలోక్య నుతుల రం జిల్లవయ్య! 149

శా॥ 'ఔరా! శాత్రవకోటి పాలిఁటికిఁ బ శ్యత్ఫాలమూర్తుల్ గదా
యీరారాణ్మణు' లంచుఁ జిత్తురు రణం బం దంద తెన్నాఁ రవి

ద్వారంబందునఁ జేసె శాత్రవ కులధ్వంసంబు మాతండ్రి యా
వీరాగ్రేసర చక్రవర్తి యడుగుల్ వేయేండ్లు సేవించెదన్. 150

మ॥ పదివేల్ వీరుల బాహుశౌర్య యుతుఁడీబాలుం డటం చెన్నఁగాఁ
గదనం బెచ్చట భీమమౌ నచటఁ జక్కన్ వ్రాలి దుర్దాంత శ
త్రు దళచ్ఛేదము చేసి నిన్ను జయయుక్తున్ జేయ యత్నింతు నీ
బదనూర్ సింహము తేజసింహము నుడుల్ వ్యర్థంబుగాకుండుతన్.

శా॥ నింగిన్ ముట్టెడు కోటకొమ్మగుములున్ దేవాలయమ్ముల్ జయో
త్తుంగ స్తంభము లొప్ప శ్రీపురుషు లెందున్ బుత్రపౌత్రాప్తి నొం
దంగా మాదృశభూపతుల్ కొలువునన్ ద్వత్పాదముల్ మోయఁగా
సింగారించిన తేరి యట్లలరు నాచిత్తూర్పురిన్ గాంతునే. 152

మ॥ అని వాక్రుచ్చి హృదంతరాళమున వీరావేశ ముప్పొంగ వి
చ్చిన కెందామరలైన కన్నులతుదిన్ జెన్నారు రేమంచు బొ
ట్టిన నొక్కాశ్రుకణంబు జాఱఁగను వీరాగ్రేసరుం డుండె వె
న్కను గూర్చుండిన గ్వాలియర్విభుఁ డనంతత్యాగసంశోభితై. 153

—— రామచంద్రదేవుఁడు తన మనోగతము తెలియఁజేయుట. ——

సీ॥ దరిలేని జల మగాధస్థాయి వెలుఁగొందు
కడలికి నొకతోయ కణమునట్లు
బ్రహ్మాండ మంత గొప్పగనున్న పెనుసైక
తాద్రికి నొక విస్తుటుణపు నట్లు
శాఖాచయంబు దిశాకోణములఁ బ్రాకు
నవనీజమున కొక్కయాకు నట్లు
భూదేవి మకుటమైపొడవు నెత్తున్న ప
ర్వతరాజమున కొక్క రాయియట్లు
ఆ॥ లేబలంబు లేనియే కాంగి బహువాహి
నీకు నీకు సాయమేమి సేతు
హృదయకుసుమ మొక్కఁడే నాదు సర్వస్వ
మదియె నీపదముల నప్పగింతు. 154

చ॥ అజిత పరాక్రమంబున మహాహవసీమలఁ గత్తి మోసి నా
బుజముల కాయగాఁచెఁ గడుఁబూర్వుఁడ వృద్ధుఁడ నైతిఁగాని నీ
విజయరథంబు మోయ భుజవీర్యము పట్టున లోటులేదునే
గజిబిజిచేసి శాత్రవులకండలు మెండుగ రాల్తు మేదినిన్. 155

శా॥ చండారాతి కులాటవీ దహన శశ్వత్కీర్తి సర్వస్వ మీ
తఁ డొక్కండె ప్రపంచమందుఁగల మద్భాగ్యంబు నాకూన యీ
ఖండేరావు కురంగముల్ దునుము వ్యాఘ్రస్వామివోలెన్ బలో
ద్దండుండై తెగటార్చు వైరులఁ గృతాంతప్రాయుఁడై యాజిలో. 156

సీ॥ పగఁబట్టి వచ్చి బేబరు సర్వభక్షకుం
డయి గ్వాలియరును గొన్నయది మొదలు
నెట్టిసాయము లేక యెందో రెక్కలు లేని
పక్షినై పడిన యీబడుగునన్ను
మేవాడఁ జేరిచిమీతాతగారు స
హస్ర హస్తములతో నాదరించి
రతని యనంతరం బభిమాన మెనయఁ దం
డ్రివిధాన నోమితి నీబుఱంబు
గీ॥ వేయిజన్మంబు లెత్తి నీవిమత నృపుల
నసమ రణభూమిఁ జీల్చి చెండాడియైనఁ
దీర్పఁజాలమి సత్య మీదేహ మెపుడు
త్వత్పద సమర్పితంబు భూధవ కులేంద్ర. 157

సీ॥ నిత్యకల్యాణ మందిరము చిత్తూరు మం
డలము వివాహమండపము గాఁగ
రంగుగుల్కు ననేకరాజపుత్ర స్యంద
నమ్ము లై రేని కుండలునుగాఁగఁ
గృష్ణసింహాది వీరేశ్వర దోఃప్రతా
పస్ఫూర్తి రత్న దీపతతి గాఁగ
యవనభూధవ కిరీటాలి నిర్గతమణుల్
వజ్రరంజిత రంగవల్లి గాఁగ

గీ॥ దస్యు గళరక్తముల వసంతమ్మలాడి
నీదు కరవాల మెచటఁదానై దళకొని
సకలమును దీర్చు నాగపసాని గాఁగ
విజయలక్ష్మి వరించి నిన్బెండ్లియాడు. 158

గీ॥ అని యుపరమించె నంత నాతని సమీప
మున మహోన్నతరూపుఁడై మూర్తిఁగొనిన
వీర రసవార్ధియో యనఁగూరుచున్న
భిల్ల లోకైక నాధుఁడా భీమచాంద. 159

— భీమచాందు తన సాయమును వివరించి చెప్పుట. —

సీ॥ కాంద్రుకాంద్రని పెద్దగా ద్రోఁతల నిగిడ్చి
గబ్బి బెబ్బులి పిండుబొబ్బరించు
శైలముల్ పగిలి పచ్చడిగాఁగ ధ్వని చేసి
సింహ పోతములు గర్జించు చుండుఁ
జేయెత్తు లేచి పచ్చివిసంబు వెదచల్లి
కోడెనాగులు బుసకొట్టుచుండు
వసుధ యిట్టటు లాడబరువై పరుపులెత్తి
యేనుంగు గుములు ఘీంకృతులు సేయుఁ

గీ॥ బద్మజాతాండ మంతరై భయము గొలుపు
గండశిలలఁ గొండలు చుట్టు నిండి యుండుఁ
బ్రమథ యుతుఁడైన కైలాస భర్తకైనఁ
జాలనే గుండె నాదు రాజ్యంబుఁ జొరఁగ. 160

సీ॥ భూలోక నాకమౌ బోయెపాళెంబుండుఁ
జందన తరువరచ్ఛాయ లుండు
గొలుపుకూటంబుండుఁ గోడె గుబ్బెతగముల్
వింజామరమ్ములు వేచుచుండ్రు
బొమిడికంబుల భిల్లపుంగవుల్ నడదివ్వె
లగుదు రందఱును నీయాజ్ఞ నుండ్రు

నాయాత్మకెంతో యానందమో నాదు సిం
హాసనంబందు నీవధివసింపు

గీ॥ మండఁ గూర్చుండి క్షణమైన నవలఁబోక
కొలిచి దేవునకట్లు సేవలు ఘటింతు
నడుగు మన్నొట కోర్వ నాహస్తయుగము
జాళువా పట్టుదిండుగా సంతరింతు. 161

మ॥ సరియంచుఞ్ దలయూఁచి చూడు మటి నా స్వర్గంబు నందైన ని
ర్జరులుఞ్ ముప్పదిమూఁడుకోట్లెపుడు పూజల్ చేసి సేవించు న
ప్సరుహెూతుండును జూచియుండని సుఖంబుల్ భోగముల్ వచ్చి దాం
తరలై చుట్టునుజేరి కొల్చు నిను మద్వాక్యంబు నాలింపుమా. 162

మ॥ అకటా! నీయెడ నెయ్యపుఞ్ బలిమి సేనట్లాడితిఞ్ గాక యే
టికి నాప్రార్థన మియ్యకొందు వెపుడుఞ్ డెందంబునఞ్ దేశమా
తకు వాటిల్లు విపత్తుకై వగచి చింతఞ్ గ్రాఁగు నీ వగ్గి క్రిం
గక స్వాతంత్ర్యము దక్కుదాఁక నొకచోఁ గాలూని కూర్చుందువే. 163

సీ॥ జాతియు జన్మదేశమును భిన్నములైన
మనపూర్వులకు మైత్రి దనరకున్న
నాకన్న వయసు నుంతగఁ దక్కువైన బా
ల్యమున నొండొరుఁజూచినది మొదలుగ
నీపైన నవ్యాజనియతి నామది నిల్చె
రెండవ దేహంబుఞ్ రీతిఁజూతుఁ
గడఁబోదు నీపు జాగ్రన్మంగళాకృతి
కలనైన హృత్ఫలకమునుండి

గీ॥ నీవు పాల్గొననట్టి యీనిఖిలలోక
సార్వభౌమత నరక వాసముగ రోతు
నండ నీవున్న నంబలినైన నమృత
మట్లు సేవించి యానందమంద నేర్తు. 164

సీ॥ అహితదైతేయ పశ్యత్ఫాలమూర్తులౌ
శౌర్యదుర్జయు లొక్కజాతివారు

తరతరంబులుగ స్వాతంత్ర్యలక్ష్మి మహో
దయముఁ గోరి విదేశధరణీ పతుల
మాఱొడ్డి బాహు శుంభత్ప్రతాపముఁజూపి
ధనధాన్య వస్తు వాహనయుతముగ
సర్వార్పణ మొనర్చి శాశ్వత ధన్యత్వ
మందు టెవ్వరికి వంద్యంబుగాదు

గీ॥ హృదయము గలట్టి మానవుండెవఁడు వారి
యడుగులను గొల్చి యహితుల నణఁచి జన్మ
పావనము సేయఁ డాతని బ్రదుకదేల
బల మదేల నిరర్థకైశ్వర్య మేల. 165

మ॥ అకటా! ముప్పదికోట్ల హైందవులు మోయన్ దగ్గ భారంబుఁ గొం
కక నీవొక్కఁడ వెత్తికోఁదలఁచి తింకన్ నిన్ను సేవించి గొం
తుక లర్పించెడు వారు పూజ్యులగు భక్తుల్ నీపతాకంబు క్రిం
దకి రానొల్లని వార లందఱును మాతృద్రోహులున్ వంచకుల్. 166

మ॥ పొదలన్ వెల్వడు దొడ్డక్రోలుపులు లేపున్ జూపు నాసింగపుం
గొదమల్ వీరని శాత్రవుల్ బెదురు నుక్కుందుంటలున్నార వేఁ
బదివే ఱ్లెంకలు భిల్లవంశజులు నీపాదాబ్జముల్ గొల్వ నే
కొదలేకుండఁగ నందఱున్ బనిచి నీకున్ బ్రీతిఁ గావించెదన్. 167

సీ॥ వెదురు పొదలనుండి ప్రిదిలిన యాణిము
త్యములు కుప్పలు కుప్పలై రహించు
పణి ఫణాగ్రములందుఁబండి రాలిన మణుల్
పరుపులు పరుపులై పరిఢవిల్లు
గనుల మొల్చిన యనర్ఘ స్వర్ణ రౌప్యాది
లోహముల్ పెనుకొండలుగఁ దనర్చు
శైలసానువులలోఁ జంద్రకాంతశిల లీ
జగ మంతటికినైనఁజాలియుండుఁ

గీ॥ బెరుగుటయె కాని తఱుఁగుట యెఱుఁగనట్టి
రత్న గర్భ సార్థముగ నారాజ్య సీమ

యూఁచముట్టుగ నాయొద్దనున్న సిరులు
నాథ! నీమ్రోల సర్వార్పణం బొనర్తు. 168

మ॥ రవిబింబ ధ్వజ మొప్ప నీ వనికిఁ జేరన్ నీకు ముస్మ్రన్నె యా
రవికన్నన్ మునుదోఁచు నప్పొడుపుఁ దారన్ బోలె జృంభించి యా
హవ రంగాభ్రమిఁ జొచ్చి శాత్రవ కులధ్వాంతంబుఁ జీల్తున్ బ్రతా
ప విభుండన్న పిరంగి కీఘనుఁడయః ప్రస్ఫీత గోళంబనన్, 169

సీ॥ పారతంత్ర్య మదల్చి స్వాతంత్ర్యమును నిల్పు
బవరమ్ము వచ్చె సంవత్సరాది
పండుగవోలె నీభారత ప్రజకెల్ల
సమాగమైన యుత్సాహ వేళ
యందఱు మొక మొగంబై నిల్చి యరుల గె
ల్చితిమేని స్వాతంత్ర్యసిద్ధి యొదవు
ననిలోనఁ బడినఁ గల్పాంతంబు వఱకు శా
శ్వత నాకలోక వాసంబు గలుగు

గీ॥ రెంట నేది గల్గినఁ గృతకృత్యులగుదు
మింత కన్నను జిరపుణ్యమేది గలదు
మీన మేషంబులను బొర్లద్రుమించకుండ
నిపుడె ప్రస్థానభేరి మ్రోయింపవయ్య. 170

—• ప్రతాపసింహు నిర్ణయము నిబంధనములు •—

మ॥ అని గాంభీర్యము పూరుషాకృతిని దృశ్యంబౌచు నిందుండెనో
యనఁ గూర్చున్నఁ బ్రతాపసింహుఁడు మహాత్మా! నీ కసాధ్యంబు గ
ల్గునె యీనాఁటి కిరాత వేషమునఁ జెల్వంబోటి వెన్వెంట లే
దను చే కాని పురాకిరాతుఁడవు గావా శత్రుపూర్ణాహుతా!. 171

గీ॥ త్యాగమూర్తులు వీరధర్మైక నిరతు
లింద యుండఁగ జయసిద్ధికేమి కొఱఁత
యాకసము వ్రాలుఁగాక చేయప్పళించి
యావఁ గలము విపత్కోటి నోపఁగలము. 172

సీ॥ సమరముల్ నిష్కారణమ రేఁగి రత్నగ
ర్భయు రక్తగర్భయౌ పనికిఁ జాల
నొకచీమకైన నించుక హాని గలిగినఁ
గనలేను; బారతావనిని గలుగు
తరు లతా గుల్మ భూ ధర గహ్వరములఁ బ్రే
మింతుఁ బ్రాణమును బ్రేమించు నట్లు
నాదు హృద్బంధు లిందఱ మిమ్ముఁ గొనిపోయి
రణరంగమునను శాత్రవుల కత్తి
గీ॥ వాదరల కప్పగింపఁగా వలయు ననిన
మేరు వంతటి బాధ జన్మించు నాకుఁ
గటకటా! కోరరాని దుష్కార్యముల ర
ణంబు వంతటి ఘోర కృత్యంబు గలదె 173

గీ॥ అలరుమేవాడ లక్ష్మి ము ఖాబ్జమునకుఁ
గుంకుమం బట్టి చిత్తూరు గుఱుతుఁబాపి
యిపుడు హారావళీసీమ నెల్లఁ గొనఁగ
నక్బరు తలంచినటు తెలియంగ నయ్యె. 174

గీ॥ రాజ్యలక్ష్మి సేనాలక్ష్మి రౌప్యలక్ష్మి
లంచములు చూపి యతఁడు వంచించి తీఱు
నెంత బలవిక్రమము లున్న నిపుడు మనకు
నాత్మనిగ్రహమును ద్యాగ మవసరంబు 175

గీ॥ ఏను మొదలుగ సామంతు లెల్ల ప్రజలు
రజత సౌవర్ణ రత్న పాత్రములు విడిచి.
ప్రకృతి యర్పించు పచ్చడా పళ్లెరములు
చదురుటాకులందున మెసపుదము గాక. 176

గీ॥ తలఁచిన మనోరథప్రాప్తి గలుగుదాఁక
వ్రతము నడపిన దశరథ రాము కరణి
హంసతూలికా తల్పమ్ము లవల విడిచి
మృదుల దర్భాసనముల నుండుదము గాక. 177

క॥ పెరుగును గావున చికురో
త్కరము శిర శ్చుబుక గండతలముల భద్రా
కరణము సేయింపక యుం
దురుగాత మహర్షికోటితో నెనయగుచున్. 178

క॥ మొరయునుగావుత ముందఱ
మొరసెడు దుందుభులు వెనుకమొగ్గమై యనిలో
నఱ నిదురయు నఱ కడుపును
బొరయంగఁ బూనుదము వీరపూర్ణ వ్రతమున్. 179

సీ॥ ఈశ్వర పదభక్తియెపుడు మానఁగరాదు
మధుమాంస సేవన మఱగరాదు
బంగారు పట్టు వల్వాలు గట్టఁగారాదు
భోగకోటుల వంకఁ బోవరాదు
కామాది శత్రు వర్గము లంటరాదు స
త్యంబు శౌచము విడనాడరాదు
త్యాగంబుఁ గల నైనఁ దగ్గనీయంగరా
దాత్మ నిగ్రహము పోనాడరాదు
గీ॥ మాన ముత్తమధనమాట మఱువ రాదు
ధర్మమే దైవమనుబుద్ధి తలఁగరాదు
నిఖిల జగములు మాఱొడ్డి నిలుపఁగాక
దేశభక్తిని విడనాడి తిరుగరాదు. 180

సీ॥ స్వాతంత్ర్య ధర్మవాంఛాశీలురగు వారి
దారిఁగష్టంబులు చేరియుండు
నావిపత్కోటితో నడలక వీరులు
శాశ్వత యుద్ధంబు సలుపవలయు
ననుపమ త్యాగ సమారాధనములతో
ధర్మదేవతఁ గొల్చి తనుపవలయుఁ
దదృక్తజన జీవితమ్ము దుర్దమ తపో
మయమై సురక్షితంబయి తనర్చు

గీ॥ మహితకష్టానుభూతి ధర్మంబు పొలుచు
నపజయంబుల నది తగ్గ కతిశయిల్లుఁ
గాన విజయంబె ముఖ్యంబు గాదు మనకు
దర్మనిర్వహణంబు కర్తవ్య మెపుడు။ 181

సీ॥ ఉదయమే లేచి తే పుదయపురము వీడి
కుంభల్ మియర్ కోటకును జనుదము;
పదివేల పల్లెల ప్రజలు స్వస్వనివాస
ములు వీడి యచటికే పోవ వలయుఁ;
పొలములుదున్న నాఁగలి మోపఁగారాదు;
పశువుల నెచట మేపంగరాదు;
బాటల నెవ్వరు పయనింపఁగారాదు;
కూపముల జలంబుఁ గోరిలరాదు။
గీ॥ వనమృగం బొక్కఁడైనఁ జంపంగరాదు;
మరచియో తప్పియో చెట్టైనఁ బుకరాదు;
కేలనొకగడ్డిపోఁచయు గిల్లరాదు;
గిరులు విడనాడి బయలులఁ దిరుగరాదు. 182

శా॥ నీరంధ్ర ద్రుమ పుంజ రంజితమునై నిద్రాణ నానామృగ
స్ఫారంబై భయదాంజనాచల ముటుల్ వ్యాపించె నాజీకటుల్
బారై యంబరుదేశమాదిగ నలుం దాస్సీమయుఁజా దాఁక బ్రి
హ్మారణ్యం బగుఁగాక దేశము జనం బందేగరాకుండఁగఁజా. 183

క॥ తనకించుకయును లాభము
దనరిందనుచు నక్బ రెఱఁగి దండెత్తక యుం
డిన నిరుదెగలకు మేలగు
మన ముంచము కొన్నినాళ్ల మౌనము తోడఁజా. 184

సీ॥ తతహరిశ్చంద్ర మాంధాత్రాదులు చరించు
వజ్రాలబాట నా ధాసుకులము
నరమాత్రుఁ డొకని కే శిర సొగ్గి యిక్ష్వాకు
లకు మసినోఁక నో ర్పకొనలేను

ధరళఖండంబు కంపము పట్టి మేవాడ
మునిఁగి క్రిందికి గ్రుంగి పోవుఁగాని
యవనులతోడి బాంధవమూన నిన్నాళ్ల
మని తురుష్కులకూడు తినఁగజాలఁ 185

గీ॥ గాన బలమెల్లఁ జూపి సంగర మొనర్చి
గెలిచి స్వేచ్ఛాభిమానముల్ నిలుపుకొనుటొ
దురమునను వ్రాలి మరణమొందుటొ నిజంబు
కలుగ దెందును మధ్యమార్గంబు నాకు. 186

క॥ ఇది నానిర్ణయ" మన "మం
చిది యెల్లర కనుసరింపఁ జెల్లు! నటులె చే
యుదు" మని నందఱు గదలుచు
సదనములకు వెళ్లి రధిక సంతోషమునన్. 187

మ॥ "పరివారంబులతో ధనావళులతో వస్తుప్రపంచంబుతో
నరుగన్గావలె నేఁడె యందఱు జనుల్ హారావళీ గహ్వరో
త్కరంబుల్ చేరఁగ; నెవ్వ డాజ్ఞను దిరస్కారంబు గావించినన్
ధరపైరాలుఁ దదీయ శీర్ష'మని మ్రోఁతల్ పెట్టె ఢక్కాధ్వనుల్ 188

గీ॥ అట్టె హారావళీ పర్వతాంతరమునఁ
బరిణయము లొక్కలక్షయు జరిగెనేని
యంత జనబృంద ముండఁబో దనఁగఁదనరె
నఖిలదేశంబు ప్రజయెల్ల నచట నుండె. 189

— మేవాడ్దేశమంతయుఁ బాడువడి యరణ్యముగ మాఱుట —

సీ॥ రాజులు నివసించు ప్రాసాదములు గూలి
వన మృగంబులకు నివాస మయ్యెఁ;
బొలములలోన విత్తులు రాలి మొలిచి చె
ట్లాకాశమును దాఁకు నట్లు పెరిగెఁ
గొలఁకులలోఁ గూపములలో జలము నిల్చి
పాఱుక లేమిని బాడు వడియె

నరులు సోఁకమి స్వేచ్ఛఁబెరుగుచు నొకటికి
వేయిగా మృగములు వృద్ధినొందె

గీ॥ నలఘు రావీ వనాశాంతరావనీత
లము లతావృక్షమృగవిహంగమవృతమయి
దేవ దానవులకు సైనఁదేరి చూడ
రాక చొరరాక మృత్యు వర్త్మముగఁ దనరె. 190

గీ॥ తరులు రాపాడు మ్రోత వాతముల మ్రోత
మృగవితతి మ్రోత పలుసెలయేళ్ల మ్రోత
ఖగ తతుల మ్రోత గలిసి యొంకార నాద
మెపుడు నల్దెసలందుఁ బైకెగయు చుండె. 191

మ॥ ఒకమాఱా 'బదనూ' రరణ్యములలో నుద్దండులై శత్రు సై
నికు లేతేరఁగ నా ప్రతాప విభుఁడున్ వీక్షించి యాత్మీయ సై
న్య కదంబములతోడ వచ్చి మదశుండాలమ్ములన్ జీల్చు సిం
హకిశోరంబటు దాఁకి కూల్చెను జగంబౌరా యటం చెన్నఁగన్. 192

ఉ॥ వేఱొకసారి యుల్లి పదివేలభటుల్ షహబాజుఖాను వి
త్తూరికి వెళ్ళుచుండఁగ మహోగ్రవనంబున ముట్టడించె వా
రూఱక నిల్చిరందఱు దయోదయుఁడౌచుఁ బ్రతాపుఁ డంత సం
హారము సేయకే విడిచె నద్దిర! యాతని ధర్మ మెట్టిదో. 193

సీ॥ గొల్లలు మేకలఁగొని మేపుదు రటంచు
బచ్చిక బయళులఁజొచ్చి చూచుఁ
గాఁపు పొలాన నాఁగలి మోపునో యంచు
మారుప్రదేశముల్ తొంగి చూచు
వేఁటరుల్ మెకములపింపుఁ జంపుదురంచు
మోర వనంబులుదూరి చూచుఁ
దరుల బోయలును వాగుర లొడ్డెదు రటంచుఁ
గొండపై కెక్కి యుందుండి చూచు

గీ॥ సాలుంబ్రాధిపతి వెంటనంటి యుండ
దేశ మెల్లెడఁ దిరిగి శోధించు చుండుఁ

దనదు నానతి లవమైనఁ దప్పెనేని
ప్రళయ మగుఁగాక యెవ్వాఁడు బ్రతుకఁ గలఁడు. 194

గీ॥ భోగసన్న్యాసమున పరిపూర్ణ దీక్ష
పట్టి యిటుఁ బ్రతాపుఁడు కష్టపడుచు నుండ
రాజ్య తృష్ణాభరైక పూర్ణవ్రతంబు
దీక్ష గాని యక్బ రచట సాధించు చుండె 195

—• అక్బరు సార్వభౌముని దిగ్విజయములు. •—

సీ॥ అంబరు దేశమందా రణస్తంభ పు
రము నాఘనుఁడు పాలనము నొనర్చె
నల శమంతకసింహుఁడను వీరుఁ డాదుర్గ
మును వాని కడనుండి కొనుచు 'నుదయ
పురికి నంకితుఁడవై పరిపాలనము సేయు'
మని తనపతి భూరధనున కిచ్చెఁ
గోటవాఁకిటనున్న గొప్పపల్లె శమంత
కుఁడు గాని తా నేలుకొనుచు నుండె

గీ॥ గొండకన్న దుర్భేద మాకోటఁగానఁగ
నందువిడిసి యక్బరు నిల్చెరెండు నెలలు
చెంతనున్న మందంత పోసినను గాని
జయమొదవుసన్న యాస లేశమును లేక. 196

సీ॥ తురకలు సంధిగోరిరి దుర్గపతి యొప్పె
సేవకుఁడును మానసింహుఁ డరిగె
రందఱాస్థానమునందుఁజేరిరి భార
ఘనరావు పినతండ్రి తనకెదురుగ
మానసింహుని పితమాని నిల్చిన భటుఁ
గనుతెప్ప పెట్ట కొక్కగతిఁ జూచి
యక్బరని గ్రహించి యతని చేతులు వట్టి
సింహపీఠమున నాసీనుఁజేసె

గీ॥ నక్బరును మూరథసరాపు నాదరించి
కాశికా మండల మొసంగి గారవించెఁ
గోట వెలికి రాఁదలఁచెఁ గవాటసీమ
నతనిఁ దాఁకె శమంతకుం డతిభయమున. 197

మ॥ "పురముల్ పోయిన రాజ్యముల్ చెడిన నెప్డున్ మాన రాణాయె సు
స్థిరదైవంబగు నట్టి స్వామి పదభక్తిన్ మాని మొగల్ ధరే
శ్వరు పాదంబులు గొల్వ నూరకనుఁడెన్ భాగ్యమ్ము నాసించి యో
హారవంశాగ్రణులార యీయఘము మర్త్యాపారముల్ మెత్తురే" 198

మ॥ అని తానున్ దసు గొల్చుచున్న హారవంశ్యశ్రేష్ఠులా సద్భటుల్
చని యొక్కుమ్మడి వారలన్ దగిలి యాస్వాతంత్ర్య యుద్ధంబునన్
చనువుల్ వీడుచు నిత్యనాకసుఖ మొందన్ బోయి రాదేశ భ
క్తిని లోకంబులు మెచ్చి వారియశమున్ గీర్తించె వేనోళ్లన్ 199

గీ॥ రామచంద్రుఁడు రీవామహా మహీంద్రుఁ
డలఘు కాలంజరీ దుర్గ మప్పగించె
బాజబహాదూ రొసంగె మాళ్వము సహస్ర
వాజి పతులౌచుఁ గొలిచి రక్బరును వారు. 200

గీ॥ జోధబాయి మార్వార్మహీశుని తనూజ
గనె జహంగీరు తక్కిన కాంతలందు
నక్బరు 'మురాదు' దనియాలుననెడు సుతులఁ
బుత్రికామణు లొక్క రిర్వురను బడసె. 201

—• అక్బరు సార్వభౌముఁడు ఘూర్జరదేశము జయించుట. •—

మ॥ జనసమ్మర్దము ఘూర్జరంబు 'ముజఫర్షా' యన్న భూమీశుఁ డా
ఘనుఁడున్ బాలనసేయఁగా నచటి కక్బర్ కొంత సైన్యంబుతోఁ
జనె వాఁడెంతయు భీతుఁడై యతని పజ్జన్ జేరె డిల్లీశుఁ డా
తని సీమన్ గాని కొన్నిపల్లె లొసఁగెన్ దజ్జీవ నార్థంబుగన్. 202

మ॥ మును బైరాముఁడు రాజరక్షకుఁడు తత్పుత్రున్ బదాతేంద్ర వా
నిని నబ్దూరహిమాను సైన్యపతిగానేమించి యాఘూర్జరం

బునకుఁ రెండవమాఱు సేనల రణంబుఁ జేయఁగా నక్బరుఁ
గొనిపోయెఁ బచరాప రావని వడంకుఁ బొంది ఘోషిల్లఁగఁ. 203

సీ॥ ఉభయ సేనలకు మహోద్ధత యుద్ధంబు
పడిసె నహమ్మదాబాదు ప్రాంత
నక్బరుపతి ఘూర్జ రాధిపు రణరంగ
మందుఁ బెల్లుగఁదాఁకి బందెఁ గొనియె
సమర మంతయు నొందె జయ మక్బరు వరించె
ఖాండీషు క్రైరాయు గదియవాడ
కాంబె బ్రోచియు రివాకాంత మాహీకాంత,
రాధాపురంబు సూరతు బలిస్న
గీ॥ పయి బరోడా యహమ్మదాబాదు మఱియుఁ
బాలనపురాది బహుమండ లాలి యవన
సార్వభౌముని మృదుపదాబ్జములు చేరి
యేఁబదియు లక్షల ధనంబు నియ్యఁదొడఁగె. 204

—• అక్బరుసార్వభౌముఁడు వంగదేశమును జయించుట •—

మ॥ వరుసఁ వంగ విహారముల్ కొనఁగ నక్బర్ కోరె; నాసీమలఁ
బరిపాలించె సుఖప్రదమ్ముగ సులేమాఁ ఖానుఁ; డావీరుఁడుఁ
మరణం బొందనమీదఁ దత్సుతుఁడు సమార్భిట్టయ్యె దావూదు ము
ష్కరుఁడై లోకుల బాధపెట్టుచును రాజ్యంబేలె వాఁడయ్యెడఁ. 205

సీ॥ ధనము లక్షలు కోట్లుదనరె నర్వది వేవు
రాశ్వికుల్ మూఁడువేలాఱునూర్లు
ద్విరదంబు లిర్వదివేల్ పిరంగులను ల
క్షయును నల్వదివేలు కాలిబంట్లు
పదినూర్లు యుద్ధనావలు గల్గి దావూదు
చక్రవర్తిని లెక్క సలుపఁబోక
సరిహద్దు నందున్న 'జామేనియా' దుర్గ
మును సేనలను గొంచు ముట్టడించె

గీ॥ నదియుఁ గోప కారణమయ్యె నక్బరునకు
మానసింహుఁడు తోడర మల్లువీర
బలుఁడు ఖాసిముఖానాది ప్రబలవీరు
లండఁ గొలువుండ వెడలె బ్రహ్మాండ మద్రువ. 206

మ॥ అమర ద్వీపవతీ తటాంతరమునన్ హాజీపుర ప్రాజ్య దు
ర్గమునన్ జేకొని పాటలీ నగర దుర్గంబున్ గొనెన్! పెక్కు యు
ద్ధములన్ జేసి విహార వంగముల నాతర్వాత నోఢ్రంబునన్
గ్రమ మొప్పన్ గ్రహియించె నక్బరు సమిద్గాండీవి యీతండనన్. 207

క॥ పరిపూర్ణ విజయమున న
క్బరు ఢిల్లీపురముఁ జేరి కడు సంతోష
స్ఫురణమున మానసింహుని
సరసకుఁ బిలిపించి గోష్ఠి సలిపెడువేళన్. 208

{ అక్బరుసార్వభౌముఁడు కున్వార్ మానసింహప్రభువుతో మంత్రాంగము చేయుట. }

మ॥ పదమూఁడేడులు దాఁటిదాఁటకయె లేఁబ్రాయంబునన్ దండ్రియున్
ద్రిదివం బేగెను; నాఁటినుండియు ధరిత్రీ రాజ్యభారంబు నన్
గదిసెన్; దేవునికూర్మి సర్వమును జక్కన్దాల్చి కల్యాణ సం
పదలన్ లోపము గల్గకుండ నెపుడున్ వర్ధిల్లఁగాఁ జేసితిన్. 209

సీ॥ తెగిన హారమున ముత్తియములువోలె భా
రతరాజ్యమది పెక్కు ప్రక్కలగుచుఁ
జిన చిన్నపాయలై చెడె; రాష్ట్రపతులలో
నొండొరులకు మైత్రి యొదవ దెపుడు
నిత్యలక్ష్మి శుభ నిలయములై యుండ
వలయు రాజ్యములు శాశ్వత రణముల
ధనజన వస్తువాహన శూన్యమైపాడు
వడి శ్మశానములట్లు ప్రభఁ దొలంగె
గీ॥ నిట్టి కుజ్జావతారంబు లెల్లఁడోయి
భరతఖండ మఖండ్డైత ధాగ్యవిభవ

నిలయమైయుండఁ జూడఁగా వలయు ననుచుఁ
గడుపులోఁ గొండ యంతాస గలిగె నాకు 210

సీ॥ సింహాసనం బధిష్ఠించినదాది నీ
భావమేమద పేరు పాఱియుండె
నాగ్రి మొదల్గాగ ననుదినం బొక్కొక్క
రాజ్యంబు గెలిచి రాష్ట్రమునఁ జేర్చి
పారిజాత మృదుగంధ వహానట్లు భారత
మేదినీతల మాక్రమించి ప్రజల
కామోద సౌభాగ్య మలవరించుచు రామ
రాజ్య విఖ్యాతిఁ గూర్పంగఁ గంటి
గీ॥ నొందొ యొక రిరుపురు రాజ్యతృష్ణచేత
నక్బరును దిగ్జయ మొనర్చు నంతుఁగాని
సత్యమీవెఱుంగవె ధాత్రి జనులెఱుఁగరె
భువనములనేలు నాదిదేవుం డెఱుఁగఁడె 211

సీ॥ సహగమనము భీతి సడలించియుంటి, న
న్యాయమౌ పన్నుల నణఁచియుంటి;
మధుమాంస సేవన మాన్పితి; భారత
నృపులతో వియ్యంబు నెఱపుచుంటి;
నొకకంట నమృత మింకొకకంట సున్నంబు
గలిగి వీక్షింప; మొగలులు హైంద
వులటన్న భేదంబు గలుగదు; మీలోన
మత్ప్రాణసము లెంత మందిలేరు
గీ॥ భారతాభ్యుదయముఁ గూర్చి పవలు రేయు
నేనుపడుబాధ లా దేవుఁడే యెఱుంగు
నీకుఁ జెప్పినఁ దప్పున్నదే కనులకు
క్షణము నేపైన నిద్దుర గదియరాదు 212

శా॥ రారాజై మితిలేని సౌఖ్యభరముఁ బ్రాపించి యున్నాఁడటం
చీరెన్నందగుఁగాక,. నాదు హృదయం బెట్లొక్క చింతాగ్నిచే

క్షీరాంభోనిధి క్రూరబాడబ మహాగ్నిజ్వాలచేఁ బోలేఁ గం
గారాషంబును; దాని బాధలకు గుర్రింగన్ సాగితిన్ బెల్లుగన్ 213

మ॥ అది యెవ్వారిల తోడనేఁ దెలుపరా దద్దాని నెవ్వారు తీ
ర్చెదమన్నన్ మఱి తీరఁదోవ, దెపుడున్ జింతించి చింతించి నేఁ
డుదిదాఁకన్ మది నోర్వనే వలయు; నెంతో కూర్చు మిత్రుండ వ
య్యది నేఁజెప్పిన నీదుమానసము చింతాయత్తమై క్రుంగెడున్. 214

చ॥ ఇరువదియేండ్లుగాఁగ సహియించుచు నుంటిని; యెన్నిమార్లొ నీ
వెఱుఁగవుగాని యేకతమ యుద్ధుర ముండిన యప్దునావ్యథా
భర మిటులుండెనంచుఁ దెలుపన్ గమనించితి; నంతలో హృదం
తరము కలంగి మాటయయినన్ వెలిదాటక నిల్చిపోయితిన్. 215

చ॥ ఒకయెడ సింధువాహిని మఱొక్కెడఁ బూజ్యము బ్రహ్మపుత్ర యిం
కొకయెడ వింధ్యభూమిధర ముత్తరమందు హిమాలయంబు వీ
నికి నడుమన్ గలట్టి యవనీస్థలి నాపరిపాలమ్మునన్
వికసన మొంది భూప్రజయు నేనును సౌఖ్యముఁగంటి మెంతయున్ 216

మ॥ అరులెల్లన్ నశియించి; రక్కరిన నాహా! యంతరాజేఁడి యం
దురు; గర్భంబు ఫలించి పుత్రికలు పుత్రుల్ గల్గి; రత్యంత దా
గ్యరమల్ పొల్చెడి; కోటిమంది హితు; లింకన్ బ్రాయమోస్వల్ప మే
కొఱఁతల్లేవు; మహోన్నతస్థితులె నాకున్ జెల్లె నేనాఁటికిన్, 217

మ॥ అమరాధీశుఁడుగూడ నాసవను నార్యావర్త దేశంబు స
ర్వము నాఛత్రము క్రిందికై నడిచె, మేవాడ్ రాజ్య మొక్కండుమా
త్రము సాతంత్ర్యర మాభిమానముల మత్ప్రాజ్యాధికారంబు లే
శము మన్నింపక గర్వముల్ బలిసి శీర్షంబెత్తి క్రేణించెడున్. 218

చ॥ ననుగడుఁబేర్మిమైఁ గనుచు నాపరిభుతన్ మదిమెచ్చి కన్య ని
చ్చిన మిమువంటివారి వెలిచేసి ప్రతాపనృపుండు పంక్తిభో
జనములకైన నించుకయు నైపక తేలికచేసిచూచె, మీ
ఘనతకు హానివచ్చినను గల్గవె నాకు విషాద వేదనల్ 219

చ॥ కలుగఁగరాదు లాభమొక కాసును నాతని దేశమందు లో
కులఁ బురముల్ త్యజించుచును గొండలనుండఁగఁ బిల్చి సంపదల్

వెలసెడి దేశమెల్లఁ బెనుపీడుగఁ జేసె, వివేక మున్నదే
యెలుకలదాడి కోడితనయింటికి నిప్పిడు కూళలుందురే? 220

ఉ॥ ఆదిమ సూర్యవంశభవుఁ డంట, తురుష్కులఁజేరి కొల్వుఁగా
రాదఁట నల్వురెవ్వరొ పరాక్రమ వాక్యము లాడినంత మా
మీఁదికిఁగాలుదువ్వెనఁట, మేము భయంపడి పారిమున్న మ
ర్యాదఁట' కాకరేఁగినను నంతయుచేయు నటంట, వింటివే 221

మ॥ మఱి నాయొద్దను జేరుభూమిపతులన్ మర్యాదతోఁ జూడనో
ధరణీభాగము లియ్యనో? పిలిచి బాంధవ్యంబు చేకూర్పనో
చిరమైత్రిన్ విహరింపనో నృపుల నన్ సేవించిచేదేమి మే
సిరి? తానింతటి పొర్ధ్వ మేమిటికిఁ దాల్చెన్? చెప్పఁగాఁ జాలుదే 222

సీ॥ నేఁగోరునదిమెల్ల నిఖిలభారతఖండ
భాగ మొక్కండేల వలయు ననియె
యెపు డిర్వురు స్వతంత్రు లిటనుండఁ జోటుండ
రాదు! లోకము పెద్ద రాజననుచు
నంగీకరించె నన్నాతఁ డంగీకరిం
చిన దాన నిసుమంత చేటుగలదె
తనకిరీటంబు క్రిందను వార్లునే' వట్టి
పేదసరకట్లె యన్పించు కొనుటె
గీ॥ కాని: నేరేఁగినను నాపఁగలుగువార
లేరి' దానెంత' తనదేశ మెంత!తనదు
సేనయది యెంత' హృదయంబు శైనమిమ్మొ
వంటివారలఁ గని యూరకుంటిఁగాక. 223

సీ॥ నిజము చెప్పటకేమి నీవాతనినిగూర్చి
పలుమాఱు గడుఁగౌరవంబునెరపి
పలుకుటఁజేసి నీభావ మెచ్చుటనొచ్చు
నోయంచు నట్టులో యోర్చియుంటి
"నీవాఁడ" ననుమను; నేనేలనీకిష్ట
మైనట్టులతని మర్యాదచేయు

మతఁడు స్వతంత్రుఁడై యలర రాదనికాదు
దేశ మొక్కటిగ వర్ధిల్లవలయు
గీ॥ ననుచు నింతగఁ జింతింతు నని మాత్ర
మంతకంతకుఁ బెరిగెఁ; రాజ్యంబు పాడు
వడియెఁ; నేమనఁగూడక యెడరుపడితి
హృదయశల్యము పాయుచొప్పెఱుఁగ నైతి 224

చ॥ నిను కడమాటగా వినుతుఁ! బెద్దయుఁ గాలముగా శరీరమున్
దినియెడి రాచపుండువలెఁ దీరని వ్యాధియుఁబోలె నాప్రతా
పునిదెసనైన చింతఁదనుపున్ మనసున్ వ్రణమయ్యెఁ; నేగతిన్
దినములుదాటుఁ! దీఱదిది దేహముతోడుతఁగాని యూజనిన్ 225

మ॥ అకటా! చల్లఁగనింట నన్నిలిపి యాయస్తాద్రి యందుండి చూ
డ్కికిన్రేఁగా నుదయాద్రిదాఁకఁ గల దిగ్దేశమ్ములన్ గెల్చి లా
భకళల్ నించెడు నీవునాప్తమణివై వర్తింపియున్ జింతఁ బా
యక నేనెప్పుడు క్రుంగిపోవలసెఁ! గట్టా! దైవమెబ్భంగిదో" 226

—• అక్బరు చక్రవర్తికి మానసింహ ప్రభువుమనస్తాపోప •—
శమనము చేయుట.

మ॥ అని యాస్యంబును వాల్చిచూపు ధరపై వ్యాపింపఁగాఁ జేసి చిం
తనుసూచింపఁగ మానసింహుఁడు ప్రచండ ప్రాభవోద్దండుఁ డా
తనివీక్షించుచు "దీనికింతపడిఁ జింతన్ బొందఁగా నేటి; క్రీ
పనినీకోరిన యట్లు తీర్పఁగను మద్భారంబు! నీకేటికిన్ 227

ఉ॥ ఇంతకు నీవుకోరుపని నెవ్వరికేనియుఁ దప్పపట్టఁ గా
సంతయుఁ జోటులేదు! జగమంతయు నేమముఁనొందు సౌఖ్యసి
ద్ధాంతమె చూపినావు! తఱిదైనపు డమ్మహనీయుఁ జూచి త
త్స్వాంత మెఱింగి వీలయిన యట్టులు కార్యము నిర్వహించెదన్. 228

సీ॥ అతఁడు మాకులముల కధిపతి; యతని శ్రే
యముఁ జూడ మాధర్మ మండ్రు; కాని
యెప్పటి మాటలో! యెన్నటిజోలియో
వినుటయే యతని నేఁగని యెఱుంగ

ధ్వజినీ పతిత్వసంబంధంబు సామంత
భావంబు వియ్యంబు బాంధవంబు
పెండ్లి పూండ్లును దాటు హితవృత్తి యెల్లప్పు
సముఖమ్మున మెలంగు చనవు కలిమి

గీ॥ పయిని నొకవేయి సంబంధ బంధములును
దొడరిపూల సంకెలలు నామెడనుబట్టుచుఁ
గట్టువడినాఁడ నీపాద కమలములకు
నాతనికిఁ గూర్తునే? నిన్నె యనుసరింతు. 229

గీ॥ ఉదయపురిపైన దండెత్తి కదియఁబోవ
స్వల్పరాజ్యము; నీడాక సైపలేదు
మృదుశిరీష పుష్పమ్ము; తుమ్మెదయెవ్రాల
నోర్వదుః జగేశ్వరుఁడు త్రొక్క నోర్వఁగలదె" 230

చ॥ అన "సరి! యట్లుచేయు" మన నక్బరు "పెక్కురు కార్యదక్షులన్
బనిచితి; రెండుసారులుగ వారలు ఘూర్జరదేశ మేగి యం
దునఁగల రాజ్యకార్యములు తోఁచిన యట్టులు తీర్చిరైనఁ బా
లనము స్థిరత్వమున్ గనిన లాగగుపింపదు పెక్కులేండ్లకున్" 230

— మానసింహాప్రభువు ఘూర్జమునకు వెడలుట —

కం॥ అనిన "నదియెంతపని? చె
మ్మని పలుకుచు మానసింహుఁ డామఱునాఁడే
తనవెంటఁ గొంతసైన్యముఁ
గొనుచుఁ బ్రయాణం బొనర్చె ఘూర్జరమునకున్ 232

చ॥ చనియటనున్న కార్యములు సర్వముఁ దీర్చి యుత్తమ వ్యవ
స్థను నెలకొల్పె. రాజ్యరమ సర్వసుఖంబులు గాంచి వృద్ధినొం
దెను; బలవంతుఁడున్ ప్రబల నిర్ఝర మెంతటి దుర్గమస్థలం
బునయినఁ జీల్చి చొచ్చుకొని పోవునటంచను పల్కునిల్పుచున్. 233

మ॥ తనయంబర్ పురిఁ జేరఁగా మఱలి మధ్యన్ గల్గు మార్గంబునన్
జనుచో నొక్కెడ మానసింహుఁడు "కడున్ సద్భక్తి నీపాద ద

ర్పనముఁ జేయఁగఁ గోర్కెగల్గెఁ నిదెయాజ్ఞఁ వేగఁ బాలింపవే''
యనిమామఁ జయమల్లుఁ బంచెను బ్రతాపాధీశు నర్థింపగన్ 234

చ॥ కదిసి ప్రతాఃసింహనృపుఁ గార్యమలం దెఱిఁగించె, సమ్మదా
స్పదుఁడయి భూవిభుండు దయి సాగరసీమను జూతు నన్నవా
ర్తఁ దెలిపె నాతఁ, డిచ్చటఁ బ్రతాపుఁడు నచ్చట మానసింహుఁ డ
య్యుదయపురంబుఁ జేర గమనోన్ముఖులై చని చేరిరిర్వురున్ 235

గీ॥ అన్నియును బర్ణశాలలే, యంతరమున
నన్ని దర్భాసనంబులే, యన్నిచోట్ల
నతినిరాడంబరత్వమే, యందఱ ముఖ
ముల నమాయికత్వంపు ముద్రలే, రహించె 236

గీ॥ అచటి యందఱు భోగసన్యాసిమణులు
పరమహంస ముఖ్యుఁడు ప్రతాపప్రభుండు
పఱ్ఱ నున్న గంభీరా స్రవంతి వోలెఁ
బరమ గంభీర మందఱ భావవృత్తి. 237

గీ॥ అతుల సువిశాల పర్ణ శాలాంతరమున
మృదుల దర్భాసనంబులు వదిదనర్ప
నొక్క దానిపైనఁ బ్రతాపుఁడుండె నతని
చెంతనే సలుంబ్రా కృష్ణసింహుఁడుండె. 238

—— మానసింహప్రభుపు ప్రతాపసింహుని దర్శించుకొనుట. ——

సీ॥ వజ్ర దీధితులు శుభ్ర కపోలములపైన
నాట్యమ్ము సలుపు కుండలము లలరఁ
బరమదుర్లభ మహాభాగ్యరేఖ లెసంగు
రమణీయ దీర్ఘనేత్రములు దనర
సౌందర్య దేవతా సదనమై సంపూర్ణ
చంద్రుని గేరు నాస్యంబు వెలుఁగ
క్షితి నెల్లఁ బ్రుటీని వశీకృతి గావించు
భూరి లక్షణ దివ్యమూర్తి యమర

గీ॥ మంచి చందురుకావి రుమాలుపైన
రాజ చిహ్నమౌ మగణా తురాయి గులుక
మానసింహుండు ప్రబలాభిమానధనుఁడు
హయముడిగి పర్ణశాలకు నరుగుదెంచె. 239

మ॥ కరముల్ రెంటను మోడ్చి భూమిపయి మోకాలూని కూర్చుండుచున్
శిరమున్ వంచి నమస్కృతుల్ సలిపినిల్చెన్ మానసింహుండు, సా
దరచిత్తుండు ప్రతాపసింహవిభుఁ డుత్సాహంబుతో "నంబరే
శ్వర ! రమ్మిచ్చటఁ గూరుచుండు" మని సంభావించి సంప్రీతిమై. 240

గీ॥ "రాజపుత్ర భూస్థలిఁ గల రాజులందు
నాయనా ! నిన్నుఁబోలు రాణ్మణులు గలరె
ప్రాభవమునందు యశమందు బలమునందు
నింతవాఁడింక లేఁడన నెసఁగినావు 241

చ॥ ఒకత్రుటి యేనియున్ వ్యవధి యుండదు, భారతదేశ కార్యముల్
సకలము నాపయిన్ బడితొలంగవు, వేసవియందు మండుటెం
డకుఁ గడుదూర మిట్లు పయనంబొనరించితి, వెట్టిదొడ్డ కా
ర్యకరణ మూనియో ! తెలుప నర్హమయైనను విందు" నావుఁడున్. 242

మ॥ "నిజధర్మా చరణంబొనర్పఁ బురమున్ దేశంబు సర్వస్వమున్
స్వజనంబున్ విడినాఁడి యెప్పుడు ప్రబల స్వాతంత్ర్యమున్ గొల్చి బే
రజమెక్కింత యెఱుంగ కుండెదు మహారాజర్షి ! నీపాద పం
కజముల్ గొల్చుటకన్న నిప్డుమఱి యేకార్యంబు నాకుండెడిన్ 243

సీ॥ హారావళీపర్వ తాటవిరాజ్యంబు
కొండ గుహలు కొల్వు కూటములును
బూచిన పెనువృక్షములు సితచ్ఛత్రమ్ము
లాగండశిలలు సింహాసనములు
విరుల గుచ్ఛమ్ములు వింజామరమ్ములు
పంచాస్య వితతి సేవక గణంబు
ప్రకృతి సౌందర్యంబు భాగ్య సౌభాగ్యంబు
జ్ఞానషే మోక్ష లక్ష్యంబు గాఁగ

గీ॥ ముప్పదియు నాఱు కులముల భూరమణులు
పాదములు గొల్వఁదగు జగత్పావనుండ
వడవిఁ బడరాని యిడుమలు బడుచునుంటి
ధర్మనిష్ఠుర వీరవ్రతంబుఁ బూని." 244

క॥ అని మానసింహ భూవరుఁ
డనఁగ బ్రతాపుఁడును "మత్కులాభరణులు పూ
ర్వ నృపాలుర ధర్మము నే
ననుసరణ మొనర్చుచుంటి నతిదృఢ నిష్ఠన్. 245

మ॥ స్థిరదీక్షన్‌గొని ధర్మదేవత నుపాసింపన్ బ్రయత్నించు నా
నరులన్ గష్టము లెల్లమార్కొనుః ననం తత్త్యాగ ధైర్యంబు ల
క్కరయో వారికిఁ' జీఁకటుల్ బలియఁ జుక్కల్ తేజమున్‌బెంచు నా
కరణిన్ ధీరులు పెంచుచుందురు విపత్కాలంబునన్ ధైర్యమున్.246

సీ॥ దృక్పథంబున భేదమే కాని దైవద
త్తములెకా కష్ట సౌఖ్యములు రెండు
రెంటిలోఁ గష్ట ముత్కృష్టమంః బ్రదితాను
వలగొన్నవారి పాపములు గడిగి,
ప్రకృతి కజ్ఞానసం పదలఁ బెంపొందించి,
శమదమాదిగుణాళి సంతరించి,
యఖిలజగం బీశ్వరాధీనమని తెల్పి.
యుత్తమ జ్ఞానంబు నొందఁ జేయు
గీ॥ నిరత మాత్మ శోధనచేసి నిశితశిక్ష
పెంచి కష్టానుభూతి ప్రాపించి గాక
మనుజుఁ డొకకోటి యోగముల్ మరగియైన
నుత్తమోత్తమ పురుషత్వ మొందఁగలఁడె 247

మ॥ అమరోద్యానముఁబోలె నెల్లెడ సమగ్రానందమున్ బెంచి లో
కముఁ గల్యాణపు మండపంబటు వెలుంగన్ జేయు స్వాతంత్ర్య ధ
ర్మమహాదేవత మున్గెఁ గిల్బిష సముద్రంబందునన్; రక్త హ
స్తములన్ లేపినలేచు లేవదణుమాత్రన్ రిక్తహస్తంబులన్. 248

మ॥ పొడయెండైనను సోఁకఁగా నెఱుఁగ కెప్డుꣳ శీతలచ్ఛాయలꣳ
బడినꣳ దుఃఖము మాఱెఱుంగక సుఖప్రాబల్య భావంబు లే
ర్పడినꣳ, నొప్పి రవంతయుꣳ దెలియ కశ్రాంతంబు భోగంబు చొ
ప్పడినꣳ, మానవుఁ డాత్మజీవితపు శోభాలాభముల్ చెందునే 249

క॥ నాకష్టంబులఁ గూర్చిచి
వాకొనకుము; కష్టములకు భయపడ'' నన "నాఁ
గాక''నుచు మానసింహుఁడు
"నాకొక్కఁడు తోఁచుఁ' దెల్పినꣳ గనలకుఁడీ 250

—• ప్రతాపసింహునితో మానసింహప్రభువు సంధిమాటలు జరుపుట. •—

సీ॥ కాబూలుమొదలు వంగముదాఁక వ్యాపించు
సకలభూతలమేలు చక్రవర్తి
యవన హైందవులను లవము భేదములేక
సమదృష్టిఁజూచు విజ్ఞానశాలి
యడుగరేకాని తన్నడిగిన రాజ్యమై
న నొసంగఁగలఁ వదాన్య ప్రభుండు
తనచూపుపాఱు దిక్కున నెందపజయంబు
వినరాని రణరంగ విజయమూర్తి

గీ॥ కాలిబం ట్లేఁబదైదు లక్షలును బదియు
నైదులక్ష లాశ్వికదళం బైదువేలు
హస్తితతి గల్గు విశ్వైకభర్త
యక్బరు నృపాలుతుల్యు లీయవనిఁ గలరె! 251

సీ॥ భూదేవి పూలమేల్ముసుఁ గూనెనోయన
వఱలు నుద్యానముల్ పెరుగఁజేసె
ఛత్రముల్ వలెవంగి చలువ నిచ్చెడుచెట్ల
రాజమార్గముల నేర్పాటు చేసె
ద్వాదశవర్షముల్ వర్షంబు లేకున్నఁ
దఱుఁగని చెఱువులఁ ద్రవ్వఁజేసె

మహినెల్ల నీశ్వర మయమనుచుఁ జాటఁ గో
వెలలు దీపములట్లు వెలయఁజేసె
గీ॥ సకల భాషాకవీంద్రుల సత్కరించి
కృతులు వ్రాయించి బహుబహూకృతులు చేసెఁ
ఒదియు నాయుబూబులు సైన్యపతులు గొలువ
మీఱె మర్త్యమలోక మందారుఁ డగుచు. 252

సీ॥ క్ష్మాచక్రమెల్ల నేకచ్ఛత్రమైయుండ
శాసించి దిగ్విజయము లొనర్చుఁ
దనచేఁ బరాభూతిఁ గనిన రాజులనెల్ల
సమ గౌరవమ్మున సత్కరించుఁ
దనయేలుబడిని నొఁదలదాల్తు మనిపించి
వారిదేశమ్ము లవ్వారి కిచ్చు
నీకఁగొంత రాజ్యంబు నిచ్చు! నాస్థానమం
దరసి సేనాధిపత్యంబు నిచ్చు
గీ॥ నెయ్యమునకుఁ దోడుగఁ బెన వియ్యమిచ్చు
నడుగ వేపసఁడాలఁ దేశమైననిచ్చుఁ
గల్పకము మేరుగిరి కామగవియుఁ జేరి
యతని యాకృతి నిలజన్మ మందెనిజము 253

మ॥ అలబృందావనమేగి యిందలి మునీంద్రానీకముల్ గొల్చి గో
కులపాలాన్వయవార్ధి చంద్రుఁడగు నాగోవిందు భావించి క్రో
వెలలన్ నాలుగు గట్టినాఁడు! యవనోర్వీనాథు లీభారతీ
యుల దైవంబుల ద్రొక్కి దేవళములోహో! కట్టి సేవించిరే. 254

సీ॥ ప్రజ బానిసలుచేయఁ బడు చట్టమునునిల్పి
జుట్టుపన్నును దుద ముట్టఁజేసెఁ
బరమేశుఁగొలువ నందఱును సమానార్హు
లని యాత్రికుల పన్ను నణఁచి వైచెఁ
బ్రతిదినోదయము తల్పమునుండి లేచిన
యంతఁ బరబ్రహ్మ మాత్మఁ దలఁచు

నా త్రిమూర్తులకన్న నాదిదేవునికన్నఁ
బూతంబులంచుఁ గోవులకు మ్రొక్కు

గీ॥ నార్షవిధి సూర్యభగవాను నర్చసేయుఁ
దెల్లగడ్డయు మాంసంబుఁదినఁగరోయు
నింకఁ బెక్కైల నీకాల మీగుణమ్ము
లుత్తమ బ్రాహ్మణులకైననున్నె చెపుమ. 255

గీ॥ స్వామి యాతఁడు సద్గురుస్వామి వీవు
నిహ మతఁ డొసంగుఁ బరసౌఖ్య మీవొసంగె
దిరువురును రెండు కనులు నాకేకరీతిఁ
గొలుతు నిరువుర పాదముల్ తల ధరించి. 256

మ॥ భవదత్యుత్తమ ధర్మదీక్ష త్రిజగద్వంద్యంబయో దేశ కా
లవిధుల్ చూచియు నుంతమార్పు కొనినన్ లగ్గయ్యెడిన్ రాజ నీ
తి వికాసం బఖిలార్థసిద్ధులను సంధించున్ వృథా కష్ట న
ష్ట విచారంబులు పెంచుపట్టుల ననుష్ఠానంబు మార్పన్ దగున్. 357

సీ॥ నీవీరధర్మంబు నెపమున లోక మెం
తగ బాధనొందుచున్నదియొ చూడు
ప్రజలు నిల్వఁగ నీడ పడయక తినఁగూడు
కట్ట బట్టయులేక గాసి పడిరి
పాడువడె ధరిత్రి బలియురౌ మగలు కం
కాళమ్ములో యనగానఁ బడిరి
భాగ్యదేవత లట్టి పడఁతులు దుర్భర
దారిద్ర్యదేవతల్గా రహించి

గీ॥ రనుదినం బేకభుక్తంబు నవని శయ్యఁ
గొని ప్రపంచోన్నతుండవై మనఁగఁదగిన
నీవు సన్న్యాసి వేషాన నిలువ, గుండె
దిటవు చెడియెఁ గొండంత సంకటము గలిగె. 258

ఉ॥ నీ రవివంశ గౌరవమునిల్పుట పూర్వమునుండి వచ్చు నా
చారము మాకు క్షందనముసల్పి వచించెద నట్టివానితో

వైరము మేలుగా: దెపుడుఁ బాలును నీరునుబోలె నొక్కఁడై
మీరు మెలంగినన్ జగము మేలుగనున్; సుఖ మగ్గలంబగున్. 259

మ॥ గురువైరాగ్య మహాసముద్రుఁడవు నీకున్ బూర్ణసౌభాగ్య భా
గ్యరమాసేవధి యక్బరీశ్వరునకున్ గల్లోల గంభీర సు
స్థిర పాథోధులఁగూర్చు చిన్న జలసంధిన్ బోలె నే సంధినిన్
వఱలన్ జేసెద: శంభుమాధవుల రేవన్ మైత్రి వర్తింపరే 260

క॥ సిరులఁ దులఁదూగ వలసిన
ధరణిని యుద్ధములులేపి దారుణ వధలన్
జరిపించి రక్తబలులను
నెఱపఁ దలఁపఁ బోకుమనుచు నిన్నర్థింతున్. 261

క॥ అన మోము మందహాసము
చినుకఁ బ్రతాపుఁడును మానసింహు వదనమున్
గని నీవచించు హితముల
కును నామది నెంతయేనిఁ గుతుకంబయ్యెన్. 262

సీ॥ సచరాచర ప్రపంచము పుట్టుటాది యా
త్మస్వేచ్ఛ ప్రథమబాధ్యత నరునకు
నొక మానవుండు వేఱొకనికి లోఁబడి
మనుటయు దైవ సమ్మతముగాదు
ధనరాజ్య విభవ సాధనము లాసగజూపు
వారు వానికి నాస పడెడువారు
సమముగాఁ గలుష భాజను! లైహికాముష్మి
కసుఖముల్ వారికిఁ గలుగఁబోవు

గీ॥ స్వేచ్ఛ మదినెంచి స్వజనంబు నెల్లసిరులు
ప్రాణమును సర్వమునుబాయు వారియెడల
దైవమే లేకయున్న నీధరణియందు
సత్యమేలేదు: పైన నీశ్వరుఁడె లేఁడు. 263

సీ॥ రాజనీతియును ధర్మం బీద్వయిని నీతి
తఱచుగా లాభప్రదముగ్య దోఁదుఁ

గాని రాజోపభోగముల నైశ్వర్య సం
పాదనకే యది పనికివచ్చు
సర్వం బఖిలలోక తత్వంబులకు నెల్లఁ
దల్లియుఁ దండ్రియు దైవమగును
నీతియో గౌరవ స్వాతంత్ర్యముల కడ్డు
పడనంతవరకె సంభావనీయ
గీ॥ మాత్మ గౌరవహాని దాపైనయపుడు
మానధనులకుఁ ద్యాగ సంపదయుఁ బౌరు
షమును సాహసమునుగాక శరణ యోగ్య
మగుపథం బొక్కఁడుండ దీయవనియందు 264

సీ॥ పలుపుర నీవంటివారు ఢిల్లీశ్వరుం
డగణిత గుణశాలి యనఁగవిందు
నతఁడు ఘనుండు కాఁడనను నేఁగూడ; న
క్బరుదెసఁ గడుగౌరవం బెసంగు
నతఁడమానుష సద్గుణాఢ్యుండనను; గాని
యవనభూపతుల యోగ్యతముఁడందుఁ;
గొన్ని మంచిగుణంబు లున్నవి నిజము, శా
త్రవుఁడైన గుణమున్న దాపరాదు
గీ॥ పరులవృత్తి విపర్యించి పారఁబట్టి
లేనిపోని దుశ్శంకలు లేవనెత్తి
నలుపులు గణించి లేనినిందలు ఘటించు
టభిమతముగాదు నాకు బాల్యంబునుండి 265

సీ॥ జగమునందిప్డున్న సమ్రాట్టులందెల్ల
నక్బరు పెద్దవాఁడగుట నిజము
నీవనినట్లు సేనావారములు లక్ష
లుంగోటు లతని కుండంగవచ్చుఁ
బట్టిన దంతయు బంగారుగావచ్చు
గోపాలదేవునిఁ గొలువవచ్చు

సర్వేశ్వరుని కటాక్షమున శ్రీమంతుఁడై
జనియించె' నతఁడు సంశయములేదు
గీ॥ కాని నరుఁడౌట నిష్పాక్షికముగఁ జూడ
నుండనేయుండు లోపమ్ము లొకఁడు రెండు
మనకును దురుష్కలకును ధర్మములు వేఱు
మనది వేదంబు వారిదై చను ఖొరాను. 266

మ॥ తనచే నిర్జితులైన భూపతులు క్రోధంబుల్ విసర్జించి యె
ప్డును బ్రేమంబునఁ దన్నుఁ జుట్టుకొని కొల్వున్ జేయఁ గాశించి యెం
దును దేశంబు మతంబు వేఱయిన బంధుత్వంబుఁ గల్పించు నా
పనికిన్ డిగ్గె; నిగూఢ మాతని మనోవ్యాపార లీలాగతుల్ 267

గీ॥ అల్లుఁడై బావయై మామయైనతన్ను
వెలితిగననీక శ్రీమహావిష్ణు నట్లు
భారతీయులు గొలుతురన్ భావమెఱిఁగి
యక్బరిటుచేసె; హేతువన్యంబు గలదె 268

సీ॥ తన కెదురుండ రాదను దీక్షకకట' దు
ర్గావతితోడి సంగరము సాక్షి
చాందేలు వంశాబ్ధి కిందిరాసతి' మహో
దాగన్న పుణ్య సంపన్నమూర్తి
యామహాజనని రాజ్యము సంపదలతోడ
వేదనాదముతోడ విద్యతోడ
వ్యాపారములతోడ వస్తువ్రజముతోడ
నానంద సదనమై యతిశయిల్లె
గీ॥ రాజ్యతృష్ణాభరైక కారణముగాక
తొడరి చంపంగ నేటికా దొడ్డతల్లి
జగము కటకటపడె: స్వదేశప్రభువుల
మైన మాకెల్లఁ దలవంపు లైదనర్చె 269

సీ॥ అఖిలప్రజాహృదయక్షేత్రముల సత్య
ధర్మబీజములుంచు ధన్యచరిత

యూనాజబహమార్క యూనాపతుల గెల్చి
పరిభూతి మెఱుఁగని బలిమికత్తె
పల్లెలపైఁ బులి పడెనన్నఁ జనిచంపు
దాఁక నుపవసించు ధర్మమూర్తి
వివిధ వర్ణాశ్రమ విధులు తూచాతప్ప
కయె ప్రతిష్ఠించిన గౌరవాఢ్య
గీ॥ యట్టి క్షాత్రతపస్విని నరులు దాఁక
బ్రాణముల చియ్యలేక భారత మహీశు
లంగనలకన్న దుర్బలు లైరటంచు
దేశ దేశముల్ తిట్టు దుష్టితులు వెచ్చె. 270

సీ॥ సిరి పుట్టినిల్లు పూర్జరదేశము దవా
నల మొకోయనకాచు పలముకొనియె;
మ్రింగ మెదుకులేక మేదినీప్రజ లిసి
రాని జంతుల శరీరములు దినియు
నాకలి చల్లార కట్టెకుప్పలు కుప్ప
లైకూలెఁ దస్కువా రాశవముల
గాకులు గ్రద్దల కరణిఁబైబడి పీకి
తినఁజొచ్చి; రక్కరు దిగ్విజయము
గీ॥ చల్లఁగా సాఁగ వంగదేశమున నుంచెఁ
గాని త్రుటిపైనఁ జింతించు కవణిలేదు
జగము సర్వంబు గెలిచిన సౌఖ్యమేమి
ప్రజకెడరు లేక పాలింప వలయుఁగాదె? 271

మ॥ పదిపడ్రెండు వసంతముల్ గడచి పోవన్ లేదె సన్న్యాసులన్
గదనంబున్ బురికొల్పి యందునొక పక్షంబూని తానందఱన్
దుదముట్టించి ధనేశ్వరంబునను గన్నుల్ చల్లఁగాఁ జూచుచున్
మదిమోదింపఁడె; దొడ్డవారి కుచితంబా యిట్టిహింసారతుల్ 272

మ॥ ఘనదుర్గంబులు వాహినీతతులు భాగ్యశ్రేణులన్ బట్టియె
ప్డును దేశోన్నతినెన్నరాదు; గుణసంపూర్ణత్వమున్ నిగ్రహం

బును ధర్మాచరణంబు సత్యము యశంబుల్ త్యాగముల్ గల్గు న
య్యనఘస్వాంతుల సంఖ్యఁబట్టి యెపుడా యౌన్నత్య మేపారెడుల్- 273

క॥ తనతల్లియుఁ దనదేశము
తనకా స్వర్గమ్ముకన్నఁ దలిలక్ష్మి వ
ర్ధనములు పూజ్యతమంబులు
వనునిది సత్యమును సహజమై పొలుపొందుల్. 274

సీ॥ అచలవృత్తి వహింతు సాధర్మమూని! లో
కము పుట్టుటాది యీక్షణము దాఁక
మాహానువంశంబు మానవమాత్రుని
కెవనికిఁ దలయొగ్గి యెఱుఁగదెప్పు
డస్వతంత్రము మేరు వైనలక్ష్యముచేయ
స్వేచ్ఛ జీవింప నూహింతుఁగాని
యక్బరు తన రాజ్య మంత యిచ్చెదనన్న
నదియేల! క్రీఁగంట నైనఁజూడ
గీ॥ వల్కలముఁ గట్టి స్వాతంత్ర్య వైభవమున
నిట్లు సన్న్యాసినై యున్న నిదియె చాలు
నాకు భోగభాగ్యముల కెంతయును దూర
మాస విడిచిన వాని కాయాసమున్నె. 275

సీ॥ అఖిల భోగములున్న నాత్మతృప్తియులేక
దారిద్ర్య జలధి నాతఁడు మునుంగు
నేసంపదయు లేకయే స్వతంత్రుఁ డుండి
యీశ్వరుకృప గడియింపనేర్తు
గౌరవమునకు భంగముఁ దెచ్చు నక్బరు
తో సంధి నాకు సంతోష మిడదు
మేమిర్వురము పూర్వమై మనుటయె శ్రేయ
మిది దైవసంకల్ప మింతమాత్ర
గీ॥ భారతావని కెట్టి లోపమును రాదు
కాలచక్రము తిరిగెనా కలిమి తిరుగుఁ

దీపుగదా యుండనిమ్ము; సాధింపరాని
పనికి వగపేల? యాయాస పడఁగనేల? 276

శా॥ ఆకాపట్యము, లాదరస్మితము, లాడంబరౌదార్య మావియ్య మా
మోకాల్ మ్రొక్కులు నాటమూవిభవ మా ముప్రొద్దు సేవింపుటల్
నాకెత్తున్ దలనొప్పి పట్టణము లన్నన్; మీకు నెట్లుండునో
నాకీ కొండలువోలె సౌఖ్యమిడు శాంతస్థానముల్ వేవుపో 277

శా॥ తత్సర్వంసహమెల్ల లోఁబడకపోయెన్ నాకటం చెప్పుదున్
నాసిన్ బొందఁ బొగడ్తపై మదినిడన్; గష్టంబు లెక్కింపఁ బే
రాసన్ ద్రవ్యముఁగోర; నిట్టి తృణశయ్యల్ పర్ణశాలల్ సుధ
ర్మా సింహాసన వైజయంతముల మేరన్ జూచి యుప్పొంగెదన్.'' 278

గీ॥ అనుచుఁ దనమాట పోయనీయమినిఁ జేసి
మోమొకింత వివర్ణతఁ బొందుచుండ
నట్లొ సవరించుకొని ప్రతాపేంద్రుఁ జూచి
మానసింహుఁడు కార్యంబు మఱువలేక, 279

సీ॥ "క్రొత్తఁగా నేఁజెప్పుకొనఁగ నేమిటికి నీ
యెఱుఁగని ధర్మంబు లెందులేవు
మేవాడరాజ్య లక్ష్మీదేవి దెస నొక్క
టనువైచియుండు నక్బరు నృపాలుఁ
డెప్పుడు రేఁగునో యేదెస వచ్చునో
మెల్లుచేయునో యెవ్వరెఱుఁగఁ గలరు
పట్టుపట్టినచేని వానిచలంబును
బౌరుష మింతని పలుకవశమె

గీ॥ లేడిపయి యాఁకు సింగంబు దాడవచ్చు
నెంత విక్రమోన్నతియున్న నేమిఫలము
వానిపౌరుష ఘాటి కోర్వంగ లేక
బాధపడెదవు; బలవద్విరోధమేల?

చ॥ పెరనృపులెల్ల లోఁబడెడు వేళలఁ గొన్ని నిబంధనంబు ల
క్బరు విధియించుచుండుట జగం బెఱుఁగున్ గద మైననిన్ను నా

తెలుఁగున బొమ్మనన్ గలను చేప్పనియిల్లో మతొక్కచోటొ నే
నెఱుఁగనెః యెల్లకార్యముల నేసమకూర్చెద నీకుఁ దృప్తిగన్. 281

సీ॥ నీకన్నియల బాదుపాకెమ్పుటయులేక
జుట్టుపన్నెనాఁడు గట్టకుండఁ
బనిఁమీఁద సింధువాహిని దాటుటయులేక
యాస్థానమున నెప్పుడరుగకుండ
జాతియు మతము లేశము వీడుటయులేక
సేనాధిపత్యంబు చెందకుండ
మోఁకాల్లిపై వ్రాలి మ్రొక్కినిల్చుటలేక
గుఱ్ఱంబులను దెచ్చుకొనకయుండ
గీ॥ వత్సరారంభపు నవరాత్ర్యుత్సవముల
సంతలకు రాణివాసమ్ము చనుటలేక
కడుపులోఁ జల్ల యిటునటు గదలకుండ
సమతదైవార మీకు నే సంధిఁగూర్తు. 282

సీ॥ నీ కగౌరవమైన నాకైనయస్లైః నీ
దివ్యచిత్తము సుఖస్థితిని నుంచు
మీపర్ణశాలలో నేకాంతముగ నుండు
మిచటికి నొరులెవ్వ రెఱుఁగకుండ
మెలమెల్లఁ జీఁకటుల్ మొలుచువేళకుఁ దెత్తు
నక్బరు చెవిని రహస్యముగను
"సరిమె పొమ్మను"ః మొక్క క్షణమున నాతని
నేను గొంపోయి ఢిల్లినిజేర్తు
గీ॥ నుదయపురి నేలుకొనుముః చిత్తూరుపురము
బాగుపఱుపంగఁ బట్టు ద్రవ్యంబుఁ దెత్తుఁః
గొదువ యనిపించినను మాళ్వ ఘూర్జరములు
తీసికొననాజ్ఞ నెత్తిపై మోసితెత్తు. 283

సీ॥ ముప్పదిమూఁడు రాణ్మఖ్యవంశములు పా
దములు గొల్చెదు గురుస్థాన మీవు

నీపాదపాంసుల నిరతమ్ము దలందాల్చి
నేను నీయున్నతి నెగ్గఁజేతు
సంధి సంగరములే శరణమై కనుపించు
సంధిఁ ద్రోసినను నిశ్చయము రణము
ప్రస్తుతస్థితుల నక్కరు వీడి నినుజేరి
దుర యొనర్చుట నాకు దుర్లభమగు
గీ॥ నతఁడు విడఁడీవు లోఁబడ వంతమేది
మకర గజరాజముల పోరు మాడ్కిసాగుఁ
బుష్పవన మట్టిభారత భూమియెల్ల
నగ్గి పెట్టితిరంచు దుర్యశము గలుగు. 284

ఉ॥ భూరమణేంద్రు లందఱును బోయిన మార్గమె యోగ్య మింతకుఁ
వేఱగు త్రోవలేదు; పృథివిం గల సర్వము వెంటఁగొంచు నీ
యేఱిటు పాఱఁజొచ్చె! నెదురీద నెవండు సమర్థుఁడౌ; వృథా
పౌరుష మున్నదంచు బడబాజ్వలనంబును బాఱ్ఱమింగెదే" 285

క॥ అన ముసిముసి నగవులు మో
మునకుం జెంగావిరంగు మొనయింపఁ బ్రతా
పనృపతి యంబర్పతి యా
ననము దెసనుగాంచి "ముగిసెనా! నీమాటల్. 286

సీ॥ కోమటి యొకచిల్కఁ గొని కొన్నియేండ్లకుఁ
బంజరంబును గొంచు వనికిఁబోయె
నడవిచిలుక "చుట్ట మా! బంచె గొనిరే! స్వా
తంత్ర్యమ్ము చెడె! నెట్లొ తప్పుకొనుచు
నేగుదెమ్మనె! స్వేచ్ఛ యొఱుంగని తొలిచిల్క
"గాలిలో నెట్టులు తేలుచుంటి
క్రిందఁబడవె! యేమితిందు వీయడవి! నె
వ్వరు సాకెదరు! శత్రుభయము లేదె
గీ॥ పంజరమునఁ జోటిత్తు! నాపజ్జనుండు
కోమటియుఁ దియ్యమామిడి గుజ్జుపెట్టు

బిల్లికరువడు, పామును బీఁదిచట
భయములేక కాలముఁ గడ్పవచ్చు"ననియె. 287

సీ॥ ఆది నెల్యూకసుం డరుదెంచి నపుడు స
ర్వబలంబు లుండె భారతధరిత్రి
కా చంద్రగుప్తుఁ డాహవమందుఁ దాఁకి వా
నికి మూఁడు చెఱువుల నీళ్లుదాపె
నాపిమ్మట నరబ్బు లరుదెంచి; రప్పుడు
దార్ఢ్యతేజము కొంత తగ్గిపోయె
నవలఁ బఠానులు యవనులు వచ్చి; ర
య్యెడ దేశవీర్య మెక్కుడుగఁ జెడియె
గీ॥ నిపుడు భారతలక్ష్మి తానెట్టులుండెఁ,
గోట్లకొలఁదిగ జనులెల్ల గూడులేక
పమరదారిద్ర్య జలధి మున్గిరి; కనుఁగొను
మినుప సంకెలల్ మనకాళ్ల కెక్కియుండె. 288

సీ॥ పదివేలపల్లెలు పాడుగాఁ బడియుండె;
రాష్ట్రమంతయు మహారణ్యమయ్యె;
నొకకాని ధనమేని నొకచిట్టి ధాన్యమేఁ
గలఁగత మానట్టి వెరవులేదు
పడమటి కొండల బ్రహ్మమానుల మాడ్కి
బీదలమగుచు జీవితముఁదీర్తు;
మిట్టిదేశముపైన నీపట్టుదలయేల
మముగెల్చి యేమిలాభము వచింపు
గీ॥ పరుల.కావంత కీడొనర్పంగ లేని
హరిణశాబము హింసించు నతఁడు రెండు
కొమ్ములును జర్మమునుగాక కోట్లకట్టె
పడగలెత్తెడు భాగ్యంబుఁ బడయఁ గలఁడె. 289

సీ॥ స్వాతంత్ర్యలక్ష్మి విశాల సేవలకు జీ
వితమును నేఁదీసి పెట్టినాఁడ;

బ్రహ్మాండమంత విపత్తు వచ్చినసరే
నించుకయేని జింతించఁబోను:
మఱి నెందుఁగాని నిర్మాణమ్మునకు ముందు
విధ్వంసనము ముఖ్య విధిగనుండెఁ'
బరతంత్రగతినొందు వైభవంబున కన్న
స్వాతంత్ర్యమున వచ్చు చావుమేలు;
గీ॥ మాశిశోదియా వంశ సంభవులు బ్రదికి
స్వేచ్ఛమై నుండవలెః లేనియెడలఁ జచ్చి
స్వర్గమునవైన నుండఁగా వలయుఁ;గాని
మధ్య వేఱొండు మార్గంబు మాకులేదు. 290

సీ॥ ఆర్తరక్షణము చేయఁగబూని మేని కం
డలుచెండి యిచ్చు విఖ్యాతనిధులు
సత్యంబుకొఱకు యోషాపుత్రకుల నమ్మి
మాలనిఁ గొలిచిన మానధనులు
పితరులకై పూని క్షితియెల్ల మేలొంద
స్వర్గంగఁదెచ్చు దీక్షానిరతులు
జనకాజ్ఞకై పెక్కు సంవత్సరములు లర
ణ్యములఁ గష్టములొందు విమలయశులు
గీ॥ భానుకులమునెగాక సర్వప్రపంచ
మును యశశ్చంద్రికలఁ బూఁచ పూయఁగలిగి
రట్టి పూర్వుల దొడ్డపేరగ్గిఁ గలుప
నోర్తునే ప్రాణముల వీడ నేర్తుఁగాక. 291

సీ॥ మానసింహా' యభిమానసింహుఁడవు గా
కగునని యిట్లాడఁ దగునెనీకుః
నుర్వి యెప్పుడుపుట్టెనో యప్డె మాఘాసు
వంశంబు ప్రభవించి వాసిఁగాంచె
నెన్నియుగంబులో' యెన్నియుద్ధంబులో
యిందాఁకఁ దలవంప కెత్తినిలిచె

మావంశనృపతుల మహిమ నూహించి నేఁ
బరవశత్వమున నైమఱచుచుందు
గీ॥ నట్టివిశ్వోన్నతంబైన యన్వయమున
కకట! యేసీచుఁడైన దుర్యశముఁ గూర్పఁ
బూనినను బ్రాణములతోడఁ బోవఁగలఁడె
వ్రక్కలై శీర్షమది నేల వ్రాలుఁగాక. 292

సీ॥ అప్రతిహతముగా నక్బరొక్కఁడె యేల
క్షితిని దేవుఁడు సృష్టి సేయలేదు;
వితత ప్రజాకోటి యతనిచేఁ దనుమాడఁ
బడుటకై పుట్టింపఁ బడఁగ లేదు;
సకల భూపాల కన్యక లాఘనుని భోగ
పరత కుద్దేశింపఁ బడఁగలేదు;
ధరణీశులెల్ల నాతనిఁజేరి కొలిచి పా
దములొత్తఁ బుట్టువం దఁగలేదు;
గీ॥ తనయొకని రాజ్యతృష్ణకై ధరణిఁగలుగు
ప్రజయు స్వాతంత్ర్యమును బాసి పారతంత్ర్య
మున మునుఁగుటెల్లఁ బాడిగా దనుచు నక్బ
రెంత యెఱిఁగిన జగమున కంతమేలు. 193

మ॥ "అకటా! కష్టము: నాకుఁదోడుపడుమీ;" యంచొక్కనిఁ వేఁడుపా
తక మేనేరను; మీఁదు మిక్కిలి భవత్సాహాయ్యముఁ నాదు కు
త్తుకయుఁ బోయెడు నప్పుడైన నడుగఁ; దొల్దొల్తఁ దౌరుష్కు నిం
టికి నిన్నిల్లట పల్లుగావిడిచి, పాడిఁ దప్పి వర్తింతునే. 294

సీ॥ తెలువ లఖండ పాతివ్రత్య బలమున
జ్వలదగ్ని శిఖల తేవను రహింత్రు
పురుషులు వీరధర్మ రసావతారులై
వితత ఘోర శతఘ్ని పిండములటు
లొక్కొక్క రొకదుర్గమోయన నందురు;
వైరులదృష్టి మేవాడ సీమ

చిన్నదై కానుపించినను దుర్భేదమౌ
దేశ నైసర్గిక స్థితులఁబట్టి
గీ॥ యెంతమేరయు గెలిచిన నంతెకాని
యంగుళంబైన ముందున కరుగుటరిగి
శత శతాబ్దముల్ యుద్ధముల్ జరిపియైన
నక్బ రఖిలంబుఁ గొనుట సాధ్యంబెకాదు. 295

మ॥ నను నారాజ్యము దూరముంచి తన సన్నాహంబు లేచోటనై
నను సాగించిన నాకునేమనుచు మౌనంబూనఁగావచ్చు నా
ఘనుఁడున్ నాదెసఁ జిన్నివ్రేలొకఁడు నిక్కన్ బెట్టినన్ మాటలన్
బనియేమున్నది? దేశమున్ బ్రళయమొందన్ జేతు నిక్కంబుగన్ 296

క॥ విమతుల ఖడ్గము హృదయా
బ్జముఁ జొచ్చునుగాక! యచటి స్వాతంత్ర్యపు బీ
జముఁ జంపుట మాత్ర మసా
ధ్యము; నెఱవేఱదు జగంబు తలక్రిందైనన్. 297

మ॥ పుడిసెం డూపిరి మేన నున్నవఱకున్ బోరాడి యాత్మోపనే
నడతున్; గాదని యాకసం బురలుచున్ నాశక్తికిన్ మీఱు న
ప్పుడు ఢిల్లీపురిఁజేరి యక్బరు సభాభూమిన్ బ్రవేశించి కే
ల్మొడుతున్ బొఁమ్మిక; నంతదాఁకను వినన్ బోనేరి సందేశమున్." 298

గీ॥ అనుచు గంభీరముద్ర యాస్యమునఁ దొలక
రింపఁగా నుండె నంతలోఁ గృష్ణసింహుఁ
డాత్మభావ మించుక తెలియంగఁజేయ
మానసింహుని వదన పద్మమును గాంచి. 299

— సలుంబ్రా కృష్ణసింహుఁడు మానసింహు నధిక్షేపించుట. —

సీ॥ "సాటిరాజుల భుజా శౌర్యవంతుఁడవు? ధై
ర్యబలంబు సాహసం బలరు ప్రోఁడ
వఖిలదేశమ్ము దాస్యాంధ కారమ్మునఁ
బడి దుర్గతుల మున్గి చెడెడు వేళ

భుజమిచ్చి లేపక మొగలురాజులఁ జేరి
సేవించుచుంటివై సిగ్గుపడక
తగుదుననుచు వచ్చి ధర్మదేవత వంటి
యిమ్మహాప్రభు సముఖమ్మునందుఁ
గీ॥ బిరికిమందు పోయఁగనిట్లు పెనఁగుచుంటి
వార! యిన్నాళ్ళు బ్రదికి నీనీరసోక్తు
లాలకింపఁగ నయ్యెఁగా యనుచుఁ జింత
హెచ్చె నేమందు నీభాగ్య మిట్టులుండె. 300

సీ॥ నవ నిబంధనముల నవలనుంచుదు వంట;
చీఁకటిలో సంధీ చేసునంట
యక్బరుచేవినేమొ యూడఁగావలెనంట;
యెవరిని బ్రతికింప నిన్నిపాట్లు
టాటోటువిద్యలు బూటకం బీమహా
విభుఁడొప్పు ననియె భావించినావె
మాయ యెఱుంగని మహానీయులకు రహ
స్యములతో నెపుడైన నవసరంబె
గీ॥ కనులు కర్ణంబు లొకవేయుగలిగి జగము
నిండియుండెడు దేవుండు నిజమెఱుఁగఁడె
ధర్మతత్త్వైకమూర్తి ప్రతాపుఁడేడ
జగములన్నియు రోయు నీసంధియేడ' 301

గీ॥ యవనుల పదంబుఁ గొలిచి వియ్యంబువలచి
కుశమహారాజు కులకీర్తి గుంటఁగలిపి
చెఱుప వచ్చితె మమ్ముఁ దాఁ జెడ్డకోతి
వనమునంతయుఁ జెఱచునఁట భంగిదోఁప. 302

క॥ ఉరగమును వృశ్చికమ్మును
గరళ క్రూరములు; పాముకన్నను మేలం
దురు తేలు:నిన్నుఁగన న
క్బరు మేలనవచ్చు స్వకుల వర్ధనుఁ డౌటన్. 303

శా॥ పావిత్ర్యంబున కాటపట్టు పరిశుభ్రంబైన సత్కీర్తికిన్
దా, వాసత్వము నూతకోలయగు నీధర్మాత్మతో నూఱులున్
వేవే లక్వరులైనఁ దూఁగుదు రొకో నీకేటికీ వెట్టి కా
శీ విశ్వేశ్వరుఁ డొక్కఁడే సవతుగాఁ జెప్పంగఁ బోలున్ జుమీ. 304

మ॥ లవమున్ నీదగు బోధ మొప్పఁడన నేలా యేకలింగేశుఁ 'డి
య్యవనీచక్ర సమగ్ర రాజ్యమును నీకర్పింతు నన్గూర్చి య
య్యవనాధీశ్వరు మైత్రిచేయు'మనఁగా నౌనంచనన్ బోఁడు; మా
నవుఁడీ ధైర్యసురాద్రి పట్టుదల మానన్ నేర్చునే యెవ్వఁడున్. 305

మ॥ సకల స్థావర జంగమాత్మక మహీచక్రంబునన్ సత్క్రి
ర్మకళల్ నించు ప్రతాపసింహ విభుఁడీ రాజర్షి కాలుంచు పా
దుకలున్ మోయఁగ యోగ్యతల్ మనకు నెందున్ గల్గునే! యట్టి వా
నికి ధర్మంబులు నేర్పఁజాలుదు మొకో నీవున్ మఱిన్ నేనునున్.

చ॥ కరఁగిన లక్క పైన సదురన్ గల ముద్రిక వోలె మాకు నం
దఱకు మనోంబుజంబులఁ బ్రతాపుఁడు తాండవమాడు; నీతఁ డొ
క్కరుఁడని యెంచెనేమొకొ మొగల్పతి; యిర్వదిరెండువేల యు
ద్ధురబలులందు మించుకయుఁ దొట్రిలఁబోని శతఘ్నులున్ బలెన్.

మ॥ కరముద్రేకముతోఁ దరంగతతు లాకాశంబునున్ సోఁక సా
గర మధ్యంబున శీర్షమెత్తి లవమున్ గంపింపఁగాఁ బోని దు
ర్భర భీతిప్రద గండశైలము వలెన్ రాణా ప్రతాపేంద్రుఁ డ
క్బరు నేనాంబుధి చుట్టినప్డు నిలువంగానేర్చు శౌర్యోగ్రుఁడై. 308

మ॥ ధరణిన్ గల్గిన రాజు లందఱు బలౌద్ధత్య ప్రభారేఖ న
క్బరు దుస్సాధుఁడటందు; రీశ్వర కటాక్షంబున్న నాస్వామి యొ
డ్కరుఁ డవ్వానినిఁ బట్టి గావుగొను; భూకంపంబు దుర్వార భూ
ధరమున్ జెప్పయు మాయు లోపలనె పాతాళంబునన్ దింపదే. 309

మ॥ ఘనుఁ డయ్యక్బరు మాట యేమిటికి; నక్బర్, వాని సేనల్, స్వదే
శనృపాలుర్, మఱి భారతక్షితియు, విశ్వంబెల్ల బైనెత్తి వ
చ్చినఁ దానొక్కఁడనంచుఁ గొంచెమయినన్ జింతింపఁ డుద్వేత్తుగాఁ
గాని జృంభించిరసాతలంబునకునుగ్గున్ నూకఁగాఁ ద్రొక్కెడున్.

మ॥ కనులన్ మూసియు నూఱకుండినను మేల్గల్గున్ బ్రతాపప్రభం
జనుఁడున్ రేఁగిన సర్వ వస్తుతతులన్ శైలంబులన్ ధారరా
వనియున్ సప్తసముద్రముల్ చెదరి సర్వం బేకమై చూర్ణమై
చను నీయక్బరు నెచ్చటన్ వెదకెదో సందేహ మామీఁదటన్. 311

మ॥ రవి యస్తాద్రిని మొల్చుఁగా కఖిల పారావారముల్ క్రుంగుఁగా
కవనీ చక్రము వ్రీలుఁగాక చెడుఁగాకాకాశ మయ్యుగ్ర భై
రవుఁడై విశ్వముఁ గాల్చుఁగాని లవమున్ రాణాప్రతాపుండు గౌ
రవమున్ గోల్పడి మర్త్యమాత్రునకు శీర్షంబొగ్గఁ జెప్పట్టునన్. 312

గీ॥ పెద్ద పిన్న మర్యాదల విధము తెఱుఁగు
టభ్యుదయము గోరెడు వాని కవ్వవసర
మ్మది తొందర పడకు' మటంచుఁ దెలిపి
యాప్రతాపాధినాథు నాస్యంబుఁ జూచి. 313

సీ॥ వసుమతీదేవి కీశ్వరుఁ డిచ్చు మణిభూష
లగుచుఁ బుష్పము లుండు నంతదాఁక
క్షణమైన విడక జగత్ప్రాణుఁడును జగ
త్ప్రాణ మగుచు నుండు నంతదాఁక
నమరసన్నుతము సత్త్వంబు చిరస్థాయి
యై లోకమున నుండు నంతదాఁక
స్వాతంత్ర్యధర్మ శబ్దము ధీరహృదయాబ్ధి
మందు మ్రోయుచునుండు నంతదాఁక

గీ॥ ఓప్రభూ నీమహార్హ గుణోజ్జ్వలతయు
భావపరిశుద్ధతయు సత్య వైభవంబు
ధర్మ సంత్రాణకీర్తి యీధరణి నిండి
యారవి సుధాకరం బాచు నలరుఁగాక. 314

గీ॥ అని పలుకునంత నొక్క సేనాధిపుఁ
డరుగుదెంచి జగద్గురూ యారగింప
వేళ యయ్యె నటంచని విన్నవించి
నిలువ నందఱు లేచి లోపలికిఁ జనిరి. 315

మ॥ అటఁజుట్టుఁగల తావులందు బదివేలాకుల్ పఱన్ వేయఁగా
భటులెల్లన్ వడిఁజేరి; రొండొకయెడన్ బ్రత్యేకమర్యాదఁ గొ
న్నిఁటినిన్ వేయుచుఁ గూడుఁ గూరలును బాయసంబు వడ్డించి; రం
తటఁ గూర్చుండిరి మానసింహుఁడును జెంతన్ వాని సైన్యప్రభుల్ 315

సీ॥ అచటికడ్డి ప్రతాపునాత్మజుఁ డమరసిం
హుఁడువచ్చి మానసింహునిఁ గనుఁగొని
"పొద్దయ్యె; భోజనంబునకుఁ గూర్చుండుఁడు
పరిషేచనం బొనర్పంగఁ దొడఁగుఁ"
డన నంబరేశ్వరుం డమరసింహునిఁ జూచి
"లోకగురుండిక రాకపోమె"
ననుఁడు, "వారారోగ్య మనువుగాలేమి నన్
బనివిరి మీకు సపర్యసేయ"
గీ॥ ననిన మానసింహుఁడు ముఖమ్ముపైయెత్తి
"యతిథినైయున్న నాకు మీయయ్యగారు
స్వయముగావచ్చి పంక్తిభోజనముపెట్టి
ప్రియము దొలుకాడఁగా గారవింపఁబొప్పు. 316

మ॥ తసమర్యాదకు నాయశంబునకు నిందల్ దెచ్చెఁ దావచ్చి చెం
తను గూర్చుండకయున్న నొక్కమెదుకైనన్ దాఁక; నాపిమ్మటన్
బనులీలాగున సాఁగునో తెలియఁగా వచ్చున్ జుమీ! పోయి యా
యనరప్పింపుము తప్పదో యమరసింహా యంచు వాక్రుచ్చినన్; 317

సీ॥ అంతలోనఁ బ్రతాపుఁ డక్కడికేతెంచి
"యయ్యా! నీవెఱుఁగని యదియుఁగలదె
యవనులతోడి బాంధవమూను వారల
సరసఁ గూర్చుండి భోజనముసేయ
నని నియమమ్ము నాకగుట నీచెంత భు
జింపలేమినిదద్ద చింతయొదవె
నేనేమిసేయుదు నీధర్మమిట్లుండె
నియమంబు విడనాడ నేరనేను

గీ॥ పంక్తిభోజన మవిలిప్ప పలచురీతిఁ
గోటిమర్యాదలను నార్తుఁ' గొడువగలుగ
దయ్యు' భటులును సిప్పు ఏండాపగించి
చల్లఁగాఁడొండు రేపు మీఢిల్లి పురికి'' 318

మ॥ అసమన్ బల్కినఁ దోఁక త్రొక్కిన భుజంగాధీశు మర్యాద బో
రనశృంగంబులు భంగమై చనిన గోరాజంబు చందంబునన్
గినుకన్ దాల్చుచు మానసింహుఁ "డరరే' నీయున్నతిన్ బెంపు సే
యనె తౌరుష్కనరేంద్రబాంధవము చేయన్ గగ్గె నాబోంట్లకున్. 319

ఉ॥ నేఁడును నక్బరీశ్వరుని నేనుభరంపడి నిల్పకున్న న
వ్వాఁడు ప్రచండ వారినిధి భంగములో యననేనలంపి మే
వాడ రసాతలంబునకుఁ బంపుచు నిన్నును బట్టితున్మి తూ
టాడక పోయియుండఁ! డిపు డైనను గండము తప్పిపోయెనే 320

మ॥ తలతో నీపదపద్మముల్ గొలువఁ డెంతన్ జేరు నన్నున్ మహా
బలదర్పోద్ధతుఁ బంక్తిబాహ్యుఁడనుచున్ వాక్రుచ్చె దిట్టైనచో
నిలువన్ నేర్చునొకో భుజద్వయి పయిన్ నీశీర్షమున్! గన్నులన్
దలకెక్కెన్ జుమి' నీదుగర్వమును డిందన్ జేతు నేకత్రుటిన్. 321

గీ॥ తేగియె నేటి కిర్పూర్శను బంధించియున్న
స్వామి భృత్యధర్మము! లాహవములు పెంచి
నిలువ నీడలేకుండ గుట్టలఁ జరింపఁ
జేయలేకున్న ననుమాన సింహుఁడనకు.'' 322

సీ॥ అని కోపమునఁ బల్కు నాప్రతాపమహీంద్రుఁ
"డీ నిష్ఠురోక్తుల నేమిలాభ
మున్నమాటాడిన నులుకు నొందెదవేల
యిటనీకుఁ బరిభవ మేమిగలిగె
నేనయి నినుఁబిల్చి యిటుచేసియున్న లో
పంబెల్ల నా నెత్తిపయిననుండు
నీవెవచ్చితివి! సంభావించి దర్శం
బిచ్చితి! భేదమింతేని లేక

గీ॥ చేయఁదగిన మర్యాదలు చేసియుంటిఁ;
బూర్వ నియమానుసారము భోజనమును
విడిచితిని; వేఱుగతిని భావించి కినుకఁ
జెంది యేమేమొ పలుకఁ జొచ్చితివినీవు. 324

గీ॥ నేను గోపంబు నొందనుగాని మాన
సింహు రణమందు సంధించి చేయిచేయి
గలిపి బలము తూఁచుకొనంగఁ గలిగెనేని
యదియు పదివేలటంచు సమ్మదముఁ గాంతు." 325

మ॥ అని మందస్మితరోచులన్ నెఱపఁగా నయ్యంబరీశుండు "నీ
మనియున్నంతకు నాదునామము జపింపన్జేసిరే నిర్దయుల్
దినమందన్నము బుద్ధికిన్ లవము శాంతిన్ గల్గఁగానీక నే
బెను కష్టంబులు పెంచి డీల్పఱచినిన్ వెన్నంటి వేఁటాడెదన్." 326

మ॥ అని శేషాహి విధాన రోఁజుచు సమర్షావేశుఁడై యున్న దే
వుని ప్రీత్యర్థముగాఁగ నైదు మెదుకుల్ బోనేసి చేగద్గి ద్రో
లని నిల్చుండిన యాత్మసైనికుల నెల్లన్ శీఘ్రమేలేచి రం
డని తానానతియిచ్చివచ్చి జవనాశ్వారూఢుఁ డయ్యెన్వడిన్. 327

మ॥ పరమోల్లాస హృదంతరుండగు సలుందాస్వామి "యోయంబరీ
శ్వర! నీమాట యటుండనీ; నగరిలో వర్తించు నీజావ న
క్కరు నీవెంటనె తేవలెన్! మఱవిపోవన్ రా"దటంచాడ నం
దఱు నొక్కుమ్మడిఁ జప్పటల్ చఱచి రుత్సాహమ్ము దైవారఁగన్ 328

గీ॥ మందిపడి వెన్కచూచి యంబరు విభుండు
"భవునికడనున్న బసవన్నవలెఁ బ్రతాపుఁ
గొలిచి తలయూఁప మఱఁగిన పలుకుబండ
విన్ను లక్ష్యపెట్టుదునె; నేనెన్నఁడైన. 329

క॥ కనుఁగొందువులే నీగతి"
యనుచు నెలుంగెత్తి పలికి యాత్మీయదళం
బును గొంచు ఢిల్లిదెసకై
చనెమదిఁ గ్రౌర్యమ్ము నీను సందడిగొనఁగన్ 330

మ॥ అవనీదేవులఁ బిల్వఁబంచుచును బుణ్యాహమ్ము చేయించి ప్రా
లవెలుంగొందు నదీజలంబుల సచేలస్నానముల్ చేసి పూ
జ్యవిధానమ్మునఁ బంచగవ్యమును బ్రాయశ్చిత్తముఁ బొంది మ
క్కువమై నందఱుపోయి చేరుకొని రా'కుంభల్ మియర్' దుర్గముఁ 331

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవ
త్కావ్య నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్వాకవంశ
దుగ్ధాంభోరాశి రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజన
జనాను గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసార్వభౌమ సాక్షి
ద్వీర ప్రతాపాది వింశత్యధిక బిరుదవిఖ్యాత, సుకవిరాజశేఖర, రాజ
శేఖరకవి ప్రణీతంబయిన "రాణాప్రతాపసింహ చరిత్రం" బను పద్య
కావ్యమునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ

రామేశ్వరాయ నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర

## తృతీయాశ్వాసము

మ॥ జలపూరంబడుగంటి కూపములు కాసారంబులున్ బ్రీలి సం
దులఁ బాతాళము లోఁతు చూప; ధరయున్ దుర్వార ఘోరాగ్నిమం
డలమై మండుచుఁ బేలగింజ వలెఁబెట్లన్ జంతు జాలంబు శో
షిల గ్రీష్మంబది నిప్పులన్ జెఱఁగి డాసెన్ సర్వమున్ గాల్చుచున్. 1

—• అక్బరు సార్వభౌముఁడు మేవాడపైఁ దన సైన్యముల నంపుట. •—

సీ॥ స్థిరవైరి యముఁడనన్ జెల్లు తోడరమల్లు
రణ మర్మము లెఱుంగు రాయసింగు
చండారి విపినానలుండు వీరబలుండు
ప్రబల కీర్తినిచేలు రాయశీలుఁ
డుల్లాసమతియు నబ్దుల్లా చమూపతి
పౌరుషంబూను షాబాజుఖానుఁ
డభిమానసంధానుఁ డబ్దారు రహిమానుఁ
డసమ శౌర్య నిధానుఁ డసపుఖాను
గీ॥ మఱియు ఖాసిముఖాన్ ముఖుల్ మహితశౌర్య
రేఖ ముల్లోకములఁ జప్పరింపఁ గలుగు
యవన నరపాలమౌళి సైన్యాధినాథు
లేక ముఖమునఁ గదలి దండెత్తి రపుడు. 2

మ॥ అరి సంత్రాస కరోగ్ర సత్వయుతమై హారావళీ పర్వతాం
తరమందున్ జెలరేఁగుచున్ జగమునంతన్ గాల్చు స్వీయోగ్ర సో

దర శౌర్యప్రబలాగ్ని నార్పఁగ మహాధారాధర స్ఫూర్తి సా
గరసూక్తద్వితయంబు వేచెను దురుష్క శ్రేణి మేల్మే లనన్. 3

సీ॥ యువరాజమణి సరి యొక మదించిన కొమ్ము
టంబారి యేస్లుపె నధివసించె
నతి విక్రమోద్భాసియగు మానసింహుండు
యవనదేశ మహోన్నతాశ్వ మెక్కి
నతనితో నిర్వదియైదు వేలాశ్వికుల్
గదలి రిర్వర గడ గడవడంకె
నక్బరు సర్వసేనాధిపత్యము హార
మంబరేశ్వరు శిరమందు మోపె

గీ॥ జలనిధి తరంగములఁ బోలుసైన్యములును
దత్త దధినాయకులు గూడి తరలి పోవ
ఢిల్లిపురి జనశూన్యమౌ రేవఁ చనరె
నరగి యంద 'అంబరు' దాటి రతిరయమున 4

గీ॥ మండలగృష్ఠాంబను పురంబుదండ గనుమ
కరిగి హారావళీ పర్వతాంతరమున
లోయలన్ బడి పయనంబుచేయ సాఁగి
రతి భయంకర విపిన మధ్యంబు జొచ్చి. 5

—• హాల్దీఘాటు కనుమ వర్ణనము •—

సీ॥ హారావళీ పర్వతాంత ముత్తరము 'కుం
భల్ మియర్,' దక్షిణ పార్శ్వమందు
రుక్సనాథముఁ, తూరుపు సతుల్లా, పశ్చి
మము మేరుపురము, లీమధ్యసీమఁ
బొడ వెనుబది మైళ్లు వెడలు పేన్పదిమైళ్లు
గలుగు హాల్దీఘాటు కనుమతావు
పాషాణములతోఁ బ్రపాత సంతతులతో
లతలతో నిబిడ గుల్మములతోడఁ

గీ॥ బొదలతో గండశిలలతో నదులతోడఁ
గంటకమ్ములతోడ వృక్షములతోడఁ
నీఁగరై నను బోరఁగ సందియనట్టి
భీకరారణ్యశైల మచ్ఛేద తలము. 6

సీ॥ కుండలీంద్రుఁడు చుట్టుకొని పండెనోయన
వలగొనియున్న పర్వతపుఁబంక్తి
నిలువుగా నఱికినట్టులు ప్రాఁక గారాక
చక్కఁగా నిలుచు పాషాణసమితి
ప్రకృతి నైసర్గిక భంగిఁ బ్రోవుగ నిడ్డ
కొండపేటులమీఁది కోటగములు
మలిచి కొలిచియుంచు మాదిరియై యేట
వాల్గగు పర్వత పార్శ్వములును
గీ॥ శకటములురెండు సుఖముగాఁ జనుటకైన
నను వాసఁగనట్టి యొక చిన్న కనుమగలిగి
యల సురాసురులకుఁ బోర నలవిగాని
కఠినతలము 'హాల్దిఘాటు' కనుమసీమ 7

ఉ॥ ముందుగ మ్రోఁగు దుందుభుల ప్రోతలునిల్పుచు సైన్యకోటి నం
దందును నిల్పఁజేయుచు రయంబునఁ దానొకచోటఁజేరి య
య్యంఎఱ వాహినీపతుల నచ్చటఁజేరిచి మంతనంబు చె
ల్వందగ మానసింహవిభుఁ డాదర మేదుర చిత్తమేర్పడన్. 8

మానసింహుఁ డనుచరులను హాల్దిఘాటుకనుమఁ బోరనియోగించుట. —

సీ॥ ఇఁక దుర్గమము మార్గ; మీ మీఁదటి ప్రయాణ
మతి కష్టతరము; భయాస్పదంబు
గంటకుఁ దక్కువగాఁ బ్రొద్దునిలిచెఁ "గుం
భల్ మియ' రిటకు నిర్వదియుమైళ్లు
గలదు! హాల్దిఘాటు కనుమ కట్టెదురఁ గ
న్పడి మృత్యు ముఖమట్లు భయముఁ గొలిపె

మెలమెల్లఁ జీఁకటుల్ మొలుప వేళకుఁపైనఁ
గనుమ నెట్టులొ దాఁటి చనెదమేని
గీ॥ యర్ధరాత్రము కుంభల్ మియరును జేరఁ
గలముః జయమొందఁగల మటుగాక రిపులు
మనకు ముందుగఁ గనుమమూరిసనుఁ బిదప
నంగుళంబైన ముందున కరుగు టరిది. 9

సీ॥ ఈఁగిరులెల్ల రాణాగారికి సమీప;
మెపుడెందు దూఁకునో యెఱుఁగరాదు;
మనగాలి నుంతసోఁకినను సింహంబుల
వంటి శిశోదియాభటులు గొలువ
నీనినపులి యట్టు లెగిరిపైఁబ్రాలు; నా
తని నోర్వనుదుట నేత్రమ్ము గలుగు
నా గజాసురవైరికైన దుర్భర;మెంత
యప్రమత్తుల మైననంతమేలు;
గీ॥ కాన వాద్యంబులెల్లను గట్టిపెట్టి
పెదవి గదలింపకయె మౌనవిధివహించి
వడివడిగదూఁటి కనుమ వెంబడినిసాఁగి
యవలఁ జేరంగవలయు నేర్పతిశయిల్ల." 10

మ॥ అనుచుఁ నల్వురు నల్వురై నిలువ సైన్యంబంతయుఁ దీర్చి యీ
పని సంద్రంబున కేతమెత్తు టనుచుఁ ఘావించియుఁ మానసిం
హనృపాలుండు ప్రతాపునిఁ గెలుచు నత్యాశాబలాకృష్టుఁడై
చనుఁడంచాజ్ఞ నొసంగె ముందునకుఁ దత్సైన్యాధిపుల్ భీతిలఁ 11

—• సలుంబ్రా కృష్ణసింహుఁడు హఠాత్తుగాఁ గనుమ నాక్రమించుట. •—

సీ॥ కడ గానరాని దీర్ఘ శరీరమున మహో
రగము నికుంజ గర్భంబువెడలి
వంకరగాసాఁగి పైకిఁ బ్రాకెడురీతి
యవన సేనాదండ మల్లనల్లఁ

గదలి హాల్దీఘాటు కనుమ డాయుచునందు
మొదటి నల్వురుకాలు మోపునంతఁ,
బిడుగుల చప్పుడెల్లెడఁ దేఁగ చూఁడువే
లాశ్వికోత్తములు తన్ననుసరింపఁ
గీ॥ దటము లెకతట్టుకొని మహోద్ధతిని దూఁకు
పరమ గంభీర గంగాప్రవాహ ధాటి
నాకనుమఁనూటి యాద్యంత మలమినిలిచె
సింహమటు సలుంబ్రాకృష్ణ సింహవిభుఁడు 12

చ॥ అనుపమ వాయువేగమున నద్రి ప్రతిధ్వనులెన నుద్ధతిన్
గనుమమొగంబు చొచ్చుకొని కట్టెదురన్ లయకాల రుద్రుఁడో
యనఁ బయిదూఁకు కృష్ణవిభు నామొగలుర్గని భీతిఁగ్రుంగుచున్
వెనుకకుమొగ్గి రగ్గురుఁడునిన్గని తగ్గ నహిప్రవజంబనన్. 13

—• యవనసైన్యంబులు రాత్రికి దండు విడియుట. •—

మ॥ సమయం బెంతయుఁ బ్రాతికూల్యము వహించన్ గట్టునన్ జిక్కి తా
లిమివోరోఁజెటు నాదిశేషువరె నిల్చెన్ మానసింహాండు వై
రము సాధించెదనంచు; నంటఁ జతురశ్ర వ్యూహమున్బన్ని ప
శ్చిమ దిక్కుస్థ ముబంబుతోడ వసియించెన్ బాదుషాసైన్యముల్ 14

మ॥ బలుసింగంపుఁ గడానికేతనము శోభల్ నల్దెసల్ నిండు క్రొం
జిలుఁగున్ బట్టు జిరాగుడారమున చిల్చెన్ దా జహంగీరు; ముం
గలిప్రక్కన్నును పంచవన్నియ పతాకల్గుల్కు క్రొమ్మించు చ
ల్వల డేరాకడ మానసింహుఁడు వసింపన్బోయె నారాత్రికిన్. 15

క॥ ఇరుపుర గుడారముల నలు
తెలుఁగుల యువరాజు నింటి తెరవలు గణికల్
మటి కపులు నాయకులు విడి
సిరి తద్దిత్త రుచిరతర శిబిరము లందున్. 16

క॥ నలుదెసల నీగుడారం
బుల చుట్టును మానసింహ భూవరు నంబర్

ప

## హల్దీఘాట్ కనుమ

[ నాలుగు గజముల వెడలుపు ]

| 25000 పిరంగులు | అసప్ఖాను 25000 ఆశ్వికులు | తోడరమల్లు నూర్జుఁడు-సాగరుఁడు 50000 ఆశ్వికులు | ఖాసింఖాను 25000 ఆశ్వికులు | 2500 పిరంగులు |
|---|---|---|---|---|

ద (left side): రాయసింహుఁడు 50000 కాల్బురు; షాబాజ్ఖా 50000 కాల్బురు

ఉ (right side): రాయశీలుడు జయమల్లుఁడు 50000 తుపాకి పౌజులు; అబ్దుల్లా 50000 కాల్బురు

ధనధాన్యశాలలు

25000 భటులు

రాణివాసము

పాచకశాలలు, గోశాలలు — మూలబలము — గాయకులు — జహంగీరు | కున్వార్ మానసింహుఁడు — కవులు — కున్వార్ మానసింహాని — వైద్యశాలలు, అంగళ్లు

వేశ్యలు

అంబరుదేశము

మద్యశాలలు

| 2500 వారణ బలము | అబ్దూరు రహిమాను 50000 కాల్బురు | వీరబలుఁడు 50000 కాల్బురు | 2500 వారణ బలము |
|---|---|---|---|

తూ

బల మిరువదియైదగు వే
లలరారె నరాతివిక్ర మాపహలీలన్. 17

మ॥ అల సైన్యంబులచుట్టు వీథులను జేయన్బంచి పానీయశా
లలు గోశాలలు నాఁటి దాన్యధనశాలల్ చేర్చి సద్వైద్య శా
లలు నెక్కొల్పియుఁ బెక్కులంగడులు నిల్వన్ జేయుచున్ మద్యశా
లలు స్థాపింపఁగ గొప్పపట్టణము లీలన్ గ్రాలెఁ జోటంతయున్. 18

క॥ ఈవీధుల వెలివరుసను
యావన పాదాతిదళము లాశ్వికులును దం
తావళసమితి పిరంగుల
ప్రోవులు నందంద భీతి పొడమఁగ నిలిపెన్. 19

సీ॥ మొనసి హోల్డీమాటు కనుమకు నెదుర యా
వనచమూ పశ్చిమ పార్శ్వమెల్ల
ముగురు సేనాధీశ ముఖ్యులయ్యెడఁ బంచు
కొని వారివారి యిక్కువల నుండి:
రవ్వారిలో మధ్య మందున నేబఁది
వేల యాశ్వికులు సేవించుచుండఁ
బరిభూతి యెట్టిదో యెఱుఁగని విక్రమ
మహితుండు తోడర మల్లు నిలిచె;
గీ॥ ఘనుఁడసప్ఖాను ఖాసిము ఖాను ప్రబల
బాహుబలు రొక్కరొక్క రిర్వదియు నైదు
వేల యాశ్వికుల్ గొలువ న వ్వీరవర్యు
లుభయ పార్శ్వదలంబుల నుండిరపుడు. 20

మ॥ అదయాక్రామ దరాతివీరభట శౌ ర్యాగ్ని చ్ఛటా వార్షకాం
బుద మబ్దార్ రహిమాను వీరబలుఁడా పూర్ణప్రధారాను లేఁ
బదివేల్ కాల్బురతో నొకొక్కరుఁడు ప్రాగ్భాగంబునన్ నిల్చి రా
త్మదళంబుల్ జయనాదముల్ సలుప నుత్సాహంబు దీపంపఁగన్. 21

మ॥ చలదంభోధి గభీర ధీర గుణు లాషాబాజుఖాన్ రాయసిం
హులునన్ దక్షిణమందు; నుత్తరము శౌర్యోదగ్రులై క్రోలు బె

బ్బులులఁబోలిన రాయశీలుఁడును నబ్దుల్లాయుఁ దౌరుష్క సే
నల సొక్కొక్కరుఁ డర్ధలక్ష గొనుచుఁ దాముండి రాయాయెడఁ. 22

సీ॥ రాత్రికాలమ్మ శాత్రవవాహినీ సమూ
హమున కతి సమీప మగుటఁజేసి
పడమటి దెసయందు వాయవ్య నిరృతి కో
ణములఁ బిరంగి తండములునిలిపి
తూరుపు తరులతా దుర్గమారణ్యంబు
గానఁ దద్భాగ రక్షణము మదిని
వలచి యీశాన వైశ్వానర కోణంబు
లందు వారణ సమూహంబునిలిపి

గీ॥ పనులు పదివేల కనులతో భద్రపఱచి
మానసింహుఁడు శిబిరంబులోని కరిగె,
గాయకుల గేయములు గణికాచయముల
యాటలును సాగఁగాజేసె నాసలీము. 23

—• రాజపుత్రసైన్యము లెదిగివచ్చి హాల్దిఘాటు కనుమచేరుట. •—

సీ॥ కల్ప నిర్ఘాత సంకాశ రారోద్వంశ
దీపకుల సడపెఁ దేజసింహుఁ
డతుల విక్రములఁ జోహణవీరులను గొంచుఁ
బరతెంచె బలియుండు భానుసింగు
ధేలవారా సుభటాళుల నడిపించె
సింహశౌర్యుఁడు మనస్సింహవిభుఁడు
పులిపిల్లలని శాత్రవులు భీతినొందు ఝూ
లాన్వవాయులఁదెచ్చె శ్యామసింగు

గీ॥ హర కులోద్భవులును దేవరాన్వయులును
బ్రమరభటులు హారావళి పర్వతంబు
ముక్కముక్కలై పడఁబెడ బొబ్బలిడుచు
వెడలిరప్పు డిర్వదిరెండు వేలదొరలు. 24

గీ॥ సకల యవనులు కాల మాసన్నమైనఁ
బాని సంయమనికిఁ గొనిపోవవచ్చు

యము( డతనిభటుల్ వీరని యరులువెఱవ
భిల్ల భటులతో ముందుంచె భీమచాంద 25

సీ॥ సర్వ సర్వంసహా స్వాతంత్ర్య ధర్మ మం
త్రోపదేశ గుహాత్త మోత్తముండు
నియతేశ్వరధ్యాన నియతి బ్రహ్మైక్య సం
ధానంబు నెఱపు నానందవార్ధి
కారణమాత్ర సంసార మంటియు నంట
కుండు నుత్తమరాజ యోగిమౌళి
సచరాచర ప్రపంచమునెల్ల( దనుఁదోలె
సమబుద్ధి(జూచు విజ్ఞానశాలి
గీ॥ ధర్మ సంస్థాపనార్థ ముద్భవమునొందు
దేవతా దివ్యతేజం బుదీర్ణమూర్తి
యాప్రతాపుఁడు "చైతక" హయమునెక్కి
తరలె సమరులుమెచ్చి యోఁదలల నూఁప 26

సీ॥ రాజపుత్ర భటోత్కరంబు దొంతరలుగాఁ
గనుమకు రెండుప్రక్కలను జేరెఁ!
ప్రబల శిశోదియా వంశ్య వీరులతోడ
దానికి నడుమఁ బ్రతాపుఁడుండె;
నతనిదక్షిణ పార్శ్వమందుఁ జోండావ ద్వ
రేణ్యులతో నిల్చెఁ గృష్ణసింహుఁ;
డవ్వలఁ దేజసింగాతనిచెంత షే
ల్వాపతి నిల్చిరి భటులతోడ;
గీ॥ నాప్రతాపుని వలపట శ్యామ సింగు
ఘానుసింహుండు గ్వాలియర్ పతియుధేల
వారభూపతి బేడ్లా— కొఠేరియా నృ
పాలకులునిల్చి రహిత దుర్వారలీల. 27

మ॥ తళుకున్నిద్దఁపు జాళువాకలికి పూఁతల్ గుల్కుచుం వేయి వె
ల్గులు నల్దిక్కులఁ బిక్కటిల్లఁ బలునిగ్గుల్ దేలు బంగారు గ

జ్జెలు వాతాహతి ప్రోఁతలెత్తఁగఁ జలించెఁ వైరిసైన్యంబు గుం
డెలు ప్రీలంగ రవిధ్వజోత్తమము హాల్దీఘాటు సీమోపరిన్. 28

సీ॥ పరిసర భూభృచ్ఛిఖరకోటిపైన న
గ్రములైన ప్రకృతి దుర్గములపైనఁ;
గడు నెత్తుగానున్న గండశిలలపైన
మధ్యనుండెడు నిడింబములపైన
నేటవాలగు కొండపేటులపైనఁ చెం
గటనున్న గొప్ప వృక్షములపైనఁ
గ్రింద మీఁదనుగల్గు సందుగొందులలోన
గుమురులై తగు నికుంజములలోన

గీ॥ నెందుఁ గనుఁగొనినను వేల యీనినట్లు
భీమ చాందు తోడివచ్చిన భిల్లభటులు
సింహనాదంబుతోఁబోయి చేరుకొనిరి
పర భయంకర శర ధనుష్పాణులగుచు. 29

సీ॥ హైందవాంగనల నాట్యముసాఁగె రుచిరమై
రాయశీలుని గుడారమ్మలందు;
నమృత మూరెడుగాన మలరారె నద్దూరు
రహిమాను పట కుటీరములయందు;
మొగలు నపుంసకాపూర్వ నృత్యపుగోల
చెలఁగె నాసఫెఖాను శిబిరమందు;
ద్రాక్షారసంపుఁ బాత్రలునచ్చె నర్తన
ల్షాబాజుఖాను వేలములయందు;

గీ॥ నవల మిగిలిన యవన సేనాధిపతుల
విడుదలను బొబ్బిపోకలై వెలసెమద్య
పానమును ధూమపానమ్ము వచ్చి నల్ల
మందు విందులు నందుపై సందడులును. 30

మ॥ యవనాశ్వంబులు హైందవాశ్వము లసంఖ్యాకంబు లొండొంటిఁ జూ
చి విరోధమ్మునఁ గాలుదువ్వి రజనీ సీమంతినీ కర్ణ రం

ధ్ర విదారంబుగ హేషలన్ సలిపెఁ గాంతారంబు భేదిల్లఁ ని
క్షువలన్ నిల్చెలుఁ గొండకోళ్ళ గుములున్ గూసెన్ విశేషార్భటిన్ 31

మ॥ నగవున్ వెన్నెల మోము చందురునితో నాణెంపుఁ బావాలతో
సొగసున్ జంగురుకావి నిద్దపు జిరా హొక్కాయతోఁ గాంతులన్
బగటిన్ గూర్చు కృపాణితో సటఁబ్రతాపస్వామి శైలంబు దం
డ గుడారంబులలోఁ జమూపతులఁ జూడన్ బోయె శీఘ్రమ్ముగన్. 32

సీ॥ తల్లి పుత్రకుల నాదరమునఁ జూచున
ట్లనురాగ పూర్ణుఁడై యధిపుఁ డరయ
వీరులందఱు భక్తి వివశులై "మాదేవుఁ
డిట మమ్ముఁ బ్రోవ నిద్దేగుదెంచె
మందహాస జ్యోత్స్నలందమై వర్షించు
నీమోము చూచి నద్దెల్లలోక
సామ్రాజ్య మిడిన హస్తము సోఁక నిత్తుమే
యీతని పదసేవ యింద్రభోగ"

గీ॥ మనుచుఁ గన్నులఁ గని హృదయములఁ దలఁచి
భూవిభుని సద్గుణంబులు పొగడుచున్న
యంత నుదయ ధరాధరమందు మొలిచె
వెలుఁగు గములకుఁ బలునిక్క వేఁగుఁజుక్క. 33

మ॥ "కలనాదంబు లొనర్చెఁ బక్షితతి; చుక్కల్ వీడె వజ్రంపు శో
భలు; ప్రాచీదిశఁ గాంతిపూర మలమెన్; బ్రాఘ్రాత మందానిల
మ్ములు వీతెంచె" నటంచు మంజులరవమ్ముల్ మీఱఁ దౌరుష్కయో
ధులకున్ బాడిరి మేలుకొల్పు లపుడెంతో రక్తిమై తాళికుల్. 34

—• సూర్యోదయము. •—

మ॥ "కులమున్ బ్రోచెడు ధర్మమూర్తులకు నెగ్గుల్ కల్గరా దీ తురు
ష్కులవారిన్ బడకుండఁ బ్రోచెద" నటంచున్ వేయి బంగారు చే
తులు పైఁగప్పుచు నాదరించె" నన బ్రాదుర్భావమున్ బొంది తొ
ల్దొలుతన్ సూర్యుఁడు దోఁచెఁ దూర్పుమలయందున్ రాజపుత్రాళికిన్. 35

—• ప్రతాపసింహుఁడు సూర్యోపాసనము చేయుట. •—

శా॥ "వీరుల్ పోయిన రాజ్యముల్ చెడిన నుర్వీ౽ దేశదేశ ప్రజా
వారం బేగిన నాత్మజీవ మిడు శోభారాశివై విశ్వమం
దారప్రాయుఁడవై నభోగతి ననంత బ్రహ్మకల్పంబుగా
మీర౽గల్గిన బ్రహ్మమూర్తివి నినుఁ౽ బేర్కొందు ఛాయాధిపా. 36

సీ॥ నగరమందలి ప్రధాన ద్వార మెల్లప్డు
సూర్య మహాద్వార శోభఁ గాంచు
మాహార్మ్యమున రాజమణులు కొల్వుండు భా
గము సూర్యభవన విఖ్యాతిఁ గాంచు
జనులకు నృపులు దర్శన మిచ్చు పైమేడ
సూర్య శిఖరమంచుస్తుతి వహించు
సింహాసనము వెన్కఁజికిలి బంగరు మేటి
సూర్యబింబము మూర్తిసొబగు నొందు.
గీ॥ ధ్వజముండు సితాతపత్రముల్ తనరు నీదు
పేరనే; నిన్ను మించిన వేల్పు లేఁడు;
తలఁపులను గదలికలను బలుకులందు
నీ వెపుడు గోచరించుచుండెదవు మాకు. 37

మ॥ జననం బందినవాఁడ నీ కులమున౽ స్వాతంత్ర్య ధర్మంబు ని
ల్పను గాంక్షించితి; నేఁడు వైరుల నపల్పన్గూల్ప యత్నింతు; నీ
మనిమన్మండ మదీయ గౌరవ యశంబుల్ నిల్పదీవింపుమీ"
యని ప్రార్థించెఁ బ్రతాపుఁ డర్యముని భక్త్యావేశ ముప్పొంగఁగ౽. 38

ఉ॥ ఆపయి నేకలింగవిభు నవ్వలఁ బర్వత సార్వభౌమ పు
త్రీ పదపద్మ యుగ్మము మది౽ గడుభక్తి భజించి ధర్మ శి
క్షాపరులైన పూర్వనృప సత్తములన్ దలఁచె౽ బ్రతాపుఁ డెం
తో పరిశుద్ధమౌ హృదయ తోయరుహంబున భక్తిఁ బెంపుచు౽. 39

సీ॥ పదపడి దుందుభి ధ్వానంబు చెలరేఁగె;
రాజపుత్రులు తనుత్రాణములను

ధరియించి దీర్ఘకుంతములు ఖడ్గములు హ
స్తములఁ దాలిచి, శిరస్త్రాణములను
వహియించి యున్నతాశ్వముచెక్కి ఖండనో
చిత మండనములు రంజిల్లుచుండ,
సమర సన్నద్ధులై తమతమ సేనాధి
పతులపైఁ గన్నుంచి పజ్జనిలువఁ
గీ॥ గృష్ణసింహాది బహు వాహినీశ్వరులును
వీరరస పూరుషాకృతుల్ వెడలివచ్చి
యాప్రతాపుని యడుగులయందు వ్రాలి
'యుద్ధమొనరింపఁగా సెలవొసఁగు' మనిరి. 40

—• ప్రతాపసింహుఁ డనుచరులకు యుద్ధముచేయ సెలవొసంగుట •—

మ॥ తలఁగఁ బోవని దేశభక్తిమెయి స్వాతంత్ర్యంబు భావించి యా
ధర మున్నెవ్వరు పూనియుండని మహాధర్మవ్రతంబూని భో
గరమావైభవముల్ త్యజించితిరి నిష్కామ క్రియాయోగుః లిం
దఱమిమ్మైఁ గనుఁగొన్న నాహృదయ మానందాబ్ధి నోలాడెడిఁ 41

శా॥ నామేవాడఁగలట్టి వీరరస సన్నాహంబు సర్వస్వ మీ
భూమీభాగంబున నేఁడు చేరినది పూవుల్పూచు చందానః 'మీ
రామేమా' యని ముందు దూకవలె వీరశ్రేష్ఠుః లీనాఁటి సం
గ్రామంబట్టి మహావకాశమిఁక గల్గఁబోవ దెన్నేండ్లకుఁ. 42

సీ॥ అప్పరు సకల లోకాతిశాయి బలుండు
లక్షలుఁ గోట్లు కాల్బంట్లు, లక్ష
లాశ్వికుల్గల ధీరుఁః డఖిలజగందొక్క
నిమిషమే పిండిపిండిగను జేయఁ
గల పిరంగులు వేలుగలవాఁడుః నడకొండ
లట్టి వారణబలం బలరువాఁడు
వేయేటికిఁసర్వ విశ్వంబు ప్రతికూల
ముగ మనపైఁద్రిప్పి పూన్చినాఁడు
గీ॥ మనము నిరుపేదలముః విక్రమం బొకండె
మనకుఁగల సర్వ సమరసామగ్రి; కాన

జంకకయు వెల్తిఁగనక యుత్సాహమంది
పోరుసలుపుద మపకీర్తి పొరయకుండ 43

సీ॥ ఆర్య తంత్రముల కార్యస్వతంత్రత వైభ
వంబులు చతురంగ బలము లొకట
ధర్మంబు దైవతత్పరతయు స్వాతంత్ర్య
వాంఛ యాత్మబలోపపత్తియొకటి
దమతమ శౌర్య వీర్యములతో మొనకట్టి
యొండొంటి డీకొన్న యుద్ధమిదియు
నేపక్షమిచట జయించునోయని ప్రపం
చమువారి కన్నులిచ్చటికిఁ దిరిగె
గీ॥ నాత్మవంచనలేక యాహవము నడిపి
జయముఁ గైకొన్న స్వాతంత్ర్య సౌఖ్యమబ్బుఁ
బహుబలము నిల్వలేదాత్మ బలము మ్రోల
ననెడి సిద్ధాంతమును నిల్పు యశముగలుగు. 44

సీ॥ కల్లోల భయద సాగర మధ్యమున నిల్చు
గండోపలము మాడ్కిఁ గష్టవేళఁ
గంపమొందని భటగ్రామణి వీరుఁ డా
తనికన్న మేటి యీధరణిఁ గలుగఁ?
డలని వైభవం బాత్మగౌరవ దీక్ష
ప్రఖ్యాతి యతని సంపాదనంబు
తలఁగని కష్టవేళల స్వదేశీయుల
దృష్టు లాతనిదెసఁ దిరుగుచుండు
గీ॥ దేశ భక్తాగ్రగణ్యుఁడౌ ధీరుబ్రదుకు
వేయునేండ్లైన క్షణమైన వెలితియున్నె
కాల గర్భంబునందుఁ రాఁగల యుగముల
నతనికీర్తి దివ్యజ్యోతియై వెలుంగు 45

శా॥ నా యీసైన్యములందు నొక్కభటుఁడైనన్ భీరుఁడై యున్న ని
ష్ఠేయుద్ధాంగణమున్ త్యజించి యెటకే నేగంగ లగ్గౌ; జిగీ

షాయత్తుల్ భయమే యెఱుంగని యుదగ్రాటోపులే సేఁడు నా
కాయా పార్శ్వములందు నిల్చి జయముల్ హర్షంబు నీయన్ దగున్. 46

క॥ సమయమున భీతిగొని శా
ర్వముఁ గోల్పడి లోకపూజ్యమగు మీసంతా
నము దాస్యశృంఖలా బ
ద్ధము చేయికుఁ డనుచు మిమ్ముఁ దగసర్థింతున్. 47

సీ॥ నాల్గు దిక్కులఁజుట్టు సభము సోఁకెడు మహో
ద్దండ శైలములొప్పు కొండలోఁప
మనల నెవ్వరుచూతురని తలంపకుఁడు జ
గచ్చక్షుఁడైన యాకర్మసాక్షి
పైనుండిచూచు లోపలితలంపులు విప
క్షచ్ఛేద మొనరించి సమయువారి
నభినందనముచేసి యశము నిల్పిరటంచుఁ
గడుపుపైఁజేరిచి గారవించుఁ'

గీ॥ దాతలకుఁ దాతయైన యాధన్యతముని
బొజ్జపైకెక్కి మహేంద్ర పురముపోవు
తొలి మహాద్వారమున దేవమాతలెల్ల
మ్రొక్కఁగల భాగ్యమొందు టద్భుతము గాదె 48

సీ॥ శత్రులు నాల్గులక్షలకుఁ బైఁబడియుంద్రు
ద్వావింశతి సహస్రదళము మనది
యొక్కఁ డిర్వదిమంది యోధులనోర్చిన
జయమునకింక సంశయము గలదె
యాపాటి సాహసం బలరనివాఁడు మీ
యందఱిలో నొక్కఁడైనఁ గలఁడె
కవచ ఖడ్గములుండఁగా రాజపుత్రుఁ డి
ర్వదిమందిఁగూల్చ దుర్ఘటమెయెందు

గీ॥ నైదువేల పిరంగులు నంతసంఖ్య
ద్విరద తతియున్న భయమేమి పేఁడి పేఁడి

పిడుగు లురలేదు మనచూపు లదరగజము
లజములు పిరంగులవి బొంగులగుచుఁ బడవె 49

సీ॥ వనచర సాహాయ్యమున రాముఁడొక్కఁడే
యసురబలంబుఁ జక్కాడలేదె?
గోగ్రహణము నాఁడు కురువీర కోటుల
ఫల్గునుండొకఁడె డీల్పఁబలీదె?
మూంజునిఖిల్ల చమూ సమూహమునెల్ల
హమ్మీరుఁ డొకఁడె తున్మాడలేదె?
నాదుముత్తాత చండ నృపాలుఁడొక్కఁడే
చిత్తూరిసేన నిర్జింపలేదె?

గీ॥ యాత్మ తేజోబలాఢ్యు లియ్యఖిల జగము
తెత్తివచ్చినఁ బ్రుటిని జయింపనేర్తు
రందఱేకాగ్ర మనముల నహితభటుల
నూఁచముట్టుగఁ దాఁకంగ నొప్పునిపుడు." 50

—• ప్రతాపసింహునితోఁ గృష్ణసింహుఁడు తనపట్టుదల నెఱిఁగించుట. •—

గీ॥ అనిన రాణానుగని సలుంబ్రాధినేత
"యిచటిభటుల ధీరుందొకండేనిలేఁడు
కట్ట కడపటి భటుఁడైనఁ గట్టితెచ్చి
మృత్యుదేవతఁ జెఱసాల నిడఁగఁగలఁడు. 51

సీ॥ ఒక్కొక్కఁడును సమస్తోర్వీతలమునిండ
నిరుపమామోదంబు నెఱపునట్టి
పూవుల సంఖ్యముల్ పూచె రాజస్థాన
నందనదేవ మందారతరువు
తడ వొకింతయులేని తౌరుష్కవాహినీ
చైత్రయాత్రాప్రభంజనముధాటిఁ
గూఁకటి వ్రేళ్లతోఁ గూడఁగంపించెఁ జె
ట్టాపూవులన్నియు నవనిరాలె

గీ॥ నీవనెడు దొడ్డపూవైన నిలుపఁ బొలుచు
విశ్వవిశ్వంభ రామోద విజయలక్ష్మి
నలుదెసల నింపనంచని కలఁచుచుండ
నక్బ రనెడిజంఝూనిలం బలమెసేఁడు 52

శా॥ పోనీ రాజ్యము, భోగభాగ్యవితతుల్ పోనీ; సతీపుత్రులున్
బోనీ; ప్రాణముపోవనీ; మఱియు నీ భూచక్రమే పిండియై
పోనీ; చండనృపాలు పావనకులంబున్ దాస్యమున్ మోయఁగాఁ
బోనీయన్ ద్రిదివాధిపత్య విభవంబుల్ దక్కునట్లుండినన్." 53

క॥ అనుచు సలుంబ్రా కృష్ణుం
డని నంతనె తేజసింహుఁ డమలస్మిత శో
భన వదనంబెత్తి ప్రతా
పునిగని సైన్యంబులెల్ల మోదంబుఁగనన్. 54

—• తేజసింహుఁడు తనశక్తి యుక్తు లెఱిఁగించుకొనుట. •—

సీ॥ శత శరాబ్దములు కష్టముచేసి కట్టిరి
వంశపావనులు మేవాడరాజ్య
సౌవర్ణ సౌధరాజము! దుర్బలులమైన
నిమిషంబులో నది నేలవ్రాలుఁ;
బరతంత్రగతి సార్వభౌములై బ్రహ్మాండ
మున్నంతకు బ్రదికియుండుకంటె
దారిద్ర్యయుక్త స్వతంత్రజీనన మొక్క
గంటయుఁ గడకొక్క క్షణముచాలు;
గీ॥ దేశ ధర్మ రక్షాదీక్ష ధీరవృత్తి
మీఱెదముగాక! రిపులఁజంపెదముగాక
భీతిమృత్యు మహావృక్ష బీజమగుటఁ
బిరికిచేతి బల్లెంబది బెండుగాదె? 55

సీ॥ తనపాఱు త్రోవ దుర్దమ గండశిలలైనఁ
దునియలు తునియలై తొరగునట్టు

లతితరోన్నత పర్వతాగ్రంబునుండి య
ప్రతిహత ధాటితోవచ్చి దూఁకు
నచల సరిత్ప్రవాహము ముందునకెకాని
వెనుకకు మరలని విధముతోఁ బ
జృంభించిరేఁగి యేకైకధాటిఁ దురుష్క
వీరుల నిపుడె యువ్వెత్తుగొందు

గీ॥ మొక్కఁ డిరువండ్రనేటికి నొక్క వేయి
మందినైనను దొడరి చంపంగనేర్తు
మేము విహరించుచోటెల్ల మృత్యు దేవ
తావిహార స్థలంబయి తనరుఁగాక. 57

మ॥ యవనుల్ నాలుగు లక్షలుందురని యేలాచూడ మద్బాహుసం
భవశౌర్యోగ్ర విహారమారుతము ఘంభద్ధాటికిన్ వైరి యో
ధ వితానంబులు వృక్షసంతతుల పత్రశ్రేణులున్బోలె ని
య్యవనిన్ డుల్లఁగఁజూతు నీమదికి నాహ్లాదంబు నేతున్ప్రభూ, 58

క॥ శ్రమమేల! యగాధ సము
ద్రముఁబోలిన యీయపార తౌరుష్క వ్యూ
హమునందు వామభాగా
ర్ధము లేదని యింతనుండి తలఁపుముదేవా." 59

క॥ అన భీమచాందు "భళి! నీ
జనకుని మఱపింపఁగలవు శౌర్యాటోపం
బున" నని ప్రతాపసింహుని
గనుఁగొని లయకాల మేఘగర్జారభటిన్. 60

—• భీమచాందు యుద్ధమునుగూర్చి యుత్సాహ వాక్యములాడుట. •—

సీ॥ మనువులు పదునాల్గురుమంది పుట్టకమున్నె
భరతోర్వినార్యు లేర్పడకమున్నె
రామాయణంబు భారతము వ్రాయకమున్నె
వేదముల్ భాగముల్ విడకమున్నె

రాజాధిరాజు లేర్పడుటకుమున్నె నా
గరకతభువిని బ్రాకకయమున్నె
యీమేరు ఓకొండ తీ గండశిలలు నీ
వనములు మాభిల్ల వంశజులవి:
గీ॥ యీ తురుష్కులెకాదు మహేశుఁడైన
నరుగుదెంచినఁ బ్రాణమున్నంతలోన
శిరములను ఖండ ఖండముల్ చేతుఁగాని
మిగులనిచ్చిన నిదియొక్క మీసమొక్క! 61

సీ॥ గొలుసులనున్న బెబ్బులి పిల్లలనఁగ యీ
వనవీర మృగములపైనవ్రాలి
కడికండలొలుచు యోగంబెప్పు డెప్పుడం
చదె భిల్లభటులు ముప్పదియువేలు
కొండకోటలపైననుండి గుప్పనమూఁక
నుత్సాహభరమున నున్నవారు
రణమందరుల డీల్పడచి గెల్చుటో లేక
చచ్చుటో చూఁడవజాడగలుగ
గీ॥ దింక మేవాడపైన దండెత్తుటనిన
మృత్యుముఖముఁ జొచ్చుటెయంచు నెఁడదవ్రీలి
యక్బరును భీతిగొనఁగ సాహసము సేతు
నీపదములాన బ్రాణంబు తీపుగాదు. 62

మ॥ మదమాతంగ సమూహమట్లు బలసంపన్నాన్వు లొక్కొక్క రేఁ
బదిశైలంబులనెత్తి సంభ్రమునఁ బ్రోవఁగాజాలు వారిల్ల ము
ప్పదివేల్ భిల్లుల నింటికిన్ మరలిపోవన్ గోరఁడొక్కండు: నే
దుదిప్రాణంబులు మేననుండువఱకున్ దోఁతుందు నీముందటన్." 63

గీ॥ అనిన నాభానుసింహోదు లందఱొక మొ
గమున "నేఁడు హల్దీఘాటు కనుమనిండ
వైరిరక్త ప్రవాహముల్ పాఱఁజేఁతు"
మనిన నంత బొఁదలలూఁపు నంతలోన. 64

మ॥ అరిసంఘంబులఁ గూల్చి గెల్పుఁ గొన నాయత్తంబుగం" డంచునం
దఱకుం దెల్పుచు యావనాయస బృహన్నాళాస్త్ర ఖంభద్గళాం
తరమందుండియుఁ బ్రేలె గుండొకఁడు దిగ్దంతి శ్రవోయుగ్మగ
హ్వర విచ్ఛేది కఠోర దుస్సహ మహోద్వానంబు సంధించుచున్. 65

—• మొగలు సైన్యంబులు యుద్ధమున కాయత్తమగుట •—

శా॥ వారల్ వారలు తీర్చి యావన భటవ్రాతంబు లశ్వంబులం
దారోహించుచు నిల్చెఁ గట్టెదుర బాహా విక్రమ ప్రాభవో
దారుల్ తోడరమల్లముఖ్యులు తనుత్రాణాదులన్ దాల్చి యా
మేరుక్ష్మాధర శృంగముల్ వలెఁ గడున్ బెంపారి రత్యుగ్రులై! 66

శా॥ ధీరశ్రీ లయకాల మృత్యుముఖ సద్రీచీన ఘోరంబులై
నోరుల్ విచ్చు శతఘ్నులన్ నిలిపి యందున్ శ్వేత సూచీముఖుల్
క్రూరాత్ముల్ భృతిపాలితుల్ జగము సంక్షోభింపఁగా నిల్చి రా
శూరుల్ పంచ సహస్రముల్ బుడుతకీచుల్ నిప్పులన్ గుప్పుచున్. 67

మ॥ సమసత్త్వంబులు సగ్ని చూర్ణయుతముల్ షష్ట్యంగుల క్రూర నా
శములున్ భీకర తిర్యగూర్ధ్వబిల మూలమ్ముల్ తుపాకుల్ విశా
లములౌ బొమ్మలకాన్చి పచ్చితురకల్ బాహాబలాటోప దు
ర్దములై నిల్చిరి దీర్ఘకాయులు రణారంభ క్రియాలోలురై. 68

సీ॥ ధవళధూసర హరిద్రశ్యామ లోహిత
పింగవర్ణ తనుత్రవితతిఁ దొడిగి
కరవాల పరశుముద్గర భిండివాలాది
సమరోచితాయుధ సమితిఁ దాల్చి
మూఁడులక్షలభటుల్ మూఁగిరి; మృగమిశ్ర
భద్రమంద్ర విభేద వారణములు
నాకర్షదీర్ఘ ముఖాభీల కఠిన శా
తాంకుశహస్తులౌ హస్తిపకులు

గీ॥ నిలువ వివిధబలంబుల యలబలంబు
యుగ నమయ ఘూర్ణమాన పయోధిరవము

ననుకరింపంగ యవనసైన్య ప్రపంచ
మొక్కమొగి విజృంభించె మహోగ్రగతుల. 69

—• ప్రతాపసింహుఁడు యుద్ధసన్నద్ధుఁడగుట. •—

గీ॥ శుభదగోధూమ సమ్మిశ్రత స్థూలలోహ
వర్మమునుదాల్చి యాప్రతాప ప్రభుండు
తనరె భారతభూమి స్వాతంత్రలక్ష్మి
వీర యోధావతారమై వెలిఁగెననఁగ. 70

సీ॥ నలువది యంగుళంబుల దీర్ఘవదన మం
తకును మూఁడంత లౌన్నత్య మలరి
మాయూర కంఠస మగ్రీవమును హ్రాస్వ
కుక్షియు నత్యల్ప ఖురపుటమును
మేఘనిస్వనము నమేయసారము కాంత
కాంతి మంతమ్ము సుగంధరు చిర
మాకాశ నీలవర్ణామోఘమును సర్వ
తోభద్ర పద్మ భ్రమాభిరామ

గీ॥ ముత్తమోత్తమ లక్షణయుతము పూర్ణ
హర్షము సువర్ణ రత్నభూషాంచితంబు
నైన చైత కాజానేయ మధిపుఁడెక్కె
నఖిల సామంతమండలి యభినుతింప. 71

శా॥ హారావళ్యచలప్రపంచము నితంబాపత్యకో పత్యకాం
తారామాళ్మ గుహాధునీయుతముగా నాకంపమొందఁగ మహో
దారప్రాభవుఁ డాప్రతాపుని మహోద్యద్దక్షిణావర్త శం
ఖారావంబులు భూనభోంతరము వ్రయ్యల్గాఁగ మ్రోసెఁ గడిన్. 72

సీ॥ తపనీయ వజ్ర సూత్రములు నాల్గంచు లే
క్కన శంఖమూదెను కృష్ణనృపతి
సౌవర్ణచిత్ర పుష్పమనోజ్ఞ శంఖంబు
మ్రోయించె గ్వాలియర్ భూమివిభుఁడు

మొఱుఁగారు మగఁటాల మిసిమి గజ్జెలసరుల్
దెమరు శంఖంబొత్తెఁ దేజసింహు
డాణిముత్తియముల హారముల్ తుదిఁవ్రేలు
శంఖంబుఁబూరించె శ్యామసింహుఁ

గీ॥ డుత్తమావర్త మర్ధ హస్తోన్నతంబు
పశ్చిమాంభోధిభవము సౌవర్ణ వృంత
మగు మహాశంఖమొత్తె సర్వాతిశాయి
వీరలోకైకమౌళి యాభీమచాందు 73

సీ॥ అచలోపమాన దేహాఖిల యావన
ద్విప సమూహముభూరి బృంహితములు
జగదేక విక్రమోజ్జ్వల రాజపుత్ర వీ
ర కదంబ సింహగర్జావిరావ
మహితసైంధవ దర్శనాతిరోషిత తురు
ష్కతురంగ బహుళ హేషాస్వనంబు
లనిలఘాటీచలితాసంఖ్య సూర్యకే
తనజాత పటపటాత్కారరవము

గీ॥ తురకల పిరంగిగుముల యుద్ధురరవంబు
భిల్లసుభట కోదండ మౌర్వీధ్వనులును
రెండుసైన్యంబులను రేఁగు డిండిమ రవ
మట్టమిన్ను మన్నేకమౌనట్లుమ్రోసె. 74

—• { రణమున కుపక్రమింపుమని చంద్రభట్టారకుఁడు ప్రతాపసింహుని హెచ్చరించుట. } •—

ఉ "వైరులు సర్వసన్నహన భారముఁదీర్చి రణంబుసేయ ను
న్నారలు; వారలన్ బలిగొనన్ మనవారలుగూడఁ బూని యు
న్నార; లుపక్రమింపుము రణంబు క్షణంబున" నంచుఁ జంద్రభ
ట్టారకుఁ డాప్రతాపు నికటమ్మునకున్ జని తెల్ప నాత్మఁడున్. 75

—• ప్రతాపసింహుని విషాదము •—

మ॥ శిరమున్ వంచి నమస్కరించి "సుకవిశ్రేష్ఠా! సుఖావాప్తి సం
బరమున్ గష్టమునన్ విషాదమును బెంపన్ బోని యస్మన్మహా

స్థిర చిత్తంబు నిమేషమాత్రము చలించేక ముందుఁ గన్పట్టు నా
పరిపంధి ధ్వజినీ సమూహమును సర్వంబిప్డు వీక్షించుటకా. 76

సీ॥ స్వచ్ఛడాంబూనద చంద్రహాసధ్వజ
ప్రభలు నల్దిక్కులఁ బర్వుచుండ
యావనసేనా ముఖాగ్ర భాగమున ల
క్షలలక్ష లాశ్విక సమితితనదు
కనుసన్నల మెలంగఁ దనరు తోడరమల్లు
మా యయోధ్యాపుర మండలభవుఁ;
డితని పితామహులెప్పుడు మాపూర్వుల
కాంతరంగికులయి యలరువారు:

గీ॥ కాలమింపుక ప్రతికూల గతిని దాల్చ
నక్బరు నృపాలు పదము సేవ్యమనిపోయి
యసమ మేధాబలమున సైన్యపతియగుచు
నిదిగో మనమీఁదికిపుడు దండెత్తివచ్చె. 77

మ॥ అని యంద్రైనను దేవతార్చనము సేయకాదొక నీరైన ము
ట్టని యాచారపరుండు సజ్జనుఁడు తోడర్‌మల్లు సద్వంశ వ
ర్ధనుఁ డీ యుత్తమభారతీయుఁడు స్వధర్మచ్ఛేదముకా జేయుచుకా
మనపైవచ్చె స్వదేశమిప్డు పరతంత్రత్వంబుమైఁ గ్రుంగఁగకా. 78

సీ॥ ఆమైపుకాంచన వ్యాఘ్ర కేతనమూని
కడు పొడవైన పాగాధరించి
సువిశాల పాదాతి నివహంబు నడపునా
రాయసింగు బికనీర్ రాజమౌళి
మాపూర్వులకును సామంతుఁడై కల్యాణ
సింహుఁ డీతనితండ్రి సేవచేసె
నప్పు డెల్లేంద్రఁ బెండ్లాడి యీతం డక్బ
రన్నదమ్ములవావి యలరుచుండు

గీ॥ రొక మహారాజ్య మేలుచు నుండపలయు
నితఁడు నాల్గువేల్ హయముల కీశ్వరుఁడవయి

తురకలనుగొల్చి మనతోడఁ దొడరవచ్చె
నింక స్వామిభృత్యన్యాయ మెందుఁగలదు. 79

సీ॥ ఆయుత్తరదిగంతమందుఁ దుపాకి పౌ
జులనెల్ల సంగ్రామ సుముఖులుగను
జేయుచుండెడి రాయశీలుఁ డంబరు నృపుఁ
డగు భగవాఁడాసు నంకితుండు
వానిపజ్జఁ దురుష్క పాదాతిదళము మం
దార మహీజకేతనము క్రిందఁ
బూన్చుచునున్న జాంబూనద కవచుండు
జయమల్లుఁ డంబరేశ్వరునిమఱఁది
గీ॥ యోధపుర రాజమౌళియౌ నుదయసింహు
ప్రియతనూజను జేకొన్న పెండ్లికొడుకు
మానసింహుని దనకూర్మి మేనయల్లు
మొన్ననేగద దర్శనమునకుఁ దెచ్చె. 80

మ॥ కడజూడఁగ బడనట్టి దుర్దమ తురుష్కప్రాజ్య సైన్యాధి నా
థుఁడయై సంగరచక్రముఁగ గరములందుఁద్రిప్పు నామానసిం
హుఁ డెవండన్నియుఁ జక్కనుండినను నత్యుల్లాసియై యెప్డు నా
యడుగుల్ గొల్చెడు నాశ్రితుండెకద! యౌరా! కాలమెబ్బంగిదో. 81

సీ॥ అందఱొక్కవిధంబు ముందున్నది ముసళ్ల
పండుగయన్నట్టి భంగిదోఁప
నిదిగొ తోడరమల్లు నిరుదెస సింహమ్ముఁ
జేరికొల్చెడు వ్యాఘ్ర శిశువులట్లు
సూక్తసాగరులు నాసోదరు లిరువురు
గనుపింతు! రకట! రక్తంబుఁ బంచు
కొని యేకగర్భంబునను బుట్టితిమి ఛాయ
యట్లు నన్నెప్పుడు ననుసరింత్రు
గీ॥ నాకు వారికి భేదమింతయును గలదె
కదలినంతనె వారలే యెదురుపడుదు

రిది యవనసేనతోఁ జేయు కదనమో స్వ
జనముతోఁ జేయు కదనమో శంకగలిగె. 82

చ॥ ఐవరము లోకపావనము భ్రాతలు మిత్రులు దండ్రులైన నా
హవమునఁ దాఁకఁబోరుట నృపాళికి ధర్మమటందు; రట్టి ధ
ర్మ మెఱుఁగలేకకాదు; మొగముల్ గని సోదర బంధుమిత్ర కం
ర విదళనం బొనర్చుట కటా! కడుఁగ్రూరమటంచుఁ దోఁచెడున్. 83

సీ॥ అనఁగని "దేహాత్మ కయ్యవస్థాభేద
నాశముల్ దేహంబునకునుఁ గాక
నాత్మనిత్యంబు దేహంబనిత్యము వీరుఁ
డగు వానికిని స్వధర్మాచరణము
తల్లిదండ్రులకన్నఁ దనకన్న మిత్రుల
కన్నఁ జుట్టంబుల కన్న మిగుల
నుత్తమంబగు క్షత్రియుండెప్డు నుత్తమో
త్తమ కర్మవీరుఁడై తనరవలయు

గీ॥ సమధి రాత్మైకతత్త్వ విజ్ఞానమయుఁడ
వోటుగెలుపుల సమబుద్ధి నూహసేతు
నీకు ధర్మంబులనునేర్ప నేనెవండ"
ననిన దిటవూని నృపతి సైన్యములఁజూచి. 84

—• ప్రతాపసింహుఁడు సైన్యాధిపతుల యుద్ధమునకుఁ బురికొల్పుట. •—

సీ॥ "హారావళీ పర్వతాగ్రగణ్యము విశ్వ
పావనమైన మేవాడసీమ
యీాఁసలీలోయ లీనదులీవను
లీఘనుమండలం బిన్నిమనవి
పూర్వులెన్నియొ యుద్ధములుచేసి వారి ర
క్తములతో నీభూమిఁ దడిపినారు
ప్రాణమున్నంత కీయవని విదేశీయు
లాక్రమింపంగ నీయంగరాదు

గీ॥ కట్టకడయూపి రున్నంత కష్టితనడు
పట్టి బిగఁబట్టి పరులకుఁ బట్టియీని
జననికరణి హోల్దీఘాటు కనుమనాని
పూనికాపాడుఁడో రాజపుత్రులార 85

సీ॥ ఇంత విస్తారమం చేలుఁగిరానిది కాల
పాథోధి యలలు సంవత్సరమ్ము
లాకారగర్భంబు నందెందఱు నృపాలు
రెన్నెన్ని దేశంబు లెన్నిరణము
లెన్నెన్నిజాతులో యెందఱు గెలిచిరో
యెందఱుమడిసిరో యెఱుఁగఁగలమె
యందఱలో నొక్కఁడైన నేఁడున్నాఁడె
యశమె చిరస్థాయి యయ్యెఁగాక
గీ॥ మూటలనుగట్టి యాయువు బుజ్జకెత్తి
శాశ్వత బ్రహ్మకల్ప మీజగతి నుండు
మో యరులఁదాకి గెలుపో యోటో గ్రహింత
మంద తేకమనస్కులై యనికిఁజనుఁడు. 86

ఉ॥ ఆ వడగండ్ల వానవలె నంతట విశ్వములోని దుట్ట వా
తావరణంబు శుద్ధమగు నట్లొనరించెడు యుద్ధముల్ జగ
త్పావనముల్; విపక్ష బలభంజనులై గెలుపొంది వచ్చినన్
బూవులసోన వానలను భూజనముల్ గురియింత్రు మీపయిన్. 87

సీ॥ వనిని బూవులు రాలిపడునేను వసంతుఁ డా
దటవచ్చి మఱల నన్నిఁటినిదెచ్చుఁ
జెడ నెండఁబాఱిన చెట్టులు క్రొక్కాఱు
చినుకుల మఱల లేఁజివురుఁదాల్చుఁ
గొందఱోమనలోన నందఱోమడిసిన
మనతావు చేకొంద్రు మన తనయులు
నాయంతకేమొ యంతము నొందుదునటన్న
భయమింతయైనఁ గన్పడఁగఁబోదు

గీ॥ సాహసంబునఁ బోరి విశ్వప్రపంచ
మునఁ బ్రజాహృదయముఁ జూఱఁ గొనెదమేని
మాటలేటికి మనకింక మరణమేది
క్షితిఁ జిరంజీవులమయి విచ్ఛేదముగాక

చ॥ అనువిభు విక్రమోత్తులను నంతట నంతటనిల్చి తేజసిం
గును మఱిఁ గృష్ణసింహుఁడును గొందొకవైపున భానుసింగు యో
ధనికర కర్ణపేయముగఁ దద్రసమింత తొలంగకుండఁగా
వినిచిరి యక్షరాక్షరము వీరరసంబుననూఁగె సైన్యముల్. 89

సీ॥ గగనభాగంబెల్లఁ బగిలించి పరతెంచు
పిడుగుతండముల సవ్వడులఁ బోలి
ప్రళయ కాలాభీల వనదముల్ రాపాడ
జనియించు మేఘగర్జనమమించి
రంగ దుత్తుంగ తరంగపంక్తులు రేఁగు
వనరాశి ఘోరనిస్వనముఁ గేరి
సచరాచర ప్రపంచము తూలిపడ వీచు
ప్రకట ప్రభంజన ధ్వనినిమీఱి

గీ॥ దిగ్గజంబులు చెపుడెత్తి తెలివిదప్ప
నట్టె హాహావళీశైల మంతనిండి
యంబరేశ్వరు శిబిరంబు నఱుతమ్రోగె
సంగరారంభ దుందుభి స్వనభరంబు. 90

—— రాజపుత్ర సేనాధిపతులు యవనసేనలను దాఁకుట. ——

సీ॥ అద్రినెల్లెడ 'హర! హర! మహాదేవ' యఁ
సమరనాదం బాకసంబునిండ
శ్రీసలుంబ్రా కృష్ణసింహుఁ డాసప్ఖాను
మూఁడువేల్ భటులతో మొదటఁ దాఁకె
బదనూరుభర్త షాబాజ్‌ఖాను రాయసిం
హుల కట్టుపడె నంతబలముతోడ

నాశ్విక త్రిసహస్ర మమరఖేల్వాపతి
యబ్దూరు రహిమాను ననినెదిర్చె

గీ॥ సప్రతీప ప్రతాపాంకుఁ డాప్రతాపుఁ
డతుల కాలాగ్ని సమమూర్తులగు శిశోది
యాన్వయులు మూఁడువేలతో యవన సైన్య
మధ్యమున నున్న తోడర మల్లుఁదాఁకె 91

సీ॥ రెండువేలాశ్వికు లండఁగొల్వుండ ఖా
సింఖానుతో శ్యామసింహ నృపతి
యంతటి బలముతో నద్రధైర్యుఁడు రాయ
శీలునితో ఘానుసింహభర్త
పూని యబ్దూల్లా చమూపతితో రామ
చంద్ర మనస్సింహ శౌర్యఘనులు
విక్రమప్రకటు లావీర బలునితోడ
బేడ్లా-కొటేరియా పృథ్వినాధు

గీ॥ లాహవారంభ మొనరింప నలఘుబలుల
నాత్మసుభటులఁ గొనుచు బ్రహ్మాండ మద్రువ
వీరగర్జారవ మెలర్ప భీమచాందు
భీకరాస్త్రంబులు నిగుడ్చి తాఁకె రిపుల. 92

మ॥ వనధుల్ రెండునుదాఁకి ఘూర్ణిలెడు రేవన్ గొండతోఁగొండ డీ
కొనున, ట్లంబుదమాలికల్ దొడరి సంక్షోభించు చందాన యా
వన సైన్యంబులు రాజపుత్ర చమువుల్ వైరంబు వీర్యంబు నె
క్కొన నొండొండు కలంగఁదాఁకె సమరక్రోధ ప్రవృద్ధంబులై. 93

మ॥ బెడఁగుంగత్తుల మేల్తళత్తళల ద్యోవీధిన్ దటిత్పుంజముల్
పొడమెన్; వీరరసావతారు లగుచున్ మోగల్ భటగ్రామణుల్
కడుశౌర్యమ్మున రాజపుత్రకులపై లంఘించి దోర్దర్ప మే
ర్పడ నొక్కుమ్మడిఁ దాఁకి యార్చిరి రణప్రారంభ సంరంభులై. 94

—• ఖేల్వాపతి-యబ్దారహిమానుతోఁ జేయు యుద్ధము. •—

ఉ॥ తారకదైత్యనాదుననిఁ దార్కొని యొంపు కుమారు భంగి ఖే
ల్వారమణుండు బాహుబల వైభవుఁడా లయకాల భైరవా
కారుల యోధులన్ గొనుచు గాఢరయంబున నేగితాఁకె న
బ్దారహిమాను మొగలులు తోడనె వెన్కకుఁదూళి యార్వఁగన్. 95

ఉ॥ ఆతఁడు శైలముల్ పగులనార్చుచు నేఁబదివేలు వీరపా
దాతుల హెచ్చరించుచు గదాకరవాల పరశ్వధాయుధ
వ్రాతములన్ ధరించి గిరివర్గము భేదిలఁ దాఁకు నాబలా
రాతి విధానఁ దాఁకె నతిరౌద్ర భరమ్మున రాజపుత్రులన్. 96

మ॥ ఇరువైయేఁడుల ప్రాయమున్ జెలువమున్ హెచ్చింప వారిర్వురున్
స్మరుఁడున్- శంబరునట్లు, సాత్యకియు- నశ్వత్థామయున్ బోలె నొం
డొరు వెన్నిక హయాధిరూఢు లగుచున్ యుద్ధంబు సాగింప న
య్యిరువాగున్ భటులెల్ల నిల్చిరి దిదృక్షైకాగ్ర చేతస్కులై. 97

సీ॥ ఉభయకూలంబుల నుప్పొంగి యుల్లోల
కల్లోల మాలికల్ గడలుకొనఁగ
నతితరధాటితో నరుగు నఖండ గం
గాప్రవాహభరంబు కరణిమూఁకు
రాజపుత్రచమూభరంబు డాకకు మొగల్
కాండముల్ పులినోటి కండలయ్యెఁ
నెంత ఖండించిన సుంతయుఁ జెడక స
ముద్ర తరంగముల్ పోలెఁ బొంగి

గీ॥ పొరలి పైకెత్తివచ్చు నమ్మొగలు పక్ష
వాహినీభూరి పరిమాణ భారమప్పు
డతులిత పరాక్రమోపేతులైన రాజ
పుత్ర సైనికులకుఁ దల మున్కలయ్యెఁ. 98

మ॥ కుదురౌచున్ షహబాజుఖానుడు తుపాకుల్ ప్రేలిపింపంగ వేఁ
బదివేల్ గుండులు లేచి ధూమము నభోభాగంబుఁ గప్పంగఁ దు

మ్మెదలుఁబోలె దటాలునన్ వెడలి క్రమ్మెన్ రాజపుత్రాస్య ప
ద్మ దళంబందునఁ జేతఁదట్టి యవి క్రిందన్ గొట్టి రవ్వీరులున్. 99

—• తేజసింహుఁడు యవనసైన్యముపైఁబడి ధ్వంసము చేయుట. •—

మ॥ పెడబొబ్బల్ నికటాద్రి శృంగములఁ దబ్బిబ్బై పడన్ జేయఁ బ
ల్విడిఁ దౌరుష్క పదాతివర్గము విజృంభించెన్; మహావీర యో
ధుఁడు రారాణ్మణి తేజసింగు భటులన్ చోద్యాంచు వైరి వ్రజం
బడఁగన్ దాఁకెను శంఖమూఁదుచును బ్రహ్మాండంబు భేదిల్లఁగన్ 100

సీ॥ ఒకమాఱు ముందున కుఱికి సంహారించి
యవనయోధుల శిరంబవియమోదు
నొకమాఱు దాపటి కుగ్రుఁడై పోఁకి యం
దిన వారినెల్లను ద్రెళ్ళఁజేయు
నొకమాఱు వలపటి కురవడి లంఘించి
యందఱఁదున్మి తూఁటాడివైచు
నొకమాఱు పిఱిఁది కించుకతగ్గి తనచుట్టు
వెనుక నుండెడివారిఁ బిలుకుమార్చు

గీ॥ దీఁగ మెఱుపట్లు లశ్వంబుఁ ద్రిప్పిపోసుచు
మృత్యుదేవత చందాన మెలఁగెనపుడు
యవన పాదాతి దళముల చెవులద్రోసె
యమ మహిష కంఠ ఘంటా మహాస్వనంబు. 101

చ॥ అదరి మహాగ్నికీలలను సంతటఁజిమ్మ తుపాకిగుండులున్
గడుపునఁ జొచ్చి చుట్టుతిరుగన్ బలుపేగన పొందు మర్త్యకో
వడినల తేజసింగు భటవర్గము దానను గర్వమున్ దొరన్
బడఁగఁ దురుష్క సైన్యములు బగ్గముపాడుగఁ గూలె నేలమన్. 102

ఉ॥ ఆషహబాజుఖాను సుభటాళులఁ గొందఱఁగొంచు విద్విష
ద్భీషణ బాహుగర్వమునఁ దేజనిముందుకుఁ బూన్చె; నంతలో
రోషకషాయితాక్షుఁడు గురుస్థిరశౌర్యుఁడు రాయసింహుఁ డా
శేషఫణీంద్రు మాడ్కిఁ గవిసెన్ రభసమ్మునఁ దేజసింహుపై. 103

## హల్దీఘాటు కనుమ

ఉ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఛేలాపతి 3000 అశ్వికులు | రావోటు తేజసింహుఁడు 3000 అశ్వికులు | సలుంబ్రా కృష్ణసింహుఁడు 3000 అశ్వికులు | మహారాణా ప్రతాప సింహుఁడు 3000 అశ్వికులు | శ్యామ సింహుఁడు 2000 అశ్వికులు | ఝాను సింహుఁడు 2000 అశ్వికులు | రామచంద్రుఁడు ఎందేరావు మనస్సింహుఁడు 2000 అశ్వికులు | దేల్లా-కొఠేరి యాన్పుఫు 4000 అశ్వికులు | భీమ చాందు 30 000 భిల్లులు |

ఐ

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అబ్దుర్ రహిమాను 50 000 కాల్బలము | షాహాజుఖాన్ రాయసింహుఁడు 100,000 కాల్బలము | ఆసఫ్ఖాను 25 000 అశ్వికులు | తోడరమల్లు పూర్త్తుఁడు సాగరుఁడు 50 000 అశ్వికులు | ఘాసిం ఖాను 25 000 అశ్వికులు | రాయశీలుఁడు 50000 తుపాకి పాటు | అబ్దుల్లాఖాన్ 50 000 కాల్బలము | వీర బలుఁడు 50 000 కాల్బలము |

| |
|---|
| కున్వార్ మానసింహుఁడు సలీము అంబరు బలము 25 000 అశ్వికులు |

[illegible]

శా॥ ఆవీరుల్ హయముల్ గదల్చుకొని శౌర్యాయత్తులై మీఁదికిన్
రా వీక్షించి గజంబులన్ గనిన హర్యక్షప్రఘుండో యనం
గా విచ్చేసెను సింహనాదము వెలుంగన్ దేజసింహేంద్రుఁ డా
ప్రావృట్కాల పయోద గర్భగత గర్జాస్ఫూర్తిఁ గ్రేణించుచున్. 104

సీ॥ కల్పాంతకాల మేఘము గర్భమునసుండి
వెడలు సౌదామనీ వితతిమించి
తత మండలాగ్ర దీధితులు దిక్కులఁబర్వఁ
ద్రిప్పుకొంచును బోయి తేజసింగు
వారలిద్ధరమధ్య ప్రాలి పోరాసరింప
జ్యోతిర్లతలుచుట్టు జుట్టినట్లు
కనులు కానఁగరాక వెనుకకుఁదిరిగి భీ
కరహయంబులుత్రిప్పి మఱలదాఁకి

గీ॥ రంతరారోద్కులుంచు కల్పాంత రుద్రు
శూలమునుబోలు కుంతంబుఁ గేలఁదాల్చి
"తెగితి రింకెందుఁ బోదురో ధీరులార!"
యనుచు సింహనాదమునఁబై కరుగుదెంచె. 105

మ॥ ఉదయద్భాను సహస్రబింబగత రక్తోదగ్ర కాంతిచ్ఛటల్
వదనంబీనెడు తేజసింగు నెదిరింపన్ ధైర్యముల్ లేక పైఁ
గదియుండంచు భటాళి కొల్లయిడి చక్కన్ బాఱి రాయిర్వు; ర
య్యాదనన్ గాల్చెను దేజసింహ దహనుండావైరి సైన్యాటవిన్. 106

గీ॥ అసమ దక్షాధ్వర ధ్వంస మాచరించు
నుగ్రశివుఁబోలెఁ దేజసింహుండు పొదివి
వచ్చి- వందఱలాడ విపక్షసైన్య
మాక్షణం బకాండ ప్రళయమున మునిగె 107

— సలుంబ్రాకృష్ణసింహుఁడు—ఆసఫ్‌ఖానుతోఁ దలపడుట. —

శా॥ ఆసంరంభ విజృంభణంబు నఖిలంబాలించి కోపోగ్రుఁడై
యాసఫ్‌ఖానుఁడు పంచవింశతి సహస్రానీకినిన్ బూనుచున్

డాసెఁ ముందుకుఁ; బూఁటివేలుభటు లందఱుఁగొల్వఁగా నాసలుం
బ్రాసింహం బెదిరించె నాతని భుజావష్టంభ సంరంభమై. 108

సీ॥ ఎనిమిదంతలు బలంబెక్కుడై యున్నఁ జోం
డావతుల్ విక్రమాడంబరమునఁ
జిచ్చుఱపిడుగులై చెలరేఁగి యావనా
శ్వికులపైఁ బ్రాలి నిర్జింపఁజొచ్చిఁ;
దాతురుష్కులు విజయాతురుల్ సంఖ్యా బ
లమున నొక్కఁడుగఁ గలంగఁదాఁకి;
రుభయ సైన్యంబు లొండొంటి నోఁకినఁ దోఁచె
నుదధిద్వయముపొంగి యొరసినట్లు

గీ॥ ప్రళయ కాలాంతకోగ్ర జిహ్వాకరాళ
దీర్ఘ కుంతంబు రుచులు నల్దెసలఁ బరవ
నాసలుంబ్రాధినాథుండు యవనవీర
సుభట వక్షమ్ములను గ్రుమ్మఁగఁజొచ్చె నపుడు. 109

క॥ కడునున్న దాశ్వమును గుడి
యెడమలకుఁ ద్రిప్పుకొనుచు నిరతేజుఁడు కృ
ష్ణుఁడు రిపుల గాత్రములు ప
చ్చడిమైపడ నఱికె శౌర్య సాహసవృత్తిన్. 110

చ॥ అదిగని యోర్వలేక జ్వలి తాగ్రహుఁ డానపుఖాను కృష్ణునిన్
గదిసిన నాతఁడశ్వమును గ్రక్కున వెన్కకుఁదీసి యొక్క పె
ట్టదరఁగఁ దాఁకి సాత్వుఁడగు నానపుఖానుని గొంచుఁబోయెఁ బె
ల్లెదిగి తృణంబు నెత్తుకొని యేగెడు నానుడిగాలి కైవడిన్. 111

ఉ॥ సాహసవంతులున్ సమర శౌర్య నిధానులు రాజపుత్రు లు
త్సాహ భరంబుతోడ రిపు సైన్యములన్ జొరఁజొరి చీల్పఁ ద
ద్వాహిని పట్టుదప్పి నలువంకలకున్ జెడఁబాఱెనట్టి కో
లాహల మాకసంబు పగులన్ గవిసెన్ నలుదిక్కులందునన్. 112

(ప్రతాపసింహుఁడు- తోడరమల్లు సైన్యముఁదాకి చీకాకు గావించుట) .—

మ॥ తన సూర్యధ్వజ మొక్కచేత నొకచేతన్ శేషనాగేంద్రుఁ డో
లిన దుర్వార కరాళఖడ్గము రుచుల్ నింపన్ జగజ్జాలమున్
మునుమాదన్ జనుదెంచు నాప్రళయ రుద్రుండో యనంగాఁ బ్రతా
పనృపోత్తంసుఁడు కొండదిగ్గి యహిత వ్రాతంబు డాసెన్ వడిన్. 113

ఉ॥ ఎత్తుననుండి వచ్చు కడునెత్తగు నశ్వము దానిపైన లో
కోత్తర శౌర్యసాహస సమున్నతమూర్తి ప్రతాపదేవుఁ డా
యుత్తమువెంట నొత్తుకొని యుగ్ర బలాఢ్యులు సూర్యవంశ్య రా
హుత్తులు మొత్తమై మొగదలి రుర్వి సమస్తము కంపమొందఁగన్. 114

క॥ ఆరాజపుత్ర సుభటుల
యారభటులు యవన సైనికాళుల పృథు గ
ర్జారావంబులు నిబిడం
బై రోదసి నిండఁ బొంగి యవలికిఁ బర్వెన్. 115

మ॥ త్వర లంఘించుచువచ్చి సింహములు మాతంగోత్తమాంగంబులన్
ఖర నిర్ఘాత నఖాగ్ర సంతతుల వ్రక్కల్ చేయు చందాన భా
స్వర శౌర్యాఢ్యులు రాజపుత్రులు తురుష్క శ్రేణిపై వ్రాలి నె
త్తురునన్ గండలు కాల్వలై ధరణియందున్ బార్చి రొక్కుమ్మడిన్

ఉ॥ శృంగము భంగమైన వృష భేంద్రుని చందము దోఁపఁ దోఁకఁ ద్రొ
క్కంగనె పైకిఁదూకు భుజగప్రభు మాడ్కి సరోష సాహసా
భంగురమై తురుష్క భటవర్గము రేఁగుచు రాజపుత్ర సే
నాంగము వెన్కకున్ బడ మహాబల ధాటిని దాఁకె నయ్యెడన్! 117

ఉ॥ కత్తులు తాఁకు చప్డు! మెయిఁ గప్పిన జోడులు చిన్గు చప్డు! రా
హుత్తులు వ్రాలు చప్పుడు! హయోత్తమముల్ ధరఁగూలు చప్పుడుల్
దుత్తలఁబోలె నెత్తురులు దూఁకెడు చప్పుడు! గాయ మొంద యె
ల్గెత్తినవారి చప్పుడులు! నెల్లెడ రేఁగె రణాంగణంబునన్. 118

ఉ॥ ఒక్కొక రాజపుత్రకుల యోధుని బెక్కురు చుట్టుముట్టి యు
క్కెక్కిన మొగలుల్ గవిసి యెల్లెడ నొంపఁగసాఁగి రౌర! వా
రొక్కొకరున్ బ్రతాపనృపు నుజ్జ్వలమూర్తు లనంగ వైరులన్
ద్రుక్కఁగఁజేసి! రెంతటి యశోనిధులొక్కొ! శిశోదియాకులుల్. 119

మ॥ పొదివెన్ దాఁకెడు రాజపుత్రుల బలంబుల్ పుష్కలావర్త నీ
రదముల్ గాఁగఁ, బ్రతాప భూవరుఁడు పర్జన్యుండుగాఁగన్, బ్రభా
స్పద వర్మంబులు చంచలాకృతిగ, ఖడ్గచ్ఛట తీవ్రాశనుల్
గుదురై రాల్పఁ దురుష్క సైన్యములు నుగ్గున్ నూచమై సోలిసన్.

మ॥ విరియన్ వారెడు వాహినీ నికరమున్ వీక్షింపఁగాలేక తో
డరమల్లుండదె హెచ్చరించుచుఁ బ్రచండస్ఫూర్తిమై దాఁకె; సా
గరుఁడున్ నూర్తిఁడు కోపపూర్ణిత కటాక్షశ్రీలు రంజిల్లఁ గే
సరియుగ్మంబువలెన్ బ్రతాపునయి సుత్సాహంబుతోఁ జూపఁగన్.

సీ॥ త్రిజగద్విరోధులౌ త్రిపురాసురులతోడఁ
పోరు కైలాసమందిరుఁ డనంగ;
విలయ కాలమున జృంభించు త్రేతాగ్నుల
ముంచెడు వరుణదేవుం డనంగ;
మాల్యవన్మాలి సుమాలి ముఖ్యులఁ బట్టి
వేధించు శ్రీమహావిష్ణుఁ డనఁగ;
ఖరదూషణాది రక్షశ్శ్రేష్ఠులన్ గోప
మునఁ దాఁకు శ్రీరామమూర్తి యనఁగ;
గీ॥ ననమ విక్రమ రణ సాహసాంక మూర్తి
యాప్రతాపుఁడు సర్పసంహార లీల
సాఁగి యుక్త తోడరమల్ల సాగరులను
ముంచి కలగించి యొంచి దయ్యంచె నపుడు. 222

మ॥ బరువై యొప్పెడు దీర్ఘఖడ్గము ప్రతాపస్వామి పైకెత్తి తో
డరమల్లున్ బడమోది కంకటము గాడన్ జీల్చి మూర్తున్ ధరన్
బొరలన్ దప్పఁగఁ ద్రోసి సాగరు శిరంబున్ జూచి వేయంగ ము
ష్కరు నవ్వీరుని ప్రోల నిల్వక పరిభూతాత్ములై పాఱిరన్. 123

మ॥ ఉరగవ్రాతము సంహరింపఁగ మహోగ్రోత్సాహమున్ బెంచు నా
గరుడామంతుఁడు వాని చుట్టముల వీఁకన్ రాజరాజేశ్వరుం
డరుగున్ దెంచెఁ బ్రతాపుఁడున్ భటయుతుండై! యావనశ్రేణిదు
ర్భర తద్ఘోర కరోరధాటికిఁ జలింపన్ సాగె నాద్యంతమున్' 124

మ॥ కడు శాంతంబు నగాధమై పొలుచు నాగంభీర వారాశిలో
నుడుకున్ నీళ్లప్రవాహ మొక్క మొగమై యుప్పొంగుచున్ బాఱుకై
వడి రాణాయు శిరోదియా భటులు గర్వంబున్ బ్రవేశించి యు
య్యెడఁ దౌరుష్క చమూసమూహము బలంబింకించి రత్యుగ్రులై. 125

ఉ॥ మందర శైలమంబునిధి మధ్యముచొచ్చి కలంచునట్లు చు
ట్టుందళమొంది మోగలు భటుల్ పదులున్ శతముల్ సహస్రముల్
మ్రందఁ బ్రతాపసింహుఁడు బలస్థిరు లాతని యోధవీరు లం
దందఁ బరాక్రమస్ఫురణ మచ్చుపడన్ విహరించి రయ్యెడన్. 126

——• శ్యామసింహ — ఘాసింఘాసుల యుద్ధము •——

మ॥ ఇరువై యైదగు వేలయాశ్విక బలంబిర్వంకలన్ గొల్చు సు
స్థిర దుర్వార పరాక్రమక్రముఁడు ఘాసింఘానుపై శత్రు సం
హరణోద్యోగుఁడు శ్యామసింహ విభుఁడా సాద్రీశుఁడున్ వీరకే
సరియో నాగఁ బరాక్రమించి నడిచెన్ ఝాలాన్వయుల్ గొల్వఁగన్.

మ॥ క్రతుకాలమ్మున యాయజూకుఁడు హవిర్వాతంబులన్ వహ్ని నా
హుతులన్ జేసెడునట్లు శత్రు భటులన్ యుద్ధంబునన్ దాఁకి శీ
ర్షతతిన్ ద్రుంచుచు శ్యామసింహుఁడు గుహా సంఘాతముల్ వ్రక్కలై
క్షితిపై రాలఁగ సింహనాదము నొనర్చెన్ వీర శౌర్యార్భటిన్. 128

ఉ॥ దండధరోపమాన భయదస్థిరమేచక దీర్ఘదేహు లు
ద్దండ కృపాణ పాణులయి దర్పమెలర్ప మహమ్మదీయు లా
ఖండనసీమ వైరిభట ఖండనమున్ బొనరింప, గాలిచేఁ
బంతులు భూమిపైఁ బొరలు భంగిశిరంబులుడుల్లె బెల్లుగన్. 129

శా॥ బాహా శౌర్యులు శ్యామసింహుఁడును వాఁపర్యుండు శౌర్యోగ్రులై
బాహా-బాహి, కచా-కచిన్ బలమెలర్పన్ బోరఁ దద్దర్శనో
త్సాహ శ్రీరతులౌచు రెండుమొనలన్ దైవారు రాహుత్తులెం
తో హర్షంబున మౌనమూని రణమందున్ నిచ్చి రవ్వేళలో. 130

ఉ॥ అత్తఱి విక్రమించి భయదాహవ శౌర్యుఁడు శ్యామసింహ భూ
భృత్తిలకుండు శీర్షకము భేదిల మోదుచు ఖానుఖడ్గము

ద్వృత్తి వియత్తలంబునకుఁ ద్రెప్పఁగఁగొట్టి హయంబుఁగూల్పనో
రెత్తక వాఁడు మౌనము వహించుచుఁ బాఱెను సేలమూఁకుమన్. 131

—• భానుసింహుఁడు — యవనసేనల నుఱుమాడుట. •—

మ॥ దెసలెల్లన్ దన కేతనప్రభలు సందీప్తంబులై వెల్గ సా
హస శౌర్యాంకుఁడు భానుసింహవిభుఁ డయ్యాదిత్యుఁడున్ బోలె వె
క్కసమౌ తేజముతోడఁ బొంగుచు విపక్షవ్రాతమున్ జీల్చ వీ
ర సమూహంబును మోహరించి మహాసు సంరంభంబు వీక్షించుచున్ 132

చ॥ యవనులవైపు యోధులను నాజియుమల్లుఁడు రాయశీలుఁ డా
హవమున కెచ్చరింపరయ మారఁ దుపాకులు గాల్చి రందఱున్
బవనము వీవఁ దుమ్మెదలు పద్మములన్ విడి వచ్చునట్లు గుం
డ్లు వెడలి రాజపుత్ర భట లోకముపైఁ బడియెన్ మహోగ్రమై. 133

చ॥ పిడుగులు గుంపులై పడెడు వీఁకను నిప్పులు రాలునట్లు పైఁ
బడెడు తుపాకిగుండ్ల జడివానల పెల్లున కోర్వఁజాలమిన్
దడఁబడి రాజపుత్రభట తండము ముంచును వెన్కవోఁప క
య్యెడ స్పృహలేక నిల్వఁబడె నెచ్చటి గుంపచటన్ స్థిరంబుగన్. 134

మ॥ "అకటా! శత్రులువేయఁ బెల్లెగయు నయ్యాగ్నేయమాహేంద్ర నా
గ కరోరాస్త్రచయంబుఁ జూపులనె వ్రక్కల్ సేయునో రాజపు
త్రకులాగ్ర కటుస్వల్ప మియ్యనల వర్షంబున్ భరింపంగఁ జా
లక ముందేగక వైరిఁగూల్ప కిటు నిల్వన్ బాడియే యిట్టెడన్." 135

చ॥ అనుచును భానుసింహవిభుఁ డాడిహయంబుఁ గదల్చి వెంటరం
డని కదలన్ భటాళి నిబిడాతప మారవివెంటనేగు న
ట్లనుపమ ధాటిలేచి యనలాస్త్ర పరంపర కోర్చి శత్రుసే
న నెదుగఁజాతె; నంతట రణంబు చెలంగె భయానకస్థితిన్. 136

చ॥ కడువడి రాజపుత్రులు ముఖాముఖిఁ జెంతకువచ్చి డాఁకి పైఁ
బడఁగ మహమ్మదీయులు తుపాకులు గాల్పఁగ వీలులేక యా
బడెలసుద్రిప్పి మోదరి; కృపాణ భయంకర తీక్ష్ణ ధార చె
ల్లెడ నిగుడంగ వారి సలయుంచి కలంచిరి రాజపుత్రకుల్. 137

చ॥ తరణి నభంబునన్ దిరుగు చారిమెలంగుచు మానసింహుఁ డ
త్తఱి జయమల్లు శీర్షకము ధాత్రిని వ్రాలఁగ మోదిముందుకున్
బరచుచు రాయశీలు ఘనవక్షము నుద్ధతి వ్రేయనాఁడున్
సరగునఁ బాతె ఖడ్గము భుజంబున నొఁరుచు నెత్తురొల్కఁగన్. 138

మ॥ ఖురసంఘట్టన రేఁగుధూళి సపరషేణిన్ దివిన్ జేరఁగా
హరి శౌర్యాఢ్యులు రాజపుత్రకులు రోషాటోప మేపారఁ ద
త్కరవాలోగ్ర భుజంగకోటిచేఁ దురుష్క ప్రాణవాతంబు ల
త్తఱి భక్షింపఁగఁబెట్టి యార్చిరి వియద్ధాత్రుల్ ప్రకంపింపఁగన్. 139

—• రామచంద్రదేవుని యుద్ధము. •—

మ॥ సమరోత్సాహ విజృంభమాణ పటు గర్వాస్ఫూర్తితోఁ గొండనుం
డి మనస్సింహుఁడు రామచంద్రపతి ఖండేరావు దోస్సారుడై
దొమపిండుల్ ముడిచేలఁగావెడలి యబ్దుల్లా చమూశ్రేణి స
ర్వము చీకాకుపడంగఁ దాఁకి సమయింపన్ జొచ్చి రాచెంగటన్. 140

శా॥ తోఁకన్ ద్రొక్కు భుజంగరాజువలె నబ్దుల్లా ఖొరాసాన్ భటా
నీకంబున్ బురికొల్పి గ్వాలియరు క్షోణీనాయకున్ దాఁకె; ము
క్కాఁకల్ దీఱిన యానృపోత్తముఁడు ఖడ్గంబెత్తి సింహంబటుల్
కేకల్ వేయుచు వానిమస్తముఁ బగిల్చెన్ మోగలుల్ బెగ్గిలన్. 141

శా॥ పేల్తై రక్తముదూఁకి మూర్ఛిల, భటుల్ శిక్షించి శీఘ్రంబె య
బ్దుల్లాఖానుని మోసికొం చవలికిన్ బోవన్ మనస్సింహుఁ డ
త్యుల్లాసంబునఁ దొంగుచున్ రిపులపై నుద్వృత్తి లంఘించుచున్
ద్రుళ్ళన్ జేసెఁ దురుష్క వీరభట సందోహంబు నిర్వంకలన్. 142

మ॥ ఒకమూర్తాను విభుండు దుర్దముఁ డలాయుద్దీనుఁడన్ వీరు డో
ర్వ్యక యుద్ధాంగణమందు నర్దెసలకున్ దాఁకన్ బ్రయత్నించు సై
న్య కదంబంబుల హెచ్చరించుచు చటిఘ్యక్షత్వమున్ బూని యా
జికి ధైర్యం బిగురొత్తఁ జేసి మరలించెన్ బూన్చి యవ్వేళలో. 143

—: ఖండేరావు యుద్ధము. :—

సీ॥ పదునాఱు వర్షముల్ పాయని ప్రాఁపలేఁ
బ్రాయంబు సౌకుమార్యము వెలార్పఁ

వరుణాపుణాక్షి పత్ర విశాలమగు తేట
కనుఁగవ పరమభాగ్యంబుఁ దెలుపఁ
దనమూర్తి సొబగు మదన వసంత జయంత
సౌందర్యములకు సిగ్గందఁజేయ
నిజ తనుత్రాణ కాంతిచ్ఛట లఖిల భా
గములంపి మర్నిరీక్షతను బెంప
గీ॥ సపమ వజ్రాభరణ శోభితమైతనర్చు
దొడ్డ కాంభోజ హయము ముందునకుఁ ద్రిప్పి
రామచంద్రుఁ ఖండేరావు రణముఖమునఁ
దాఁకె విక్రాంతి వఱల మూల్తాను దొరల 144

మ॥ పులిపిల్లల్ చెలఁరేగి పైఁబడునటుల్ మూల్తాణ ఖొరాసాను యో
దులు కౌక్షేయక కుంత ముద్గర గదాదుల్ దాల్చి శౌర్యంబు వా
టిల నొక్కుమ్మడివచ్చి పైఁబడిరి; ఖండేరాయఁడుణ దుర్భర
జ్వలనుండోయన యుద్ధసీమఁ జరియింపణసాగె వీరాఢ్యుఁడై. 145

మ॥ నికటారామఫలాశిఁ బాలకుఁడు ఖండింపన్ మొదల్ పెట్టు నా
రకమై పాచక సార్వభౌముఁడును గూరల్ గోయు నట్లొచుఁ బూ
నికమై వీరవిహారముల్ సెలపి ఖండేరావు తౌరుష్క యో
ధ కదంబంబుల మస్తముచ్ దునిమె దుర్దాంత క్రియాభీలుఁడై. 146

మ॥ పరుసణ భీమ ఘటోత్క చాఖ్యను లదల్పణ భీతిమైఁ బాఱు న
క్కురు సైన్యంబుల భంగిఁ బాఱిరి తురుష్కుల్ రామచంద్రుండు, సు
స్థిర శౌర్యుండు తదీయపుత్రుఁడు, మనస్సింహుండు, దుర్దాంత వీ
రరసావేశముతో నరాతిభటశీర్షంబుల్ విదారింపఁగణ. 147

—• బేడ్లా కొటేరియా ప్రభువుల యుద్ధము. •—

గీ॥ ప్రణయబద్ధులు చోహాణ వంశ్యమణులు
వీరమూర్తులు బేడ్లా కొటేరియా నృ
పతులు నాల్గువేలాశ్విక బలము గొలువ
యవనులను దాఁకిరపుడు భయంకరముగ. 148

ఉ॥ గండశిలాప్రపంచమునగంబుననుండియు దొర్లినట్టు లు
ద్దండ మహోన్నతాశ్మకపిలానము నాలుగువేలసంఖ్య పై
నుండియు మీఁదరా నిలువనోపక యావనసేన లన్నియున్
బండిన పైరు నాఁడలు వాల్చుచు మ్రొగ్గె రణాంగణంబునన్. 149

మ॥ కవలున్ గౌరవసేనలన్ బొదివి వ్రక్కల్ సేయు చందాన దా
నవసైన్యంబుఁ గలంచు దంతిముఖ-సేనానుల్ వలెన్ వచ్చి గా
ర్వ వినాశంబునఁ జోహణప్రభు కుమారద్వంద్వ మవ్వేళ శా
త్రవ సైన్యంబుల కింకరులంచిన మొనర్పన్ సాగె వేభంగులన్. 150

—• భిల్లులు యవనులతోఁ జేయు యుద్ధము. •—

మ॥ కడునెత్తుం దెట కోటకొమ్మగుములన్ గండోపల శ్రేణిపై
వడిఁ గూర్చుండిన భిల్లులున్ ధనుపులన్ బాణాళి సంధించి సం
దడిగా నార్చుచు వేయఁగాఁ దొడరి. రేఁచద్బాణ సందోహముల్
జడివానల్ వలెఁ జెల్లుముంచెను దురుష్కప్రాజ్య సైన్యంబులన్. 151

చ॥ అచలసితంబ భాగములయందు రహించెడి గొప్పగుండులన్
బ్రబలబలుల్ కిరాతభట వర్యులు నూఱులు వేలుపట్టి పూ
నివి కదలించి, దొర్లెడు ధ్వనిన్ గిరులన్నియుఁ బ్రీల శత్రుహ
స్తిచయము నిల్చు చోటికిని జెచ్చెరఁ ద్రోసిరి గుంపుగుంపుగన్. 152

ఉ॥ ఆపయినుండి దుర్దమ మహాబలధాటిని దాఁటివచ్చు గం
డోపలకోటి మార్గముననున్న పదార్థములెల్ల నజ్జు గు
జ్జైపడ వ్రాలి మోగలు గజావళిఁ జొచ్చి పదుల్ శతంబులున్
రూపఱ దొర్లసాఁగె యవనుల్ ప్రళయంబునమున్గి కూలఁగన్. 153

మ॥ హనుమద్వానరభర్త శైలముల బాహాశక్తిమై తెచ్చి వై
చిన రామాయణ యుద్ధమందు నసురశ్రేణుల్ వలెన్ వ్రాలి యా
వన దంతావళకోటియున్ శిలలపై వ్రాలన్ ధరన్ వ్రాలి యొ
క్క నిమేషంబున మ్రగ్గె నట్టలవలెన్ గాత్రంబులున్ నుగ్గుగాన్. 154

చ॥ వెఱచుచుఁ గాలిమూఁకలును దిక్కుబలంబునఁ బాఱె; నాశ్వికుల్
పరచిరి నోరులన్ దెఱచి ప్రక్కలకున్ గిరినెక్కలేక; యు

ద్ధురతఁ దుపాకిఫౌజులును వోడనె కాల్చిరి; కాని గుండు లా
గిరి పయినున్న భిల్లతతి క్రేవకుఁ బోక పడెన్ ధరిత్రిపై. 155

శా॥ ఆమాయా శబరస్వరూప మనఘుంబై యింద్రకీలాచలో
ద్దామ ప్రస్థములన్ జరించు గజదైత్యధ్వంసి చండంబునన్
భీమాటోపుఁడు భీమచాండు ధరణీభృచ్ఛృంగమందుండి యు
గ్రామోఘ ప్రదరాళిఁగూల్చెను విపక్షారణ్య సత్వంబులన్. 156

గీ॥ అలరి యలరింప నొక్కమాఱు ప్రతాపుఁ
బరుల నొకమాఱు కనుసన్న బ్రమియఁజేయు
విడక యుభయసైన్యము మధ్య విజయలక్ష్మి
యజ్ఞనాశవుఁ దూఁగుఁటుయ్యాల నూఁగెః 157

—• మధ్యాహ్న వర్ణనము •—

శా॥ మెండై యెండలునిండె; నల్దెసలఁ గ్రమ్మెన్ నిప్పులన్గుప్పు చు
ద్దండ గ్రీష్మ సమీరముల్; నిఖిల సత్వంబుల్ గడున్డస్సె; బ్ర
హ్మాండంబందుఁ బొగల్ సెగల్ తుటుములై వ్యాపించె; మధ్యాహ్న మా
ర్తాండుం డుజ్జ్వలరొండుఁడై గగన మధ్యంబందు వెల్గొందఁగన్. 158

ఉ॥ ఆతప నాతపోద్ధతికి నాయన వర్మములెల్ల గ్రాఁగి సం
జాత కృశానుకీలలు భృశమ్ముగఁ జిమ్మఁటఁజేసి దోదసం
ఘాతము దేహముల్ బడలికల్గని సేనలు రెండువైపులం
దాతటి సుంత కన్మొగిచినట్టులు కూర్కె నిమేషకాలమున్. 159

సీ॥ తలలపై బొమిడికంబుల యిన్పరేకుల
నలమివహించు సూర్యాతపాగ్ని
పలుదెసల మిడుంగురులు విమ్మరక్త దీ
ప్తాక్షులఁ గోప భయంకరాగ్ని
ప్రాఘాత సంగర వ్యాయామమునరేఁగి
జగము మ్రింగఁగఁగోరు జాఠరాగ్ని
భువన సంతతినెల్లఁ బొడిపొడిగావించు
బహు బృహన్నాళాస్త్ర భైరవాగ్ని

గీ॥ యున్నఁటినిమింటి లోకభయంకరమయి
యతిశయిల్లు వాహో ప్రతాపాగ్ని వెలుఁగ,
భటులు పంచాగ్ని యోగభావనల మెదిగి
మఱలఁ జల్కఁడి వనికి నిర్జరులు పొగడ 160

—• మానసింహుఁడు పరంగుల నుసికొల్పి పిరంగులు ప్రేలిపించుట. •—

చ॥ "ఇరువది రెండువేల భటులెల్లెడ నాలుగులక్షయున్న మ
మ్మరవఅవేయఁ జొచ్చిరకటా గతిచే మని కుంది దక్షిణో
త్తరముల మానసింహుఁడు శతఘ్నుల సంతతధార నిప్పులన్
గురిసి విపక్ష సైన్యములఁ గాల్పఁగ నాజ్ఞ యిడెన్ భటాళికిన్ 161

సీ॥ మొగలాయి సేనా సముద్రాంతరమునుండి
పొడతెంచు బడబాగ్ని మూర్తు లనఁగ:
రాణా ప్రభంజన రాజి మొగల్ శాఖి
నిలువ దూచెడు లాకి ఫలము లనఁగ
రణదుర్గ వీర రౌద్రమునఁ జేతి కొలంది
గుప్పు నిప్పుల గొప్ప కుప్ప లనఁగ
దురక దం డను తోఁటఁ బొడిమ యాడుచు దొర్లు
పరిపక్వ కుష్మాండ ఫలము లనఁగ

గీ॥ సమయ మాంత్రిక మొనరి భూతములఁ దనుప
నడుపు రక్తాన్న నిబిడ పిండంబు లనఁగ:
నల పరంగులు పెనుపిరంగులను బేల్చ
రాలె దెసలఁ దప్తాయస గోళతతులు 162

మ॥ అవి లోకంబులఁ గాల్పనోఁ బొడరు బ్రహ్మాస్త్రాళినా నిప్పులన్
దివికిన్ జిమ్ముచు వ్రాలి యోధులను భేదింపంగ రాణా చమూ
నివహం బుఱ్ఱట లూఁగి యెత్తువడి భ్రాంతిన్ జెంది వెల్వెల్లఁబో
యి వితాకొందిన తేఁకు మోముల విధంబేమంచు వాక్రువ్వఁగన్ 163

మ॥ గుములై నిల్చి గుభా ల్గుభా లని పిరంగుల్ మ్రోగుచే కాని స
రము నిశ్శబ్దతఁ దాల్చె; యోధతతి చావన్ జూడఁగాలేక తెం

దమునకా గుందుచు చాందుభట్టొక మహోదంతావళంబెక్కి యు
త్తమ గంభీర మనోజ్ఞ నిశ్చల గళధ్వానంబు శోభిల్లఁగన్. 164

— చంద్రభట్టారకుఁడు రాజపుత్రసేనలకు రజోద్రేకముఁ గలిగించుట. —

ఉ॥ "ఓయసమాన సాహస సమున్నత శౌర్య సమగ్రమూర్తులా
రా! యడలంగఁ జోకుఁడు పిరంగుల సేంద్ల కళుండయుద్ధ వి
ద్యాయుతులైన మీకుఁ గరమంటి చరించఁగఁ బూలచెండ్లు గా
వేయవి యొక్కమైఁదగులుఁడీ పొడియైపడ సర్వలోకముల్. 165

సీ॥ మొన్నగాఁ జిత్తూరి మూఁడవముట్టడి
పదియునాతేండ్లలేఁ బ్రాయమందె
కరకంకణములు మంగళ వస్త్రములతోడఁ
బెండ్లి పీటలనుండి వెడలివచ్చి
పుత్త పూర్వద్వారమున శాత్రవులఁగూల్చె
భార్య పంద్రెండేండ్ల పడుచురిపులఁ
గుప్పగూరగఁ ద్రుంచెఁ గోమలిత్యాగ వి
క్రమములు సకల లోకములుమెచ్చె

గీ॥ నాయరుంధతీ దర్శనమపుడె స్వర్గ
మునకు నచ్చరల్ కనుసన్నలను జొవర్ప
వలచు శౌర్యైక ధనులు మీకొలమువార
లతులమతులార! ఘేల్వా భటాళులార! 166

సీ॥ గౌతమగోత్రంబు గాధిపురము రాజ
ధాని యాచార్యుండు దైత్యగురుఁడు
వంశకర్త విశ్వామిత్రుఁ డాస్వర్గ
మర్త్యముల్ మునుపు స్తంభనమొనర్చెఁ
బదునాల్గులోకముల్ పైకివచ్చిన సుంత
కీ డెఱుంగనిది రాఠోడుకులము
బిగఁబట్టితెచ్చి నిల్పినఁ దురుష్కులు మీ ము
ఖముఁజూడ వెఱతురకా ఖ్యాతిగలిగె

గీ॥ నఖిల భారతవీర మహాధవనము
గోపురమున నెత్తిన పూర్ణ కుంభతుల్యుఁ
దగుచు మీతింద్రి జయమల్లు యశముఁగాంచె
ద్వైణ్మదే భేంద్రసింహయో తేజసింహ॰ 167

సీ॥ సామ్రాజ్య మఖిలంబు సవతితమ్మునకిచ్చె
సంతరత్యాగి యూవండనృపతి
యూబయానాసీమ నరుల తలల్ వేలు
రాలఁగా విహరించె రత్నసింగు
చిత్తూరుకోట డుస్సినచోట నిలిచి దు
ర్గావాపు ప్రళయ రౌద్రమునఁ బోరె
నెనిమిదేడులు(క్రింద నీరేడులోకముల్
జయవెట్ట వర్తించె సాహిదాసు

ఆ॥ సకల పూజ్యమైన చందేళు వంశంబు
స్వామిభక్తి యుగ్గు పాలఁబెటిగె
నాకులంబు వీరులందు నాయకమణి
కృష్ణసింహవిభుఁడు కృష్ణనిభుఁడు. 168

సీ॥ జగదేక దుర్నిరీక్ష ప్రకాశులటన్నఁ
జూపు నూర్లకొలంది సూర్యకులము
నిత్య సత్యవ్రత నిష్ఠాపరులటన్నఁ
జూపు వేలకొలంది సూర్యకులము
కంఠలొలిచియిచ్చు ఘనవదాన్యులటన్నఁ
జూపు లక్షలకొలంది సూర్యకులము
లోకంబులెల్ల గెల్చు ధనుర్ధరులటన్నఁ
జూపుఁ గోట్లకొలంది సూర్యకులము

గీ॥ క్షోణివెలయు నసంఖ్యాక కులములందు
సురలకును సాయమొనరించె సూర్యకులము
సూర్యకులము దూరంబుండి చూచునెడల
నఖిల భువనంబు లంధకారావృతములు. 169

సీ॥ ఇక్ష్వాకు వెటులోక హితుఁడు కాకుత్స్థ త్రి
శంకులు మఱి హరిశ్చంద్రుఁ డెట్టి
వారు' మాంధాత ప్రాభవమెంత నాభాగు
డంబరీష భగీరథాది నృపులు
సామాన్యులే యిఁక సగర-దిలీప-ర
ఘుక్షితీశులకీర్తిఁ గొలువఁగలమె
బ్రహ్మాండమంతయుఁ ద్రాసున నిడిన నిం
దుల నొక్కఁడొక్కఁడే తూఁగఁగలఁడు'
గీ॥ భువన సామ్రాజ్యలక్ష్మి కాఁపురముచేయు
వజ్ర హర్మ్యరాజంబు మీభానుకులము
శతశత నమస్కృతులుచేసి సకలజగము
నీపదముఁగొల్చు టరుదె ప్రతాపదేవ 170

సీ॥ కాపరిస్థాన్ ప్రజాగణము నేఁటికిఁగూడ
బప్పరాయలు ఖడ్గ పటిమఁబొగడ
నాఘోరాసాన్ దేశమంటు ఖోమనసింహు
నాణెంబులింకను నడచుచుండ
సమరసింహేంద్రు విక్రమగాథ లెల్లప్డు
ఘోరీజనులు కొంటుకులకుఁ దెలుపఁ
గుంభరాణాశౌర్య జృంభణం బేవేళ
దేశదేశములు కీర్తించుచుండ
గీ॥ భారతీయుల యెదలలఁ బ్రాణముండ
మఱువనేర్తురే రవివంశ మహిమమెపుడు
ధర్మసంస్థాపనార్థమే తత్కులమున
దేవుఁడై పుట్టితి ప్రతాపదేవ! నీవు. 171

సీ॥ భరతఖండ క్షమాభరము నిజోద్దండ
బాహుదండంబున వఱలఁజేసి
జగమెల్ల జయపెట్ట శకము నిల్పిన మేటి
విక్రమాదిత్య పృథ్వీవిభుండు

సకల మింద్రప్రస్థ సామ్రాజ్యమున సార్వ
భౌమ పరంపరఁ బాదుకొలిపి
బహు కాల మేలి శాశ్వతకీర్తిఁ గనిన యు
నంగపాలాది రాట్పుంగవులును
ఆ॥ సకల సుగుణ గణ విశాల రేవంశసా
గరముగనిన దొడ్డ కౌస్తుభమ్మ
లట్టి మేటివంశ మపకీర్తిఁ బడకుండఁ
బోరరయ్య! ల్వారు వీరులార. 172

సీ॥ పావకాన్వయ సంభవక్షత్రియులనెల్ల
నాధారయష్టి చోహాణకులంబు
మున్నేడవ శతాబ్దమునఁ దురుష్కులను ఖం
డించె లక్షియగ మాణిక్యరాయఁ
డిరనియన్న కుమారుఁ డేదేండ్ల లాటుండుఁ
దస్యుకోటినిర్జించి తానుమడిసె
సకల వీరప్రపంచము మౌళివెలయు ది
వ్యజ్యోతి యితఁడను ఖ్యాతిఁగాంచె
గీ॥ నతనితండ్రి దూలారావు నువన వీర
వాహినీవార్ధి కుంభసంభవమహర్షి
మిమ్ముఁగనినంత జగము కంపించుచుండు
బాహుబలులార! చోహాణ ప్రభువులార 173

సీ॥ ఆయనంగు ననుంగు టాఁడుబిడ్డ కొడుకిం
ద్రప్రస్థపురము పుణ్యములపంట
సోమేశ కులవార్ధి శుభ్రమరీచి ని
ర్మాగర్భశుక్తి ముక్తాఫలంబు
సమరసింహునిస్నేహ సౌహృదప్రతి పృ
థామహాదేవి సౌదర్యధనము
కల్యాణి మేనటికపు ముద్దుమామః సం
యుక్తా మనోజ్ఞ ధామోదయంబు;

గీ॥ సమద జయచంద్ర జలద జంఘూమరుత్తు
ఘోరి గజసింహ ముఖులఁబోల్ వీరులేరి
యీచతుర్భుజ రాజేంద్రు నెన్నఁదగునె
పృథ్వీరాజై చతుర్భుజుం డెసఁగెఁగాక. 174

శా॥ సౌరాష్ట్రంబుననుండి వచ్చుచుఁ దురుష్కశ్రేణిఁ జక్కాడుచో
మారాణాలను దొల్తనుండి బలసంపన్మూర్తులై కొల్చు దో
స్సారంబెల్ల జగంబునన్ బొగడె మీఘూలా మహావంశ మా
ధార స్తంభము భారతాభ్యుదయ సౌధస్థాయిగన్ నిల్వఁగన్. 175

శా॥ ఐదారేఁడుల చిన్నకుఱ్ఱ లయినన్ హర్యక్షశాబంబు ల
ట్లాదస్యు ప్రకరంబుఁ గూల్చుకుల మర్యాదల్ వెలుంగన్ రిపు
చ్ఛేదంబున్ బొనరించి వారితలలన్ దెండాడి చెండాడుడీఁ
యేదీ చూతము మీభుజాబల మహోహేలా కళాదీధితుల్. 176

ఉ॥ తొమ్మిది నూఱులేండ్లు ధృతితో నెలకొల్పు మనాభిమాన భా
వమ్మును మాతృభక్తి ఫలపాకము వమ్మగు వైరినోర్చు తూ
కమ్మనఁ దక్కువైన: నటుగాపున నిష్ఠుర దీక్షఁబూని శౌ
ర్యమ్మఖిలంబు చూపి రిపులందఱ నొంపరె కీర్తి నింపరే." 177

మ॥ అని విప్రోత్తముఁ డంబుద స్వనముతో నందందునన్ నిల్చి యుం
డిన యవ్వీరుల వంశ గౌరవము వర్ణింపన్ శ్రవఃప్రీతిగా
విని యాద్యంతము సైన్యమంతయు విజృంభించెన్ సముద్రంబు పొం
గిన చందమ్మున భూరి వీరరస సంకీర్ణ ప్రభావమ్మునన్. 178

ఉ॥ అంతట మానసింహ విభునాజ్ఞఁ బిరంగులు పెన్ పిరంగు ల
త్యంత జవంబు రౌద్రమును దార్కొనఁ ద్రిప్పుచుఁ జెంతనున్న మం
దెంతయుఁ దొంటికన్న నిపుడిబ్బడి ముబ్బడిగాఁగఁ గ్రేల్వఁ గ
ల్పాంత మహాశనిప్రతతి యట్లువి యాత్మబలంబుఁ డాయుచున్. 179

గీ॥ హరుని నయనాగ్నిఁ బొడమి దిగంతరములఁ
గ్రమ్ము చండాగ్నికణముల కరణి యవన
సైనిక ముఖాబ్జ నిర్గత చంచరీక
పటలములు పైనవ్రాలెఁ దుపాకిగుండ్లు. 180

—• రాతోద్దేజసింహుఁడు విజృంభించి పిరంగులపైకేగుట. •—

సీ॥ ఆజానుదీర్ఘ బాహార్గళ యుగళంబు
సమధికోదాత్త లక్షణముఁ దెలుప
నలను సింహాసనంబైన వక్షము మహా
రాజన్య పట్టభద్రత వెలార్ప
నరుణరేఖా మనోహర దీర్ఘనేత్రముల్
సతత లక్ష్మీనివాసతను బెంప
దర్శనీయంబైన తనమూర్తి నవకోటి
మన్మథ సౌందర్య మహిమనింప
గీ॥ నమృత రసమొల్కఁ మొలక నవ్వులరుమోము
శతశరచ్చంద్ర సౌభాగ్య సరణిఁగేరఁ
దనభటులవీడి హయము ముందునకుఁ ద్రిప్పె
ధీర లోకైకమౌళి యా తేజసింగు 181

సీ॥ రణదుర్గ పరమ శౌర్య ప్రాభవము మెచ్చి
పైఁజల్లు శతపత్ర పటలమనఁగ
గుహలు మార్మ్రోయంగ బహు శతఘ్నిక లవి
చ్ఛిన్నధారల నగ్నిఁ జెఱఁగుచుండ
వేదమంత్రముల దీవించుచు భూదేవ
తతిచల్లు మంగళాక్షతల నసుమఁ
గరములు ముకుళించి శిరమొకించుక వాల్చి
పెండ్లికొడుకు మ్రొక్కఁ వెళ్లినట్లు
గీ॥ గుచియఁ గేడెంబుఁ జేతుల గుదిలపఱచి
చిత్రధార నశ్వముఁ బూన్చి శిరమువంచి
పరమ సాహసుఁడగుచు బర్వతము డిగుచుఁ
దేజసింగు పిరంగుల దెసకుదూఁకె. 182

మ॥ "నిమిషంబుగా నినుపీడి యుండఁగలమే నీతోడిదేమాకు లో
క" మటంచుగా దమ జన్మమాది దృఢదీక్షా భక్తులగాగొల్చు ను

త్తమ రారోమఁడల వీరులంపఁబుసు మొత్తంబై నిజాధీశు పా
దములన్ గొల్వఁగ వెంటఁడూఁకి రరిసంతానమ్ము చింతింపఁగన్. 183

శా॥ ఆలోకోన్నతి శౌర్య సాహస సమగ్రాశ్వాప్రి ద్మశ్యంబుఁ దా
మాలోకించుచు రెండుపక్షములఁ బాహా! సురల్ గూడ నీ
లీలల్ నేర్తురె నీసమాసు లిలలో నేర్పింపఁ దద్విక్రమ
శ్రీలన్ వాడిరి తేజసింహునకు "జేః జేః" యంచుఁ గీర్తించుచున్

—• రారోడ్ తేజసింహునకు సలుంబ్రావాకృష్ణసింహుఁడు తోడగుట. •—

శా॥ దూరంబందున నుండి యాశ్వ తులు సంతోషమ్ముతోఁ జూచి "యా
రాః రారోణ్మణి నీబలోద్ధతి ప్రపంచాతీత మద్దానికిన్
దారంబున్నదె" యంచు మెప్పుచు సలుంబ్రాస్వామి చోండావతుల్
వారై కొల్వ శతమ్నికాతతియున్ లంఘించె సింహాకృతిన్. 185

మ॥ తనచేఁ గాలుని దండమంతటి గదాదండంబు సంధించి భీ
ముని చందంబున గొప్పకన్నుఁగవ నిప్పుల్ రాల దుర్దాంత వృ
త్తిని ఘోషించుచుఁ దేజసింహుఁడును నాందిన్ దీర్చి పుణ్యాహవా
చనమున్ జేసె శతఘ్నికాత్రయము పిచ్చుల్ గాఁబడన్ మోదుచున్.

మ॥ ఖరఖడ్గంబునఁ బోర్చుగీసు భటులన్ ఖండించుచున్ ఘోర ము
ద్గర ఘాతంబుల నాశతఘ్నులను వ్రక్కల్ చేయుచున్ లోక సం
హరణోద్యోగ పరాయణుండగు నపర్ణాధీశ్వరున్ బోలి సు
స్థిర రౌద్రోద్ధతిఁ దేజసింహుఁడు చరించెన్ శాత్రవుల్ బెగ్గిలన్. 187

మ॥ సునిశాతస్థిర వీరవిక్రమయుతుల్ చోండావతుల్ వారి ప్ర
క్కన రారోడులు బానిశస్త్రి ఘలలింగా నా "షహోరా" యెడా
రిని నిప్పుల్ దిను కోడిపుంజులటు లుద్వృత్తిన్ శతఘ్నీచయం
బును వ్రయ్యల్ పడ మోదినారు గదా భూరిప్రఘాతంబులన్. 188

చ॥ కెరలుచు వ్రాలుచున్ బుడుతకీసులఁ గూల్చుచు నాశతఘ్నులన్
జెఱచెఱలాడి వ్రక్కలుగఁ జేయుచు దక్షిణమాదిచేసి యు
త్తరమునకేను లోకభయదవ్రతనిష్ఠుఁడు తేజసింహ భూ
వరమణి యుత్తరాయన దివాకరుఁబోలె వెలింగె సత్తతిన్. 189

సీ॥ ఖగరాజు కినిసి పన్నగరాజు శీర్షముల్
ఛిద్రపలై వ్రాలంగఁ జెండినట్లు
వాసకారునఁ గృషీవలుఁడు గొడ్డలిపట్టి
పుట్టలన్నియుఁ చెగఁ గొట్టినట్లు
కటురోషమున లోహకారుండు మండెడు
మూసలన్నియు చిల్ల సేసినట్లు
గ్రీష్మవాతము బిట్టురేఁగి సహకార జ
పా వృక్షముల రాల్చి వైచినట్లు
గీ॥ దండధరు గదాదండ ప్రచండదీర్ఘ
దండమున శతఘ్నీసముదాయ పృషల
వక్త్రములు వ్రక్క వ్రక్కలై పడఁగమోదెఁ
దేజసింహుండు క్షాత్ర సందీప్తుఁడగుచు. 190

మ॥ వడిమై నిప్పులయేఱుదాఁటి ఘవనవ్రాతంబు పైనెత్తి వ
చ్చెడు వైవస్వతుఁడో యనంగ "బదనూర్‌సింహుండు" రారోడు లే
ల్లెడఁ జుట్టుచు దనుఁగొల్వఁగా యవన వాహిన్యగ్రముల్‌దాఁకి యొ
క్కఁడు విక్రాంతి•భటాళిమస్తముల నుగ్గుల్‌నూఁకగా దంచినన్. 191

—• యవనసేనాపతు లొక్కుమ్మడి రాజపుత్ర సేనలను దాఁకుట. •—

ఉ॥ ఆరటమంది సైన్యవిభుఁ డాసఫుఖానుఁడు రాయసింహు న
ద్దారహిమానునిన్ సమరముష్కరు నాషహబాజుఖానునిన్
జేరగఁబిల్చి సైన్యములుచేరిచి నర్వురుఁగూడి శౌర్య దు
ర్వారులు రాజపుత్రకులపై దొడరన్ నియమంబు చేయుచున్. 192

మ॥ తన కంఖాణ హయంబుద్రిప్పి సముదాత్తప్రౌఢి నా తేజసిం
గు నెదిర్చెన్; షహబాజుఖాను దవిలెన్ గ్రోధోద్ధతున్ గృష్ణసిం
హుని; ఖేల్వాపతి దూరమందు సకలంబూహించి యత్యంత ధా
టిని జేరన్ జని రాయసింహవిభుఁ బట్టెన్ సైంహికేయుండనన్ 193

మ॥ బదనూర్‌సింహము సింహవిక్రమమునన్ బైవచ్చి ఖడ్గద్యుతుల్
చదలన్ బర్వఁగ నొక్కమైఁదగిలె నాసఫ్‌ఖాను; వాఁడంత బె

ట్టిదమౌ కోపముతోడఁ గుంతమును నాపెన్ దీర్ఘవక్షంబుపై:
నది తుంటల్పడెఁ దేజసింహవిభు ఘోరాస్త్రప్రయోగంబునన్. 194

మ॥ త్వరమై సాయుధుఁడౌచు వాఁడు బదసూర్ భర్తన్ సమీపించె; నా
బిరుదున్ వీరరసాబ్ధి వీచికవలెన్ వీతెంచె నాఖానుపై;
మెఱుపుల్వోలెఁ గృపాణముల్ దిరిగె; గ్రమ్మెన్ వాజిపై వాజి; యా
పరివేషమ్ముల సూర్యచంద్రులవలెన్ భాసిల్లి రప్డిర్వురున్ 195

మ॥ కరవాలమ్ములు నాగుపాములవలెన్ గర్రంబులన్ జుట్టె; ని
ర్భర క్రేటుల్ మఱి పోటులిన్నియనుచున్ రూపింపరాకుండె; భా
స్వర ఖడ్గంబునఁ దేజసింహనృపుఁ డాసప్ఖాను మోదంగఁ, ద
త్తురగంబీల్గినఁ జెట్టుతోఁ బడు మ్రత్తుండట్లు వాఁడున్ బడెన్. 196

ఉ॥ ఆరణవీరుఁ డిట్లయిన సవ్వలదాఁటుచుఁ దేజసింహుఁ డ
బ్దారహిమానుపైఁ గవిసెఁ; దోడనె వాఁడును దాఁకె, వారిధిన్
వారిధి దాఁకునట్టులు; రణంబు క్షణంబున ఘోరమయ్యెఁ; బా
కారి బలాసురుల్ పెనఁగునట్టులు పోరఁగ సాఁగిరిర్వురున్. 197

ఉ॥ భూరి మహాప్రభావ గుణమున్ బ్రకటించుచుఁ దేజసింహుఁడుఁ డ
బ్దారహిమాను ఖడ్గరణ ధూర్వహశక్తి వెలుంగ, నుగ్రులై
యారణవేదివెల్గెడు మహాదహనోగ్ర సమగ్రమూర్తులై
పోరొనరించి రిర్వురును బూర్ణపరాక్రమరేఖ యొప్పఁగన్. 198

శా॥ ఔరా! నీదగుసాహసం బని మనంబందెంచుచున్ విద్విష
ద్వీరారణ్య దవానలుండు బదసూర్ పృథ్వీశ్వరుం డశ్వమున్
బ్రేరేపించుచు ముందుమూఁకి తనవైరిన్ గుఱ్ఱమందుండి య
ర్వారేభంబు మృణాలమున్ గొనిన రేవన్ గొంచుఁబోయెన్ వడిన్.

ఉ॥ సైంధవుఁడోయనంగ బలసాహసుఁ డాషహబాజుఖాను ద
ర్పాంధుఁడు క్రోవకడ్డువడ నాతనిఁబై కొనెఁ గృష్ణసింహుఁ డా
కంధినిజొచ్చు కుంజరము కైపడిఁ; దద్బలఘాటివాఁడు ప్రా
లెంధరపైనదోమయుఁ బలెన్ గనుమూసిర యంతలోపలన్. 200

మ॥ పరమోదారుఁడు రాయసింహవిభు ఖేల్వాభర్తృ యాకారవే
శ్వరునిన్ దాఁకెడు సాత్యకిన్ బలెఁగడున్ సంరంభమేపార సం

గర రంగంబునఁదాఁకి యాతని భుజాగర్వమ్ము వర్ణ్యంబనన్
గరవాలమ్మున వేయునాఁడు దుటికెన్ గాయంబు గాయంబుగాన్. 201

శా॥ ప్రావృట్కాల పయోధిప్రకటి రేసన్ రేఁగి రారోధు ఛోం
డావద్వీరు లరాతిసైన్యపట లాంతర్భాగముల్ జేరి వీ
రావేశమ్మున వైరివీరతతి నంపంబుల్ విదారించుచున్
ప్రోవుల్ప్రోవులు పోసిరెల్లెడ సముద్భూమిన్ శిరశ్శ్రేణులన్. 202

ఉ॥ చండపరాక్రమంబు భుజశౌర్యము శోభిలఁ దేజసింహుఁడున్
ఖాండవమున్ దహించెడు ధనంజయుఁబోలె నరాతియోధులన్
మెండుగ శీర్షముల్ తఱిగి నేలకుఁగూలఁగ వెన్నినంత నా
ఖండనసీమ మోగలుబు పచ్చముపాతుగఁగూలి రెల్లెడన్ 203

మ॥ పరసేనన్ బదనూరుభర్తయు సలుంబ్రానేతయున్ జొచ్చి యి
ర్వురు ఖడ్గంబుల కష్టుతీరని పనిన్ బుట్టించి రివ్వారి వీ
ర రణోద్రేకమునందుఁజిక్కి యమదంష్ట్రా మధ్యమున్ జొచ్చు నా
కరణిన్ వైరులు నుగ్గునేలుగను ద్రుంగన్ సాఁగి రవ్వేళలో. 204

ఉ॥ ఓడలు గుంపుగూడుచు మహోదధియందలి నీటిమొత్తమున్
వోడనె చించుచున్ రవముతోఁ జనునట్లరిసేనఁజొచ్చి చ
క్కాడుచు వారలిద్దరును నాశ్వికవర్గముగొల్వ సంగర
క్రీడల ద్రేఁగుచూపి విహరించిరి శాత్రవ మధ్యసీమలన్. 205

## ——• ప్రతాపసింహుని ద్వితీయ యుద్ధము •——

మ॥ ద్విసహస్రంబు శిశోదియాభటులు సేవింపన్ బ్రతాపప్రచం
డసమానస్థిర వీరవిక్రమ కళావ్యాపార మేపార శ
త్రుసమూహంబుల మీఁదికిన్ వెడలి గొంతుల్ గోసి కోరాడి యు
గ్ర సహస్రాంశుఁడువోలెఁ దేజమువెలుంగన్ నిల్చె దుర్వారుఁడై 206

మ॥ కడుదట్టంబయియొప్పు చెట్టడవి చీకాకై ఛరన్ వ్రాల సం
దడిమై దంతిపరంపరల్ గవియు చందంబార, రాణాప్రతా
పుఁడు తద్యోధులు వైరిసైన్యము ముఖంబున్ జీల్చి దోర్దర్ప మే
ర్పడఁ దన్మధ్యమునందుదూఁకి రహితుల్ పాఱంగ నల్దిక్కులన్. 207

శా॥ తోడర్మల్లును యుద్ధనైపుణ కళాటోపోస్ఫూరులై మోదులన్
దోడై కొల్వ, శిశోదియా ప్రభువరేణ్యుల్ వీకమై దాఁకి పో
రాడన్ జూచెఁ; బ్రతాపసింహవిభుఁ డుద్యద్ధాటిఁ దచ్ఛీర్ష మూఁ
టాడన్ ఖడ్గము నెత్తి మోది యరిమధ్యంబందు దూఁకెన్ వడిన్. 208

ఉ॥ రోసమునొంది చుట్టును దురుష్కులు కొండఱుకొల్వ లోకసం
త్రాస విశేషశౌర్య బలదర్పుఁడు సాగరుఁ డగ్రసోదరున్
డాసెఁ: బ్రతాపుఁ డాతని క్షణంబునఁ గ్రిందికిఁ దెచ్చెఁ; నిట్టి భ
స్మాసురుఁ డట్టి యుగ్ర నిటలాక్షుని దెంగట నిల్వనేర్చునే. 209

శా॥ దూరంబందుఁ దురుష్కయోధులను సూత్రం దొక్కెడన్ జేర్చి "మీ
రీ రాణానెదిరించి పోల్చుఁ" డన వారెల్లన్ బ్రతాపేంద్రుపై
బారై మూఁకిరి; కొందఱన్ దునిమి కోపస్ఫూర్తిమై సూక్తునిన్
జేరన్ బోయి తదీయశీర్షకముఁ డించెన్ రాజమార్తాండుఁడున్. 210

చ॥ జలరుహబాంధవుం డుదయశైలము నెక్కెనఁ దత్ప్రకాశముల్
నలుదెసలన్ వడిన్ గవియు లాగు ప్రతాపుఁ డరాతిసైన్య సీ
మల మెలఁగన్ దదీయభట మండలిచుట్టును జుట్టుకొంచు మో
గలుభట శీర్షకోటి కడికండలుగా నిలరాల్చె నయ్యెడన్. 211

సీ॥ అతిపావనంబు హారావళీశైల రా
జమున హల్దీఘాటు సవనశాల
యతులప్రతాప బాహావీర్యభర యశో
ధనుఁడు తోడరుమల్లు దక్షమౌని
యాతని యాజమాన్యమునఁ జేరి మెలంగు
రాజపుత్రకులు నిర్జరుల గణము
వేలకువేలు సేవించు యావనభటుల్
వ్రేలెడుపొడుగు గడ్డాలఋషులు
గీ॥ శూరవరులు శిశోదియా వీరభటులు
ప్రమథ గణములుగాఁ బ్రతాపప్రభుండు
ప్రళయభైరవ విగ్రహ ప్రాభవమున
నరిచమూతతిఁ జొచ్చి చక్కాడెనపుడు. 212

మ॥ కఱకుంబీరపు రాజపుత్రకుల డాకన్ సైపఁగాలేక యా
కొఱప్రాణంబులతోడ నెల్లెడఁ దురుష్కుల్ పాఱఁగాఁజొచ్చి రా
హరిశౌర్యుండు ప్రతాపుఁడున్ యవనసేనాంతంబుఁ బ్రాపించి శం
ఖరవంబున్ బొనరించె దూఘర సుహోగర్వంబు లూఁటాడఁగన్. 213

మ॥ ప్రళయాంభోధర గర్జనంబుపఁట దధ్వానంబు వీతేర న
ప్వల నిల్వంబడు మానసింహవిభు నంబర్ యోధులున్ వెంతనే
పులిగాండ్రించిన దష్టజిల్లి హరిణంబుల్ పాఱు చందాన, ది
క్కులకున్ బాఱఁగఁజొచ్చి; రెంతభయ మొక్కో యాప్రతాపుండనన్

గీ॥ అంతలోఁ బ్రక్కనున్నట్టి యవనసేనఁ
జెండుబెండాడి శ్రీకృష్ణసింహవిభుఁడు
శంఖనాదంబువిని చాలసంభ్రమమున
స్వామియొద్దకు మెఱుపట్లు వచ్చిదూఁకి 215

మ॥ "అకటా! యొంటిగ నిట్లురాఁదగునె దేవా! శత్రుమధ్యం బపా
యకరస్థానము వైరిసైన్యము లసంఖ్యాకంబుగా నున్నచో
టికి రాఁజెల్లదు నాదుప్రార్థనముఁ బాటింపుం' డటంచొండు ప్ర
క్కకుఁ గళ్లెంబునుబట్టి యశ్వముఁ దొలంగన్ద్రిప్పెఁ గార్యజ్ఞుఁడై. 216

చ॥ పువు వికసించినట్లు మొగమున్ జిఱునవ్వలరింపఁగాఁ బ్రతా
పవిభుఁడు "తండ్రి! వీరున కపాయములేని స్థలంబులున్నె యా
హవమిది; వెన్కఁజూడఁదగ" దంచన నంతటఁ దేజసింహుఁ డా
యవనులసేనఁ జించుకొని యక్కఁగకున్ జనుదెంచె సూటిగన్. 217

చ॥ ఒకయెడఁ గృష్ణసింహుఁడు మఱొక్కయెడన్ బదనూరుభర్త చై
తకము ఖలీనమున్గొని ప్రతాపునిఁజేర్చిరి తొంటిచోట; దా
నికవల రెండుసైన్యములు నింగియు నేలయు రాయునట్టి పో
లిక, నతిరౌద్రధాటిఁ దవిలెన్ రణశౌర్య విజృంభణంబునన్. 218

—— యవనుల వారణబలముతో రాజపుత్రులకైన యుద్ధము. ——

సీ॥ స్థావరత్వముమాని జంగమత్వముఁదాల్చు
నంజనాచల సమూహములనంగ

మొగలాయివాహిని పుష్కరిస్థలినిల్చు
నీలకాదంబిని నివహమనఁగ
దళముగా మొలిచి విచ్చలవిడిఁ బెఱుగు ను
త్తాలతమాల సంతానమనఁగ
మొగలు నదీజలంబులు తగ్గ వెలిఁబోచు
విపుల గండోపల వితతియనఁగ
గీ॥ యవనసైన్యోత్తర దిశాముఖాగ్రసీమ
నిలిచి ఘీంకారముల నింగి నేలఁగలిపి
కరి ఘటాకోటి తాఱుచీకటులఁ దాఁటి
యరితతులఁదాఁక వెడలె భయానకముగ. 219

సీ॥ కడుఁ బదనైయున్న గన్నెరాకమ్ములఁ
దలలలో మెదడు బ్రద్దలుగఁగోసి
బలమైన కత్తివాతి లకోరులు నిగుడ్చి
దీర్ఘదంతంబులఁ ద్రెళ్ళవ్రేసి
నిశితధారలనొప్పు నెలవంక కోలల
శ్రోత్ర వృంతములు రాసులుగఁజోసి
వాఁడిమిగలి పాఱ వాఁతియలుంగులఁ
దుండముల్ మిగులఁ దుత్తుమురుచేసి
గీ॥ పలురకంబులసంప దెబ్బాటు వాన
గురిసి కుంభస్థలంబులు గూలఁద్రోసి
శరములను 'జిత్తుజల్లుగాఁబరపి భీమ
చాందు భటులుగూల్చిరి దంతిసంతతులను 220

క॥ బలవంతులైన భిల్లుల
యలుగులుమెయి నిండనాఁటి యావనగజముల్
వెలిఁగె నొడలెల్ల ముండులు
పులకెత్తిన యేదుపంది పూఁకలనంగన్. 221

ఉ॥ బిట్టుగమావటీంద్రు గజబృందములన్ నిశితాంకుశంబులన్
నెట్టుచుఁ బూన్చిర ద్రి; కవినెమ్మది నెక్కఁగసాఁగె ఘీంకృతుల్

పెట్టుచు; మొగలుల్ కరులు వీపులనుండి తుపాకిగుండ్లతోఁ
గొట్టిరి వానిడాకలకుఁ గొందఱుభిల్లులు కూలిరయ్యెడన్. 222

ఉ॥ దట్టముగాఁగమూఁగి బలదర్పులు భిల్లులు ప్రాసముల్ గదా
పట్టిసభిండివాల కరవాలతతుల్ గొని తుండముల్ తెగన్
గొట్టినఁ గుంజరోత్కరము కొండలుకూలినయట్లు బిట్టుగి
పెట్టుచు నేలపైఁ బొరలెఁ బెంటలుపెంటలుగాఁగ నత్తఱిన్. 223

—• భీమచాందు యుద్ధము. •—

సీ॥ వామబాహువునంటి వఱలుచాపము మహో
రగ రాజదీర్ఘ హారంబుగాఁగఁ
గడలెల్ల చుర్రిరీక్షద్యుతుల్ వెదచల్లు
శూలంబు ముమ్మొన వాలుగాఁగ
హస్తాగ్రమున దక్షిణావర్తశంఖ మ
య్యంబుజాసను కపాలంబుగాఁగ
గడిమయైనను దనువిడకకొల్చెడు భిల్ల
తతులెల్ల ప్రమథ సంతతులుగాఁగ

గీ॥ నప్పు డబ్దూర్ నబీతెచ్చు హస్తిదైత్యు
భిల్లపశుపతి గదనెత్తి పిప్పినేయ
గాయపడి చెందిరపుఁ గొండకరణి నదియుఁ
గాళ్లపైకెత్తి పిల్లేరు గంతువైచె. 224

ఉ॥ ఖండనభీముఁడా శబరవంశ్య శిఖామణి భీమచాఁదు దో
ర్దండ గదాభిఘాతముల దంతిసమూహము కుంభగోళముల్
మెండుగఁ జీల్చివైచుచు వెలింగెను గండశిలా వ్రజంబులన్
బిండిగఁ గొట్టుచుండు నొకపెద్దయయోమయయంత్రమోయనన్. 225

క॥ బరువయినగదను దాలిచి
యరవరులై పడఁగమోద, నాద్విరదము లే
కరదములై యాపిమ్మట
విరదములైకూలె నంగలార్పఁగ యవనుల్. 226

మ॥ విబుధేంద్రుండు పవిప్రయోగముల నుర్వీధ్రంబులన్ బోరె ని
న్నపుడెన్ ద్రిప్పుచు వ్రేయుచున్ యవనసేనాలక్ష్మి సింగారపుం
గబరీభారముఁ గోసివైచెనొ యనంగా దంతిసంతానమున్
శబరస్వామి హరించె బోర్నల కళాసంరంభ మేపారఁగన్. 227

—: బుడుతకీచులు పిరంగులను బ్రేల్చుట. :—

సీ॥ యావనసైన్య మద్ధాబ్ధిఁ ద్రచ్చినఁ బుట్టు
కాలకూటానల జ్వాలలనఁగఁ
చురకదండను చిల్వవౌర ఫణంబులఁ దోఁచు
మాణిక్యపటల సంపదలనంగఁ
గదనానిలమున మోగలు సరస్సునుండి
రాలెడు శతపత్ర రాజియనఁగ
బహుళ శరచ్ఛిన్నప్రవాళ వల్లీజాలు
గుమురైన పగడాల గుత్తులనఁగఁ
గీ॥ బరగి, తాఁబింబ కపిత్థ ఫలసమాన
పీల భయదతప్తాయస గోళతతులు
బహు బృహన్నాళి కాస్త్రముల్ పఱఁగఁజేసి
బుడుతకీచులు నడిపి రిబ్బురముదోఁప. 228

సీ॥ మొగలాయిసైన్య జీమూతగర్భమునుండి
వెలిజాఱు పిడుగుల పిండనంగ
యావన సుభట బాహాప్రతాప మహాగ్ని
కడలేచు సంగార కణములనఁగ
రణదుర్గయురిమి నేత్రముల రౌద్రముఁ గ్రక్కుఁ
బొడమిన గొప్పనిప్పుక లనంగ
మృత్యుదేవత కోపమెత్తి తూరుపుపట్టఁ
దోతెంచు హారపుల తుంటలనఁగ
గీ॥ నల్లనేరేడు పండ్లంత లగుచు యవన
భటతతులనుండి వెడలు తుపాకిగుండ్లు

రాఁగె నీలోత్పలచ్ఛాయ రాజపుత్ర
సైనికులకుఁ గర్ణావతంసంబులగుచు. 229

క॥ వడివడినవి తొడరుచుఁ పైఁ
బడినన్ దడఁబడియు డీలుపడి యాడిగిలన్
బడి యెత్తువడి బడలుపడి
బుడివడి కడుఁజెడిమె రాజపుత్రులసేనల్. 230

క॥ పదుగురు పదునేనుగు రి
ర్వదిగురు నలువదిగురు నఱుపదిగురు మఱి లోం
బదిగురు నూర్గురు సుభటులు
తుదముట్టిరి వేఁడిగుండ్ల తోరపు జడికిన్. 231

——• ఖండేరావు యుద్ధము.

శా॥ చండాగ్నేయ శరాళి గోళములు వర్షంబట్లు వీతేర, బ్ర
హ్మాండంబంతయుఁ బిండినేయఁగల ధైర్యాహార్యులున్, సుంతయున్
గుండెల్ నిల్పక క్రుంగు కష్టదశ నక్షత్ర ప్రవాహాఢ్యుఁడై
ఖండేరావు నిజాస్త్రమోఘ లలరంగా నశ్వమున్ ద్రిప్పుచున్. 232

క॥ పుష్పసమయావసరమునఁ
బుష్పంధయ సేనగొలువఁ బుష్పరథముపైఁ
బుష్పాస్త్రమ్ములఁ జిమ్మచు
పుష్పశరుని మాడ్కినపుడు ముందుకుఁ గదలెన్. 233

చ॥ వెనుకనె రాజపుత్రకుల వృద్ధ పితామహుఁడైన మానసిం
గునడచె; శ్యామసింహుఁడును గొండవిధంబున వారివెంబడిన్
జనియెను; రామచంద్ర నృపసత్తముఁ డట్టులెచేరె: ధేలవా
రనృపతి వచ్చిచూఁకెను; ఘోరంబడి రయ్యెడఁ జోహారుస్వనుల్. 234

ఉ॥ అందఱు ప్రక్కప్రక్కలకు నారణరంగమునన్ శతఘ్నికా
బృందము లున్నచోటువిడి యేగతుపాతుల వారిఁజేరి యిం
ధిందిరరాజి మాడ్కిఁ బరతెంచి కలంచెడి గుండ్లకోర్చి వా
రించెగ్రవేయసాఁగి రరరే! యల వీరుల శౌర్యమెట్టిదో. 235

మ॥ ముఱపౌకస్తురి వాసనల్ గుఱియ నాప్పుత్ పుట్టునుండన్ వధూ
వరు లూరేగెడు నట్టిమాడ్కిని బ్రతాపస్వామి సామంత భూ
వరసైన్యంబు తుపాకిగుండ్లను సహింపన్ గగ్గి యానాటి సం
గర వైవాహిక మండపంబున వెలుంగన్ జొచ్చెఁ గేళీగతిన్. 236

మ॥ "యమునసంశంబులఁ బుట్టియుండవరె లేదాయిట్టి బాహాప్రతా
పము హైందవంబు మనుష్యమాత్రుల కెలర్పన్ సాధ్యమే" యంచు ఖా
సిముఖానాది సమస్తయోధులను యోజింపన్ మొదల్ పెట్టి సై
న్యము లన్నింటిని జేర్చి కొక్కెడ విపక్షానీకమున్ దాఁకగన్. 237

మ॥ నలిగెన్ హైందవసైన్య ధాటికెనిఁ బ్రాహ్ణాంబందుఁ బౌరుష్కసే
నలు నాహైందవసేన దన్నె సపరాహ్ణాంబందుఁ బౌరుష్కసే
నల నాశాగ్నులఁ గట్టిచో నుభయ సైన్యంబుల్ రణోన్మాద మ
గ్గలమై యొండొరు మీఱఁబోరు నలుపంగాఁ జూను టాశ్చర్యమే. 238

సీ॥ శూరాగ్రయాయి ఖండేరావు యవనుల
నఱఁటి మొక్కలనట్లు నఱికివైచె,
భానుసింహునిధాటిఁ బరసేన శిశిరంబు
నందాకురాలెడు నట్టురాలె:
సింహగాచిప్పఁడు శ్యామసింహ భూభృన్మణి
చెట్టుకొక్కఁడు పాఱఁజేసెరిపుల;
నరిరాజ సమవర్తి యగు మనస్సింహుఁడు
విమతసైన్యము పీనుపెంటచేసె;
గీ॥ మహితయశులు మదన మహాభవ తుల్యులు
ధైర్యరతులు సమర శౌర్యఘనులు
వెలగపండ్లవోలె చేడ్లాకొట్టెరియా
నృపులు రాల్చిరపుడు రిపులతలలు. 239

సీ॥ ప్రత్యేక-భయదారవములు బోభిలు రాజ
పుత్రాశ్వ హేషాసమూహ రుతము
లహితులగుండియ లవియరేఁగెడు యోధ
సముదాయ సింహగర్జాస్వనంబు

భేరిపుష్టి తొరుష్క ఘటకపాలములు క
త్తుయి తాఁకె పగులు సుద్ధురరవంబు
రాజపుత్రులు పయిూరాజ హస్తాంభోజ
నాస్వనమ్మహా శంఖ నిస్వనములు

గీ॥ భట సమూహోట్టహాస పెంభన్నినాద
మఖిల దిశలను బగిలించి యుదయపూర్వు
నతిభయము నొంది మానసింహాగ్రమందు
'పద పదం'డని తనమూల బలమునడిపె. 240

— భానుసింహ వీరబలుల యుద్ధము. —

ఉ॥ వాడినచేనిపైఁ బడు వర్షము నట్టులు మానసింహుఁడున్
గోడయి వచ్చినంత యవనుల్ ధృతితోఁ జెలరేఁగి మూపులున్
మూడయి పొంగఁ వీరరస పూర్ణుఁడు వీరబలుండు యోధులన్
గూడి యెదిర్చె నయ్యహిత కుంజరసింహము భానుసింహమున్ 241

మ॥ కరవాలంబులు కెంపుఁగోనలు స్ఫులింగశ్రేణి నల్దిక్కులన్
బరపన్ భీషణ చంద్రహాస రుచు లభ్రంబంటి వర్తింప ని
ర్వారు గంధర్వములన్ విచిత్రగతులన్ బోనిచ్చుచున్ దాఁకి సం
గరమున్ జేసిరి బాహుశౌర్యము సమగ్రప్రౌఢి దీపింపఁగన్. 242

మ॥ ఘన గర్జారవధాటికిన్ దెసలు బ్రద్దల్ బ్రద్దలై పోవ, నూ
తన సంరంభ విజృంభణంబున నమిత్రశ్రేణి భీతిల్లఁగా
వెనుకన్ జూడక భానుసింహుఁడు రణోర్విన్ శాత్రవున్ దాఁకి యా
తని యశ్వంబు గళంబునన్ దఱిఁగె నుద్యత్ఖడ్గ ధారాహతిన్ 243

ఉ॥ వీరబలుండు ప్రాలి రణవీధి మదించు హయంబునెక్కి 'రా
రో రణవీరులార' యని యోధులఁబిల్వ, నరాతివీర సం
హార పరాయణుల్ సుభటు లట్టులె దూఁకిరి; భానుసింహ ధా
త్రీరమణుండు వారి నెదిరించె నొకండె పరాక్రమమ్మునన్. 244

క॥ కమల సరోవరమున ద్విర
దము విహరించిన విధానఁ దనివిసనక వి

క్రమరాశి వాసుసింహుఁడు
సమయించెఁ దురుష్కభటుల సమరతలమునన్. 245

చ॥ అదిఁగని మానసింహ విభుఁడంబరు వీరుల 'భానుసింహుపైఁ
గదిసి వధంబుసేయుఁ'డని కట్టడసేయఁగ నట్టహాసముల్
పొదలఁగ వారు పైఁబడిరి; భూరి భుజాబలరేఖ యొప్పఁగాఁ
గదనము సేయఁసాగె లయకాల యముండన నాతఁడుగ్రుఁడై. 246

ఉ॥ క్రూరతురుష్కవీరుఁడొక రుండతనిన్ దరిఁజేరఁబోయి దు
ర్వార కృపాణమెత్తి తల వ్రక్కలుగాఁ బడమోద, రక్తముల్
వాఱఁగ భానుసింహుఁడును వ్రాలె ధరిత్రిఁ; దదీయవాజి య
వ్వీరునిపైననిల్చె నరివీరులు పైఁబడకుండఁ గాచుచున్. 247

ఉ॥ అంతట శ్యామసింహుఁడు రయమ్మున నచ్చటి కేగుదెంచి జం
భాంతకు నోటువుచ్చి విమలామృత భాండముఁగొన్న యాగరు
త్మంతుఁడు పోలె వీరబలు దర్పమడంచుచు, భానుసింహు సే
నాంతరమందు నుండికొని యవ్వలికేఁగె సురక్షితమ్ముగన్. 248

చ॥ "పడెఁబడె భానుసింహుఁ" డనువార్త దవానలమో యనంగ నె
ల్లెడలను నాక్రమింప విని యీనినబెబ్బులి మాడ్కి, రామచం
ద్రుఁడు జయమల్లు సైన్యములతో నొనరించు రణంబు వీడుచున్
వడివడివచ్చె వీరబలుపై గిరిపైఁబడు వజ్రమోయనన్. 249

రామచంద్రదేవుని ద్వితీయ యుద్ధము

ఉ॥ కైటభదైత్యుపై నడచు కంజదళాయత నేత్రుఁడో యనన్
సూటిగ రామచంద్రనృపసోముఁడు మొగలు వీరయోధులన్
దాటుచువచ్చి వీరబలు దాఁకి తదీయ భటాళిఁజేతులన్
దీట యడంగఁ గండములుద్రెంచి యనేకులఁ గూల్చె నత్తఱిన్. 250

శా॥ గుల్లల్‌గుల్లలు గాఁగఁ గొందఱను నుగ్గున్ నూకఁగాఁ గొందఱన్
దెల్లన్ జేయుచు, రామచంద్రుఁడును ద్వార్వీరుల్ విజృంభించు ను
ద్యల్లీలల్‌గని మానసింహ విభుఁడున్ దౌదవ్వు లందున్న య
బ్దుల్లాఖానునిఁ బిల్చి వారిపయికిన్ బూన్చెన్ మహోగ్రాజికిన్. 251

శా॥ ధీరోదాత్తుఁడు రామచంద్రుఁడును సందీప్తానల జ్వాలయై
తారుష్కాటవి భస్మసాత్కృతముగా దర్పించి చెండాడి యా
శ్రీరామప్రభుఁ డస్త్రధార నసుర శ్రేణీశిరశ్శ్రేణులన్
సూఖుల్ మోఁఖులు రాల్చునట్లు రణమందున్ రాల్చె మస్తంబులన్. 252

చ॥ అలయక రామచంద్రపతి యావనసేనల గీటడంచి, చే
తులకసిపోవఁ దోరి బలధుర్యుని వీరబలేంద్రుఁ దాఁకి, మం
టి ఖమియు ఖడ్గరాజము బెడంగుగఁ ద్రిప్పుచుఁ దచ్ఛిరంబు వ్ర
క్కలుగను మోదె వాఁడు పడఁగన్ భటులన్ గొనిపోయి రవ్వలన్

మ॥ పొగవోలెన్ దగఁబాఱి యానృపతి యబ్దుల్లా చమూనాయకున్
దగిలెన్; వాఁడు పరాక్రమించి, నడగొండన్ దోలె వచ్చెన్; మహో
రగమున్ దార్క్ష్యుఁడువోలెఁ బట్టి యిలపై రాల్పంగఁ దత్సేనయున్
మొగవిచ్చెన్ గనువిచ్చి యంబరు విభుండున్ గాంచి శోకింపఁగన్.

శా॥ గాసిన్ బెంచుచు రామచంద్రుఁడు తురుష్కశ్రేణి ఖండించుచో
ఖాసింఖాను పదాఱుమంది భటు లంగశ్రేణి రక్షింప యు
ద్ధాసక్తుండయి యాతనిన్ దొడరి యుద్యద్ధాటిమై ఖడ్గమున్
వేసెన్; భూపతి దానిరాల్చె నవనిన్ నిస్త్రింశ ధారాహతిన్. 255

ఉ॥ ఆపదునేడుమంది యొకఁడై పటునంబడి; రంత దోర్బలా
టోపముమై నెదుర్చుచుఁ గడుంగడు డస్సియు రామచంద్ర ధా
త్రీపతియున్ దురుష్కభటు దెబ్బగళంబున సోఁకె క్రిందుమీ
దై పడికూలెఁ! గల్పకమహావనిజాతము కూలు చాడ్పునన్. 256

—• శ్యామ సింహాదుల యుద్ధము •—

శా॥ ఝాలావీరుల శ్యామసింహుఁడు తురుష్కశ్రేణిపైఁ బూన్చి దా
వాలంబున్ బొనరించి రక్తతతు లేఱై పాఱెఁ; దద్ధాటికిన్
రాలెన్ మస్తము లెల్లెడన్; లయసమీరమ్ముల్ విజృంభింపఁగాఁ
దాళీపక్వ ఫలంబులున్ ధరణి మీఁదన్ రాలు చందంబునన్. 257

మ॥ పరుషాకారులు యామ్యకింకరుల ఠేవన్ వెల్గు నాచోహాణుల్
సరసన్ గొల్వఁ గొటేరియావిభుఁడు బేడ్లాభర్తయున్, యావనో

త్కారముల్ భీతిలి నాల్గువైపులఁ జనంగా సంగరక్షోణి ఘో
ర్వరసోన్మాదముతోడఁ బోరిరి మృగేంద్రారావమున్ జేయుచున్. 258

శా॥ ఆటోపమ్మున రామచంద్రసుతుఁడా వ్యాఘ్రంబువోలెన్ నిరా
ఘాటప్రక్రియ వైరిసైన్య మృగసంఘాతంబుపైఁబ్రాకెఁ; ద
ద్దాటిన్ సైపఁగలేక తుత్తుమురుగాఁ దండోప తండంబుగా
రోటన్ బెట్టి సడింపమాడ్కి యవనేంద్రుల్ గ్రుక్కి రవ్వేళలో. 259

చ॥ జలధితరంగ మాలికలచాడ్పున యావనసేనపైఁ బడెన్;
జలమున రామచంద్ర నృపసత్తము సూనుఁడు శేషనాగ మ
య్యెలుకలపిండు పైఁబడెనొ నేఁపునఁ బ్రాలుచుఁ బోరుచున్ దురు
ష్కుల తలలేరివైచె, సుమగుచ్ఛము లల్లనగిల్లు కైవడిన్. 260

మ॥ అతఁడున్ రెండవ భైరవుండనఁగ బాహాటోప సాహంక్రియా
రతి నుప్పొంగుచు వీరవిక్రమ విహారమ్ముల్ పొనర్పన్ దురు
ష్కతతుల్ గ్రమగ్గెను మృత్యుదేవతయు నాల్కన్ జాచెనో నా రణ
క్షితియెల్లన్ భటశూన్యమౌచుఁ గనుపించెన్ వానినల్దిక్కులన్. 261

శా॥ 'అండన్ జేరఁగనీఁడు తుత్తుమురు సేయన్ జొచ్చె మమ్మెల్ల నీ
ఖండేరావు యముండొ రుద్రుఁడొ మమున్ గాపాడి రక్షింపఁగాఁ
రం'డంచున్ యవనుల్ చమూపతుల మ్రొక్కుల్ వెట్టి ప్రార్థింప, న
గ్రుండై యాజయమల్లుఁడాఁకె 'భయమున్ గోల్పోవుఁడం'చార్చుచున్

శా॥ చండాటోప మెలర్పనయ్యెడ ఖొరాసాన్ వీరులున్ వచ్చి యా
ఖండేరాయనిఁ దాఁకి; రాతఁడు భుజాగర్వంబుమై మార్కొనెన్;
బెండై శౌర్యము, కొండతోఁ గిరి రణోర్విన్ పీఁకుచున్, గొంద ఱు
ద్దండస్ఫూర్తి నెదిర్చి, రప్పరఘ కుంతశ్రేణులన్ గ్రుమ్మచున్. 263

చ॥ తడయక రామచంద్ర వసుధాపతిసూనుఁ డవక్ర విక్రమా
ఢ్యుఁడయి రణంబుసేయ నొకయోధుఁడు ఖడ్గమునెత్తి వేయఁగాఁ
గుడిభుజ మట్టెప్రీలి బెడఁగుంగరవాలము ధాత్రి డుల్లినన్
బొడువుఁడటంచు వైరు లురమున్ బడఁ గ్రుమ్మిరి కుంతసంతతిన్. 264

——• ఖండేరావు రణరంగమునఁ గూలుట. •——

సీ॥ గగన హర్మ్యాగ్రనాగమున నిల్చుటమాని,
యిలఁజేరు చంద్రమః కళయనంగ
గ్రౌంచభేదనము గావించి విశ్రాంతిఁ గూ
ర్చుండెడు షాణ్మాతురుండనంగఁ
గ్రతువైరిఫాల నేత్రజ్వాలలకు సౌమ్మ
సిల్లికూలెడు మనసిజుఁడనంగఁ
గల్పాంతపవన సంఘర్షణంబున కోర్వ
కిలఁ్రాలు హేమాద్రి శృంగమనఁగ
గీ॥ నభ్రముననుండి తనదు పుణ్యంబుదప్పి
సూటితెగిపడ్డ చక్కని చుక్కయనఁగఁ
దనువుఁదాల్చిన భువన సౌందర్యధనము
బపరమందు ఖండేరాయఁ డవనిఁగూలె. 265

మ॥ వనరాశిన్ జొరఁబాఱు వాహినులటుల్ బార్లై మనస్సింహుఁ డా
తని తొమ్మండ్రు సహోదరుల్ యవన మధ్యంబందుఁ బోరాడ జొ
చ్చిన ఝూలాసుభ టేంద్రులున్ భటశిరశ్ఛేదంబు నేయన్, విప
క్షనికాయంబులు దిగ్భ్రమన్ దవిలి వెన్కన్ జూడఁగా సాఁగినన్. 266

ఉ॥ "గ్వాలియ రీశులున్ దెగిరి వ్రాలెనునేలను భానుసింహుఁ; డీ
వ్వేళ జయంబుతప్పు; దొకపెట్టున వైరులఁదాఁకి కూల్చుటల్
మే"లని మానసింగు నియమించెఁ; దురుష్కులు దిక్కులెల్ల గ
గ్గోలువడంగనార్చి రిపుకోటులఁదాఁకి రవార్యశౌర్యులై. 267

సీ॥ భయదయావన వీరభటులార భటులతోఁ
బ్రళయకాల పయోద పటలిమాడ్కిఁ
జెలరేఁగి నాల్గుదిక్కులఁగ్రమ్మ, దావాగ్ని
యలమిన మృగములు కఁలగినట్టు,
లగ్నివర్షించు గ్రీష్మాతపోద్ధతికిఁ బు
ష్పవనంబు తలవాల్చి వాడినట్లు
వారాశియుప్పొంగి మేరమీఱఁగ నదీ
తోయపూరం బెకదొట్టినట్లు

గీ॥ రాజపుత్రులు పటుపరాక్రమ సమగ్ర
మూర్తులై పోరుచున్నను మొగలు పిరి
భటులుసంఖ్య హెచ్చౌట నోర్వంగలేక
ఒరుసుపడిరి కొండలుపైన వ్రాలినట్లు. 268

—• చంద్రభట్టారకుఁడు యవనులపైఁ గవియుట. •—

మ॥ అతులాత్మీయబలంబు నొంపఁ గనితో శైవాగ్రగణ్యుండు స
ద్గురుఁడున్ విప్రుఁడు చంద్రభట్టు కరముగ్రుండై రణోన్మాద వి
స్ఫురితుండై గజరాజవాహముఁ గలంబున్ గ్రైవమున్ వీచుచున్,
గరవాలంబుధరించి దూఁకెఁ బ్రతిపక్షచ్ఛేదమున్ జేయఁగన్. 269

చ॥ అనిల జవంబునన్ విఱుగు నభ్రములట్టులు, శ్యేనపాటికిన్
వెనుకకుఁబోవు నవ్విహగ బృందము నట్టులు, వేఁటకాని ద
ర్శనమున నోడి పర్విడెడు సత్త్వములట్టులు, చంద్రభట్టు ఘో
ర నిబిడధాటి బెండువడి క్రమ్మగ్గిరి మొగలు యుద్ధవీరులున్. 270

సీ॥ పదదాడిఁ గనిన భగ్నప్రాస నివహంబు
ఖండితాలంకార మండనంబు
నసమన్వితోరు పదార్థ సంఘాతంబు
స్ఖలిత వ్యవస్థాక గణయుతంబు
దుష్క్రియాకృత శబ్దదోష భూయిష్ఠంబు
నపరాసహిష్ణు వాక్యాన్వితంబు
నధిక విసంధియుఁ నపగత నియతియు
నగణ్యమాన గురులఘ్వంతరంబు

గీ॥ నపగత రసావకాశంబు నత్యనవ్వ
య క్రమముగాఁగ యవనసైన్యంబునెల్ల
సరస కవిలోకపతి యయ్యుఁ జంద్రభట్టు
కు కవి కావ్యంబుఁబోలె నెక్కసఁగఁజేసె. 271

మ॥ "పిడుగుంబాటున సైన్యగర్భమున నావేశించె నీతండు; చం
పుఁడు పోనీకుఁ"డటంచు నొండొరులు గుంపుల్ గుంపులై వ్రేలుచో

పేఁడు సందీయక చుట్టు మూఁగిరి మొగల్ వీరుల్ తదధ్యక్షు ల
య్యెడ దేవాసుర యుద్ధమట్లు సమరంబేపారె నత్యుగ్రమై. 272

సీ॥ చంద్రహాసంబెత్తి జయమల్లు కేడెంబు
శీర్షకంబునుఁజించి చెండివైవ
రాయశీలుఁడు సువర్ణ ప్రాభపుండౌచుఁ
గరవాల ఫణిని వ్రక్కలుగఁజేయ
సింహశౌర్యండు ఖాసింఖాను మున్మున్ను
పరతెంచియున్న తాళ్వంబు నఱుకఁ
బలివంటి ప్రోడ యబ్దుల్లాచమూపతి
నెత్తిపై ఖడ్గంబు నెత్తివేయ
గీ॥ రాజపుత్ర శతాధిక గ్రంధకర్త
చంద్రభట్టారకుఁడు యశస్సాంద్రమూర్తి
తల పగిలి యశ్వమునమండి తెలివితప్పి
ముందునకుసోలి ధరవ్రాలి మూర్ఛ మునిఁగె. 273

చ॥ ఎవని పదాంబుజాతము లహీన నృపాలవరేణ్య సేవ్య మా
కవి ధరవ్రాలినన్ మెఱుపు గ్రక్కునవీచిన యట్లు ఢేలవా
రవిభుఁడువచ్చి దూఁకి కరిరాజు మృణాలముఁబోలె నెత్తి యా
హావతల మందునుండి పడినవ్వలఁజేరిచె నశ్రమంబుగన్. 274

మ॥ "కవి నిర్యాణమునొందె; మమ్ము నెదురంగాలేఁ డొరుం'డంచు, న
య్యవనుల్ పొంగుచుఁ గేకలార్పులును జేయన్, దన్మహానాదముల్
దివి మ్రోయంగఁ బ్రతాపభూవిభుఁడు తత్సేనాధిపుల్ నెమ్మనం
బవియన్ శోకమునొంది కుందిరిదురం తాయాస భారమ్మునన్. 275

—• రారోడ్ తేజసింహుని మూఁడవ యుద్ధము. •—

సీ॥ సాగరాంతర నివాసముమాని ధరణికిఁ
బరతెంచు బాడబవహ్ని యనఁగ
నాప్రతాపేశ్వరుండను గజాసురవైరి
ఫాలనేత్రానల జ్వాలయనఁగ

సచరాచర ప్రపంచముఁ గాల్పఁ బరతెంచు
ప్రళయ కాలపరేత రాజసంగ
యవన సేనారణ్య మలమి భస్మముసేయఁ
దవిలెడు నిర్ధూమ దహనుఁడనఁగ

గీ॥ ధరకు దిగివచ్చు చండ మార్తాండుఁ డనఁగ
వైరిగిరి కోటిపైఁ వ్రాలు వజ్రమనఁగ
భూతలంబు నిర్యవనంబుచేతు ననుచుఁ
దేజసింగు హయంబునుద్రిప్పి కదలె 276

మ॥ తన రారోడులు రెండువేల్ భటులు చెంతన్ గొల్వఁగా సింహగ
ర్జనమున్ జేసి యజాండ కర్పరము పిచ్చల్ గాఁబడన్ మ్రోకఁ, ద
ద్ధ్వనియున్ మృత్యువు నట్టహాసమటు శ్రోత్రద్వంద్వమున్ జీల్ప 'నిం
డెను సూతేండ్ల'ని ప్రీలె మొగలుల గుండెల్ తేజసింహున్ గనన్.277

ఉ॥ మారట రుద్రుఁడై యతఁ డమందపరాక్రమరేఖ మెప్పఁ గ్రొ
క్కారు మెఱుంగువోలెఁ దురగంబు రణాంగణమందుఁ ద్రిప్పి దు
ర్వార జవంబునన్ దలలపై నడిపించి తురుష్కకోర సం
హార మొనర్పఁగాఁ దొడఁగె నచ్చటి యందఱు వహ్నిరూపులై. 278

మ॥ కృత సర్వాహవ సాదనాఢ్యము రిపోర్వీన్ దేజసింహాగ్ని ప
ర్వత ముప్పొంగుచుఁ బెన్మహానలము పర్వన్ దప్పుకోలేని దు
స్థితిఁ దౌరుష్క చమూ మహావనము భస్మీభూతమై చుట్టునున్
క్షితిపై రాలెను గుప్ప తెప్పలుగ నిర్జీవస్థితిన్ గూలుచున్. 279

మ॥ యవనోర్వీరుహకోటిఁ ద్రుంచి ధరపై వ్యాపింపఁగాఁజేసి యా
హవసుక్షేత్రము సర్వమున్ జవసుసేంపన్ గల్గి దుర్వార సైం
ధవ సంఘట్టనతోడ మెత్తఁగను దున్నన్ గల్గి రారోడు పుం
గవుఁడున్ శత్రుల రక్తధార మదవల్ గట్టెన్ బ్రతాపోన్నతిన్. 280

గీ॥ అహితు లందఱు తనదు సాహసముమెచ్చ
విసుగ కంతంతకును విజృంభించి పొంగి
యాకుగుమి దూసిపోసిన యట్లునటకి
వైరిసంహార మొనరించె వాలుమగఁడు. 281

మ॥ ఖురసంఘట్టన తాళమానముల నిగ్గన్ జూప రారోడ్భటుల్
తురగవ్రాతముఁ బూన్చి యాప్రళయ చక్రముల్వోలెఁ దీండ్రించి యు
ద్ధుర తౌరుష్కచమూ సమూహములపైఁ ద్రొక్కించి స్రుక్కింప న
య్యరులున్ వ్రాలిరి పీన్గుపెంటలుగ హాహాకారముల్ చేయుచున్. 282

మ॥ తెగియున్నట్టి మనోజ్ఞహారమున ముత్తెంబుల్ వలెన్ దిక్కులన్
మొగలుల్పాఱిరి, మానసింహుఁడు "జయంబుల్ చేతికిన్ జిక్కచోఁ
వెగహాఱిన్ దగునయ్య ధైర్యరమ సంధిల్లన్ రిపుశ్రేణిఁ గూ
ల్పఁగఁ బొం" డంచని మందలింప నట నిల్వన్లేక వారందఱున్. 283

సీ॥ "ప్రళయరుద్రులుగాని బదనూర్ భటులుగారు
తెలియవే రారోడు తేజసింగు
మృత్యుదేవతయైనఁ గృపగల్గుఁగాక చం
పినదాఁక నీతండు విడువఁబోఁడు
నితనితో మార్కొని యేన్గు తొండంబంత
బుసవచ్చె సోదరుల నుసురులేదు
గొలుసులఁగట్టి లాగుకొనిపోయిన హోము
తేజసింహుని దిక్కు త్రిప్పఁబోము
గీ॥ నిలక తూగాడెఁ గాళ్లు నేకొలువుచాలుఁ
బ్రాణముండిన లాభముల్ వడయవచ్చు
"రాము రాలేము మేము పోరంగఁజాల"
మనిన, మానసింహుఁడు దిగులందినిలిచె. 284

శా॥ ఆసప్ఖానుఁడు కొంతసేనఁగొని డాయన్వచ్చె నచ్చోటిఁ; క
ష్టా సక్తిన్గని మానసింహవిభుఁడున్ బ్రాణంబుఁ బ్రాపించి పే
ల్లాసలౌ బాసలుపెంచి కష్టపడ నాయా సైన్యముల్ దైన్యముల్
వాసెన్; డాసిరి తేజసింహు నెదిరింపన్బూని వారందఱున్. 285

మ॥ చిఱునవ్వాస్య మలంకరింప; రిపులన్ జేయెత్తి "వేంచేయుఁ డం
డఱు వీరుల్ మిముఁదాఁకి పోరుటకు డెందంబుత్సవం బందె; సు
స్థిరులై పాఱక నిల్వుఁ" డంచు బదనూర్సింహంబు పూరించె ని
ష్ఠుర శంఖంబు విపక్షకోటిపయి రారోడుల్ వడిన్ దూఁకఁగన్. 286

చ॥ ఒకయెడ రెండులక్షలగు యోధులు గుండెలులేక నిల్వ, నిం
కొకయెడ రెండువేలభటు లుర్విపడంకఁగ వారిఁద్రాకఁగా;
నొకనికి సూఱుమంది భటులోలెడి పూరణరంగ వైభవం
బొకవెయి కండ్లఁజూడవలె నూఱక వర్ణనచేయ శెట్లగున్. 287

చ॥ ఉదధితరంగ పంక్తులు మహోన్నతధాటిని శైలపార్శ్వమం
దుఁ దగిలి పాయలై విఱిఁగి తోడనె వెన్కకుఁజాఱి శాంతమై
పొదలుగతిన్ దురుష్క చమువుల్ రభసమ్మునఁ దేజసింహుపైఁ
గదిసి తదీయధాటికిని గ్రమ్మఱి వెన్కకు మ్రొగ్గె నయ్యెడన్. 288

మ॥ పురదైత్యేంద్రులఁ గాంచు రుద్రునివలెన్ బోసిక యాలోక భీ
కరుఁ డయ్యుగ్ర నృసింహమూర్తి యరులన్ ఖండించి దోర్దర్ప వి
స్ఫురణన్ వెల్గ, రణాంగణం బఖిలమున్ శూన్యంబుగాఁ దోఁచెఁ; "గు
మ్మరికేఁడున్ గుదెకొక్కనాఁ" డనెడు సామ్యంబున్ నిరూపించుచున్. 

మ॥ అలమువ్యోమ ఘనప్రవాహ భర మట్లభ్యార్భటిన్ దూఁకు నా
జలపాతంబటు దేజసింహుఁడతి భీషణ్మప్రాభవుండౌచు ముం
గలికిన్ దూఁకఁ దదీయధాటి నిలువంగాలేక సర్వంబు మో
గలు సైన్యంబు దిశాముఖంబులఁ గలంగన్ వాఱె దైన్యంబునన్. 290

ఉ॥ "ఈయప మృత్యువున్ దొడరి యీశ్వరుఁడైన మసంగలేఁడు మా
యాయువుగట్టి దౌట నొడలందసుపుల్ గనఁగంటి మింటికిన్
బోయియు నాలుబిడ్డలఁ గనుంగొనువారము వైరిగెల్వ నే
దో యొకదారి చూచుకొను మూఱక చంపకు కూటిపేదలన్." 291

మ॥ అనఁగా, నంబరుభర్త యాఱుగుర సైన్యాధీశులన్ జేర్చి యే
మని తానాశలు చూపెనో; భటులు తోడ్తై కొల్వ వారున్ రణో
ర్విని దూరమ్మునఁ బొంచిపొంచి యనువౌవేళన్ వడిన్ దేజసిం
హునిచుట్టున్ వలయాకృతిన్ గవిసి రత్యుగ్ర ప్రతాపాఢ్యులై. 292

చ॥ అదిగని తేజసింగు ధనురాకృతి వార్వముఁద్రిప్పి, ఖడ్గముల్
చిదియఁ దురంగమంబులు నలిన్ బడ యోధులు డుల్లికూల 'స
ర్వదమనుఁ' డంచు నెల్లరును బల్కఁగ వైరుల నొక్కడైన దె
బ్బ దిననివాఁడు లేఁడన నవార్యబలంబునఁ జేసె యుద్ధమున్. 293

సీ॥ "ఇదె చెంతఁజేరితి నిపుడైన నెదిరింపుఁ'
డని కొందఱనుదాఁకి యసువులూడ్చి
"పరువు లెత్తెదరేల మరణంబు దప్పునే॥
యనుచుఁ గొందఱ తలలవియమోది
"యేది మీవిక్రమం బిట్టిదేనా॥ యంచుఁ
గొందఱడాసి నుగ్గుగనుజేసి
"యొదిగి యుండెదరేల కదిసిరారం"డని
కొందఱ నసిధార క్రిందసేసి
గీ॥ ‹మీరు కంపించు టట్లుండ మీహయములు
వడఁకెఁ గనుఁ"డంచుఁ గొందఱఁ బట్టికూల్చి
మెలఁగె రణమునఁ దేజసిం గెలుకపిండు
నలముకొని పిల్లిచేరలాట మాడునట్లు. 294

సీ॥ ఆననేందువు దరహాస చంద్రికలోనఁ
జని రాయశీలు వక్షమ్ముఁ గ్రుమ్మె;
నొయ్యారమునఁబోయి యోరచూపునఁజూచి
జయమల్లు నశ్వంబు సంహరించె
నిలిచినట్టులెనిల్చి చెలరేఁగి ముందేఁగి
వీరబలేంద్రు నుర్విఁబడమోదె;
నొర ఖడ్గముంచి యత్యుల్లాసమునఁ జేయి
సాచి ఖాసింఖాను జక్కడంచెఁ;
గీ॥ గరయుగంబున ఖడ్గయుగంబుఁ దాల్చి,
చనుచునటికె నబ్దుల్లాభుజ ద్వయంబు
మీసమొత్తి యాసవ్‌ఖాను మేనుచించెఁ
దేజసింగు ప్రతాప సందీప్తుఁడగుచు. 295

మ॥ కడురక్తిన్ జయలక్ష్మియున్ వధువు, మోగల్‌పీరు లాదేవి సం
దడిమైఁ గొల్చెడు చుట్టపక్కములు యుద్ధంబున్ వివాహంబుగా,
బెడఁగున్ గత్తుల పూలమాలలు శుభాప్తిన్ గూర్చుచున్ దేజసిం
హుఁడు దేగాటలనాడు పెండ్లికొడు కట్లొప్పారె నవ్వేళలో. 296

గీ॥ దేవతిర్య ఙ్మనుష్యులఁ దేజసింహు
నట్టివీరుండు లేఁడని యందఱనఁగ
సమర మొనరించె; శాత్రవుల్ సమసిరపుడు
శిశిరమున నాకురాలెడు చెలువువోఁచె. 267

ఉ॥ పోఁడిమిమీఱ నార్వురు చమూపతుల్ భటు రెంతకాల మ
ల్లాడినఁ దేజసింహుఁ డిసుమంత కలంగుటగాని వాజి తూ
గాడుటగాని, కత్తి కరమందుఁ జలించుటగాని లేద; క్రొ
వ్వాఁడిమితోఁ దురుష్కభట భంజనముం బొనరించె నుగ్రుఁడై. 298

మ॥ కదనక్షోణిని మానసింహుఁడట వెన్కన్ వెన్కనే పొంచి సా
గిదరిన్ జేరుచు జోడుగుండుల తుపాకిన్ బ్రేల్పఁగా వర్మమున్
జిదుగన్, వెన్నునగల్చి వక్షమున దూసెన్ గుండు; లాదెబ్బతోఁ
జదియన్ మోదెను తేజసింగతని దోస్తంభంబు బెండై చెడన్. 209

## రారోడ్ తేజసింహుని నిర్యాణము.

సీ॥ గిరిభేదనము చేయుతఱి నొక్కచోఁ గ్రాంతిఁ
బడయు దైవతచక్రవర్తి యనఁగ
గగనహర్మ్యాగ్రభాగ విహారమును మాని
ధరఁజేరు చండమార్తాండుఁ డనఁగ
దివినేగువేళఁ గ్రిందికి విమానము జాఱి
పడిన ఖేచర సార్వభౌముఁ డనఁగ
భువనముల్ కంపిల్ల మ్రోఁగియాఁగిన ప్రతా
పాబ్జాక్షు పాంచజన్యం బనంగ
గీ॥ నంతదాఁకను మొగలు సేనాబ్ధి యింకఁ
బరమ వీర్యంబున జ్వలించు బాడబాగ్ని
తేజసిం గశ్వముననుండి త్రెళ్ళి పడియె
నో జగద్గురూ త్రిజగద్గురూ' యటంచు. 300

శా॥ ఆరారోద్భవన ప్రతాపతపనుం డస్తంగతుండై చనన్
భేరీనాదము బొబ్బలార్పులును శోభిల్లెన్ మొగల్ సేన; శో

కారావంబుల రాజపుత్రకుల సైన్యంబంతయుఁ గ్రుక్కాని
ప్పారంబై స్ఫుటహతప్పె జీవకళ లేశంబైనఁ గన్పింపమిన్. 301

—• ప్రతాపసింహుఁడు విజృంభించి యవనసైన్యముఁ జొచ్చుట. •—

సీ॥ హారావళీ పర్వతాంతర మందుండి
వచ్చు కేసరి సార్వభౌముఁ డనఁగ
యావన భువన సంహారంబు గావింప
నెత్తిపైఁ బడుపెను మిత్తియనఁగ
జగములన్నిటిని ధ్వంసం బొనర్పఁగ రెచ్చి
పరతెంచు లయకాల భర్గుఁడనఁగఁ
గల్పాంతమున జగద్గణము దుమ్ముగఁజిమ్మ
సప్తప్రభంజ నోచ్చలన మనఁగఁ
గీ॥ దేజసింహుని మృతికి నార్తినివహించి
"యవన సైన్యాంబునిధి మదీ యాస్త్రబాడ
బానలవ్యాప్తి నింకింతు"నని ప్రతాప
విభుఁ డరాతులపై విజృంభించె నపుడు. 302

సీ॥ ముక్కు తోడరమల్లు భూరిసైన్యం; బసఫ్
ఖాను ఖాపింఖాను కన్నుఁగవయుఁ;
గంఠ మబ్దుల్లాయుఁ; గడుపున జయమల్లు
రాయశీలుల భట వ్రాతములును;
బాదంబులను వీరబల రాయసింహుల
సైన్యంబు, రెండుపక్షంబులందు
షాజాజుఖాన్ చమూసమితి యబ్దూరహి
మాను సేనాపరంపరలు బెరసి;
గీ॥ యంబరీషుండు పుచ్ఛంబు నందునిలిచి
గారుడవ్యూహ మొనరింపఁగాఁ బ్రతాప
విభుఁడు సామంతులందఱు విడకకొలువ,
దస్యుకోటి దూడవ్యూహధాటిఁ దగిలె. 303

మ॥ ఉరగాధీశు సహస్రజిహ్విక లటంచూహింప వోర్దర్ప దు
ర్భరుఁడై యొప్పు శిరోధిఁయా సుభటులా రాజాపిఖుండల్ భయం
కర నిస్త్రింశ కఠోరధార నిగుడంగా, గండభేరుండముల్
హరిణవ్రాతము నట్లుచెండిరి విపక్షానీక మత్యుద్ధతిన్. 304

శా॥ లోకమ్ముల్ పొడిగాఁగఁ దాండవకళల్ బొల్పార నర్తించు నా
శ్రీకంఠున్ బురుడించు రౌద్రరసమూర్తి ప్రాభవంబొప్పఁ బ
ట్టాకత్తిన్ గొని యాప్రతాపుఁ డరికంఠంబుల్ విదారించుచున్
జీకాకై పడఁజేసె; మోగిలు చమూశ్రేణిన్ సమీకస్థలిన్ 305

మ॥ క్రమమై హస్తములట్టె లేచుటయు, ఖడ్గవ్రాతముల్ కాంతి పూ
రములన్ బెల్లుఁగఁ జిమ్ముటల్, భటుల మూర్ధమ్ముల్ పడిన్ వ్రీలి ర
క్తములన్ బైకెగఁజిమ్ముటల్, యవనయోధవ్రాతముల్ గాలి ప్రా
ణము గోల్పోవుటతప్ప వేఱెదియుఁ గానన్ రాదు నల్వంకలన్. 306

మ॥ తమవ్యూహంబు చొరన్ బడన్ యవనయోధశ్రేష్ఠు లిర్వంకలన్
గుములై పైఁబడఁగాఁ, బిపీలికములున్ గుంపౌచుఁ బైకెక్కిన
శ్రమమై పాఱు భుజంగ రాట్సదృశమౌ రాణాచమూదండ మా
ర మహావేగముతోఁ దురుష్కభట గర్వంబందు హూరెన్ వడిన్. 307

మ॥ శతధా ఖండము లౌచురాలె సమరక్ష్మామధ్యమందున్, విశీ
ర్ణ తనుత్రాణ చయంబులున్, దళిత కుంభశ్రేణు లాపై విలుం
ఠిత కంఠంబులు; భగ్న ఖడ్గములు; కుంఠీభూతభేదుల్; నిపా
తిత కేతువ్రజముల్; విఖండిత గదాదివ్యన్మహా దండముల్. 308

చ॥ తడయక వైరిశీర్షములు తాళఫలంబులు వోలె డుల్లఁగన్
బొడువఁగ నమ్మహాపురుష మూర్తికె చెల్లును; శాత్రవాశ్వముల్
వడిఁ దనుఁ గాంచి భీతిగొని పాఱఁగ వల్గిత ధారనెత్తి వ
చ్చెడుపని చైతకంబునకె చెల్లునసంగ మెలంగి రిర్వురున్. 309

ఉ॥ అప్రతిమాన సాహస మహాబల విక్రముఁడైన రాజపు
త్రప్రభుఁ డాప్రతాపుఁడును దస్యు సమూహములన్ వధించి; బ్ర
హ్మప్రళయంబుచేసె; సమరాంగణమున్ విడి యంబరీశు సై
న్యప్రతతుల్ గలంగుచు భయావిలచిత్తతఁ బాఱెదిక్కులన్. 310

— ప్రతాపసింహుఁడు మానసింహ- సలీములఁ దగులుట. —

గీ॥ పూచిపట్టిన వడగొండ పోల్కిఁ దనరి;
పట్టు బంగారు జిలుగు టందారినెసఁగి
"పంచమంగళ" గజరాజు వఱలె; నందు
మానసింహ- సలీములు గానఁబడిరి 311

గీ॥ తేఱలి తీవ్ర క్రుధాశోణ దృగ్యుగంబుఁ
బఱపి; యశ్వముఁ గోల్తలఁ బైఁగవించి;
యుగ్రసింహంబు వేదండ యుగమునట్లు
బల్లెమెత్తి ప్రతాపుఁ డవ్వారిఁబొదివె. 312

సీ॥ రౌద్ర రసారూఢి శ్రవణముల్ రిక్కించి
వీఁపుననున్న ప్రరాపుతోడ
నుబికి; ముందరికాళు లున్నతంబుగ నెత్తి
యువరాజ మానసింహుల గజంబు
దంత ద్వయంబుపైఁ దగమోపి భయద హే
షలఁజేసి దర్పించి చైతకంబు
నిలిచె; నాపంచమంగళము తద్ధాటికి
వెఱచి తొండముఁ దల విసరుకొనుచు

గీ॥ వెనుక కొక్కుమ్మడిని వాఱెఁ బృథివియద్రువ
గజగమనధాటి గండంబు గడచిపోయి
మానసింహ-సలీములు మనఁగలిగిరి;
మాపటులుమాత్ర మిరువురు మడిసి రపుడు. 313

సీ॥ కనులున్నభాగ్య మీతని యమానుష శౌర్య
రేఖఁ గంటిమటంచు రెండుపక్ష
ముల భటులనిమాని నిలిచి; రబ్బూరహి
మాను విల్వెల్ల విస్మయము గదురఁ
"బదునాల్గు భువనముల్ వెదకిన రాజపు
త్రకు లట్టివిక్రమ రాసులుండ

రిట్టి పూజ్యులబట్టి హింసించు మామొగల్
జాతులు పరమ దుర్జాతులగుటఁ
గీ॥ దనువునను జీవముండెడుదాఁక, వారి
చరణసేవ సేయుదుఁగాని మఱచి తప్పి
యైన, నిసుమంత యపకార మాచరింప"
నని ప్రతినచేసి తనఖడ్గ మవనివైచె. 314

మ॥ తనచేనున్న రవిధ్వజంబుఁగని "యీతండే ప్రతాపేశ్వరుం"
డని మోగల్ భటకోటి చుట్టుకొని ఖడ్గానీక కుంతాది సా
ధనముల్వైచిరి; కాని యాతఁ డణుమాత్రన్ వెన్కకున్ బోక, కే
తనమున్ వీడక, పోరుచుండె నరిసంతానంబు ఖండించుచున్. 315

సీ॥ అరివీఁడు, వీఁడాప్తుఁ డనరాక సంకుల
రణమయ్యెఁ; రాణా నరాతికోటి
ముట్టడించెను; రాజపుత్రవీరులు క్షీణ
బలులౌట మేవాడఖానుని గతి
సందిగ్ధముగఁ దోఁచె; మృతదేహ గణముతో
రణమున రక్తధారలను దోఁగు
తపనునిమాడ్కిఁ బ్రతాపప్రభుండు గా
యములతో రక్తసిక్తాంగుఁడయ్యెఁ
గీ॥ విరియఁబూచిన కింశుక తరువువోలె
వెలుఁగుచుండియుఁ గడు విజృంభించి వైరి
భటుల శిరములు ఛిన్నములై వసుధరాల
నతఁడు రణమొనరించె భయంకరముగ. 316

సీ॥ వెనుక ముందులు చూచుకొనక యూపిరి పుచ్చు
కొనక, యాలోచించుకొనక, వీరు
వారనుకొనక, కన్పడువారలను బట్టి
చంపు నాసంకుల సమరమందు,
నాసపుఖానుతో నాబదోనియు "మన
ప్రక్క, వైరులప్రక్క, రాజపుత్రు

యుంటిమిగా; పిరియందు గోత్రపులంపు
హితులంచు మీరెట్టు లెఱుఁగుపంచు"

గీ॥ రస, నసవెఖాను "కస్మాసికొనుమఁ జీల్చి
వేయుదుము; రాజపుత్రులు విమతులైన
విహితులైన యావన మతద్వేషులగుట
నందెవరు నీల్గినను మేలె'' యనుచుఁ దెలిపె 317

సీ॥ తమ రాజరాజు రక్తముగస్పడ శిశోది
యా వీరులును సలుంబ్రాధిపతియు,
శ్యామసింహాదులు సంవర్త సమవర్తి
మూర్తులై యరిగళంబులనుజీల్చి;
రపుడు మనస్సింహుఁడా ప్రతాపేంద్రుని
యడుగులుమ్రొక్కి సూర్యధ్వజంబు
పెటికి కొండొక దూరమరిగె; నెచ్చట రవి
ధ్వజమున్న నచటఁ బ్రతాపుఁడుండు

గీ॥ ననుచుఁ బెక్కురు యవనులం దరిగి;రంత
దురము భరమయ్యె; భటులతోఁ దొమ్మిదగురు
సోదరులతో మనస్సింహుఁ డాదినంబు
స్వర్గమునకేఁగి చెల్లించె స్వామిభక్తి 318

మ॥ అవనిన్ వ్రాలఁగ ధేలవార నరపాలాధీశుఁ డుద్యత్ప్రతా
పవికాసంబునఁ బెలురేఁగుచుఁ బ్రతాపస్వామి రోషించి శా
త్రవ విచ్ఛేదము చేయఁజొచ్చెను సలుంబ్రాభర్త తోడౌచు నా
హవ రంగంబున వైరి వీరభట శీర్షశ్రేణి విదారింపఁగన్. 319

గీ॥ బల్లెమది మూఁడుచోట్లఁ దుపాకియొక్క
చోటఁ, జంద్రహాసము మూఁడు చోటులందు
దాఁకి రక్తములురలఁ బ్రతాపదేవుఁ
డొప్పె సంగార వల్లరివో యనంగ. 320

ఉ॥ తూములనుండి ధారలయి తోయము దూకెడునట్లు; తీవ్రదం
బై మెయినుండి తొమ్మిదియు నవ్వాదిగాయములందు నెత్తురుల్

భీమముగాఁగఁదూఁక, రిపు వీరహయాళి భయంబునొందె ది
క్సీమలఁబాఱఁ, జైతకము సింహముమాడ్కిఁ జెలంగె నయ్యనిన్. 321

మ॥ "వినః నేఁడీ మొగలాయివీరుల తలల్ ఛేదింతు; నిందుండి రా!"
నని జృంభించుచు వైరిఁగూల్చెడు ప్రతాపాధీశు నర్థించి ప్రా
ర్థనముల్ సేసియు విన్నవించియు సలుంబ్రాఖిల్ల లోకేంద్రు లా
తనిఁ దోడ్తెచ్చిరి శత్రు వీరభట మధ్యంబందుఁ దప్పించుచున్. 322

మ॥ తనవంశంబునఁబుట్టి స్వచ్ఛమగు స్వాతంత్ర్యంబుఁ గాపించి యా
వనసైన్యంబునుజించి చెందుచుఁ బ్రతాప ప్రాభవుండౌ ప్రతా
పునకున్ గల్గఁగనున్న క్లేశము లవంబున్ జూడఁగానోడి క్రుం
కెననంగా రవి పశ్చిమాంబుధి మునింగెన్ రక్తకాంతిచ్ఛటన్. 323

సీ॥ ఆనాఁడు రణరంగమందుఁ గూడిన ప్రతా
పప్రభు సుభటు లిర్వదియురెండు
వేలలో నెన్మిదివేల్మంది బ్రదికి; రా
తని బంధు లైదువందలు మడిసిరి;
త్వారువీరులు మూఁడువంద లేఁబదిమంది
పడి; రొక్కొకకులంబు వందలుగను
భటులఁ గోల్పడియె; యావనపక్షమందుఁ దొం
బదివేలుప్రాలి రక్కదనమందు;
గీ॥ మూఁడులక్షల కెక్కుడై మొగలుభటులు
మనినవారెల్ల గాయముల్ దినినవారె
శత్రులందాఁక నోపక సైన్యమెల్ల
నిలిచె బెగడంది నింగిఁజూపుక్కలు నిగుడ్చి. 324

{ కృష్ణసింహుఁడు యుద్ధమునుండి వెడలిపొమ్మని ప్రతాపసింహు నర్థించుట }

మ॥ పరమోదారుఁ బ్రతాపుఁగన్గొని సలుంబ్రాభర్త "యెల్లప్డు డిం
తరుదై నీముఖచంద్రునిన్ దవిలి లోకాహ్లాదమున్ బెంచు నా
దరహాసాంకుర మెందుడాఁగె నిటుచింతన్ గుందనేలా సురే
శ్వరుఁడున్ (గాలముదప్పు) నొక్కకరణిన్ వర్తించుటల్ వింతయే. 325

సీ॥ "ఏకలింగేశ్వరుఁ డిచ్చిన దానితో
నేవేళఁ దృప్తివహించుచుండు
సాధనసంపత్తి చాలమి విజయమెం
దఁగలేక పోయియుండంగవచ్చుఁ;
బరిభూతి యనినంతఁ బ్రళయమంచుఁ దలంప;
మపజయంబున సత్వ మతిశయిల్లు;
నీపూటనిదిచాలు; రేపు మరలవచ్చి
భువనముల్ కీర్తింపఁ బోరాపవచ్చు
గీ॥ నెంతకాల మజేయమై యెసఁగి ధర్మ
మహిమ స్వాతంత్ర్యదీక్షయు మనలవిడువ
వంతకాలము క్షాత్రపు లంగుళంబు
మేరయైనను గదలింపలేరు మనల. 326

చ॥ ఇదియుఁ బ్రదోషకాల; మిపుడెట్లును యుద్ధమునిల్పి నిందుఁజే
యఁదగినదేది కన్పడదు; హాయిగఁ గొండనుదాఁటిపొమ్ము; నేఁ
డుది మొదలీచమూతతులఁ దోడ్కొని నీపదముల్ భజింపఁగా
నుదయమెవత్తు; నొంటిగతి నుల్లమునన్ దలపోయ కేగుమీ." 327

మ॥ అనఁ 'దంద్రీ ననుసమ్మి కొల్వఁగల సేనాధీశ్వరుల్ వ్రాలి కూ
లిన నీచీఁకటిఁద్రోసి నేనెటుల హాళిఁబాటువీడంగ నే
ర్తును మేవాడ్భటశౌర్యలక్ష్మి రణమందున్ దమ్ముపాలయ్యె నే
ననిఁ గాపెంచెద; శత్రులన్ దునిమెదన్; బ్రాణంబులర్పించెదన్. 328

మ॥ "గురులున్ మాన్యులు చుట్టపక్కములు నాకున్ గూర్చు సామంతభూ
వరు లీలోకమునందు నాకుఁగల సంబంధుల్ భుజావీర్య వి
స్ఫురణన్ బోరుచు వారివారి పొలుగున్ క్షోణీస్థలిన్ గూల్చి పం
డిరి; వీరందఱవీడి దొంగవలె నొంటిన్ బోవఁ గాల్గాడునే 329

మ॥ ఒడలంమాపిరి యాడునంతకు రణోద్యోగంబు నందుండి నా
యకులుగుల్ వెన్కకురావు; సుంతయు శరీరాయాసమున్ బోఁపదీ
కడ; రేయైన దివంబయైన నొకఁడై కన్పట్టు; బాహ్వాద్రి సూ
ర్యుఁడు దోతెంచెడుదాఁక క్షాత్రపులనోర్తున్; గూర్తుఁగీర్తిచ్ఛటల్"

సీ॥ అని ప్రతాపుఁడుపల్కఁ గని భీమజాండు "భా
రతఖండ చండమార్తాండమూర్తి
యని యొనర్పంగ లేవనికాదు; భీతిల్లి
దనికాదు; సకల లోకాళి యెఱుఁగు
నినువంటి వీరుఁడెందును ద్రిలోకములఁ ద్రి
కాలమ్ము లందును గలుగఁడనుచు;
సమయ మట్టిదిగానఁ "జనుటమే"లనెఁ గృష్ణ
సింగు; నాకట్లతోఁచెడిఁ దలంప
గీ॥ గొంకరాలము సంగరక్షోణి విడిచి
యవలఁ దొలగుట పౌరుష హానిగాదు;
నీవుగలిగిన నిఖిలార్థ నియతిగలుగు
దైవమున్నది యూపై విధానమునకు. 331

చ॥ అనినఁ బ్రతాపుఁ "డేమియును నాడఁగలేను; పరాభవాగ్ని నా
మనసు దహించె" నంచన, నమాత్య శిఖామణి కృష్ణసింహుఁడున్
వినయ మెలర్ప వేఁడుకొని వేయువిధంబుల విన్నవించి సాం
త్వనములఁ గుస్తరించుచుఁ బ్రతాపునిఁ బంపె రణంబునుండియున్. 332

—• { రణరంగము వీడిపోవు ప్రతాపసింహుని యవన
సేనాధిపతులు వెన్నంటుట. } •—

సీ॥ కాలిబాటను చైతకముపైఁ బ్రతాపుఁడు
గిరివెంటఁ గొంత దవ్వరుగునంతఁ,
వెంత సశ్వఖురాలి క్షితిసోఁకు ధ్వనివిని
తిరిగి వెన్కకుఁజూచి తురకభటులు
తఱుముకొనుచు వచ్చుటెఱిఁగెఁ; గొండొకదూర
మరిగి మరలిచూచి యందొకండు
తగ్గియుండుటఁ గాంచెఁ; దనప్రయాణము సాగఁ
జేయుచు మరలి వీక్షించె, నింక
గీ॥ నొకఁడులోపించె; నంతలో నుద్ధురగతిఁ
బాఱు పదిమూరల వెడల్పు యేఱుదవిలెఁ;

దైతరము పేహమునసున్న సర్వమెల్ల
నొక్కచోఁ జేర్చి సెలయేటి సుబికిదాఁటె. 333

మ॥ కఱుఁ గష్టంబున వెన్కవచ్చుటటుఁ డొక్కండేటియందుణ్ హయం
బడుగుల్ మోవఁగఁజేసి, దాఁటుకొని "సీలాశ్వంబుపై నెక్కిపో
యెడి యో యోధకులాగ్రణీ నిలువుమీ యష్టంచుఁ బల్కణ్ బ్రతా
పుఁడు; "సిద్ధంబుగనుంటి ర"మ్మని హయంబుణ్‌డిగ్గి నిల్వంబడెణ్.

—• సూక్తసింహుఁడు ప్రతాపసింహుని మన్నన వేఁడుట. •—

మ॥ త్వరమై నశ్వముడిగ్గి యోధుఁడుసు జెంతణ్‌వ్రాలి "నానామహీ
శ్వర శీర్షస్థ కిరీట రత్నచయ శోభాపూర నీరాజన
స్ఫురణణ్ మించు భవత్పదాంబుజయుగంబుణ్ గాంచి సేవింప నా
పర మైశ్వర్యముగల్గె నేటికిఁ బ్రతాపా! విశ్వలోకార్చితా. 335

మ॥ "ధర, సామాన్యపు శబ్దజాలమున "స్వాతంత్ర్యంబు" దానొక్కఁడై
పరఁగెణ్; నేఁడు భవత్పరిగ్రహ మహాభాగ్యంబునణ్ జేసి, స
ర్వ రసాధిష్ఠితరూఢి నొప్పుచుఁ బరి బ్రహ్మప్రభావ ప్రథణ్
వఱలణ్ జొచ్చెను; దివ్యమూర్తివి ప్రతాపా! విశ్వలోకార్చితా. 336

సీ॥ అన్నవు; స్వామివి; యాచార్యుఁడవు; ప్రాణ
మెత్తుగాఁజూచి నన్నేలు నిన్నుఁ
దెగనాడి, యకట భ్రాతృద్రోహమును గురు
ద్రోహంబు నొడిగట్టి తురకలందుఁ
గలిసి, మేవాడపైఁ గత్తిగట్టుటను మా
తృద్రోహ మొనరించి తిట్లుపడితి
నేఁబువాఱెడి బాష్పవారి నీయడుగులు
తడుప నాచిత్త ముత్తలమునొందె

గీ॥ నఖిల భువన వంద్యంబు నీయడుగు దోయి
దలఁకుదుణ్ నాదు పాడుచేతుల స్పృశింపఁ;
బెరిఁగెఁ గొండలు కొండలై దురితరాశి;
యెట్లు కృపఁదేల్తువో నన్ను నింకమీఁద. 337

సీ॥ మరణ దండనమాన్పి కరుణించి యమృత సా
రముపోసి తనదు ప్రాణమునకన్న
నెక్కుడుగాఁజూచి యిర్వదేఁడుల దాఁకఁ
గ్రింద మన్ననిబొజ్జ యందుఁజేర్చి
జనకుఁడై పెంచె శాశ్వత యశోనిధి సలుం
ప్రారాజ్యలక్ష్మి గారాబుభర్త
యకటకటా నోర ననరాని విధమునఁ
గాఱులాడితిఁ గండ కావరమున;

గీ॥ నభినవకిసాల కోమలంబై తనర్చు
నామహారాజు మదియెంత యడలెనొక్కొ
యీ పితృద్రోహ మొక్కఁడే యెట్టిదుర్గ
తులకు నైనను గొంపోవఁ గలదునన్ను. 338

క॥ ఈతఱి నీ పంచ మహా
భూతమ్ములు సాక్షి; వైరము నశించెను నా
చేతమ్మున; నన్నుఁ గృపా
న్వీతుఁడవై యేలు"మనినఁ బృథ్వీశ్వరుఁడున్. 339

సీ॥ "నిర్హేతుకంబుగా నీవు వాదాడి న
న్నెడఁబాసి చని పెక్కులేడులయ్యె
బోరానికోటికిఁ బోతివి కొలువంగఁ
గూడని విమతులఁ గొలుచుచుంటి
వుదయంబునుండి నన్నెదిరి తఱిమిపోరు
నడిపితి సాయంతనంబువఱకు
మూఁడుమాఱులు నన్ను ముట్టియంతంబు నొం
దింప గట్టిగఁ బ్రయత్నించి యుంటి

గీ॥ వని ముగిసి గంటకాలేద యపుడె యేండ్ల
పొడవున నెసఁగు వైరంబు పొలిసెననుచు
నిచ్చకపు మాటలాడుచు నిటులువచ్చి
తెటుల నినునమ్మనగును నాకెఱుకపడదు. 340

క॥ దుర మొనరించుటకే యిపు
డరుదెంచియ యున్న యుష్మదగ్రజుఁ జెపుడె
వ్వరు కోరిన వెనుదీఁడని
యెఱుఁగు''మని వచింప, సూక్తు "డిటు లేమిటికిన్. 341

సీ॥ సకల సామంత రాజసమూహములు సభా
స్థానంబునందు నిర్జరగణంబు
తెఱఁగునఁ గొలువంగ దేవేంద్రసమ వైభ
వంబుననీవు మేవాడరాజ్య
సింహాసనం బధిష్ఠించి యేలుటఁగాంచి
యెడఁద నోరిమిలేక యీర్ష్యవొడమెఁ
గాని యెన్నెన్నిమోగతుల యత్నించి బ
యల్పడనీకలో నణఁచియుంటి

గీ॥ వేఁట చాలించి కూర్చున్న వేళనెట్టు
లో హఠాత్తుగ నదియుఁ బైకుబికి రాఁగఁ
బంది నెపమున నీతోడ వాదు పెంచి
యుంటి నావిత్తవృత్తి యట్లుండె నాఁడు. 341

సీ॥ సందేశామును నిన్న శత్రుసైన్యములు హ
ల్దీఘాటు కనుమఁ గాల్నిలుపఁబోవ
నెటనుండి వచ్చెనో యేఱుపూఁకినయట్లు
మాతండ్రి యా సలుంబ్రామహీంద్రుఁ
డిరులు క్రమ్మెడువేళ కిరువదిరెండు వే
ల్దొరలు గొల్వంగ నీవరుగుదెంచి
సూర్యధ్వజము నిల్పఁజూచితి నపుడ నా
మదిలోన నొక గొప్ప మార్పుగలిగెఁ

గీ॥ బక్షివలె నీపదములొద్ద వ్రాలియుందుఁ
గాని రిపుల యుప్పునుదిన్న కారణమున
రాత్రినిలిచి ప్రొద్దుటనుండి రణమునడిపి
వారిఋణ మావిధమున దీర్పంగఁగంటి. 343

గీ॥ అని ముగిసినంత సకల సేనాధిపతుల
మంబరీశ్వరు శిబిరంబునందు నుంటి
మంతనీపు దేవా! శ్వేత తాశ్వమెక్కి
యరుగు టందఱమును గంటి మద్రిదెసను. 344

సీ॥ అంబరీషుఁడు "పోయె నకటా ప్రతాపుఁడా
త్మని తలఁదెచ్చు వీరునకు మాళ్వ
ధరయిత్తు" ననియె; మూల్తాన్ ఖొరాసాన్ దొరల్
గదలి; రే కాకినీగాంచి కరిగి
మొగలులదెసఁ గిన్క పొడమియా యిరుపురఁ
దటిమి గీటడఁచి నీదరిఁ దరిసితి;
మూఁడేండ్ల కఱవున మునిఁగి నేఁటికిఁగంటిఁ
దనివిలో భ్రాతృవత్సలుని నిన్ను;
గీ॥ నకట యీర్ష్యాగ్రహ గ్రస్తమైన హృదయ
పాపమెల్లఁ బశ్చాత్తాపవహ్ని సమసెఁ
ద్వత్కృపామృతవృష్టి నాపైనఁగురిసి
నన్నుఁ గృతార్థునిఁ జేయు మనాథనాథ. 345

గీ॥ అకట నావంటి పాపాత్మునకుఁ బవిత్ర
మైన మేవాడఁజోటుండదని యెఱుఁగుదుఁ
గాని నీదు విశ్వవిశాలమైన హృదయ
సీమఁ దావుంతునని యె వచ్చితి క్షమింపు. 346

క॥ మదిఁ గోపము వాయద యే
నదె కుంతము నీదు హస్తమందిదిగో నా
హృదయము సూటిగఁ బొడువుము
పద సీమను వ్రాలి విడుతుఁ బ్రాణానిలముల్." 347

క॥ అని జడివట్టిన వడువునఁ
గనులను బాష్పములు దొరఁగ గద్గద కంఠం
బునఁ గేలుమొగిచి నిలిచినఁ
గనుఁగొని వాత్సల్య రాగకళ లుట్టిపడన్. 348

సీ॥ ఔను నావెన్కఁ మూఁడశ్వముల్ తఱుముచు
నరుగుదెంచుట మున్నె యరసియుంటి
నటఁ గొంతసేపటి కగుపడె రెండుమా
త్రము మఱియును గొంత తడవునకును
మిగిలె నొక్కండంతఁ దగిలె నీ యేఱడ్డ
పై దీనిదాఁటెదు నంత నీవు
పిలిచితి శాత్రవవీరుల యశ్వంబు
లవిగొ రౌతులులేక యడవిపట్టె
గీ॥ మంచిమనసున నీవరు దెంచియుంట
కింతకన్నఁ దార్కాణ మింకేమివలయు
రణ పరాజయ దుఃఖ నిర్మగ్నుఁడ నగు
నాకు సోదరలాభ మీనాఁడుఁగలిగె 349

గీ॥ ఇట్టులనుతాపపడి యుపకృతి యొనర్చి
సరసఁ జేరితి వనివిన్న క్షణమె నిన్ను
శిరమునను జేర్చుకొనుఁ గృష్ణసింహవిభుఁడు
పరమకోమల మమ్మహాప్రభువు మనసు. 350

గీ॥ మబ్బుతెర జాఱ సుప్రభా మహితుఁడైన
చంద్రుని విధానఁ గిల్బిష క్షాళనమున
ద్విగుణితకళా విభాసివై తేజరిల్లు
చుండు నీవేరికైన మాన్యుఁడవు కొమర. 351

మ॥ నను నీవింతగ వేఁడుకోవలెనె యన్నా' ర"మ్మటంచున్ బ్రతా
ప నృపోత్తంసుఁడు సూస్తుఁగౌఁగిటను నిల్పన్, వాఁడు హర్షించె; నం
తనె నిల్వంగనులేక చైతకము క్రిందన్ వ్రాలె; వీక్షించి గ్ర
క్కునజీనిన్ సడలించి తేఁడు సరసన్ గూర్చుండెఁ జింతారతిన్. 352

—• చైతకాశ్వము వీరస్వర్గమున కేగుట. •—

మ॥ అతిదీనంబుగ స్వామి మోముగని యాయత్యుత్త మాశ్వంబు బా
ష్పతతుల్ వీడుచు మందమందముగ హేషాధ్వానమున్ జేసి, యం

చితమౌ భక్తిఁ దదీయ పాదములపై శీర్షంబుఁ బొందించి స్వ
స్థతఁ గన్మూసెను; మఱెప్డు మేల్కొననినిద్రానిష్ఠలో మున్గుచున్. 353

చ॥ "అకటకటా జగత్ప్రళయమైన, నొకంగసళమైనఁ దప్పు దా
రికిఁ జనరాయరాతి హయబృందము భీతిలి పాఱఁదాకిఁ యౌ
ర కుడిభుజంబవౌచు సమరంబుల నన్ను భరించుచుంటి; చై
తకమ! ఋణానుబంధములు దప్పెనె నీకును నాకునేఁటికిన్. 354

సీ॥ నాయెడనీకు నెంతటిభక్తి యెంత వి
శ్వాస మెంతటి మహోత్సాహ భరము
కొడుకునకన్న నెక్కుడుప్రీతిఁ బండ్రెండు
వత్సరంబులుగ నాపంచగావి
యకటకటా శిరమందుఁ దురాయితోఁ
బెండ్లికొడుకు నట్లు వెడలివచ్చి
కనుపించౌనర్తువు; కదనరంగముల నీ
సరిలేదనఁగఁ గీర్తి నెరపినావు;

గీ॥ బంధులను నాప్తులనువీడి వచ్చునన్ను
విడువఁజాలక యిందాక వెంటవచ్చి
తోయి మధురాతి మధురమైయొప్పు నీదు
వీరహేష నాలించెదు పెంపుచెడెనె." 355

—• సూక్తసింహుఁడన్న కళ్ళెమునిచ్చి యవనుల శిబిరమునకేగుట. •—

సీ॥ అని కుందఁగని సూక్తుఁ "డత్రిరంబు కలపైన
నొఱుఁగ నుంతకలంగి యొఱుఁగవీవు;
చైతకంబు పృతికి శతపత్ర చైత్రనే
త్రముల వాష్పములు ముత్యంబు లట్లు
క్రమ్మనేఁగని యోర్వఁగాఁజాల: నిదిగొ నా
"యంకారు;" నీసేవ లవధరించు;
దీనినిఁగొని భద్రమౌ నెడకేగు; మం
బరుభర్త మోమెుక్క మాఱుచూచి

గీ॥ త్వరితముగవచ్చి నీపదద్వయముఁ గొలుతు."
ననుచు, నశ్వమునిచ్చి జోహారొనర్చి
యలుతనున్న ఖొరాసాను హయమునెక్కి
యరిగి కనెమొగల్ సర్వసేనాధినాథు. 356

గీ॥ "ఆప్రతాపుని శిరమేది యక్కట! కాన
రారె మూల్తాన్ ఖొరాసాను వీరవరులు
నీహయంబేది సూక్త! సందేహమయ్యెఁ
జెప్పు సత్యం"బనిన, మానసింహుఁ గాంచి. 357

సీ॥ "అల్ల హాల్దీఘాటునందు సూర్యధ్వజం
బెత్తినప్పుడె చిత్తవృత్తి మాఱె;
నాల్గులక్షలు మిమ్ము నావారలిరువది
రెండువేల్ దొర లెదిరింపఁగంటి;
నపజయంబున ఖిన్నుఁడై యన్నయని వీడి
యొంటిఁ బోఁదలను జెమ్మఁగంటి వీవు
పొగిలి నాహృదయంబు మూల్తాన్- ఖొరాసాను
భటులఁగూలిచి నాడు వాజినిచ్చి

గీ॥ పంపి నినుఁజూచి పోనిట్లు వచ్చినాఁడ
నెమ్మి నను నమ్ముఁ; లేక చిత్తమ్ము వచ్చు
నట్లు దండింపు మెఱవ నాప్రాణమాన"
యనిన, మానసింహుఁడు కోపమందినిలిచి. 358

శా॥ "మేమై నీవిపుడా ప్రతాపుతలఁ దెమ్మీ పొమ్మనన్ లేదు; తా
నై ముందున్ బడిపోయి మాహితుల సంహారంబు గావించి రా
ణామేతెంచి తొలంగఁబంపె; నను నిందల్ చేయుచున్ వచ్చెఁ; నీ
స్వామిద్రోహినిఁ బట్టుకొండు; చెఱ నుంపన్ బోలుఁ, దోసీకురే." 359

—• సూక్తసింహుని దండింప వలదని యబ్దూరహిమాను వాదించుట. •—

గీ॥ అనుచు గర్జింప నచటి సైన్యాధిపతులు
వానిఁ జుట్టి; యబ్దూరహిమానుఁ "డితఁడు

పైర్చమున వచ్చి యున్నసత్యంబుచెప్పె;
నేమనఁగఁడోకుఁ, డని యంబరీశుఁజూచి 360

మ॥ ఇతఁడిన్ నేసును రెండువత్సరములు లయ్యోన్ మైత్రిఁబాటించి; పు
ణ్యాతముండంచు వచింతు నిక్కముగ; ద్రోహంబుండెనేనిన్ బ్రతా
పుతలన్ దెమ్మని నద్దేనీచగు శిరంబున్ జెండియేయున్న మా
స్థితి యెట్లుంచెడి నించు కేనియును యోజింపంగ సందుండునే. 361

గీ॥ భ్రాతకాలముసామి పౌరుషవంతుండు,
రాజరాజు, రిణపరాజితుఁడయి
చను ప్రతాపుఁగూర్చి సాయంబుచేయు ట
బ్బురమె"యని పలీము మోముఁగాంచి 362

ఉ॥ ఈరిణ మందిటుల్ మనల నిందఱిఁబొంచి కలంచి తోలఁగా
నేరిచె నాప్రతాపవిధు నేఁటి యమానుష వీర విక్రమో
దార విహారముల్ గనినఁ దప్పక లోకములన్నియున్ సమ
స్కారము చేయునన్న, నను జన్మఁడుమెచ్చి చనంగ వింతయే. 363

ఉ॥ ఏనును రాజపుత్రుల జయించి యశంబుఁ గడింప వచ్చితిన్;
గాని, తదీయ పౌరుష వికాసము దైవత దైత్యకోటులున్
గానము చేసిరప్పుడు; జగన్నుతశౌర్యుఁ బ్రతాపు మానవుం
డౌ ననరాదు దేవుఁడను టర్హమటంచని తోఁచు నామదిన్. 364

సీ॥ హారావళీ పర్వతాగ్రంబు నందొక్క
నవరత్న దివ్యమండపముగట్టి
యపరంజితో నామహాదాగు విగ్రహం
బమరించి తన్మధ్యమంబునిలిపి
విశ్వశోభనమైన వేళలో నాధీపు
పరమపావన వామ పాదమందు
సకల జగజ్జైత్ర సంజ్ఞామనోహర
స్వర్ణ తులాకోటి సంతరించి
గీ॥ భక్తిమెయి విశ్వవీర ప్రపంచ మెపుడు
పర్చ చేయంగవలయు శూరాగ్రయాయి

యమ్మహారాజు డోలు ధర్మానుయాయి
సురల యింద్రైన వెదకిన దొరుకుటరిది 365

సీ॥ జగము సంభవమైన క్షణమునుండియు నేటి
దాఁక స్వాతంత్ర్య మింతటి మహోగ్ర
దీక్షతోఁ గొలిచిన ధీరుండు గనుపింపఁ,
డిప్పుడు మనియున్న యెల్లవార
లపుగసలకు మడుగు లిడికొల్తురి; రాఁగల
యుగములలోఁబుట్టు వొందువారు
స్వాతంత్ర్య ధర్మదీక్షా గురూత్తముఁడంచు
నా చంద్రతారార్క మభినుతింతు

గీ॥ రమ్మహాత్ముని సోదరుఁడైన సూక్త
డింతకాల మిచ్చటనిల్చు టెంతొభాగ్య
మీతనిఁ బ్రతాపుఁ జేరఁబోనిందు నేఁడుఁ
మన్ననముచేసి కడుఁ బెద్దమనసుచేసి.'' 366

మ॥ అని భాషింప, సలీము, సూక్తుఁగని "యయ్యా నీవు మాయుప్పనుం-
దిని మీయన్నకే సేవచేసితి; నినుఁ శిక్షింపఁగా నొప్పు; నై
నను సత్యంబు వచించుటం బ్రదికి, తండన్ నిల్వ కెందేనిఁ బో''
మ్మని శాసించె, "నెబాసు మంచిది సలా''మంచేఁగె నాసూక్తుడుఁ

—: బదోని డిల్లీకివెళ్లి పాదుషాకు యుద్ధఫలము దెలుపుట :—

సీ॥ అప్పు డంబరుభర్త యాజ్ఞబదోనియు
నానాఁటి యుద్ధంబునందుఁ జంద్ర
భట్టారకుని భద్రవారణంబును గొంచు
శీఘ్ర ప్రయాణముల్ చేసి, ఢిల్లి
కరిగి, యక్బరువిభు నడుగుఁదమ్ముల వ్రాలి,
పూసగ్రుచ్చిన విధంబునను సమర
వార్తలన్నియుఁదెల్పి వారణరాజంబు
నర్పించి నిలిచిన యక్బరుపతి

గీ॥ ముద్దుమోమునఁ జిఱునవ్వు మొలకలెత్త
నాణిముత్తెంపు హారంబు నఱుతవైచి
చంద్రహాసంబు యావనాశ్వంబుఁ బారి
తోషికములిచ్చి యతని సంతోషపఱచె. 368

ఉ॥ అంతటఁ గొన్నినాళ్లరుగ నంబరుభర్త సమస్తవాహినీ
కాంతులు సైన్యముల్ గొలువఁగాఁ బయనించుచు ఢిల్లిచేరి భూ
కాంతుని పాదపంకజ యుగంబు సమీపమునందువ్రాల, నే
కాంతమునన్ విభుండతని కార్యముమెచ్చక మందలించుచున్. 369

—• అక్బరు సార్వభౌముఁడు మానసింహునితో నిష్ఠురోక్తులాడుట. •—

మ॥ "నిను మేవాడకు బంపినప్డు మదినుండెన్ గొండలక్ష్మాప్రతా
పుని నిర్జింతువటన్న యాసలు; సమిద్భూమిన్నినున్ వైరిమా
ర్కొనెనో లేవొకో సర్వమున్విడిచి నాకున్జెప్పఁగావచ్చి; తే
మని చింతింతును మందభాగ్యునకు సేలాపట్టు సద్యోగముల్. 370

చ॥ అకటకటా ప్రలాపు నెటులైనను గెల్వుమటంచు నేను చె
ప్పుకొనిన యంతసేపయినఁ బోవలదే యొకపూటలోన వె
న్కకరుగుచెంతురే యకట కట్టిడినై నిను సమ్మిసంచుకై
వెకలినిజేసి; తేమనుచు వేయువిధంబుల నిన్నుదూరుదున్. 371

సీ॥ ఎంతకాలమ్ముగా నీయుద్ధ సంరంభ
మెంతటిసన్నాహ మెంతసేవ
యెన్ని శస్త్రాస్త్రంబు లెన్ని సంహారమ్ము
లెందఱుసేవకు లెంతవ్యయము
నాస్థితియకట కొండనుద్రవ్వి యెలుకను
బట్టిన చందానఁ బరిణమించెఁ;
గడకు హల్దిఘాటు కనుమలోనఁట యొక్క
పగలఁట ఘోరాహవంబుగలిగె

గీ॥ నఁట తుదకు నాకె జయమయ్యెనఁట యిదేటి
మాటలోనేను విననోప మానసింహ!

నా వెతలు మాన్పినన్నుఁ దేర్ప నీవెవండ
వగు నదియుఁగాక మాన" దటంచు విసిగె. 372

సీ॥ అప్డు డంబరుసేత యక్బరీశుని గాంచి
"దేవ నీవిట్లు చింతింపఁదగునె
నాజీవితంబును నాయభిమానంబు
నీయధీనముచేసి నిలిచినాఁడ;
శక్తి వంచనలేక క్షణ మేమఱఁగఁదోక
యాప్రతాపాధీశుసని నెదిర్తు;
యముఁడనై యతని ప్రాణానిలమ్ముల నూడ్చి
పీల్చి పిప్పియొనర్చి వెతలఁ బెనుతుఁ;

గీ॥ బలుకు లోకవేయు నేటికి భరతఖండ
మందు శాశ్వతస్థాయిగా యవనకోట
రాజ్యసంస్థాప నాచార్య రాజరాజ
బిరుదములు నీకుఁగూర్చి శోభిల్లఁజేతు." 373

మ॥ అన, నక్బర్విభుఁ 'డౌనుగా' కని కరంబానందముంబొంది "యొ
క్కనిమేషంబును నూరకుండకయె సంగ్రామంబు సాగింపు మ॥
మ్మని శాసించిన, మానసింహుఁడును సేనాధీశ సైన్యంబులన్
గొని రాణాపయికేఁగు నుత్సుకతతోఁ గొల్వుండె నిర్వ్యాజమై 374

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్షవీక్షా సమాసాదిత రసవ
త్కావ్య నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశ
దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర,
సుజన జనానుగ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసార్వభౌమ
సాక్షాద్వీర ప్రతాపాది వింశత్యధిక బిరుదవిఖ్యాత, సుకవి రాజ
శేఖర, రాజశేఖరకవి ప్రణీతంబైన "రాణాప్రతాపసింహ చరి
త్రం" బను పద్యకావ్యమునందుఁ దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీ

రామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర

## చతుర్థాశ్వాసము.

---

మ॥ స్థిరశౌర్యుండు ప్రతాపసింహపతి హాల్దీఘాటు యుద్ధంబు రా
తిరి సూక్తున్ విడనాడు నాపిదప నద్రిశ్రేష్ఠములన్ దాఁటుచున్
మఱునాఁ డయ్యుదయాద్రి సూర్యుఁ డుదయింపన్బోవు నవ్వేళకున్
దరియన్బోయెను శైలమార్గములగుండన్ "గైలవారా"ధరన్.

సీ॥ జాము ప్రొద్దెక్కెడు సమయంబునకు సలుం
బ్రాభర్త యెదిగి భూపతి పదాబ్జ
ములఁ బ్రాలి "దేవ వీరలు ప్రమరులు; వీరు
చోండాపతుల్; వీరు చోహాణభటులు;
ఈతఁడు శ్యామసిం;గితఁడు ఝేల్వాపతి;
బేద్లా-కొఠేరియా విభులువీరు:
తమతమస్సైన్య శేషములు గొల్వంగ నీ
శ్రీపాదసేవఁ గాంక్షించివచ్చి:

గీ॥ రాదరింపవే" యనిన, సైన్యపతులెల్ల
మ్రొక్కి నిలిచిరి; భిల్లులు ముందుఁగొలువ
వందనమొనర్చె భీమచాం; దందఱఁగని
కూరుచుండంగ నియమించి క్షోణివిభుఁడు. 2

{ వీరస్వర్గమునకేగిన యనుచరులగూర్చి ప్రతాపసింహుఁడు విచార పడుట. }

చ॥ "మనమున నాలుగేండ్లుగ సమస్త విధంబుల నానిపూని చే
సిన బహుళశ్రమంబు ఫలసిద్ధి వహింపక నేఁడు నిష్ప్రయో
జనముగనయ్యె సాటి నృపసత్తములన్ దలయెత్తి యెట్లు చూ
డనగు విధాత చెయ్ద మకటా వికటించెనె యిట్టినాదెసన్. 3

సీ॥ భూదేవతాళి కప్పురపు హారతులిచ్చి
మంత్రపుష్పము పెట్టుమహితదేవ
పూజా గృహంబట్లు పొదలె నా సేనతో
నిన్న హాల్దీఘాటు నికటసీమ
గంట లిర్వదినాల్గు కడచి పోకయమున్నె
పెండ్లికొడుకు లట్లువెలయు శూరు
లెందఱు కన్నులకందక చాపైరి
పదునాల్గువేలు సచ్ఛటులుగాలి
గీ॥ "రక్కటా కడుపున హాలహలము పోయు
వడువున దేహమంతయు నుడుకులెత్తె
నమృతభాండము పల్వ్రక్కలగుచు విరిసెఁ
బెండ్లిచవికె గుహాలున విఱుఁగఁబడియె 4

మ॥ అదయుల్ శత్రులు గ్వాలియర్ గొనిన రాజ్యంబూడి చిత్తోరికోఁ
బదముల్ మోపినదాదిఁ, దండ్రివలె మేవాడ్ రాజ్యలక్ష్మి పదం
బుఁదలన్ నిల్పుచు, రామచంద్రనృపుఁ డెప్డున్ భక్తి సేవించె; నా
సదయస్వాంతు ఋణంబుఁ దీర్పఁగలనే జన్మాంతరం బందునున్. 5

శా॥ "ఆఱున్ బైఁ బదియేండ్ల ప్రాయమును బూజ్యస్వాంతమున్ మన్మథా
కారంబొప్పెడు లేఁతకుఱ్ఱఁడు తురుష్కశ్రేణులన్ దాఁకి, కం
గారై పాఱఁగఁజేసి శాశ్వత యశఃకాయంబునన్ నిల్చె; ఖం
దేరావున్ బురుడించు పోటరులఁ గంటే యేయుగంబందునన్. 6

సీ॥ "తౌరుష్కవిపుల పదాతి వర్గముదూసి
యాశాంతముల కేఁగునట్లు దోలె
యావన బహుళ బృహన్నాళి కాస్త్రముల్
వేలకువేల్ పిండిపిండిలేపె

రెండువేల్ భటులతో రెండులక్షలు తురు
ష్కులలీలఁ దాఁకి గగ్గోలుపఱచె
నైదువందలు వీరులదిమి చుట్టినవ్రేటు
తనపైఁ బడకయుండ ననియెనర్చె

తే॥ జగము పుట్టినదాది నీక్షణముదాఁక
బదియు నేడేండ్ల ప్రాయంపు బాలుఁడింత
శౌర్యముం జూపలేదని జనముపొగడఁ
దివిరె నకట సామాన్యుఁడే తేజసింగు. 7

సీ॥ "తనదేహ ధన జీవితములిచ్చి మాతృదే
శముఁ గొల్చుభక్తి విజ్ఞానమయుఁడు
పదునాల్గు లోకముల్ గదిరినఁ దనపట్టు
వీడని పరమ గంభీరమూర్తి
మృత్యుదేవతనైన మిత్రునియట్లు ప్రే
మించెడు వీరలక్ష్మీ ప్రభుండు
మత్పదంబేకాగ్ర మనమునఁ గొలుచు పూ
ర్ణస్వామిభక్తి పరాయణుండు

తే॥ "భారతమునకెకాక విశ్వమునకెల్ల
యశముఁ జేకూర్పఁజాలు మహాబలాఢ్యుఁ
డౌర రాఠోడ్కులంబు ధన్యతమమయ్యె
దేజసింహావతార సంయోజనమున. 8

తే॥ తండ్రివలెనేలె; మనసు మెత్తనిది వీర
సమర రంగాగ్ర సీమఁ బ్రచండ భానుఁ
డకట! వానుసింహుఁడు సూలె" ననుచు వగచు
నాప్రతాపునిఁ గని సలుంబ్రాధిపతియు. 9

చ॥ "అనిఁబడు భానుసింహ వసుధాధిపు సాద్రినృపాలుఁ డప్డె చెం
తను గల శైలగహ్వరము దాపునఁ జేర్చి సపర్య చేసె నా
తనికి భయంబు లే దనఁ బ్రతాపుఁడు "కీడున మేలు గల్గె దే
వుని కృప" యంచు నాత్మఁ దలపోయుచు మ్రొక్కి నిమీలితాక్షుఁడై. 10

—• ప్రతాపసింహుఁడు సేనాధిపతుల సత్కరించుట. •—

సీ॥ అల సలుంబ్రాధీశు నవ్వల సాద్రీశుఁ,
బదపడి ఝల్వానృపాలుఁ, బిదప
బేంద్లా-కొటేరియా పృథ్వినాయకులఁ దే
ర్మినిజూచి "మీరును మీరుమీరు
సంవర్త సమవర్తి సదృశులై నిన్న హ
ల్దీఘాటు కనుమ నమోఘనాటిఁ
బరసేనఁదాఁకి యుగ్రరణంబు సాగించి
కొఱలేక రిపులను గూల్చినారు
గీ॥ స్వామిభక్తి పరాయణుల్ సరళమతులు
మీయెడఁ గృతజ్ఞుఁడ" నటంచు సాయము విను
తించి వేర్వేర సరసకుఁదీసి వారి
వారికినిఁ గొన్ని ఫలములు పంచి విభుఁడు. 11

సీ॥ "యువరాజ మానసింహుల యేన్గు చైతకా
శ్వము ధాటికోర్వక పాఱుపిదప
వేలు లక్షలు మొగల్ వీరులు ననుముట్టఁ
ద్వరవచ్చి నారవిధ్వజముఁ గొనుచుఁ,
దురకమూఁకలఁ జాల దూరంబుజేర్చి నా
పైని యెత్తుడి తద్దఁబాయఁజేసి
తొమ్మండ్రుగురు తనతోఁ బుట్టువులఁ గూడి
స్వామిభక్తినిజూపి స్వర్గమేగె;
తే॥ నా మనస్సింహునకును మేలేమిసేతు
నతని యనుజుండు జ్ఞాతి యీశ్యామసింహుఁ
బ్రథనసీమల నాకుడి వంకఁబోరు
నట్టి యధికారమిచ్చి యుష్టాదరింతు. 12

సీ॥ ఇఁకమీఁద యుద్ధంబు లెసఁగుచో సాద్రి నృ
పాలురే దినమణి ధ్వజముపట్టి

నన్నుఁ జాయరయె పెంచుచు నుండెదరుగాక
యాస్థానమునుజేర నరుగునపుడు
తద్దుందుభులు రాజధాని నాహర్మ్య సిం
హద్వారమును జేరు నంతదాఁక
మ్రోయుచుండెడుఁగాక యీ యవ్వనమున ని
ప్పటీసుండి సాద్రి నృపాలమౌళి

తే॥ లందఱును దమ నామధేయముల ముందు
రాజపద లాంఛనమ్ము గౌరవపదమ్ముఁ
దాల్చిగావుత వంశజుల్ తరతరముగ"
ననిన, "భళి"యనె నైకకంఠ్యముగఁ గొలువు. 13

క॥ "దేవా, నీసేవను ర్యా
లావంశము ధన్యమై చెలంగె" ననుచు శ్యా
మావనిపతి మ్రొక్కెను; సం
భావనమెయిఁ బతియు భిల్లపతిఁ గన్గొనుచున్. 14

మ॥ "తరమే నిన్ను నుతింప; నీభుజమయాధారంబు నాకుగ్ర సం
గర రంగంబుల; దేననెట్టులు బహూకారంబుఁ గావింతుఁ బ్రే
మ రసంబొదఁగ గౌఁగిలింతునని సంభావించె నద్దేవడిన్
మొరసెన్ భేరులు;. సూక్తుఁడున్ నిజబలంబుల్ గొల్వఁ గానంబడెన్.

—• సూక్తసింహుఁడు ప్రతాపసింహుని జేరవచ్చుట. •—

ఉ॥ "నిన్న నితంబుచేసిన పనిన్ దని వొందక వైరమూని, నేఁ
డన్నను దాఁక వచ్చెఁడును మాడరె వీని"నటంచుఁబల్కి యం
దున్న సమస్తవీరులు మహోద్ధతిలేవఁ, బ్రతాపుఁడంతఁ జే
నన్నను వారినిల్పి "యొకసంగతి మీకెఱిఁగింతు; సైపుఁడీ. 16

సీ॥ అందఱు గూర్చుండుఁ;డని నిల్చిపైనిన్న
గిరివెంటనే వచ్చి తెఱిఁగి, యంబ
రీశుండు నను గూల్చ నిరువుర వీరులఁ
బంపె; వారు పిఱుంద వచ్చిరంత

సూక్తుఁడు వారిఁగూల్చుచు నన్నుఁగని మ్రొక్కి
నతనిచేఁ గనికరించితిని; బిదపఁ
జైతకంబిలబ్రాలి సమసె నిజాశ్వము
నాకిచ్చి తఱలి, యీ నాఁడుపన్నెఁ;

తే॥ గలిగెనాకు హాల్దీఘాటు కదనమందు
నిన్న సోదరలాభ" మటన్న హర్ష
మలర నందఱ నెమ్మోము లడరెనపుడు
నవవికసి తారవింద సంతతుల కరణి. 17

సీ॥ సూక్తుఁ డశ్వముడిగ్గి సూటిగఁజని సలుం
బ్రాధీశునకు మ్రొక్కి యన్నకెఱగి
"దేవ నీయొద్ద రాతిరి యనుమతిఁ గొని
చని మానసింహు దర్శనముచేసి,
యవనసేనాధి నాయకులఁ గూల్చుట, నిన్నుఁ
గొలుచు టాదిగఁ, గార్యములను దెలిపి
నన్నుసేవించు సైన్యమువెంటఁ గొనుచు మా
ర్గమున వచ్చుచు "ఖిల్బు రా"పురంబుఁ

తే॥ గాంచి యవనులనొంచి దుర్గము గ్రహించి
దాని గురుదక్షిణగ నీపదద్వయమున
నప్పగింపంగ వచ్చితి; నాదరించి
చేకొను" మటన్న నవ్వి యాశీర్వదించి. 18

ఉ॥ ఎత్తి కవుంగిటం బొదివి యిప్డుకుమారక నాకు నీమహో
దాత్తగుణంబు మిక్కిలి ముదం బొడగూర్చె; భవత్పరాక్ర మో
పాత్తము ఖిల్బురానగర వర్యముఁజేకొని నాకుమాఱుగా
నిత్తివి నేలు"మంచు వచియించి ప్రతాపుఁడు మిత్రకోటితో. 19

—• ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట. •—

సీ॥ "మనము హాల్దీఘాటు కనుమలోఁ జూపిన
త్యాగ శౌర్యములు శ్లాఘ్యములె కాని,

గుటికి బెత్తెడుగఁ దక్కువ యౌట జయలక్ష్మి
యందని ప్రమాని పంద్రై తనర్చె
మన కపజయము గల్గిన దంచుఁ గుందకుఁ
డపజయంబున దీక్ష యతిశయించు
నెంత త్యాగం బన్న నంతగా దేవుని
వాత్సల్యమునకు సత్పాత్రమ గద'

తే॥ యింక రాఁగల వేళల నేమి సేఁత'
మరి విజయ కాంక్ష విడువక యని యొనర్ప
మనుచు మదిఁదోఁచె నాకు; మీయంద ఱెట్టు
లాన తిచ్చెద"రన సలుంబ్రాధిపతియు. 20

ఉ॥ "శ్రీలు తొలంగి గేహమనఁ జీఁకటి మూలల గోళ్లు మీఁటి వై
ద్యాలయమందు రోగుల క్రియన్ శయనించెదు మందమర్త్య కం
కాలము లెట్లు లోకహిత కార్యముఁ దీర్చెదు? విక్రమానల
జ్వాలలు నిన్నుఁబోలు పటు శౌర్యులు దీర్తురు గాక రాణ్మణీ! 21

సీ॥ ఆనాఁటి కొకమాట యీనాఁటి కొకమాట
పలుక నేర్చునె సలుంబ్రా విభుండు'
నా మాట యేమి! యందఱు భావ మెఱుఁగుదుఁ;
బ్రాణంబు మేన నున్నంత వఱకు
స్వాతంత్ర్య సమర దీక్షావృత్తి సాఁగించి
మీ దివ్య చరణ సమీప సీమ
నాత్మార్పణ మొనర్చి యజరామర ఖ్యాతిఁ
జెంద సేవింపఁ గాంక్షింతు నెపుడు'

తే॥ క్షణము తడవు సేయకయె రక్త మెగఁజల్లి
రణ మొనర్చుచు శత్రుమారణ మొనర్తు;
మెత్తిన ధ్వజంబు దింప కాయత్త పడఁగ
వలయు'నన భీమచాందు భూవరుని గాంచి. 22

సీ॥ జనదుర్నిరీక్ష తేజశ్శాలి' భారత
ఖండ ప్రచండ మార్తాండమూర్తి

నీవుండుచోటనే నిఖిల ధర్మములుండు;
సత్యముండును; నిత్య జయమునుండు;
నా సూర్యభగవాను నట్టివాఁడవు; దిన
దినమును నిన్నుఁజూచిననెచాలుఁ;
బావిత్ర్య గాంభీర్య భావముల్ క్రొత్తంద
నంబును దఱుఁగ వేనాఁడుగాని;

తే॥ పూర్ణసాత్త్వి కానందరూపుఁడవు రాజ
పుత్ర సంతానమేటికి భూభువనము
లన్నిఁటి జయింపఁగలుగు మహాభుజుండ;
వనఘ నీమైత్రి పరమభాగ్యంబుగాదె. 23

క॥ మాజీవితమును నీపద
పూజకు విడిచితిమి; కొదవ పొడమదనఁగ భే
ల్వాజాని "సందియంబే
లా జయపెట్టంగ లోకమని సేయఁదగుణ. 24

సీ॥ రేఁగెడు సమరభేరీ భాంకృతుల్ విప్ర
వితతి నాందీవాద వేదరవము
గళములఁ్రవాలు వైరులతీక్ష్ణ కరవాల
ధారలు కల్యాణ హారచయము
పొగరేఁగి క్రాఁగి గుప్పునఁబ్రేలు లోహనా
ళాగ్నులు మంగళ హారతులును
దస్యుల గళగళ ద్రక్తపూరములు దే
హమున సోఁకిన వసంతములరంగు

తే॥ వైరి మధ్యస్థలంబు వివాహవేది
మొగలు భట విదారణములు భూతబలులు
గా విజృంభించి సమర రంగమునఁబోరి
పెండ్లియాడుదు మీఁక వీర విజయలక్ష్మి." 25

తే॥ అనివ, బేడ్లా-కొఠేరియా మనుజవిభులు;
"మాతృదేశ విముక్తికై మా యఖిలము,

వించుతయు జాగుసేయ కర్పించుకొనఁగ
సిద్ధముగనుందు" మనఁ గృష్ణసింహ విభుఁడు. 26

సీ॥ "విన్నవించెద నొండు నిన్న హాల్దీఘాటు
కనుమలో నసమ సంగరము నడిపి,
వ్రాలినవారు శాశ్వత యశస్సాంద్రు లౌ
దురు;కాని వారికందరకుఁ దోడు
చైతకాశ్వము చిరస్మరణీయమై యొప్పు;
నది వ్రాలిన ప్రదేశమందుఁ బెద్ద
యరుగను నద్దాని యంచునఁ గూప స
త్రములు ప్రతిష్ఠించి దానిపేరు

తే॥ నిలుప సెలవీయఁదగు"నన్న నృపతి "యకటఁ
దాని ఋణమునుదీర్ప నాతరమె మీరు
కోరినటులు చేయింపుఁడు కొఱఁత వలవ
దని పలికి యందఱను గలయంగఁ జూచి. 27

ఉ॥ "పట్టినపట్టు పట్టినదె; ప్రాణము దేహమునందునుండ, నే
పట్టున మానఁగాదు; మన పైకరుదెంచు తురుష్కసేన లి
గుట్టలు చొచ్చుజెల్ల యముకోఱలు చొచ్చుటెయంచు గుండియల్
కొట్టుకొనఁగా మెలంగవలె లోకులు కన్నులువిచ్చి చూడఁగన్. 28

సీ॥ యవన సంగ్రామ మహానాటక ప్రద
ర్శనమున నిన్నటి దినమునందు
జరిగు హాల్దీఘాటు సమరోత్సవంబు ప్ర
స్తావంబు చందమైసాఁగి యుండెఁ;
బ్రథమాంక మింకఁ బ్రారంభంబుగానుండు
నడుమ వ్యవధిలద్ద యదరఁబోవ;
దెన్ని యంకంబు లెన్నేండ్లాడ వలయునో
యెట్టులు ముగియునో యెఱుఁగరాదు

తే॥ మంగళా చరణము మొదల్ మంగళంబు
వఱకు నుత్తరోత్తర రసప్రౌఢి వెలయఁ

దేఁకువ వహించి వర్తించి తృప్తి పఱుప
వలయు నీ విశ్వ సభ్య ప్రపంచకమును. 29

తే॥ చెలఁగె నొకభంగి మన పరిస్థితులు నేఁటి
వఱకు; "ముందున్నది ముసళ్లపండు" వనెడు
కరణి వచ్చుకాలము కష్టగర్భితమగు;
నేకలింగేశ్వరుండె తోడింక మనకు.'' 30

సీ॥ అనినఁ "గొండలు పిండియైపడ వర్తింతు
మింక సందేహింపనేల దురము
నిలుపక సాఁగింప వలె"నంచుఁ బలికి రం
దఱు; "మంచి"దనుచుఁ బ్రతాపవిభుఁడు
హర్షాశ్రు కలిత నేత్రాంచలుఁ డయ్యెఁ; వా
రరిగిరి భూధర ప్రాంతములకు;
వానకా రరుదెంచి భయద నీలాంభోధ
రము లాకసమ్మునఁ గ్రమ్మసాఁగె;

తే॥ వాన జడిపట్టి కురిసె; యావనబలములు
గిరులఁ దిరుగఁజాలక వెన్క కరిగె;నంత
క్ష్మబిడౌజునకబ్బె విశ్రాంతి కొంత;
పెరిమ హేమంతమున బ్రసవించెఁ బ్రకృతి. 31

గీ॥ కాఱు మొగిళులతో వాన కారుదాటెఁ;
గెఱలిచలి ప్రకృతికి గిలి గింతలిడియె;
గానఁగోనల షహాబాజుఖాను గడచి
పౌజు హారావళీసీమ పట్టుఁజేర్చె. 32

సీ॥ అల సలుంబ్రాసీమ యందుండి పిడుగుల
గేరు వీడులఁదెచ్చెఁ గృష్ణసింగు;
ఝాలూరి సేనలతో లేచివచ్చె దు
ర్వార విక్రముఁడైన భానుసింగు;
సాద్రియందుండి ఝాలాన్వవాయుల సేన
లన్ని దోడ్కొనివచ్చె శ్యామసింహుఁ;

జాబు సేరాషా పురాధీశులు శిశోదీ
యా వీరభటులతో నరుగుదెంచి;

తే॥ రింక బెండ్లా-కొాకేరియా నృపులువచ్చి;
రవల సూర్యమహలునుండి యచటఁజేరె
దుర్జయుఁడు; దుర్నివార బంధుర బలుండు
భిల్లసేనలతో డాసె భీమచాంద. 33

—• రెండవ సంవత్సరము యుద్ధము. •—

చ॥ తమపయివచ్చు వైరులఁ బ్రతాప మహీంద్రుఁడు మాఖ శుద్ధ పం
చమి నెదిరించె శైలముల దండ, విశాలసమున్నత ప్రదే
శముల; దురంబు ఘోరముగసాఁగె; దురుష్కులు రాజపుత్రులుఞ్
సమసిరి వేనవేలుగను నాఁటి మహా సమరాంగణంబునఞ్. 34

చ॥ యవనులసేన సంఖ్యలప నగ్గలమై జలరాశి వీచి పం
క్తివలెను బొంగి పైఁబడ నుదీర్ణపరాక్రమ లయ్యు నాప్రతా
పవిభుని రాజపుత్ర భట వర్యులు తజ్జ్వలనాస్త్ర ధాటి కో
ర్వవలను లేక డీల్పడి పరాజయ మొందఁగ సాఁగి రయ్యెడఞ్. 35

క॥ మఱుసటి సంవత్సర మ
క్బరు మేవాడ్సీమఁ జొచ్చి స్వయముగ వసుధా
పరిపాలనాదీ కమ్మలు
స్థిరముగ నేర్పాటుచేసి చేరెఞ్ బురికిఞ్. 36

క॥ అల బహిరంగ సమీకం
బుల వనులనోర్వఁ గష్టముగఁ జోఁపగఁ నే
నలఁగొని ప్రతాపవిభుఁ డి
మ్మలఁ గుంభల్మియరు దుర్గమును జొరఁదల్చెఞ్. 37

సీ॥ క్రమముగాఁ గైల వారాసీమ దాటుఁచు,
నెత్తైన కొండల నెక్కిపోయి,
దట్టంబుగా సాగదాళి మొల్చుటఁ గ్లిష్ట
మగు శైల మార్గంబులందు నడచి,

తొలుత బహిర్ద్వారములు రెండు గడచిపోఁ
జని హనుమ ద్ద్వారమునఁ గమించు
చును విజయద్వారమునను శోణద్వార
మునను రామద్వారమునను జొచ్చి

తే॥ సేన లన్నియుఁ గోటలోఁ జేరకొనియె;
నా ప్రతాప ప్రభూత్తంసుఁ డంబుదముల
నొరయుచు మహోన్నతమయి సుందరము నైన
మేఘభవనంబులో విశ్రమించె నపుడు. 38

—• కుంభల్మియరు యుద్ధము. •—

ఉ॥ పుట్టలు వ్రీలి చీమల గుముల్ వెలికిన్ బరతెంచు కైవడిన్
దట్టములై వడిన్ మిడుతదండు గుముల్గొని దూఁకునట్లు పెం
గుట్టలలోఁ దురుష్కభటకోటి చొరంబడి నాల్గుదిక్కులన్
ముట్టడి వేసి దుర్గమును ముంచెను పెద్ద పిరంగి వ్రేటులన్. 39

సీ॥ విక్రమంబున కాది పీఠమైన ప్రతాపుఁ
డదరి నాల్కలు సాఁచు నగ్నిశిఖల
వంటి రాజస్థాన భటులఁ బ్రేరేప, నా
మడమ ద్రిప్పని మేటి కడిమి కాండ్రు
గోడలు దిబ్బలు గోపురంబుల నెక్కి
వీఁక కొక్కఁట శిలావృష్టి గురియ,
భిల్లవీరులు లోకభీకరంబుగ ధను
ష్టంకార మొనరించి శాత శర ప

తే॥ రంపరలఁ జిత్త జల్లుగానింపు చండ
యముఁడు నాల్క సాఁచిన యట్లు యవనసేన
దిన దినము గంట గంటకుఁ దేకువ చెడి
బలము తఱిఁగి యంతంతకుఁ బలుచ నయ్యె. 40

తే॥ ప్రళయమార్తాండువలెఁ బ్రతాప ప్రభుండు
వహ్నిఁగురియింప మొగలాయి భటులు కోట

వైపు చూడతే వైరి, షాహాజిఖాను
రాతి గుండియకోఁ బెద్దబీతు దవిలె. 41

సీ॥ గుదులు గుదుల్ బాణ కోటు లాయుధములు
కుంభవృష్టిగఁ బెల్లుకురియు కతన
యవనవీరులు తలలవిసి సంధులు ప్రీలి
గాత్రముల్ రక్త సిక్తంబు గాఁగ
రణరంగ లక్ష్మియు రక్తాభిషేకంబు
చేసిన చంద్రమై చెదరె సేన;
క్షణములు బలిసి యుగంబులై నిలిచె; షా
హాజిఖా నేమొనర్పంగఁ జోప

తే॥ కడలు నొంది యాబూ పర్వతాధికారి
నాప్తుని బ్రతాపఘరు దేవరాధిపతిని
ధన కనక వస్తువాహన తతుల తోడ
నరిగి తన్నుద్ధరింపు మంచాశ్రయించె. 42

ఉ॥ క్రచ్చఱఁ గోటఁ జొచ్చినదురాతిరి యన్నరరూపదానవుం
డచ్చఁపుఁ జీఁకటిన్ "నవగు" ణాఖ్య రహించెడు కూపమందునన్
బెచ్చు విసంబు పోసి కలిపెన్ నెనరించుక యైన లేక; హా
పచ్చని యింటఁ జిచ్చు నిడుపాపుల కేపని చేయఁ రానిదా. 43

తే॥ కోటలో నది యొక్కఁడే కూప మగుట
నందఱా నీరమును గ్రోలి; రం దనేకు
లసువులను పీడి; రిది చూచి యాప్రతాప
నరపతిని ఖానుసింహుండు దరియ నేగి. 44

సీ॥ "జలముల విసమును గలిపి దేవరపతి
తడిగుడ్డ గొంతుకల్ తఱిగినాఁడు;
నెలలుగా మొగలు సేనలు పోరినను నేఁడు
గలిగిన నష్టంబు గలుగలేదు;
నిటఁ దడవున్న నిర్హేతుకంబుగ సంఘ
మృతి గల్గుటయు ధ్రువంబిపు కృష్ణ

సింహాదులను గూడి శీఘ్రంబె దుర్గంబు
దాఁటిపోవుటమేలు; తనువులందుఁ
తే॥ ప్రాణములు గల్గుదాఁక మద్భటులు నేను
కోట మొగలాయి బలము చేకొనకయుండ
నని యొనర్తుము; మాఱు మాటాడకేగు;
మద్దుకొనువాఁడఁ గనుల నీయుటుగుదోయి" 45

క॥ అని వినయంబునఁ బ్రార్థిం
చిన నందఱు నల్లైయెత్తి చెప్పుకొనఁ బ్రతా
ప నృపతి సమయ మెఱుంగుచు
మనమును నొడఁబఱచె నొక్క మాదిరిగాఁగన్. 46

—: ప్రతాపసింహుఁడు 'చేవందా' దుర్గమునఁ జేరుకొనుట. :—

క॥ క్రందుగ మేవాణ్ణిర్వృతి ది
శందగు చప్పన్నసీమ శబరుల దేశం
బందరిగి ప్రతాపుఁడు "చే
వందా" దుర్గంబుఁజేరె బలములతోడన్. 47

సీ॥ "మునుపటిదగు దుర్గమునను౦డి పోరాడఁ
బూనిన విషజలంబులను ద్రావి
పూటకేనును సైన్యములును ద్రగ్గుట ధ్రువం;
యిహపరంబులు రెంటికిదియు దూర;
మెటులైనఁ దప్పదుమృతి; యట్లుగాన దు
ర్గ బహిర్గతుఁడనై యరాతిసేనఁ
జిచ్చఱ పిడుగట్లు చీలిచి చెండాడి
చిందర వందర చేయనె తగు"
తే॥ ననుచుఁ దలపోసి తనదు సైన్యమ్ముఁగొనుచు
ముందుఁగల హనుమద్ద్వారమును దెఱచుచు
హరుని ఫాలనేత్రజ్వాల ననుకరించి
భానుసింహుండు వైరులపైన వ్రాలె. 48

—• చంద్రభట్టారకుఁడు భానుసింహునకుఁ దోడుపడుట. •—

తే॥ అనిలుఁ డనలంబునకును దోడైనయట్లు
సిద్ధహస్తులు విక్రమ శుద్ధులైన
సద్భటులఁ గొంచుఁ గవిరాజు చంద్రభట్టు
భానుసింహునకును సాయపడియె నపుడు. 49

ఉ॥ మండెడు వహ్నికుండముల మాడ్కి విలోకన విస్ఫులింగముల్
నిండ, హయవ్రజంబుఁ గదలించుచు భూరిఖురాగ్ర ఘట్టనా
ఖండ ధరాపరాగముల క్రందున గాఢతమంబుఁగూర్చి యు
ద్దండత రాజపుత్రభట తండముదాఁకె నరాతి కాండమున్. 50

తే॥ వీరకేసరులను బోలు భిల్లభటుల
కర కలిత కార్ముక కదంబకములనుండి
పక్షితతి మాడ్కి శితబాణ పటలిరేచి
తురక మూఁకల శిరముల నఱికివైచె. 51

ఉ॥ అంతఁ దురుష్కసేనల మహాహవ శౌర్య విలాసరేఖ సా
యంతన మొందుచుండ, నలినాప్తుఁడు పశ్చిమవార్ధి డాసి సా
యంతనమున్ బొనర్చెను రయమ్మున నాసపుఖాను సేనతోఁ
జెంతఁ గనంబడన్ యవనసేనలు పొంగె సముద్రమున్ బలెన్. 52

చ॥ యముని కరాళ జిహ్విక క్రియన్ జెలరేఁగుచు భానుసింహుఁడున్
సమర మొనర్చుచున్ మొగలు సైన్యముఖంబును వ్రచ్చి చొచ్చి గ
ర్భమునను దూఱి వైరుల శిరంబులు రాసులు పోసిపోసి ప్రా
ణమును త్యజించె నబ్బురమునన్ రిపులున్ దనుమెచ్చి యార్వఁగన్.

మ॥ కవి రాజాదినరాజు వోలెఁ గర ముగ్రస్ఫార తేజంబుతో
నివమున్ మాపెడునట్లు వైరిగణమున్ హింసించి మందేహ దై
త్య వితానంబులలోనఁబోలె రిపు సంతానమ్మునన్ జిక్కి, గా
యవడెన్; నిర్గత రక్తధారలు తిరంబై పాఱెఁ బెన్కాల్వలై. 54

సీ॥ బ్రహ్మ వంశంబు పావనమై పొదల బృహ
స్పత్యంశమునఁ బుట్టు బ్రహ్మవేత్త

పికరాజువోలె గొంతుకయెత్తి మధుర గీ
తికలు పాడిన మేటి సుకవిరాజు,
క్రమత హాల్దిమాటు రణమునం దరికోటి
వోమ లట్టులు దోలు భీమసేనుఁ,
దజరామరఖ్యాతి నవనిపై నిలుపంగఁ
గలుగు శతాధిక గ్రంధకర్త.

ఆ॥ వీరరసముపెల్లి విరియఁ గుంభల్ మియర్
రణమునడపు విలయ రౌద్రమూర్తి;
చంద్రభట్టువొచ్చె సవిత్రుమండలి, నమా
వాస్యగాఁగ నాత్మ పక్షమునకు 55

మ॥ వనధిన్ జేరు మహా నదీజలము సర్వంబందునన్ లీనమై
చను చందంబున రాజపుత్రులు తురుష్కశ్రేణులన్ జీల్చుచున్
జని నిశ్శేషముగాఁగఁ గూలి; రటుపై షాబాజుఖాన్ సేనలన్
గొని మోగల్ధ్వజమెత్తి చేరికొనియెన్ గుంభల్ మియర్ దుర్గమున్.

—• మానసింహుఁడు ధర్మేతి-గోకుండా దుర్గములఁ జేకొనుట. •—

శా॥ నిండెన్ గొండలలోన మోగలు భటానీకంబు లందంద; ను
ద్దండప్రాభవ శౌర్య ధైర్యరతుఁడా "ధర్మేతి" దుర్గంబు "గో
కుండా" దుర్గము మానసింహుఁడును జేకొంచున్ మొగల్ సేన లం
దుండన్ జేయుచు ఢిల్లికిన్ జనియె నత్యుత్సాహమే పారఁగన్. 57

తే॥ ప్రళయకాలాగ్ని శిఖిమాడ్కిఁ బ్రజ్వరిల్లి
శత్రు సైన్యాటవులఁ గాల్పఁజాలు యోధ
శేఖరుఁడు మహబత్ఖాను సేనతోడ
నుదయపుర మాక్రమించి యందుండసాఁగె 58

ఉ॥ "స్థాణుఁడో విష్ణుఁడో మఱి ప్రతాపుని మానవమాత్రు సంగర
క్షోణినిగెల్చి నిట్లు కౌతుకం బడనేటికి నేఁడు నాదు న
క్షీణబలంబు లోకములు కీర్తనసేయఁగ వానిఁదాఁకి స
ప్రాణునిగాఁగఁ బట్టుకొని వచ్చెద"నంచుఁ బ్రతిజ్ఞ చేయుచున్. 59

—• ఫరీదుఖాను ప్రతాపసింహునితోఁ జేయు యుద్ధము. •—

సీ॥ అఫరీద్ఖాను సైన్యముల నద్రులనిండ
నెక్కించి; నందుపై నొక్కవాఁడు
రాణాయువేడలి దుర్గబహిః ప్రదేశంబు
లను జరించుచునుండె ననుచుఁ దెలిసి
చముపుల నాల్గుభాగములుగా విడఁదీసి
యనుమాన మున్నచో ట్లాక్రమించి
వేఁగు జామైన రాణాగారు చిక్కుదు
రిది తప్పదనినమ్మి నిదురవోయె;
తే॥ నర్ధరాత్రమ్మున మహాగ్ని యద్రిఁదోఁచె;
నది ఫరీదు దవానలంబని తలంచె;
రాజపుత్ర సేనలుగొల్వ రాజగురుఁడు
ముందువైపునఁ దాఁకె నమ్మొగలుసేన. 60

ఆ॥ అంతరాని మంట యాసలుంబ్రాస్వామి
యుక్కుతునియలట్టి యోధులఁగొని
యవను లున్నలోయ యవ్వలి దెసనెల్ల
ముట్టడించి త్రోవ మూసివైచె.

ఉ॥ కాకులవోలె వైరులు వికావికలై యఱవంగఁజుట్టిద
ర్వీకర భీకరంబులగు పెద్ద కటారులనెత్తి స్వాంతమం
దేకడ జంకులేక వధియించి ప్రతాపుఁడు కృష్ణసింహుఁ డు
గ్రాకృతిఁ దోఁపఁజేసిరి రణావని మోదుగు పూచినట్లుగన్. 62

తే॥ పదియు నైదువేల్ భటులు వెంబడిని గొలువ
రాయసిం గుదయపురిఁ జేరంగనెంచి
బొబ్బలార్పులు గర్జనంబులు దనర్ప
వ్యాఘ్రశైలంబు డాయంగ వచ్చెనపుడు. 65

ఉ॥ వచ్చుట తానెఱింగి శరవర్షము గుప్పుచు భిల్లసేన కా
ర్చిచ్చును బోలిగుట్టలను జెట్టుల పుట్టలనుండి గుంపులై

వచ్చి హరాత్తుగాఁ బోదివిపాయలు పాయలుగాఁగఁ గ్రొవ్వుఁగా
విచ్చి వితాకుఁ గాకు వడి బెగ్గిలి పాఱెఁ దురుష్క సైన్యముల్. 64

ఆ॥ బ్రహ్మపుత్రనుండి పంజాబుదాఁకఁ గ
న్యాకుమారియును హిమాద్రి నడుమ
మెఱసెఁ బరమశాంతి; మేవాడ యొక్కండె
కదనలక్ష్మి కయ్యెఁ గాఁపురమ్మ! 65

క॥ మెల్లగ 'మండలగృహ' ము
బ్దుల్లాఖాఁ మాత్స్యదుర్గమును నా“షేరో
నెల్లా”ధరఁ గలదానిని
బల్లిదుఁడగు మానసింగు పట్టెరి వరుసన్ 66

తే॥ శ్రావణమురాకఁ గొంత విశ్రాంతిఁగొనుచు
మార్గశీర్షమ్ముతోడఁ గ్రమ్మఱఁ దురుష్క
విసరములు రేఁగ నిసుమంత విసుగు పడక
రణము సాగించుచుండె నారాజ గురుఁడు. 67

సీ॥ ఏఁటేఁట నెలనెలఁ గృశియించె దేహంబు;
నవసిపోసాఁగె సేనా బలంబు
దుర్గంబులెల్ల శత్రుగతంబు గాఁజొచ్చె;
ద్రవ్య సంపత్తి తద్దయును దఱిఁగె
ఘోరమ్ముగాఁ గుటుంబము వృద్ధి యగుచుండె
ననుదినం బాపద లతిశయిల్లె
నానాఁట నెదిరి సేనల పెంపు లావయ్యెఁ
దలఁదాఁచుకొను చోటు తక్కువయ్యెఁ

తే॥ జెట్టులను బుట్టలను బ్రాపుజేసికొనుచుఁ
గడుపు నించుచుఁ బూటలు గడుపవలసె
గడియ గడియ కరుల్ వచ్చు కతన నిజ ని
వాసముల బెక్కుమార్లు మార్పంగ వలసె. 68

—•( అక్బరు సైన్యము నంపి కైలవారాసీమలోని ఫలవృక్షములఁ గొట్టించుట. )•—

సీ॥ "పురములు మార్చి కాపురముల నెత్తించి
పదివేల పల్లెలు పాడువెట్టె
యవరేఖ యంతైన నవని దున్నుటయులే
కొకగింజయును ధాన్య మొదగఁబోదు
కైలవారా మహాగహానంబు ఫలముల
దినమున కొకఁడుగాఁ దినుచుఁ బ్రదుకు
నెన్నియత్నంబుల నేనొనర్చినను లోఁ
బడఁ దంతకంతకుఁ బటిమఁబెంచుఁ

గీ॥ గావునను మీరు కైలవారా విపినము
చేరి ఫలవృక్షములనెల్లఁ జెండివైచి
యాప్రతాపేంద్రు వెదకి వెన్నంటి వేఁట
లాడుఁ"డని పాదుశాహి సైన్యముల నంపె. 69

క॥ పొడవును వెడలుపు పెక్కా
మడలగు నాకైలవార మహియందుఁ జొరం
బడి యవనులు ఫలతరువులు
పుడమిన్ బడఁగొట్టిరన్ని పొలివోవుసటుల్. 70

క॥ కొందఱు భటులను వృషభము
లంచన వెంబడినిగొని ఫలంబులకై తో
పుందరిసి శ్యామసింహుం
డందుఁబడిన చెట్లుచూచి యాప్తుల గనుచున్. 71

క॥ "మనతిండి చెఱచి యవనులు
చనుచుండిరి; వారిఁగదిసి సమయింతము రం"
డని రేఁగి యహిత సైన్యం
బును దెంపరియగుచు వెన్ను ముట్టఁగఁ దాఁకెన్. 72

క॥ అనుచరులఁ బద పదండని
తనముంగలఁ దఱిమి తురక దళవాయివడిన్
దన పిక్కబలముఁ జూపఁగ
వెనుదిరుగుచు శ్యామసింహవిభుఁ డరుదెంచెన్. 73

క॥ స్థితి గతువెల్ల సలుంబ్రా
పతి కెఱిఁగింపఁగ నతండు స్వామినిగని "దే
వ॰ తుపుష్కలు ఫలవిటపి
ప్రతతి నఱికిరనుచు నేఁడు వార్తలువచ్చెన్. 74

చ॥ దినమున కొక్కపండు మఱి తీయనితీర్థము నొక్కచేరెఁడుం
గొని మునిరాజవృత్తి మెయి గొబ్బునఁ గాలము పుచ్చుచున్న నీ
కును రమఁబోలు నీలలనకున్ మదనోపమ మంజులాంగులౌ
తనయుల కక్కటా! చెనఁటి దైవము తండ్రికిఁ గర్వుచేసెనే. 75

గీ॥ పౌరుషంబున్న సంగ్రామ వీరరంగ
ముల మనలఁదాఁకి దర్పించి గెలువవచ్చుఁ
గట్టపూచి కాచినచెట్టు గొట్టుటయును
గౌరవమె వట్టి కటిక మొక్కలముగాక.

సీ॥ అడుగులకును మ్రొక్కి యర్థించి కొనివచ్చి,
యమృతాభిషేచనం బాచరించి,
బంగారు జిలుఁగు దువ్వలువలు గట్టించి,
నవరత్నమయ భూషణములు దొడిగి,
కర్పూరమిళిత సుగంధచర్చ లలంది,
పరిమళపత్ర పుష్పము లొసంగి,
నవపాయసాహార నైవేద్యమిచ్చి, భ
క్తిమెయి నాత్మ ప్రదక్షిణముచేసి,

గీ॥ కొలువఁదగు దేవుఁడవు నాకుఁ; గొంతకాల
మారఁబండిన పండు లాహారమిడుట
కైవగలఁ బొక్కుచుంటి; నేఁడవియులేని
యధిక దుర్దశవచ్చె; నేమని తపింతు." 77

క॥ అని కడుజాలిమెయి వచిం
చిన సచివప్రవరుఁజూచి చిఱునగవు ముఖం
బున మొనయఁగ "దండ్రీ యెం
తని నీప్రేమంబు మహిమ నగ్గింపఁగనౌ. 78

గీ॥ కంచె చుట్టును నెలకొల్పి కాపు పెట్టి
జలము పాఱించి పండించి ఫలము లెల్ల
బండ్లపైఁదోలి మన కిచ్చుభంగి యైన
శుభమెకదః యేది పగ తురుష్కులకు మనకు. 79

క॥ తలయెత్తుటాది విమతుల
సిలుఁగుల నిఁక మీకు వగవఁ జెల్లునెః మనముగా
వలగొని రాల్ఱువ్విన వా
రలు పువ్వులు రువ్వఁదోదురాః యెందైనన్. 80

సీ॥ శైలవారా మహాగహనంబు సువిశాల
మ ద్దాకింతయు లేని యార బయలు
ప్రకృతి యచ్చటఁ బెద్దపండ్లతోపును బెంచె
రాక పోకలకు మార్గములు గలవు
చనుదెంచి మెవమ గోసిన వద్దనవు చెట్టు
లఖిల జనాకర్ష మపటి ఫలము
లందఱు కందెడు నా తోఁటపై జీవి
తమ్ములు మోపి యాధారపడుట

గీ॥ మనది తప్పగుః రిపుల నేమనుట కుండుఁ
బగను సాధించి మనలఁ లోఁబఱచు కొనఁగ
నింత కన్న పిలగు మార్గమేది గలదు
మనమ్మె యాహారమును మార్చుకొనుట యొప్పు. 81

సీ॥ ఇందు నం దనకుండ నెందైనఁ గలదిగఁ
జి క్కింతలేక చేఁ జిక్కు నదిగ
నెండకు వానకు నింత వాడనిదిగ
గాల భేదము లేక క్రాలు నదిగఁ
బాదుషాగాదు దేవతలెల్ల వచ్చి వా
సరవార మాస వత్సరము లేల
క్రాంతి నొందక పెక్కుబ్రహ్మ కల్పములు క
ష్టించిన నిసుమంత చెడని యదిగఁ

గీ॥ బారలును గుద్దలులు పట్టిపని నడిపిన
మూఁడు జాముల లోపల మొదటికన్నఁ
దటిమి విమతుల వీఁపులఁ బెరుగునదిగ
వెలయు నాహారమును గసు పెట్టువాఁడ. 82

సీ॥ పెక్కుమడలదాఁక వెడలుపు పొడవునై
హారావళీశైల మలరుచుండు
సూదిమోపఁగ సందు సుంతలే కిచ్చోటఁ
బెరుగు "మో" లనియెడి బీడుగడ్డి
దీనిరుచి యొకింత తీయనై యుండుఁ బ్రొ
ద్దుటవెళ్లి మనభటుల్ దోకితెత్తు
రవిరుబ్బి రొట్టెల ననుపమైఁ జేయించి
యిందుకాలము పొట్టపోసి కొందు

గీ॥ మకట! యిది కష్టమని మది నడలరాదు
కొంచె మలవాటుపడిన రుచించితీఱు
నాఁకలి నడంప నేతిండి యైనఁ జాలు
గార్య గౌరవమున రుచిఁ గననిదేది. 83

మ॥ తినఁగాఁదండి యొకండె యేటికిఁక నాదేహంబునున్ జీవమున్
జనెడున్ గాక మనుష్యమాత్రునకు శీర్షం బెప్పుడున్ వంచఁ డో
వను; జేసెండగు పొట్టకూటికయి దైవప్రాయమై కీర్తి మో
సిన స్వాతంత్ర్యము నమ్మివేయఁగల దుశ్శీలుండు క్షంతవ్యుఁడే. 84

క॥ ఈగడ్డిరొట్టె తిండికిఁ
ద్యాగము స్వాతంత్ర్యయోగ ధర్మంబును దో
డై గెలుతు మరులు కను మే
లాగున విరిగెదరొ మన బలమ్ముల ప్రోలన్. 85

క॥ ఇది సంతసింప నదనగు
నెద వగవకు" మనుచు నినకులేశ్వరుఁడన "మే
లిది యాచరణీయము సౌ
ఖ్యదమని యాకృష్ణసింగు హర్షము పొంగన్. 86

మ॥ "ఫలవృక్షంబులఁ గూల్చి నంతటనె యత్రఁ బంతయుఙ్ బ్రీలుచుఙ్
దలపైత్రాలు నటించుఁ గుంది తమ చెంతఙ్‌జేరి దాసోహ మఙ్
పలుకుల్ పల్కెదమంచు నెంచి రహితుల్ పంచాంగముల్‌చించి చు
క్కలు లేవంచు వచింప వీఱడుల జోకల్‌గావె యాకార్యముల్.

క॥ కానిం డియ్యది యొకగతి
గా నున్నది భటుల బీడుగడ్డిని పెండం
చానతి యిచ్చెద నేఁ" డని
యా నూత్నాహార నియతి నారంభించెఙ్. 88

గీ॥ అంతనుండియు నాప్రతాపాధినాయ
నకుఁ గుటుంబమునకు భటులకును "మోలు"
గడ్డిరొట్టెలె గతియయ్యెఁ; గాలుచున్న
కడుపునకు మందు గంజియఙ్ వడువుగాఁగ. 89

మ॥ ఒకనాఁ డాసవుఖాను సైన్యములతో నుగ్రాటవిఙ్‌జొచ్చి మం
దుకు నేతేరఁ బ్రతాపుఁ డాత్మబలముఙ్ దోడ్కొంచు నావిద్విష
త్ప్రకరంబుఙ్ నలుమూలలఙ్ బెదరి పాఱఙ్‌బోర మర్దించి వె
న్కడు నేతెంచి నివాసభూమి దరియంగానేగె మధ్యాహ్నముఙ్. 90

ప్రతాపసింహుఁ డనుచరులకు "దోవా" పంచిపెట్టుట.

మ॥ ఒక దర్భాసనమందు రాజమణి కూర్చుండంగ సామంతు లిం
చుక దూరమ్మున నోసరిల్లి కరముల్ జోడించుచుఙ్‌నిల్చి; రా
నికటాద్రీంద్ర బిలంబు నుండియును రాజ్ఞీరత్న మవ్వేళ నే
వకుతో నంపెను బండ్లురొట్టెలు ప్రతాపస్వామి కర్పింపఁగఙ్ 91

మ॥ ఫల మొక్కించుక త్రుంచి చేకొనుచు, నాపై రొట్టెనొక్కండు ము
క్కలుగాఁజేసి యొకింత నోరనిడుచుఙ్ గన్నన్న నందున్న వా
రల సామంతులఁబిల్చె; దగ్గఱి నలుంబ్రాభర్తృ కేల్మోడ్చినఙ్
ఫలముఙ్ రొట్టియముక్కఁ జేనిడెఁ బ్రతాపస్వామి దీవించుచుఙ్. 92

సీ॥ సాష్టాంగ మెఱఁగి మహా ప్రసాదంబని
చేవోయి యొగ్గి దోసిఁట గ్రహించి

తులకించు భక్తిఁ గన్నుల నద్దుకొని వెన్కఁ
జనుచు యథాస్థానమున వసించె;
నటుపైన సూక్తసింగంత ఫేల్వాపతి,
బేడ్లా-కొశేరియా విభులు, పిదప
నా షాపురా—బుసే రాణీశు, లవల చు
ణ్డయసింహుఁడును నట్లె సంగ్రహించి
తే॥ పరమ భగవత్ప్రసాదంబు భంగిఁ జూచి
యా జగద్గురు చంద్రముం డారగించు
పిదపఁ దామెల్ల భుజియింప వేఁచియుండి
రధికభక్తి నర్ధనిమీలి తాక్షులగుచు. 93

సీ॥ కడుపునింపుగఁ గూడు కట్టజేసెఁడు గుడ్డ,
తలదాఁచుకొన నింత నెలవులేక
పరమ దారిద్ర్యదేవత లట్టులుండు నా
పటు వీర లోకైక పట్ట భద్రు
లాదికాలమున మహైశ్వర్య భోగ భా
గ్యములతో స్వర్ణ సౌధములలోన
నెంతటిమర్యాద, యెంతటివిశ్వాస,
మెంత మనశ్శుద్ధి యెంతభక్తి,
తే॥ యెంత యుత్తమక్రమమహో! యంతకన్న
శతగుణము లెక్కుడుగఁ చంద్రి సరణిఁ జూచి
యాప్రతాపునిఁ గొలుచు దృశ్యంబుఁ గనఁగ
గనులు వేయైనఁ దక్కువే యనుచుఁ దోఁచు. 94

—• యవనసైన్యములు మేవాడపై నెత్తివచ్చుట. •—

ఉ॥ వైభవ సాంద్రుఁడై యవనవాహిని చుట్టును గొల్వ నొక్క భ
ద్రేభమునెక్కి యామడ లొకేగతిఁ దీవ్రత వచ్చుకాల రు
ద్రాభుని మానసింహుఁగని యచ్చటనుండిన వారలున్న య
ట్లే భుజియింప మాని వడినేగిరి మొగలునేన మీఁదికిన్. 95

ఉ॥ సేనలు రెండుసున్ దగిలెఁ జేతికటారులు పూలమాలలై
మేనుల వ్రాలుచుండె బలిమిన్ వలచుట్టిన వేటకాండ్ర ర
మ్యానన రేఖ యాయవను లందును, క్రుద్ధమృగేంద్రరేఖ రా
సైనికు లందుఁదోఁచె; రవి జారఁగ నిల్పిరి పోరు మోగలుల్, 96

—: యవనులు రాజపుత్రుల దుర్గములను గొనుట. :—

సీ॥ అవ్వల యవన సేనాధీశ్వరులు మూఁగి
ముట్టడించిరి దుర్గములను గొన్ని:
నజమీరు దుర్గంబునందె ఖాసింఖాన్, ప
రీదుఖానుఁ దపల గ్రహాముఁ గొనియెఁ;
దోడరమల్లు తోడ్తోఁ బట్టెఁ "జేవంద"
నింతలోపల "సమాయిత" గిరీంద్ర
దుర్గంబుఁ దవిలె నబ్దుల్లా; శిశోదియా
వీరులు మార్కొని పోరిరిట్లు
తే॥ నెలజరిగె పోరు; కోట మొగలులకయ్యెఁ;
నా "మడేరియా" ప్రాంతమ్మునందు "రాతి
కోట"యను దుర్గమును బట్టుకొని ఫరీదు
యవనసేనా సమూహంబు నచటనిలిపె. 97

క॥ అంతట వాసింఖాను "వ
సంతా" దుర్గంబుబట్టి సైన్యమునిడి యా
చెంతఁగల "ఛత్రకోట" స
నంత సమూహితుల గొలువ నరికట్టుకొనెన్ 98

మ॥ యవనుల్ నాలుగువైపులన్ గదిసి దావాగ్నిక్రియన్ గాల్పఁగా
భువనాతీత పరాక్రమాంకుఁడు ప్రతాపుండట్లు నాయంత నం
బపు దాఁకన్ రిపు కంఠరక్తపుఁ బ్రవాహంబూడ్చి చల్లార్చి యా
రవి క్రుంకంగఁ గుటుంబముం దు గుహఁజేరన్ బోయె విశ్రాంతికై.

—: దేవేరీ యుద్ధము. :—

సీ॥ వలుపాతరేచి సైవ ప్రార్థనముచేసి,
వినతిమై నుదిత ఖానునకు మ్రొక్కి

కలయఁ గప్పొనిన మొగలుదండు గుంపులై
యెల్ల దిక్కులఁ గొండ వీనినట్లు
పరిసర గహన గర్తము లాక్రమించి ని
ద్రింపఁగాంచి ప్రతాపదేవుఁ డంత
నా బసేరా-షాపు రాధీశ్వరుల, సలుం
బ్రాధర్త్మి శైల్వాన్నృపాలు సూక్తి
తే॥ దుర్జయునిగొంచు వైరులఁ బొదరసరిగె;
శ్యామసింహుఁ గుటుంబ రక్షణకు నిలిపి,
యుభయ సైన్యంబులకునయ్యె యుద్ధమమిత
తీవ్రభంగి "దేవేరీ" ప్రదేశమందు. 100

సీ॥ శైల నిర్ఝరమట్లు సరభసమ్ముగ సలుం
బ్రా మహీపతి దాఁకె రాయసింగు
ప్రజ్వలజ్జ్వాలవరె బునేరా-షాపు
రాధీశ్వరులుమట్టె రసపుఖానుఁ;
ప్రబల దంభోళి సంరంభంబు వెలయ షే
ల్వాపతి తగిరె షాబాజుఖానుఁ;
ప్రకట ప్రభంజన ప్రతిమానుఁడై యెది
రించె దుర్జయుఁడు ఫరీదుఖాను;
తే॥ దండధరుఁ డట్లుదాఁకెఁ బ్రతాప విభుఁడు
ముందుఁగలుగు నబ్దుల్లా చమూ చయమునుఁ
భిల్లగణమెల్లఁ గొలువ నాభీమచాందు
కడు విజృంభించి ఖాసిముఖానుఁ దాఁకె. 101

క॥ పుడమి యద్రువ యమరాజుల
వపువునఁ జెలరేఁగు నాత్మ భటులందఱు వెం
బడి రాఁగ మృత్యువటు సూ
క్షుఁడు మహాబత్ఖానుఁ దగులుకొనె ఘోరముగన్. 102

ఉ॥ ఆఁకలిగొన్న సింహ నిచయంబు విధాన మహాశిశోదియా
నీకిని బిట్టురేఁగి రణ నిష్ఠుర వీరతురుష్క కోటులన్

దాఁకి ప్రతాపసింహుని మనంబల రారఁగ సుంత సందు వో
సీక శిరంబులన్ నఱకి యేఱులు పార్చిరి వేడిరక్తమున్. 103

ఉ॥ అంతటిలోఁ దురుష్కభటు లాసపుఖానునిగూడి లోక దు
ర్దాంత పరాక్రమంబున నరాతులఁ దాఁకుచు షాపురావనీ
కాంతునిసేన వెన్క కరుగన్ విదళించి యజాండ కర్పరం
బంతయు ముక్కలై పడఁగ నార్చిరి వీర రణోత్సవంబునన్. 104

ఉ॥ ఆధ్వని నాలకించి సుభటాళులఁ గొంచు బ్రతాపసింగు సూ
ర్యధ్వజమెత్తి ముంచెఱిమి ఖాసపుఖానుని దాఁకి, తత్తురు
ష్కధ్వజినిన్ జొరంబడుచు సర్వము నాశనమున్ బొనర్చి ద
క్షాధ్వర హర్తయైన నిటలాక్షుఁడువోలె వెలింగె నయ్యెడన్. 105

ఉ॥ ముందుఁగలట్టి వైరి బలముల్ దనుఁగాంచి తలంకుచుండ, మ
ధ్యందిన చండభానుని క్రియన్ జెలరేగుచుఁ గృష్ణసింహుఁ డం
దంద విహారముల్సలిపి, యందఱు ముందఱవిచ్చి పాఱుచున్
సందొనరింప; శౌర్య రభసమ్మునఁదోరె భయానకమ్ముగన్. 106

తే॥ రాయసింహుసేనా విసరమును దాఁకి
చేను గోసిన చందానఁ జెండివైచు
కృష్ణసింహేంద్రు నుగ్రమూర్తిని గనంగ
వీరులకునైన గుండె కంపించి పోవు. 107

గీ॥ ప్రళయకాల దవానల జ్వాలయయి ఫ
రీదుఖాన్ దుర్జయుని మించి రేఁగిదాఁటి
రాజపుత్ర సైన్యంబుపైఁ గ్రమ్ముకొనుచు
రక్త కీలాల నిధిఁజేసె రణతలంబు. 108

మ॥ తన దర్పోద్ధతి కోర్వలేక మహబత్ఖాన్ సైన్యముల్ దిక్కులన్
గని యుర్వెత్తుగఁ బాఱుచుండఁగ, ఫరీద్ఖాన్ కాలరుద్రుండొకో
యన వెన్వెంటనెవచ్చెఁ; సూక్తుఁడు ప్రతాపాధీశు పేరెత్తి యు
గ్ర నృసింహాకృతిఁ బెంచి తాఁకెను ఫరీద్ఖానామౌళి నుగ్గైపడన్. 109

శా॥ ఆ సూర్యాన్వయ కాననేశ్వర మహా వ్యాఘ్రంబు దుర్వార బా
హా సంరంభ విజృంభణంబుఁగని ధైర్యంబూడుచున్ భీతి హె

వైచ్చి నైరింపఁగలేక యయ్యవన సైన్యంబంతయుఁ విచ్చుచుఁ
దూనెఁ దత్పతియో పరీదు కలలందుఁ మర్వలేకుండఁగఁ. 110

సీ॥ లక్షలు సేనాబలంబున్న, నంతటి
యాశ్విక చయమున్న హస్తిచయము
లెన్నికకును మీఱియున్నను, లఘు బృహ
న్నా శాస్త్రములు వేనవేలకున్న
సైన్యాధిపులు షోడశశ తంబు పైనున్న,
రాసులు రాసులు ద్రవ్యమున్న
వలసిన యన్ని సంబారమ్ము లున్నను,
సమరి మేండ్లకొలంది సాగుచున్నఁ,

తే॥ దలను బూవాడకుండఁ బ్రతాపుఁ డుండె
ననుచుఁ బాదుషా వగవ, ధైర్యంబుచెప్పి
యవనిఁ దల్త్రిందుగాఁ జేతుననుచువచ్చి
కడకు నిష్ప్రతిననుచు సంకటమునొంది. 111

ఉ॥ ఖాసిముఖానుఁ డుగ్ర భుజగప్రభు మాడ్కిని మండి లోకసం
త్రాసకర ప్రతాపుని బ్రతాపునిదాఁకఁ దలంప, ఖిల్లనే
నా సముదాయ మడ్డుపడినఁ రణ ముగ్రముగాఁగ సాఁగె; నా
గాసుర హర్తఁబోలె శబరాధిపుఁ డయ్యరులఁ బోరిఁ గొనెఁ. 112

తే॥ తురకదొరల సైన్యంబులు తురగములును
పదులు నూఱులుగా గుపుల్ గుదులుగాఁగ
బలియగుచు నుండె ఖిల్లభూపతి భుజంబు
నెక్కి నర్తించు పెనుపుష్టిఁ మిక్కి గదకు. 113

చ॥ స్థిరతర రాజపుత్రభట తీక్ష్ణ ఘనాబలధాటి కాగలే
కఱచి మహమ్మదీయ భటులందఱు మారుతధాటి నిల్వలే
కొరుగుచు వ్రాలు పైరుగతి నోజ దొలంగి కలంగువేళ ని
ష్ఠుర బలశాలి వీరబలుఁడుఁ బరతెంచె భటాళి గొల్వఁగఁ. 114

సీ॥ వడదాఁకి సోలెడు వారిపై నమృత వ
ర్షము జాఱుకీతిఁ గర్కశ తురుష్క

చముపులన్నియు రణోత్సాహంబుతో సము
ద్రము లట్లు పొంగి యా రాజపుత్ర
సేనలపైఁ గవిసెను; ప్రతాపుని పెను
యోధులు పోరాడి రుగ్రభంగి;
నప్పుడు చూపిన శౌర్య మప్పటి సాహసం
బరమలోక శ్లాఘ్యమై తనర్చెఁ

తే॥ దురకమూఁకలు ముందు ముందునకుఁ బొంగి
యొత్తుకొనివచ్చు నొత్తిడి నోపలేక
యా ప్రతాపుని వీర సైన్యంబులెల్ల
వెనుకకును మ్రొగ్గతిలునేమొ యనుచుఁ దోఁచె. 115

క॥ కాలాహి క్రూరులు నిజ
జ్వాలావీరులును బంచ శతసంఖ్యగఁ డి
న్నోలి భజింపఁగ శ్యామ నృ
పాలుండు ప్రతాపుఁజేరి వైరులఁ దాఁకెన్. 116

తే॥ శంఖరవములు సింహ గర్జారవంబు
లతిశయిల రాజపుత్ర సైన్యంబులెల్ల
నుబికి యుంకించి యురళించి యూఁది తాఁక
విరిగిపడి వైరిబలము నివ్వెఱఁ గలంగె. 117

తే॥ సూర్యభగవానుఁ డపరాబ్ధిఁ జొచ్చెఁ: యవన
గణము పులినాడి విడిచిన తెండయగుచు
గడ్డికఱచెను; భిల్లులు క్రమ్ముకొనిరి
కడల మునిముని చీఁకటుల్ గదియుకరణి. 118

శా॥ పోటుల్ మించిన రాజపుత్రసుల దండుల్ పేలవాఁ మించి యు
గ్రాహుతిన్ యవనుల్ పడుల్ బడఁ బ్రతాపాధీశుఁ దయ్యందఱన్
బాఱన్ దోలుచుఁ బుష్పవర్షము సురల్ వర్షింప వర్తింపె; "వే
వేరీయుద్ధమపూర్వ" మన్ననుడి పర్వెన్ లోక విఖ్యాతమై. 119

—• ప్రతాపసింహుఁడు యుద్ధరంగమునుండి శైలగుహ కరుదెంచుట. •—

సీ॥ "ఈనాఁడు మొగలులఁ దోపీక కడతేర్తు
మిచ్చట మీరుండనేల యతఁడె
శ్యామసింహుఁడు గూడఁ జనుదెంచెఁ దల్లి పా
టేశ్వరీదేవియు నేకతంబ
పిల్లలతో శైల బిలముననున్న; దా
వంతయుఁ బలుకుఁ దోడైనలేక
యీనాఁటి పోరాట మెప్పుడు ముగియునో
యెపుడు రా నొదవునో యెఱుఁగనేర
తే॥ మనుచరులతోడ మీరేగుఁ" డనుచుఁ గృష్ణ
సింహుఁడును భీమచాందును జెప్పుకొనఁగ
భిల్లు నొకనిఁ బ్రతాపుఁడు వెంటగొనుచు
శీఘ్రముగ శైల గుహయందుఁ జేరుకొనియె. 120

తే॥ కడుపు మలమలమాఁడు నాఁకటికివెక్కి
వెక్కియేడ్చి నిద్రించిరి బిడ్డలెల్ల;
విభుఁడు-పాటేశ్వరీదేవి- భిల్లభటుఁడు
గంగ మ్రింగక యారేయి గడుప వలసె. 121

సీ॥ లలిత సౌదామనీ లతికలుచుట్టు మూ
గిన ముగ్ధగోప కామినులుగాఁగ,
రణరణచ్చారు గర్జానినాదము మనో
జ్ఞమ్మైన వేణు నాదమ్ముగాఁగ
నంచుల మెఱయు సంధ్యారాగ పటలమ్ము
రమణీయ పీతాంబరమ్ము గాఁగ,
నృత్యన్మయూర విస్తృత కలాపము శిర
స్సంధాని లావతంసమ్ముగాఁగ,
తే॥ నతి విశాలమౌ నంతరి క్షాంగణమ్ము
చెలువ మమరు బృందావనసీమ గాఁగ;
బూని విహరించె విశ్వ రక్షానిరూఢిఁ
బ్రావృ డంభోద బాల గోపాలమూర్తి. 122

ఉ॥ ఆమలకాభములై చినుకు లంతకునంతకు నేకధారలై
పాములు వ్రేలఁ దీయుగతిఁ బర్వుచు, నేనుఁగుఁదొండ మంతలై,
భూమి జలార్ణవంబయిన పోలిక నిండుచుఁ, గుండపోత గ
ర్జా ముఖరంబులై కురియసాఁగె నభంబవియంగ మేఘముల్. 123

సీ॥ కనులు మూసినఁ జీల్చుకొని లోనదుసు దగ
ద్ధగ లీను నిబిడ సౌదామినులును,
నొక్కొక్కఁడె జగంబు వ్రక్కలు వ్రక్కలై
చనఁజేయు మేఘ గర్జారవములు
కొండ లొంటొంటిపైఁగూలి బ్రహ్మాండంబు
నగలించు ప్రళయ ఝంఝానిలములు,
క్షణమున విశ్వలోక ప్రాణితతిఁ గూల్చు
గతి జాఱు భయద నిర్ఘాతములును

తే॥ నంతకంతకు జృంభించి యావరించి
ప్రళయములు కోటి యొకనాఁడె గలిగినట్లు
ప్రకృతి కాయువునిండిన పగిది,నూపి
రాడనీక గాలియు వాన యలము కొనియె. 124

తే॥ కోటి కొకఁడైన నిలువక గుదులు గుములు
తమ-మృగ విహంగములుగూలె ధాత్రి విశ్వ
గర్భ నిర్భేదకమగు నా కాళరాత్రిఁ
దలఁచు మాత్రన నిలువెల్ల జలదరించు. 125

తే॥ ఏఱు లేఁటిబంటిగ మ్రోఁతవెట్టి పాఱి
కలిసి యుప్పొంగి యెకసొట్టి కొలఁదిమీఱి
కొండలును-లోయలును-వనుల్- గుహలునిండి
నిఖిల మేకార్ణవముగ పూర్ణిల్లె నపుడు. 126

మ॥ అకటా గాలియు వాన గూడి నిబిడంబై వేఁగఁగా రాతి చ
ల్వకుఁ గ్రొన్నెత్తురు ముద్ద గట్టుకొని పిల్లల్ ముంచుగడ్డల్ వలెన్
నిక చోర్వన్ శయనించి కప్పుకొనఁ గానీ జేనెఁడున్ గుడ్డ, క్రిం
దికినిన్ లేకయ నాఁటిరాత్రి శివరాత్రిన్‌బోలె నెట్లీడ్చిరో. 127

— ప్రభాతము —

ఆ॥ వేఁగుఁజుక్కఁ బొడిచె వెల్లఁ బాఱెను తూర్పు
కొండగోళ్ల గుములు గూయ వెసట
రవి జనింపఁ దెల్లఁ బ్రభాతమయ్యె వ
ర్షంబు బలమొకింత సన్నగిల్లె. 128

క॥ తడి యారని గడ్డిని శిబి
రుఁడు గొనిరా, రాణి రుబ్బి రొట్టెలుచేసెన్;
గడనుండి బిడ్డలందఱు
కిడి పడపడి నొక్కరొట్టె నిడెఁ బతి యెదురన్ 129

సీ॥ పద్మాసనమున దైవధ్యాన నియతి నే
త్రయుగంబు మూసెఁ బ్రతాపదేవుఁ;
డంత నొక్క బిడాల మా గుహకడ నాఁడు
కొనెడు బిడ్డయొడలు గోళ్లఁ గీఱి
చేతిరొట్టెను నోఁచి శీఘ్రంబె యొక్క ఖా
ళినిఁ జెక్కె చనె బిడ్డ కెవ్వుమనుచు
నఱచి భూమినిఁ బ్రాలె నాధ్వనికదలి పా
దేశ్వరిచని బిడ్డ నెత్తికొనియెఁ

గీ॥ తనయ యేడ్పునఁ జెవులు చీఁదఱులువోవఁ
గనుదెఱచి తొమ్ముఁ గ్రమ్మ రక్తంబుఁ గనుట
వజ్ర పంజరకల్పమవ్వార్థివేంద్రు
వీర హృదయమ్ము చెదరి ద్రవించి పాఱె.

సీ॥ "పదియుఁ బండ్రెండు సంవత్సరంబులు సంఘ
టించు పోరులకుఁ జింతించలేదు;
జగము మ్రింగు నసాధ్యశత్రు వక్కరు రేఁగి
పగవట్టెనని యింత వగపులేదు;
కోటలు సేనలు కోశంబు దేశంబు
బలము తగ్గె నటంచు భయములేదు;

కడు దీర్ఘకాలంబు గడచినఁ గూడ జ
యము గల్గదని విచారమును గలుగ;
తే॥ దాపదల కోర్చుటకె పీరుఁ డవతరించు
నని విపత్కోటి నెదిరి ధైర్యమున నడతుఁ;
గాని యీనోరులేని రక్తాంశుపుసొత్తు
లనుభవించు కష్టముచూడ నలవిగాదు. 131

తే॥ దాస దాసీ సహస్రముల్ తమ్ముఁగొలువఁ
బరమ భాగ్యోదధినిఁదేల వలయువారు
కూడులేకుండ మలమల మాడుచుంద్రు
తుద కొకండే నదృష్టవంతుండు గాఁడె. 132

తే॥ అంతిపురిలేదు; తూఁగు టుయ్యాలలేదు;
కొండలను గుట్టలను జీఁకు గుహలయందు
గాలివాన యెండలఁజిక్కి కరకురాలఁ
బఱచుకొనలేక పడియుండవలసె నకట. 133

ఆ॥ నా యనంతరమున నీ యఖండక్షోణి
నంత యేలవలయు "నమరసింహుఁ"
డిట్టు లిడుమపడెడు నిది యెట్టికాలమో
క్రోలుపులియుఁ బిల్లి కూనయయ్యె. 134

సీ॥ మూర్తీభవించు మత్పూర్వ పుణ్యఫలంబు
మామక హృదయ సామ్రాజ్యలక్ష్మి
పావిత్ర్య మందిరోపరిపూర్ణ కలశంబు
తనువుధరించు సౌందర్య ధనము
శాశ్వత శాంతి మహైశ్వర్యదేవత
ప్రకట సౌభాగ్య పర్యాయపదము
కష్టానుపద మహాకల్ప ధాత్రీజంబు
నిరుపమ వరవర్ణినీ మతల్లి
తే॥ ప్రియతమంబైన మత్ప్రేమ విగ్రహంబు
నృపమకుట రత్నరోచిః పరిపచరణ

పైన పాటేశ్వరీదేవి యకట యిట్లు
పరమ దారిద్ర్యమున మున్గవలసె నేఁడు. 135

క॥ దినమంతటి కొక ఫలమును
గొని తీరని యుద్ధములఁ దగుల్కొని కండల్
దునిసి యెముక పట్టెను మే:
నినుమైనని యెంతకాలమింక నిలిచెడునో. 136

ఆ॥ వానకాలమందు వణఁకుచుఁ దలదాఁపఁ
గూటి పేదవకైన గుడిసె యుండుఁ,
జక్రవర్తినయ్యు సంతానమిటు శైల
గుహల నిలిచి గోడు గుడువవలసె. 137

ఆ॥ బిడ్డయురమునుండి వెడలు రక్తముఁజూడ
మనసుచెడియె నాకు మఱలఁ దిండి
యొదవు నెపుడొ వైరు లెదు రౌచురింత కీ
కడుపు గోఁతయెట్లు పడఁగనేర్తు '' 138

చ॥ అని వగనొంది భూరమణుఁ డాకును గంటముఁదీసి వ్రాసి చెం
తనుగల భిల్లుచేత నిడి దానిని బాదుశహా "కొసంగు మం
చనిపి యొకింత కన్మొగిచి ధ్యానసమాధి మునింగె రాజ్ఞి యొ
య్యన జనుదెంచి యాత్మవిభు నాతని చెంగటి రొట్టెఁ, గాంచుచున్.

గీ॥ "రాజయోగ సమాధి నేత్రములు మూసి
యోర యీమహాభాగుఁడు కూరుచుండె
సహజ గంభీర వదనంబు సౌరుదక్క
యలఁతి యలఁతి చింతారేఖ లలవరించె '' 140

మ॥ అని డెందంబునఁ జింతనొందుచుఁ బ్రతాపాధీశు నాస్యంబు పై
నను జూడ్కిన్ నిగుడించి యంచె నిలిచెన్ క్ష్మానాయకోత్తంసుఁడున్
దన నేత్రంబులువిచ్చె నాక్షణమె యానారీ వతంసంబు వి
చ్చిన నెమ్మోమున నాధుడాయుచు వచించెన్ భక్తి పూర్వంబుగన్. 141

మ॥ చిననాఁడున్ నవరత్నరంజిత మహా సింహాసనంబెక్కి మ
న్నన భూమండలమేలు నప్పుడును నీనాఁడీ మహారణ్య సీ

మను బాలించెడునప్డు సుంతయుఁ జలింపక చోని మీమోము పై
నను నేఁడేటికొ తోఁచుచున్నయవి చింతారేఖ లల్లల్లనన్. 142

సీ॥ ప్రాణేశ నీయుదరము సంటు నాఁకలి
నీక్షణంబున నాశ్రయించు నిద్ర
మోమునందుఁ బ్రసాదమును గాంతి విరతి చి
త్తములోని దుర్దమ ధైర్యగరిమ
మెట్టి దుర్ఘటకార్య మిపుడు మీయెదనుండి
దొంగలించి యొకింత తొలఁగఁజేసె
దృష్టిమార్పక యొక్క దిక్కుగాఁ జూడ్కులు
క్షితిపై నిగుడ్చి వీక్షింతురేల?
గీ॥ మీమది నొకింతయును జింత మేకొనంగ
నెఱుఁగ నెన్నఁడు మిమ్ము నేనెఱుఁగుటాది
నిదియు తొలుసారి వగనొందనేమి హేతు
వెఱుఁగఁజెప్పుఁడు మానసం బెరియసాఁగె. 143

చ॥ మలయ సమీరణంబునకు మాంద్యము బాలశశాంక మౌళికిన్
గళమునఁ గప్పు-చంద్రునకుఁ గందు స్వభావము లౌను రాజరా
ట్తిలకుఁడు నామనోహరుఁ డుదీర్ణగుణుండు ప్రకృత్యతీత చి
ద్బలుఁడు ప్రతాపదేవుఁడని పల్కెఱు నేమది నుబ్బి పోపుదున్. 144

గీ॥ వైరు లెదిరింప జెన్నిచ్చి పాఱవెపుడు
పాఱువైరులఁ దఱిమి చంపంగఁబోవు
కలిమిలేముల మనసు మార్పులను బొంద
విటుల మోహింపఁ గారణమేమి నాథ. 145

మ॥ ధరణిన్ముంచు విపత్పరంపరఁ గడున్ ధైర్యంబుతో నోర్చు శౌ
ర్య రతుండన్నను లోకమెల్ల మిముఁ దార్కాణంబుగాఁ జూపు దు
ర్భర చింతారతి హేతువున్ దెలుప నర్హంబైన మీపాద పం
కరుహ ద్వంద్వముఁగొల్తు మన్ననమెలుంగన్ నా కెఱింగింపుఁడీ. 146

మ॥ అనుపల్కుల్ చెవిసోఁకు మాత్రనఁ బ్రతాపాధీశు డెందంబు వి
చ్చెను నెమ్మోమునువిచ్చె సారసదళ శ్రీలన్ బిసాళించు లో

చనయుగ్మంబును విచ్చె! విచ్చిన సరోజాతంబునందుండి పె
ల్చనఁ దోతెంచెడు పూవుఁదేనియవలెన్ జాల్వారె నీవాక్యముల్ 147

మ॥ జననంబందిననాఁటి నుండియు రహస్యంబొందు నేనెన్నఁడై
నను బాటించి యెఱుంగ నింతవఱకున్ నాయర్ధదేహంబవై
చను నీతోడ వచింపరాని దొక యంశం బుండునే' యింతకున్
మునుపే తెల్పకపోతినే యని మనంబున్ జింతచేఁ గ్రాగెడిన్. 148

సీ॥ ప్రాకార వలయిత ప్రాసాదముల యందు
శశికాంతమయ చతుశ్శాల లందు
ననుపమంబైన శుద్ధాంత సీమల యందు
మిగుల నెత్తగుగాలిమేడ లందుఁ
బరమ సుఖప్రద ప్రమదావలనము లందు
బన్నీటి కాల్వల పట్టు లందు
నారాంబుపూర కాసార తీరము లందు
మోదంబుఁగొలుపు పూపొదలయందు

గీ॥ దాసదాసీ సహస్రముల్ దిశము కొలుచు
గన్ను సన్న మెలఁగ నెండ కన్నెఱుఁగక
యలరఁదగు మహారాజు భార్యవుగ నుండి
యిడుమ పడుచుంటి నాదురదృష్ట వశత. 149

సీ॥ ఎవ్వని నామమొకింతుక చెవినోఁక
భీతుఁడైనను జగద్వీరుఁడగునొ
యట్టి రాణాప్రతాపాధీశు నర్ధాంగి
వై సౌఖ్యమొందు భాగ్యములు లేక
తలఁదాఁప నంకణంబిలులేక తినఁ గట్ట
లేక పుట్టెఁడు పిల్లలాఁకలిఁగొనఁ
గ్రోఁతులు పిల్లులభాతిఁ గాపురము మా
ర్చుచు గుట్ట గుట్టయుఁ జుట్టుచుట్టి

గీ॥ యన్నమిడి యాఁకలిని మూయుననువు లేక
యకట! నోరులు మూసి యూరార్చ వలసె

నిట్టి దినదిన గండంబులెల్లఁ జూచి
యెటు పిరియపంపు మానసం బిందువదన! 150

క॥ తల్లి యొకతె సుకముండినఁ
బిల్లలపే మందిప్పైనఁ బెంపఁగలుగు నా
తల్లిపై యిడుమల బడలినఁ
బిల్లలు పెంపొందఁగలుగు వెరపుంచెడునే. 151

సీ॥ పెండ్లిగాఁ బిల్లలు నీవు తపింప వీ
క్షించి ధైర్యమున సహించి యుంటి
దినమంత మలమల తిండిలేక తపించు
బిడ్డనోరునుగొట్టి పిల్లిగిర
బొమ్మపైఁ గ్రమ్మ రక్తమ్ము నీక్షించి కె
వ్వనివేయు కేకను వినుటఁజేసి
సముదార వజ్ర పంజర సన్నిభంబు నా
స్వాంతంబు క్షణము దుర్బలతఁబొంది

గీ॥ "యారుమాసముల్ విశ్రాంతి యవసరం"మని
తోఁచె నేడవ నెలరాఁగ పురమునేయ
సిద్ధముగ నుండుననిి చిన్న చీటివ్రాసి
భిల్లుచేఁ బాటుపాకుఁ బంపించి రాఁడ. 152

ఉ॥ వ్రాసితిఁగాని కమ్మ యది వ్రాసిన వాది నరుంతుద వ్యథా
యాసితమై మనంబు వెనుకాడుచు నున్నది, సూర్యవంశ మ
ధ్యాసములేని క్రొత్త యలవాటున కాస్పదమయ్యెనేఁడు నా
వాసి తొలంగె నేమిటికి వ్రాసితివంచు మహా దపించుచున్. 153

చ॥ అనుచుఁ బ్రతాపసింహ వసుధాధిపసింహుఁ డొకింత చింతచే
ననియెడు పల్కులన్విని నవాంబురుహాయతనేత్ర విస్మయం
బెనయ ముఖాబ్జమెత్తి హృదయేశునిఁ గన్గొని దేవ "యెన్నఁడున్
వినఁబడనట్టి వాక్యములు వింతగ నేఁడు వినంగ వచ్చెడిన్. 154

శా॥ ఏ యల్పంబగు కార్యమేనియును మీ రిన్నాళ్లు మున్నాళ్లు మా
ర్లా యా సాధక బాధకంబులను బర్యాలోచనన్ నేయకే

చేయఁగా దోవరు నేఁడిటాఁ ప్రపడుటల్ చిత్రంబె మీయీయధి
ప్రాయం బిప్డు విమర్శచేయఁగల యర్హత్వంబు నాకున్నదే. 155

మ॥ వ్యవధిన్ జెందఁగఁగోరి తాఁబునెల లాపై యుద్ధమున్ సిద్ధమే
యవుచో లాభమదేమి యీగడువుచే నాయున్సు హెచ్చించి న
ట్లవు నేఁడీపదనైన నీదు కరవాలానాఁటి చిట్లుండునో
యవనవ్రాత శిరోవిదారణ పటు వ్యాపార పారీణమై. 156

సీ॥ క్షణకాలమైన విశ్రాంతి నొందఁగఁబోక,
తనియ నూపిరి పుచ్చుకొనఁగఁ బోక,
సంతతధ్యాన నిష్ఠయొలర్పఁ గార్యసా
ధకుఁడు రేఁబవలును దత్పరుఁడయి
తనరంగ వలయు స్వాతంత్ర్య మహత్తును
కార్య నిర్వహణంబుఁ గాంక్షిచేసి
సర్వార్పణమొనర్చి జంకక పనిచేయు
ఘనునైక వీరపుంగవుఁడవీవు

గీ॥ పౌరుషోద్యోగ జలద ప్రభంజనమగు
శ్రాంతి నెటుకోరి తాఁబు మాసములు కూరు
చున్న యట్టి నిర్వ్యాపారుఁ డెన్ని జన్మ
ములు కడచెనేని పనిచేయఁగలఁడె మఱల. 157

సీ॥ భువన ముద్భవమొందు మొదలుగా నెవ్వరూ
హించి కల్పించి సాగించి యెఱుఁగ
నట్టి స్వాతంత్ర్య మహాయోగదీక్ష నా
రంభించితివి మహోగ్రప్రవృత్తి
నీ యనంతత్యాగ నియతియును నఖండ
దేశభక్తిరతి నుతించె జగము
లాయజాండ కటాహ మావరించిన జ్యోత్స్న
వలె నీయశంబు విశ్వమున నిండె

గీ॥ ధరణి నాచంద్రతార కాస్థాయిగాఁగ
నీదు పావన నామంబు నెగడునట్లు

మెలఁగుచుంటివి లోపముల్ గలుగఁ గలవె
ధన్యులగు వారిలో ధన్యతముఁడవీవు. 158

సీ॥ గతిచెడి యఖిల భారతలక్ష్మి యవనుల
పాలయి కడగండ్లు పడుచునుండఁ
గన్న సంతానంబుకన్న మిన్నఁగనెంచు
ప్రజ దాపులేక చేడ్పడుచునుండ
గల్యాణ నిలయ దుర్గము లెన్నియో కూలి
పడి బీడుపడి కాడుపడుచునుండ
హైందవాచార మార్యస్త్రీల పావిత్ర్య
మడుగంటి మంటిపాలగుచునుండ

గీ॥ భారతీయ స్వతంత్రత పట్టుదప్పి
వీఁగి నావాఁటి కుట్టూఁత లూఁగుచుండ
దన కుటుంబముపై నాస సనిఁ దొలంగ
నోపునే వీర రాణాప్రతాపమూర్తి. 159

గీ॥ అధిప! యొక శంకయుండు మిమ్మడిగి తెలియ
వలయు ననియుంటి నక్కఱ గలిగెనేఁడు
పరమ కృపతోడ నానతీవలయు భార్య
యెక్కుడగునొ భారతదేశ మెక్కుడగునొ. 160

గీ॥ అతులితాత్మాధి పత్యంబునందె దేని,
సదయతెచ్చు ఐశ్వాధిపత్యప్రశస్తి
క్షితిని నెలకొన్న కోటి దుష్కృతములందు
భ్రాంతిఁబోలిన ఘోర దోషంబులేదు. 161

గీ॥ సానఁదీర్చిన కొలఁది వజ్రంపుముక్క,
తఱచిన కొలంది మంచి గందంపుఁ జెక్క,
యిడుమ లందినకొలఁది లోనైకవీరుఁ
డును బ్రకాశింతు రన నెఱుంగనిదెమీకు. 162

సీ॥ అఖిల లోకాధీశుఁడైన సర్వేశు నం
తర్యాగమొనరించి త్యాగమెంచి,

యాత్మనివేదనం బాచరించిన మహా
రాజర్షిమౌళివౌ ప్రభుఁడవీవు
పనియందు నద్దాని పరిణామమందు లో
లతకూడ దనుచుఁ బల్కుఖను నాకుఁ
దెలుపుచుందువుగదా జలధరంబులు నభం
బలమినట్టులు విపత్తులు గలంచి
గీ॥ దిక్కుదోఁపని విషమ సందిగ్ధ దశల
నాథ! నీవాక్కు చిఱునవ్వు నవ్వెదేని
విఱిగి రవిరశ్మికిని మంచు విరియునట్లు
కోటి యాపదలైనను గ్రుంగిపోవె
సీ॥ కోటలన్నియు శత్రుకోటి చేకొనెనందు,
సేనాబలంబు కృశించె ననుచు,
జయ మింతవఱకు దర్శనమీయ లేదంచు
నాపదల్ మెడబంటి యయ్యెననుచు,
జనె నేండ్లుపూండ్లును దినఁ దిండిలేదంచు,
బసికూన లగచాట్లు పడుదురనుచు
మదిఁ గుంద వలవదీమాఱు వైరులురాఁగ
గవచ ఖడ్గములూని కానెఁగట్టి
గీ॥ యద్వితీయబలుని నిన్ను నీద్వితీయు
నైన నేను రణక్షోణి ననుసరించి
శత్రు సంహార మొనరింతు శంకలేల
యిరుపురము నిల్వ జగమెల్ల నెదురఁగలదె. 164
సీ॥ అరులచే,నున్న సైన్యాధిపుల్ మడిసిన,
సామంత నృపులెల్ల సమసి చనిన,
భటుఁ డొకండునులేక బలమెల్లఁ దొలఁగిన
నాపదల్ వేన వేలలము కొనిన,
నేను బిడ్డలుఁగూడ నిశిత ఖడ్గములూని
రణము చేయుదు మిరు ప్రక్కనిలిచి

కొండలోఁ జివరి యంగుళమైన రజమునే
కక్కురు సుఖముగా నందరాఁడు
గీ॥ మనకుఁగలిగిన బిడ్డలందునఁ గడపటి
నిసువు గళమునఁ గొన యూపి రెసఁగియుండ
దైవసముఁడవీ విడిన స్వాతంత్ర్య సమర
మజహరాదు వెదిర్చిన నాఁగరాడు. 165

ఉ॥ సంచలనం బొకించుక యెసంగని దుర్దమ చిత్తవృత్తితో
వంచనలేని బుద్ధి భగవంతుని యందలి నమ్మకంబు జో
డించి ప్రయత్నమూనిన ఘటిల్లని కార్యము దొక్కఁడేనిఁ గ
న్పించదు సర్వలాభములు నీ వశమై నినుఁ బాయ కుండెడిన్. 166

ఉ॥ ద్వేషమువంకఁ బోవని పవిత్రమనంబు రహించు నిత్య సం
తోషివి నేఁడు నిన్నలము దుర్బలతన్ వడిఁ బాఱఁబోలి వి
ద్వేషుల మార్గ్యమున్ జనుము దేవుని నమ్మినవారికిన్ మన
స్తోషమకాని యోటమియు దుఃఖము కల్గఁగఁబో వొకింతయున్. 167

మ॥ కొఱఁత యొక్కింతయులేదు లోకమున నాకున్ బ్రహ్మకల్పంబుగా
ధర జీవించెదువారు లేరెవుడు మందస్మేరముల్ మీముఖాం
బురుహం బందునఁ దాండవింపఁచు ముదంబున్ బెంపఁగా కంచు నీ
శ్వరుఁ బ్రార్థించెద' నన్నఁ బత్నికిఁ బ్రతాపస్వామి హర్షంబునన్ 168

సీ॥ అనిచేసి మరలి వచ్చినవేళ మొదలంట
శ్రమఁదీర్చు మధుర విశ్రాంతి సీమ
తలఁగిపోవని యాపదలు ముట్టి నపుడు ధై
ర్యంబీయఁగల యంటరాని కోట
కష్టాంధితమసంబు గప్పి తోఁపని యప్డు
త్రోవఁ జక్కఁగఁ జూపుదొడ్డ జ్యోతి
పదికి వేయుగవైరి భటులు పైఁబడినప్పు
డసమాన బలమిచ్చు నమ్మిన ఘుటిక
గీ॥ యన్నివేళల సౌఖ్యంబు నలవరింప
నందనోద్యానమనుచు డెందమునఁ దలఁతు

సీమఘూర ఘీర గంభీర నిబిడ ఘణితిఁ
దలఁచి పాటేశ్వరీ వనితామతల్లి. 169

మ॥ వర సౌశీల్యము నాభిజాత్యమును సౌభాగ్యంబు శ్రీయుక్ మనో
హరశాంతి స్థిరధీరతల్ దనరు నిన్నర్ధాంగిఁగానిచ్చి యు
ర్వర నాకిప్పు డనన్యదుర్లభ మహాభాగ్యంబు సంధించె నీ
శ్వరుఁడంచుక్ మదినెంచి పాయని కృతజ్ఞత్వంబునక్ మ్రొక్కెదక్.

సీ॥ నే నెఱుంగకయున్న నిరతంబునన్నుఁ గావి,
నాకోప ముపశమనమ్ముచేసి
మధురస్వభావ సంపదచే నుడుకుతీర్చి
యలఘు శాంతతఁగూర్చి కలతమాన్చి
యూరించి లాలించి యుపచరించి కఱంచి
యలరించి మించి ధైర్యంబునించి
మది హరించెడు గుణ మాధుర్యమును బెంచి
మాధుర్యమును బెంచిమమతనించి

గీ॥ యండబాయక నీవుండు నంతదాఁక
వనిత కోటానఁగోటు లాపదలువచ్చి
తలఁబడిన నంగుళంబు ప్రతాపవిభుఁడు
దారితప్పునె స్వాతంత్ర్య ధర్మనిరతి. 171

మ॥ సరళౌదార్యముచేఁ గృపానిరతిచే సౌజన్య సంపత్తిచే
ధరణిక్ మూత్నవివాహ మండపము చందంబార నానంద మం
దిరముక్ జేయఁగబుట్టు పొందిరి సుమీ స్త్రీరత్నముల్ వారికిక్
సురలోకంబున దేవదూతికల కెచ్చో సామ్యముల్ గల్గునే." 172

గీ॥ అనుచు వచియింపఁగా భాగ్యమాయె నాకుఁ
బ్రాణనాథ ప్రసాదంబు నారగింపు"
మనెడి పాటేశ్వరీదేవి ప్రార్థనమున
జనవరేణ్యుండు లేచి భోజనముచేసె. 173

—{ రాజపుత్ర సైన్యములు యవనుల నోడించి ప్రతాపసింహునిఁ జేరవచ్చుట. }—

క॥ ఆకోన సమీపంబున
శైల గుహాఘోర కుహర సంతతులెల్లన్
గ్రీలంగ భిల్లేశ్వరు నా
భీల మహాశంఖరవము వీతెంచె వడిన్. 174

మ॥ ఆ కల్యాణ మహారవంబు మధురంబై వీచి శ్రోత్రేంద్రియ
వ్యాకోచత్వము సంఘటింపఁగఁ బ్రతాపస్వామి లేచెన్ సలుం
బ్రా కృష్ణాదులువచ్చి స్వామి చరణ ద్వంద్వంబుపై వ్రాలుచున్
సాకల్యంబుగ నాఁటి సంగర విశేషంబుల్ నివేదించినన్. 175

క॥ విని యానందించెను యూ
వనసేనలు దినదినంబు పైఁబడ సమరం
బొనరించుచు గెల్చుచు వె
న్కను బడుచును గొన్నినాళ్లు గడిపెన్ విభుఁడున్. 176

——• భిల్లుఁడు ఢిల్లీపురమును కనుగుట •——

క॥ వనముల లభించు ఫలములు
తినుచును నాల్గామడలుగ దినము ప్రయాణం
బొనరించుచు భిల్లుఁడు కనుఁ
గొనె ఢిల్లీపురము కనక గోపురవరమున్. 177

సీ॥ అంజనాచలముల నసుకరించెడు దంతి
సముదాయము రహింపుశాల లొకట
నుచ్చైశ్శ్రవము మేలు మెచ్చని యవనాశ్వ
సంఘంబు లలరారుశాల లొకట
స్ఫటికంపు బొమ్మల భంగి వెలుంగుప
రంగులుండెడు మందిరంబు లొకట
నిబిడ బాహాటోప నిరతులై దీపించు
యవనుల్ వసించు గేహంబు లొకట

గీ॥ గోపురంబున రెండు దిక్కులను భువన
విలయమును గూర్పఁగాఁ జాలి భీతిఁగొలుపు

పేను పిరంగుల తండముల్ గనుపడంగఁ
జూపులకు వింతఁ గొలుపు ఢిల్లీపురంబు. 177

గీ॥ హైందవులుగొల్చు శివకేశవాలయములు
భూరి యావన ప్రార్థనాగార వితతు
లాపుర సరోవరమునఁ బెల్లలమి వెలయుఁ
గలయ విరిసిన పుండరీకముల కరణి. 178

ఆ॥ సందులందు నడచి గొందులవిడిచి వీ
థులను రాజమార్గములను గడచి
వీరి వారి నడిగి ఖిల్ల వార్తాహారి
పురము మధ్య భాగమునకుఁ బోయి. 179

క॥ లక్షలు కోట్లు ధనంబిడి
లక్షలు పనివాండ్రు వర శిలాతతిఁ బెక్కేం
డ్ల క్షయముగఁ గట్టిన హ
ర్యక్ష ద్వారాంగణంబు నాతఁడు డాసెన్. 180

క॥ ద్వారము రక్షించు ప్రతీ
హారులు కరవాలధరు లుదార బలాఢ్యుల్
'రారా' దని వారించుచు
దూరమునకుఁ ద్రోయ నతఁడు తొలఁగుచు నిలిచెన్. 181

సీ॥ అలఘు లక్షణ భూషణాంచితమగు పట్ట
పంబారి యేన్గుపై నధివసించి,
చామర గ్రాహిణీ సముదయంబు మనోజ్ఞ
కరములఁ గనక చామరము లిడఁగ,
నాణి ముత్తెపు సరు లలరు విశాల సి
తాతపత్రంబు చాయల మునింగి,
బహుళ సేనాధీశ పటలంబు యవనాశ్వ
ములనెక్కి చుట్టును మూఁగి కొలువఁ

గీ॥ జెలులు కనక పుష్పములు లాజలను జల్ల,
భువన మోహన దరహాసమూర్తి యలర,

నిలిచి మ్రొక్కి పౌతులచెసఁ గలయఁజూచు
చక్బరీశ్వరుఁ డాత్రోవ నరుగు దెంచె. 182

గీ॥ అణఁగి ముమ్మాఖులు సలాము లలవరించి
ద్వారపాలక తతి బరాబరు లొనర్ప,
ఖిల్జీఁడును సార్వభౌముని ద్విరదము దెసఁ
దరలి జాబున్న తనదు హస్తంబు సాఁచె. 183

మ॥ "ఎదురన్ జేరకు ప్రక్కకున్ దొలఁగు" మంచెల్గెత్తి దౌవారికుల్
వదరన్ ఖిల్జీఁడునిల్చె బొమ్మవలె; నక్బర్ నేత "యేకార్య ము
న్నది నీ వెవ్వఁడ"వన్న ఖిల్జీఁడును "రాణాగారు నీకిమ్మటం
చిదె యీ కమ్మను బంపి"రన్న విభుఁ డయ్యేన్గున్ దిగన్ జాఱుచున్.

క॥ "వారేకొండలలో సం
చార మొనర్చెదరు వారి సంతానము దే
వేరియు సేమముతో ను
న్నారే యెఱుఁగంగఁబల్కు నాతో" ననినన్. 185

సీ॥ "అందఱు సేమమే"యని కమ్మ నందిచ్చెఁ;
నక్బరు పాదుషా యాదరమున
నంజలి పట్టుచు నద్దానిఁ జేకొని
సంభ్రమంబున నంతఁ జదువఁదొడఁగె
నక్షియుగమువిచ్చెఁ; నాస్యంబు వికసించెఁ;
జిత్తమందు ముదంబు చిందులాడె;
వ్యాకోచ పంకేరుహాస్యంది మధుధార
లన మోదబాష్పంబు లతిశయిల్లెఁ;

గీ॥ జేష్టలందింత తొందర చెలఁగఁజొచ్చెఁ;
నొడల నొకవింత రకమైన హొయలుపుట్టెఁ;
నంత నంగరేకునఁ గ్రమ్మ సంతరించి
చనియె ఖిల్జీఁదొడ్డాని లోని సాధమునకు. 186

గీ॥ ఐదువేల్ రాణివాసంపు టబ్జముఖులు
వారివారి నెచ్చెలులతోవచ్చి చేరి

లలిత దరహాస మధుర విలాస మలర
భిల్లమూర్తినిఁ గని సంతసిల్లి రపుడు. 187

—: అక్బరు చక్రవర్తి ఢిల్లీపురంబు నలంకరింపఁ జేయుట. :—

సీ॥ పురిని నూఱులు వేలు మొగలు టెక్కెములు విం
తగు రంగులను గుల్కి యెగురసాగెఁ
బ్రతి గృహాంగణము స్తంభములందుఁ దరుణ రం
భాస్తంభ నివహంబు ప్రభలుగొలిపె
నల బహిర్ద్వార సీమలను బచ్చని మామి
డాకు తోరణము లల్లాడఁదొడగె;
రత్న సంతతిఁ గూర్చి రచియించు ముత్యాల
రంగవల్లికలు బౌరంగు నెఱపెఁ;
గీ॥ జలువ పందిరుల్ పానీయశాల లెన్ని
యెడలనో నెలకొల్పఁగాఁబడి తనర్చె;
విరులు పునుగు జవాది యత్తరుపుచేతఁ
బురము సిరినించి సౌరభంబులను విసరె. 188

మ॥ అరుగన్ జొచ్చిరి వీధివీధి జవనాశ్వారూఢు లుద్యోగు లెం
దఱా "యాస్థానమునందుఁ గొల్వమరు మధ్యాహ్నంబుపై నక్బరీ
శ్వరుఁడున్ గాన నమాత్యులున్ నృపతులున్ సైన్యాధిపుల్ పౌరులం
దఱు నాస్థానముఁజేర రం"డనుచు వార్తన్ జెల్ప నోత్సాహులై. 189

గీ॥ ఈశ్వరేశ్వరుఁ గూర్చి యెల్ల మసీదులం
దును భక్తి వెలయఁ బ్రార్థనలు జరిగె;
వైదిక మంత్రపుష్పములు మంగళహారం
తులుసాగె నెల్లదేవళము లందుఁ;
గూటిపేదలు మొదల్ కోటీశ్వరులదాఁకఁ
బురజనుల్ మృష్టాన్నములు భుజించి
నూతనవస్త్ర సందోహముల్ దాలిచి
బహు విధాలంకార పరతమించి

గీ॥ రాఁకలినిఁగొన్న బీదల కందఱకును
బంచ భక్ష్య భోజ్యంబులు పంచఁబడియె;
నీడులేని సౌఖ్యాబ్ధి నోలాడి, నాఁడు
ఢిల్లిపురి స్వర్గపురిమేలు డిందుపఱిచె. 190

—• అక్బరు సార్వభౌముని సభా భవనము. •—

గీ॥ శకటములపైన యావనాశ్వములపైనఁ
బల్లకీలపై నేస్తుబంపారిపైనఁ
జెల్లుబడి కల్గు దొడ్డవారెల్లవచ్చి
కొలువు సింగంపు వాకిఁట నిలిచి రపుడు. 191

గీ॥ విలువ దుస్తులు ధరియించు వేత్రధరులు
వంగి వంగి సలాములు ప్రచుర పఱచి
తత్తదర్హాస్థలమ్ముల నందఱకుఁ జూపి
సమతఁ గూర్చుండఁజేసిరి క్రమత నెఱపి. 192

గీ॥ హేమరుచిర మహాద్వారసీమ నుండ
యాసభా ప్రాజ్య వజ్ర సింహాసనంబు
చూపఱకుఁ దోఁచు నొక చిన్న చుక్కమాడ్కి
ననిన, భవన వైశాల్య మేమనఁగవచ్చు. 193

సీ॥ పలు చిత్తరువులు పేరుననాఁటి యుద్ధని
శేషముల్ గోడలఁ జెలఁగుచుండఁ,
బలు రకంబుల యద్దముల గవాక్షములలో
రవిరశ్మి వింత రంగులు నెఱప,
మెఱుఁగారు లోహ నిర్మిత కుందమందార
మాల లందందును వ్రేలుచుండ,
నొక్కొక్కఁడును వేయిదిక్కులఁ బ్రతి ఫలిం
చెడు కాచదీపంబు లడరుచుండ,

గీ॥ నేల యొక్కింతయేని గన్పింపకుండ
మహిత కాశ్మీర రత్నకంబళము లమర

సందుపై రెండువేలు దివ్యాసనములు
దనరఁ దనరారె సభ్య రాస్థాన వాటి. 195

గీ॥ దాని చివర విశాల వితర్ది యమరెఁ;
గ్రింద మొకమాలు పైన జరీ పని గల
పట్టు గుడ్డ వెలుంగొందెఁ; బైనుండి
వివిధ ముక్తా గుళుచ్ఛముల్ వ్రేలు చుండె. 196

సీ॥ ఆవితర్దికకు మధ్యమున వెల్గెను మనో
హర నూత్న కనక సింహాసనంబు;
నద్దాని చివరలందష్టదిక్కులయందుఁ
దనరారె హాటక స్తంభ వితతి;
వైడూర్య మాణిక్యవజ్ర సంస్థగితిపై
కాంతు లీనెను స్తంభగర్భ సమితి;
యా స్తంభముల పైన నవరంజి పైకప్పు
రేకులు రేకులై ప్రియముఁ గూర్చె;

గీ॥ నెత్తయిన చుట్టుగోడల హేమ మత్స్య
సింహ గజ పక్షి శిరము లచ్చెరువు నించెఁ;
బరమ భాగ్యాంకమగు నాసభా భవనము
తగె మఘవు సుధర్మాస్థాన తలముఁ గేరి. 197

గీ॥ మంత్రు లుద్యోగు లాప్త సామంత మణులు
పదియు నాలుగునూఱులు సైన్యపతులు గాయ
కులును బందుగుల్ నిండిరి; కొలువు దనరెఁ
దరగ బారులఁ దూఁగు నాగరము కరణి 198

క॥ కనకపు సింహాసనమున
కును గుడిదెస నగ్రపీఠిఁ గొమరొందెను శో
భన వైభవపరుఁడు 'సలీ'
మనఘుఁడు యువరాజు భారతావనికెల్లన్. 199

సీ॥ బైరాముఖాన్ చమూపతి పూర్వజన్మ త
పో మహీజాతంబు పూర్ణ ఫలము

యవనసంగత భారతాఖండ బహుళ సా
    మ్రాజ్య మేలెడు మహామంత్రిమౌళి
విశ్వోన్న తైశ్వర్య విభవసాంద్రుండైన
    యక్బరీశ్వరుని వియ్యాల సురభి
పరిషియన్ భాష బేబరు నృపేంద్రుచరిత్ర
    మనువదించిన యట్టి యగ్రసుకవి
ఆ॥ కులముగాదు దొడ్డగుణమె ముఖ్యంబంచుఁ
  జాటు సజ్జనుండు సరళ హృదయుఁ
  డార్ష వర్తనాంకుఁ డబ్దూరు రహిమానుఁ
  డధివసించియుండె నవలిపీరి. 200

సీ॥ ధరణీతలంబెల్ల దానమిచ్చినను వ్రే
    లుంచి తాఁకని రాజయోగిమౌళి,
వసుధాంతమునకైన వాహనం బెక్కక
    శ్రమచేసి నడచు నిష్ఠాపరుండు,
జైన దర్మగ్రంథ సార మాస్వాదించి
    ఖ్యాతివహించు జగద్గురుండు,
బందిఁ బడినవారిఁ బశుల విడిపించి
    పశుహింస మాన్పు కృపానిరతుఁడు,
గీ॥ యాత్రికులపన్ను గోవధమణఁచి జైన
  సార్వభౌము బోధించు విజ్ఞానరాశి,
  "హరి విజయసూరి" భువన విద్యాగురుండు
  వేదిపై నొక్క యపరంజి పీఁటనుండె. 201

మ॥ పగిలించెన్ రిపుకోటి గుండియలు; నక్బర్ పాదుషాకిచ్చె ముం
  దుగ నాత్మీయ తనూజ; సైన్యపతులందున్ జూడఁగా నింతవాఁ
  డగు పింపండనఁ బొల్చు నంబరువిభుండౌ వృద్ధహర్యక్ష మా
  "భగవాన్‌దాసు" వసించెఁ జెంతఁగల భాస్వత్స్వర్ణ పీఠమ్మునన్, 202

సీ॥ "కచ్వహా"న్వయము లోకప్రసిద్ధ మొనర్ప
    నవతారమందు మహాభుజుండు

రక్తాబ్ధినుండి బర్మాదాఁక దనకత్తి
కెదురులేక జయించు పృదుబలాఢ్యుఁ
డప్రతిహతముగా నర్ధశతాబ్ద మం
బరుదేశ మేలు నృపాలచంద్రుఁ
డాఖ్యా కక్బరెకాని యఖిలంబున కితండె
యనఁగ వర్తించు సర్వాధికారి
గీ॥ జగము పుట్టుటాదిగ నింత శౌర్యరేఖ
యింతటి మహోన్నతౌద్ధత్య మింతమాట
బలిమిగల సైన్యపతి యెందుఁ గలుగఁడనెడు
మానసిం గధిష్ఠించెఁ బ్రధాన పీఠి. 203

సీ॥ మత సహనంబు శాశ్వత ధర్మమని యధీ
శ్వరునకు నేర్పు పావనగుణుండు,
చతుర చతుస్సహస్ర హయాధిపతి యౌచు
నక్బరుఁ గొలిచిన యలఘు బలుఁడు,
తనమాట విభుఁడు వేదంబంచు మన్నించి
తలదాల్ప మెలఁగిన ధన్యమూర్తి
తనదు కాలంబునందలి చరిత్రలు పెక్కు
వ్రాసిన యుత్తమ గ్రంథకర్త
గీ॥ యకలుషోదార వర్తనుండగు ఘనుండు,
దినము పదివీసియల తిండి తినెడు దొడ్డ
తిండికాఁ 'డబుల్‌ఫజ' లను పండితమణి
యలరె ముందట నొక్క స్వర్ణాసనమున. 204

సీ॥ లాహిరీపుర నృపాలకవంశ ముద్ధరిం
ప జనించినట్టి పావన గుణుండు,
హైందవాచార మర్యాదలా మూలాగ్ర
మెఱిఁగి యనుష్ఠించు గురుమనీషి,
ఘోరాహవంబున ఘూర్జరేశ్వరు గుండె
లవియంగ దాఁకిన యలఘు శౌర్యుఁ

దక్ష రీశ్వరుని సైన్యాధిపులంటు న
గ్రస్థాన మొందు వీరప్రభుండు,

గీ॥ దన గొలుసు క్రింద నాంధ్రావనిని గొలిచి
సిస్తులు విధించి యేర్పాట్లు చేయుటందుఁ
గలియుగమున వీని సముండు గలుగఁ డనఁగ
వెలయు 'తోడరమ' ల్లొక్క పీఠి నుండె. 205

సీ॥ ఘననేనుఁ డనెడు మందస్మితమూర్తి ముం
దొక్క పీఠముపైన నుండె; నితఁడు
రీవామహీంద్రు కూరిమి గాయకుఁడు; రాగ
మాలాపనము చేయ యామున జల
ములముగ్గె; రెండుగంటలపైనఁ బొగలేచి
బుగ్గలుపుట్టె; "నిప్పుండు మడిసె"
నని యక్బరన, వల లడరించి జాలరుల్
పట్టితెచ్చిరి; కార్య భంగమునకుఁ

గీ॥ గనలి హిందోళ–మేఘరాగములు రెండు
గానమునకు నిషిద్ధము గాకయనుచు
శాపమిచ్చిన గాయక సార్వభౌముఁ
డితని కీడఁ జెసాటి యీ క్షితితలమున. 206

సీ॥ పరమ శిశోదియాన్వయ ముద్ధరించు పృ
థ్వీనాయకుల కూర్మి పెండ్లికొడుకు,
త్రిసహస్ర గంధర్వ విసరాధిపతియయ్యు
వాహినీ పతులందుఁ బ్రపమగణ్యుఁ,
దకలంకవర్తన నక్బరు సభయెల్ల
దలఁదాల్చు దివ్యమందారమాల,
కవిరాజబిరుద సంకలితుఁడై యనుపమ
గ్రంథముల్ వ్రాసిన కవివరుండు,

గీ॥ ధరణి క్రుంగిన సభమెల్ల విఱిఁగిపడిన,
నడ రొక్కించుకలేక సత్యంబుపలుకు

పృధ్వీరాజాఖ్య రారోడు వీరమూర్తి
యలరె ముందున్న యొక యున్నతాసనమున. 207

సీ॥ కాలంజరీ సమగ్ర క్ష్మాతలంబెల్లఁ
బాలించుచుండు పావన గుణుండు
ప్రభువతంసుఁడు భగవాన్దాసు సేవించి
గౌరవంబందు విఖ్యాతకీర్తి,
యక్బరుహృదయ రహస్యంబు లెఱుఁగంగ
నేర్చి వర్తిలు చిర స్నేహితుండు,
కవి గాయకుఁడు కథా కథకుఁడై వక్తయై
సభ నలరించు ప్రజ్ఞారతుండు,

గీ॥ తనదు ప్రతిభానిరూఢి కీ ధరణిజనుల
వదనములు కాఁపురంబుండు సదనములుగఁ
జతుర సరసోక్తులాడు సంస్తుత మనీషి,
వీరబలుఁడుండె నొక దొడ్డపీఠమందు. 208

గీ॥ అలఘు లీలావతీగణి తాను వాద
కుఁడు, నలచరిత్ర వ్రాసిన గొప్పసుకవి,
యా 'ఫయాజి' ముందున్న హే మాసనంబు
నందుఁ గూర్చుండె నవిరళా నందమూర్తి. 209

ఆ॥ పారసీకభాష భారత రామాయ
ణములువ్రానె; నిజమతమున దురభి
మానశాలి యాబదోనీ కవీశ్వరుం
డవలి స్వర్ణపీఠి నాక్రమించె. 210

సీ॥ బికనీరు రాజ్య పాలకుఁడై చతుస్సహ
స్రహయాధి పతియైన 'రాయసింగు'
మాళ్వదేశాధీశ మణి గాయకవిభుండు
సౌజన్యరాశి 'బా జబహదూరు'
బహుదేశ చరితముల్వ్రాసి దిగంత య
శస్సాంద్రుఁడగు "ఫెరిస్తా" మనీషి

యుల తులసీదాసుతుల యాతఁడగు నన
వాసిగాంచిన "సూరిదాస" సుకవి

గీ॥ యట్టె గసగస గింజపై నాఖొరాను
ద్వాదశాధిక శతసర మాధ్యాయమెల్లఁ
బూర్ణముగ వ్రాసినట్టి "యబ్దాస్సమాదుఁ"
డధి వసించిరి యాణి ముత్యాలపీట. 211

గీ॥ 'షేక్‌ముబారక్' మొగల్ బుధశేఖరుండు,
నా 'హకీంహుమా' యక్బరు నాప్తమిత్రుఁ
డిరువు రొకచోటఁ బీరంబు లెక్కియుండి
రవిర ళానందమున సస్మితాస్యు లగుచు. 212

క॥ విరియు వివిధ కుసుమంబులఁ
బరిమళములు నించు పుష్పవాటిక సొబగుల్
బురుడించి సభాభవనము
దొర లందఱు గొలువ నలరెఁ దోరపుఁ గళలన్. 213

—• అక్బరు సార్వభౌముఁడు కొలువుఁగూటమునకు వచ్చుట. •—

గీ॥ సకల కల్యాణ భూషణ సహితమైన
చారులక్షణ భద్ర కుంజరమునెక్కి
యక్బరు సభాభవనమున కరుగుదెంచె
భిల్లుఁడును పల్లకీనెక్కి వెంటరాఁగ. 214

ఉ॥ అంతటఁ దూర్యముల్ మొరసె నక్బరు భిల్లునితోడ డిగ్గి య
భ్యంతరమందుఁ జొచ్చె దొరలందఱు లేచి నమస్కరించి రం
తంతనె వారి వందనము లందుచుఁ జేరెను సింహపీఠి; దు
ర్దాంత రవంబెలర్పఁగ బిరంగు లనేకము ప్రేలె నయ్యెడన్. 215

గీ॥ దుద్దుఁగంబడి బుజముల దుప్టి గట్టి
కరమున, నెసంగు గంభీర కాలమూర్తి
భిల్లుఁడు వసించె నొక దొడ్డపీటపైన
వేదికాంతమం దక్బరు విభుఁడు చూప. 216

క॥ చుక్కలలోఁ జంద్రునివలె
నక్కజముగ వెలిఁగె నక్బ; రందఱు దొరలున్
గ్రిక్కిరియుచుఁ గూర్చుండిరి;
చక్కఁగ సభదెసను బాదుషా కనుఁగొనుఁచున్. 217

సీ॥ "అఖిల సేనాధీశులార! సామంత నృ
పోత్తంసులార! యుద్యోగులార
యిది మహాసుదినమౌ నిపు డనంతానంద
మలరించు దొడ్డకార్యంబు జరిగె;
నామహాదివ్య హర్షాంశంబుఁ దెలుప మి
మ్మందఱ రమ్మంటి నాదరమున;
నా జీవితమున నింతటి యమూల్య సువార్త
నింతవరకుఁ దెల్పి యేనెఱుంగ;

గీ॥ నందఱును నాలకించి యానందమొందు"ఁ
డనుచు నంగరేకునను దాటాకుఁదీసి
యిందలి పవిత్రవార్తల నిపుడె చదువు"
మనుచు లేఖఁ బృథ్వీరాజు నందఁజేసె. 218

మ॥ వినయంబేర్పడ జాబు దోసిఁటను బృథ్వీరాజు చేకొంచు దా
నిని వీక్షించుచు రాతిబొమ్మ కరణిన్ నిల్చుండె; నక్బర్ విభుం
డనురాగోత్సుక చిత్తుఁడై "సుకవిరాజా! యేటి కట్లుంటివో
వినిపింపన్ దగు గాదె లేఖ"యనఁ బృథ్వీరాజు మోమెత్తుచున్. 219

సీ॥ "ఆస్థాన వాటియందడు గిడినది మొద
లారోగ్య మొకరీతి నను వుపడదు;
కన్నులు పచ్చనై కానరావీ తాళ
పత్త్ర మించుక కానఁబడునె; కాని
యక్షరం బొకఁడైన నగపడ; దిట్టి దు
స్థితి నివేదింపంగ సిగ్గుదోఁచె"
నన "శ్రమమేటికి ననువుగాఁ గూర్చుండి
కొంతకుఁగొంత విశ్రాంతి నొందుఁ"

గీ॥ డని వచించి యక్బ 'రబ్దారు రహిమాను'
వదనసీమ దృష్టి పఱపి "మీకు
జాబు నందఱువినఁ జదువుం"డనఁగ దాని
నతఁడు గొనుచు నిలిచె యవనపతియు. 220

క॥ "మీరును జదువఁగఁ వొరకొన
రూఱక యేమిటికి నిలిచియుండెద రిపుడే
ప్రారంభింపుం"డన, న
బ్దూరహిమానుండు వినయ భూషణుఁడగుచున్. 221

సీ॥ "పదినాళ్లుగా జ్వరబాధచే నారోగ్య
మనువుగా నుండలే; దైన, నీదు
నాజ్ఞ యనుల్లంఘ్య మగుట నెట్టులొ కష్ట
పడి సభాస్థలికి నే వచ్చినాఁడఁ;
గొంచెము కాలంబుగూడ నిల్వఁగ నాకు
శక్తి లేకున్నది సత్యమిపుడు
దేవరకడ నివేదించితి"నని విన్న
వింప, నక్బరునేత వెతవహించి

గీ॥ యేల ముందె తెల్పకపోతిరీ విధంబు
నుఱక సభకు రప్పింపక యుండి యుందు
నైన నిపుడేను చతురంతయానమెక్కి
యింటి కరుగుఁడు శ్రమ మందనేల యిచట. 222

ఆ॥ త్వరగ వెడలుఁడనఁ బ్రధానమంత్రియు "నిప్పు
డింటి కరుగఁజాల నిందె కొంత
సేపు విశ్రమింపఁ దాపంబుతగ్గు వి
చారపడకుఁ" డనుచు గూరుచుండె. 223

క॥ అనఘుం డక్బరు తన కర
మున లేఖను గొనుచు ముఖము ఫుల్లాంబురుహం
బును గేర మధుర కంఠ
స్వనమున "వినుఁ" డనుచు సభను జదువఁగఁ దొడఁగెన్.

"అక్బరు నృపాలకా!

స్వస్తి! యనవధరింపు:

మెడ తెలపిలేని యుద్ధంబు లెసఁగె; రుజకుఁ
దనువు పాల్పడె విశ్రాంతిఁ గొనఁ దలంతు;
నోడఁబడుదువేవి యార్నెలల్ గడువు చాలు;
వైరి వయ్యు మదార వావమ్ము గలపు;
వన్నె యుంగుదు మెయుఁగుదు నైతికమ్ము
హితము యోజించి, నీమతంబెట్లొ తెలుపు
తప్పక మెలంగునిట్లు ............

ప్రతాపసింగు."

సీ॥ అనుచు విశ్వములోని యవనీశ్వరుల యందు
సగ్రగణ్యస్థాన మాక్రమించు
నా పవిత్ర శిశోదియాన్వయాంభోరాశి
రాకా సుధాకర ప్రచురమూర్తి
ధన్యుండు రాణాప్రతాపసింహ నృపేంద్రుఁ
డాఱు మాసంబులు వ్యవధిఁగోరె;
వతవి ప్రస్తుత పరిస్థితులెల్ల విషయమై
పరిణమించిన యట్టి సరణితోఁచె;

గీ॥ నచిరకాలమునకు నామహాభాగుండు
సంధి కరుగుదెంచు జాడతోఁచు;
నంబరీశు మేటి యసమ ప్రయత్న మీ
యానుకూల్యమునకు నాస్పదంబు. 216

సీ॥ అకలుషానంద దాయకమైన కల్యాణ
వార్తను మీకుఁ జెల్పంగఁ గోరి
యందఱ నీదిన మాస్థానమునకును
జేర్చితి" ననుచు వచించునంత
"సంధియుఁదప్పక జరగుఁ బో"మ్మని కొంద,
"అతఁడు లోఁబడు సత్య"మనుచుఁ గొంద

"జా 'జలాలుద్దీను' హరిహరాదులుఁగూడ
సాపంగ నేర్తురే" యనుచుఁ గొంద

గీ॥ "జాప్రతాపుని దళ సహస్రాశ్వ పతిగఁ
జేయుఁ"డని కొంద ఱెత్తుగాఁ జేతులెత్తి
యా సభాభవనములోన నన్ని కడల
లోకులును మిన్నుముట్టంగఁ గేకలిడిరి. 227

గీ॥ అంత నక్బరు నృపమౌళి "యవును వారు
మైత్రి పాటింతురని తోఁచె మా"కటంచుఁ
బృథ్వీరాజుఁ "జూచుచు "నేఁటికిట్లు నిల్తు
రేల కూర్చుండ"రని పల్కెఁ బృథ్వీరాజు. 228

అక్బరు సార్వభౌమునితో లేఖ ప్రతాపసింహునిది గాదని పృథ్వీరాజు నివేదించుట.

గీ॥ "సేవకుఁడనేను; నాస్వామి వీవు;నాకుఁ
దెలిసినంత నీకడ నివేదించుటయును
ధర్మమగు విన్నవింతుఁ; బ్రతాపసింహ
కర లిఖితలేఖ యిదికాదు! కాదు! కాదు' 229

గీ॥ అమల కైలాసశైల శృంగమునకన్న
రమ్యతరమైన యామహా రాజుకీర్తి
నైపఁజాలని యాగర్వ శత్రుఁడెవఁడొ
యిట్లు కల్పించి లిఖియించె నిదినిజంబు. 230

సీ॥ ప్రాణ ప్రతిష్ఠ సద్భక్తితో నొనరించి,
యమృతాభిషేకంబు నలవరించి
కోటి కౌక్కఁడుతెచ్చు కుసుమంబు లర్పించి,
సాంబ్రాణి వాసనల్ సంతరించి,
పూర్ణ నైవేద్యంబు ముంచుంచి యర్పించి,
కర్పూర టారతుల్ కాన్కలొసఁగి,
మంత్ర పుష్పముపెట్టి మమత నాత్మ ప్రద
క్షిణ నమస్కార సత్క్రియలుదీర్చి,

గీ॥ భక్తుఁడెట్టులు నాత్మ దైవతముఁ గొలుచు
నట్లు స్వాతంత్ర్యమును గొల్చు నా ప్రతాపుఁ
డతని గళమునఁ గొనయూపి రాడుచున్న
నీకు లోఁబడు ననుమాట నీళ్లమూట. 231

సీ॥ బ్రహ్మ విద్యా మహత్త్వ రహస్య మెఱిఁగిన
యుత్తమోత్తమ రాజయోగిమౌళి,
హరిహర బ్రహ్మాదు లడ్డువచ్చిన నుంత
వెనుబోని భువనైక వీరమూర్తి,
పదునాల్గు లోకముల్ ప్రతిఘటించినఁ బట్టు
దల మానని భగీరధప్రభుండు,
తవిలి మార్కొన్న మేరువునైనఁ బాదుతోఁ
బెకలించు దుర్దమ పృధుబలుండు,

గీ॥ చంద్ర సూర్యులు గతిదప్పి చనిన నాత్మ
వైభవముఁ గోలుపోని యా భానుకులుఁడు
శ్రీఁదొఱఁగి తానుగా నీదు చెలిమికోర
నిలయుఁ గ్రుంగెనె యంభోధు లింకి చనెనె. 232

గీ॥ ఢిల్లితో మొగల్ సామ్రాజ్యమెల్లఁ గొనుచు
స్వయముగా నీవు పోయి తచ్చరణ యుగళ
మును భజించెదనంచు మ్రొక్కినను గాని
తగులఁ డాతండు వామపాదమున నేని. 233

సీ॥ తౌరుష్క నృప మహాస్థాన వాటికలోన
నిందఱు దొరలు నేఁడిట్లుచేరి
తనకమ్మఁ బరికించి తగునంచు 'నీపట్టు
పగ లిట్లభిప్రాయపడి రటంచుఁ
దెలిసెనేని ప్రతాపదేవుని కోమల
దివ్య చిత్తంబెన్ని దిశలనొగిలి
జాలినొందునొ తెల్పఁజాల; నక్బరటన్న
నతనికిఁ గొంత మర్యాదయుండె;

గీ॥ నక్కట! పరేంగితజ్ఞాన మణువుగూడ
లేచె విపరీత వర్తనల్ వీరటంచు
నమ్మహాత్ముండు తలపోయు; నతని మదిని
నున్న మర్యాదయును గూడ నూడిపోవు." 234

ఆ॥ అని వచింప నతని యంబుద గంభీర
భాషణములు విని సభాజనంబు
అబ్బురంబు నొందె; నక్బరు నవమంద
హాస రోచియగుచు నతనిఁజూచి. 235

—• అక్బరు సార్వభౌముఁడు పృథ్వీరాజునకు బదులు చెప్పుట. •—

సీ॥ "ఆ మహామహుఁడు పుణ్యస్వరూపుఁ డటంచు,
భువనైక వీరపుంగవుఁ డటంచు,
నర్కవంశ నృపాల కావతంసం బంచు,
ననుపమ శుద్ధ వర్తనుఁ డటంచుఁ,
గొలఁదిమీఱిన పట్టుదల గలవాఁడంచు,
నసమాన ధైర్య హేమాద్రియనుచు
నాశలేని యమానుషానంద పరుఁడంచుఁ,
బ్రతిలేని యాశ్వర భక్తుఁడనుచుఁ,

గీ॥ గ్రమ్ముకొను బహుళాప దర్ణవములందుఁ
గడిమి తగ్గని నెఱయోఁత కాఁడటంచు,
నే నొకఁడనేల యీదేశమెల్ల భువన
మెఱిఁగి యెఱిఁగి వేనోళుల నెపుడుమెచ్చు. 236

గీ॥ సర్వమంగళోదార ప్రశస్తమూర్తి
శ్రీప్రతాపు స్వాతంత్ర్య లక్ష్మి స్వరూప
తల్లి పాటేశ్వరీదేవి ధైర్యమహిమ
శిశువు లాటలలోఁ బ్రశంసించు చుంద్రు. 237

గీ॥ ఆమహీంద్రుపై నెంత మర్యాద గలదొ
పల్లకీనెక్కి వచ్చి సభాస్థలమున

వేదిపై హేమపీఠిపై వెలసియున్న
వన నివాసియా యాభిల్లవరుఁడు సాక్షి. 238

క॥ వీరకుటుంబం బగును మ
హారాణాగారి దనుచు నొందల యూఁపఁగ
నేరని వాఁడిలపై మన
నేరని వాఁడందు; నిజము నిజమిది యెందుఁన్.239

క॥ ఉన్నదిదె తాటియా; కిం
దున్నది నృపగురుని వ్రాఁత; యున్నది తుది వ్రాఁ
లున్నాఁడు భటుఁడు, పని యే
మున్నది లేదనఁగ, లేని దున్న దనంగన్. 240

గీ॥ తన్ననిపె మహా రాణాప్రతాపసింగు
జాబు నాకియ్య ననుచు నొసంగె దీని
బొంకపఁగ నెట్టిదో దాని పుట్టెఱుఁగని
మంచి మనసున్న యాభిల్ల మధురమూర్తి. 241

క॥ "ఇందు నసత్యం బుండదు
సందేహము వాయదేని శబరభటుని మీ
రిందఱిలో నడుగుం" డన
సందియ్యక పృథ్విరాజు "శ్రమ మేమిటికిన్. 242

క॥ ఈలేఖక్రిందఁ దవిలిన
వ్రాలునకును సత్యమైన వ్రాలున కెంతో
పోలికగల దంతియ; యీ
వ్రాలును నృపగురుని దనుచుఁ బలుకఁగఁ జాలన్. 243

క॥ వివరంబిది; యాభిల్లుని
నెవ్వఁడేనియుఁ బంపియుండు నీకాలమునం
దివి క్రొత్తలె ధన మున్నను
భువనంబులు మార్పవచ్చుఁ బో: నిమిషమునన్. 244

గీ॥ నింత యేటికి దేవర యనుమతింపఁ
బరమ విశ్వాసియైన సేవకునిఁ బంపి

యరయువాఁడ నిందలి సత్య; మంతదాఁకఁ
గమ్మ నమ్మక యుందురుగాక మీరు." 245

—• మానసింహుఁడు ప్రతాపసింహునిగూర్చి తేలికగా మాటాడుట. •—

క॥ అని బలము నిగుడ వచియిం
చిన వదనంబెత్తి మానసింహుండు "ప్రతా
ప నృపతియెడ నాకును దీ
రని వైరంబుంట యందఱకు విదితంబే. 246

క॥ అతఁ డతిలోక బలోన్నతుఁ
డతులిత విక్రమ నిధానుఁ డలఘు త్యాగా
న్వితుఁడనుట సూర్యదేవుం
డతితర తేజస్స్వరూపుఁ డనుటయ కాదే. 247

క॥ ఇనచంద్రులు గతిదప్పినఁ
దన స్వాతంత్ర్యంబు విడక ధైర్యంబున డీ
కొని కోటివిపత్తులు గో
టను మీఱెడు ధీరుఁడని దృఢమ్ముగ నెంతుఁగా. 248

గీ॥ ధైర్య శౌర్యాది గుణ సముదాయమునకుఁ
దగ్గనిది పెంకెతన మా ప్రతాపునందుఁ
గానిచో నందఱట్లు సౌఖ్యమున మనక
యూపిరాడని రణముల నేపు చెడునె. 249

సీ॥ "అఖిల దేశాధీశుఁడగు మహమ్మజ్జలా
లుద్దీను సాహాయ్య మొదవియుండ,
నుదయ పర్వతము నందుండి యస్తాద్రి మే
రకుఁ గల్గు సకల గోత్రాభరంబు
నెదిరి లేకుండ జయించిన నావంటి
పటు పరాక్రమశాలి ప్రతిఘటింప,
మానవమాత్రు లేరైన నింతటికన్న
నిమిషంబు తలయెత్తి నిలువఁజాల;

గీ॥ రీడకే పాదుషాగారి తోడి పోరు
తలమునుక లౌచుఁ బడియెఁ బ్రతాపుమీఁద;
నాతఁ డెంతకాలమొ యింక నని యొనర్పఁ
బూనఁ; డీయాస మఱికలలోని బాస. 250

సీ॥ మేవాడ రాజ్యలక్ష్మి యనాదయయ్యె దు
ర్గమదుర్గ నివహముల్ గాలిఁగలిసె
భాండారములు పటాపంచలై చెడిపోయె;
సేనాబలంబెల్ల శిథిలమయ్యె
సామంతనృపు లన్యసీమలకేగిరి
బంధు సంతానంబు పలుచనయ్యెఁ
దలదాఁచుకొన నింత నెలవును గఱవయ్యెఁ
గట్టుగుడ్డలు పేలికలుగఁ జిరిగెఁ
గీ॥ గడుపు మలమలమాడె బింకంబులూడె
బలముసుడిసె స్వాతంత్ర్య పిపాసలెడసె
నిట్టి నిరుపేద యనిసేయ నెంచుసేని
యతని సంరంభమెల్ల సన్న్యాసి పెండ్లి. 251

చ॥ అడిగెను నేఁటికీ వ్యవధి ప్రాణముపోవక; నాఱుమాసముల్
గడువవు చూడుఁ;డీ గడువుకాలము దాఁటకమున్నె పాదుషా
యడుగులవ్రాలితా నవినయంబొనరించిన జాడఁదెల్పి మ్రొ
క్కెడి; నివి లోకమందుఁ బరికించిన చర్యలె; నేఁడు క్రొత్తలే." 252

క॥ అను మీనసింహు మాటలు
వినినంత నొకింతవంత పెరుగఁగ స్వాంతం
బునఁ బృథ్వీరా జడఁపం
గనులేక సభాజనంబుఁ గలయఁగఁ గనుచున్. 253

— పృథ్వీరాజు మానసింహుని మాటలను ఖండించుట. —

శా॥ "ఏమో నాకటువంటి భావము రవంతేనిన్ మదిన్ లేదు వి
శ్వామేయ ప్రకట ప్రతాపుఁడు ప్రతాపాధీశుఁ డాబూగిరి

స్వామిఁగాకొరు ముక్కుఁడెప్డు శతలక్షల్ వీరయోధుల్ సమి
ద్భూమిఁ ముట్టినఁ గెంజివుల్లటు శిరంబుల్ గిల్లివైచుఁ జుమీ. 254

సీ॥ గోవిపాఁతయులేని కుంభసంభవుఁడు స
ముద్రముల్ ద్రావె నాపోశనముగ;
బడుగయ్యు మఱి వసిష్ఠుఁడు గాధిసుతుసేన
బ్రహ్మదండమున లోపలికిఁ గొనియెఁ
బ్రహ్లాదుఁ డైదేండ్ల ప్రాయంపు వాఁడయ్యు
విశ్వంబునెల్ల స్తంభింపఁజేసె;
నంగముల్ లేనివాఁడయ్యుఁ బంచశరుండు
పూవు టమ్ముల లోకములు జయించె;
గీ॥ నాత్మబలము ప్రధానమై యలరుఁగాని
యుపకరణములఁ బనియేమి యుత్తములకు
లేమియున్న, సాయంబేమి లేకయున్న,
నా ప్రతాపుఁ డధ్యాత్మ సత్వప్రభుండు. 255

గీ॥ అకట! యతఁడేడ నీవేడ యక్బరేడ
యమరగిరి కఱువునకున్న యంతరంబు;
జగము తలక్రిందయినఁగాని జరుగఁడోవ
దా ప్రతాపుఁడు లొంగుట" యని వచించె. 256

గీ॥ పులకిత శరీరులౌచు నౌదలల నూఁపు
దొరల తలల రుమాలులు వఱచె నపుడు
కమ్మ తెమ్మెర గ్రమ్మ వృక్షముల తుదల
గునిసి యాడెడు క్రొవ్విరిగుత్తు లట్లు. 257

సీ॥ "మానసింహ నృపాల! మనము పృథ్వీరాజు
విన్నపంబును డ్రోసివేయఁ బోల;
దిట నుండు వారిలో నితఁడొక్కఁడే మహా
రాణా ప్రతాపు గారాబుఁజుట్టు;
మితఁ డప్పుడప్పుడా యినకులస్వామి ద
ర్శన మొనరించిన చనువుకలిమి

నామహోమహాజావమన్ని యంశంబుల
యెడ నెక్కుడగురీతి నెఱఁగియుండు;

గీ॥ నింతకితఁడు తొందరమాని యెల్ల కార్య
గతుల దీర్ఘమాలోచింపఁగాఁదగుననె;
మనకుమాత్ర మిప్పటికి మించినదిగలదె
విదియఁ దోఁచని చంద్రుండు తదియఁదోఁచు. 258

గీ॥ ఎదిరి వాదమ్మునకుఁదగు నెన్నివసతు
లన్నియు నొసంగి సత్యంబు నరయు టుచిత
మాత్రమేమిటి కిపు"డని యవన నృపతి
దృష్టిమార్చి పృథ్వీరాజు దెసనుగాంచి. 259

ఉ॥ "నీవు వచించుమాట గణనీయమ యట్టులె నీకు నిష్టమౌ
కైవడి నమ్మనేర్చిన యొకానొక సేవకుఁబంపి, యాజగ
త్పావన వర్తనుండగు ప్రతాపుని భావ మెఱింగి, మాకు నా
యావివరంబులన్ దెలుపు మంచలి సత్యము రూపమేర్పడన్. 260

గీ॥ 'అంతదాఁక మేవాడపై నరుగరాదు
మొగలు సైన్యంబు' లనినేను ముదలసేతుఁ;
బనులు చాలింత మిపు"డని పలికి లేచి
సభ ముగియఁజేసెఁ; నంత దుందుభులు మ్రోసె. 261

—• పృథ్వీరాజు ఖిల్లుని దోడ్కొని తనయింటి కరుగుట. •—

సీ॥ కుండంబునుండి దిక్కులనిండ నగ్ని క
ణంబులు చెదరు చందంబుదోఁప,
సైన్యాధినాథు లాస్థానరంగము వీడి
యాత్మ మందిరముల కరిగిరపుడు;
రాజమార్గమున నగ్రస్థానమున నిజ
గృహము జేరఁగఁబోయెఁ బృథ్వీరాజు;
ద్వారసీమ కతనిభార్య జోషీబాయి
స్వర్ణ కుంభంబున జలముదెచ్చి

అ॥ పాదయుగము గడిగి పైచెఱంగునఁ దడి
యార్చెఁ; లోని కిరుపు రరిగిరపుడు;
పావనానురాగ బద్ధ శోభన రాజ
హంస దంపతులను ననుకరించి. 262

గీ॥ "ఆఱు మాసముల్ విశ్రాంతి యవసరమని
పాదుపాకడకీ భిల్లభటుని బంపె
నా ప్రతాపదేవుం"డని యతనిఁజూపెఁ
బృథ్వీరాజు; జోషీబాయి వెతఁగలంగె. 263

సీ॥ "ఏమంచు నీకిచ్చె నీకమ్మ రాణా ప్ర
తాపేశ్వరుం"డంచు ధవుఁడునుడువ,
"వ్రాయునప్పుడు కమ్మ వ్రాయుపైఁ దద్భావ
మెట్టులుండె" నటంచు వింతియడుగు;
"నా మహామహు ముఖంబంత నొచ్చినయట్లు
కనుపించెనే" యంచుఁ గాంతుఁడనఁగఁ;
"బాటేశ్వరీమాత ప్రభుఁడు లేఖ లిఖించు
కతయెఱుంగునె" యంచు నతివపలుకు

గీ॥ "భక్తమణి సలుంబ్రాస్వామి పాయకెపుడు
విభుని గొల్చునె" యని భర్త పృచ్ఛసేయఁ,
"గసరు మొగ్గలు మాతల్లికాన్పు లడవి
కాకలకు స్రుక్కిరో" యంచుఁ గాంతయడుగు. 264

ఉ॥ "చెప్పుము చిత్తమిచ్చి యిదె శ్రీనృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ముఖాంబురుహంబునఁ జంద్రబింబ మం
దొప్పెడి వెన్నెలట్లలరు నుత్తమమౌ దరహాసరేఖ తా
నెప్పటి యట్లపాయక రహించుచు నుండునె భిల్లశేఖరా." 265

క॥ అని మఱియు మఱియు నయ్యం
గనయును బతియొత్తి యడుగఁగా భిల్లుండుఁ
దనమది కుదురు పఱచి క
ల్గిన సంగతు లెల్లవారికిఁ వినిపించెన్. 266

సీ॥ "తొలిదినంబునఁ జీఁకటులు క్రమ్మ వఱకొజి
విడక రేఁగె" నటన్న వెతవహించు
"దినరాత్రములు రెండు తిండిలేక కుటుంబ
మలసిపోయె" నటన్నఁ గళవళించు;
"గాలియు వాన జగత్ప్రళయము లేఁప
నుఱికె" నన్నను మది నుమ్మలించుఁ;
"బిల్లిరొట్టెను నాఁచి బిడ్డకొమ్మను జీల్చి
పోయె" నంచు వచింపఁ బొక్కిపోవు;

గీ॥ "రాజగురు సార్వభౌము వజ్రంపు గుండె
కఱకు సెడి మెత్తవడిపోవానెఁ గమ్మ''యనిన
వేఁడి నిట్టూర్పుపుచ్చి యాపృథ్వీరాజు
లేమ కన్నీటి మున్నీటిలో మునింగె. 267

సీ॥ "తపనీయ ఘటిత సుందర మందిరములున్నఁ,
బలురకంబుల నుపవనములున్నఁ,
మదనోపమానుఁడై మన్నించు మగఁడున్న,
దాసీజనంబు వందలుగనున్నఁ,
బెన్నిధులను మీఱు విత్త సంపదయున్నఁ
గరమరుదైన భోగంబులున్న.
వలువలు నగలు రాసులు రాసులుగ నున్నఁ,
దమమాట వేదమై తనరుచున్న

గీ॥ మాటవినఁ గష్ట మిప్పటి మానవతులు
తినఁగఁ గట్టఁగలేక కాననమువెంట
నాథు దేవునివలెఁ గొల్చె. నాదుపెద్ద
తల్లిఁబోలిన సాధ్వీమతల్లి గలదె! 268

గీ॥ జగములోని వీరులును రాజన్యవరులు
గొలువ విశ్వోన్నతుండునై యలరవలయు
తండ్రి పశుపాట్ల కకట! యంతంబెలేదె"
యని కలంగి జోషీబాయి యడలువడియె. 269

గీ॥ తనకుల సుధాంబురాశి పూతమ్ముసేయ
నవతరించిన పద్మాల యావతార
యలఘు సాధ్వి జోషీబాయి యడలుచూడ
రాదనుచు సూర్యుఁ డపర వారాశిడాసె. 270

సీ॥ పలురంగులీను పుష్పులచే నలరి మంది
రము వెన్కఁ నొక్క యారామమలరు;
నారామమున వట్టి వేయలతో గప్పఁ
బడి యొక్క చలువ చప్పరము చనరు;
నద్దాని నడుమఁ గద్రమాసనములు కొన్ని
వానినడుమ నొక్క బల్లయుండె;
మొకమాలు వలువ సొంపులుగుల్కఁ బైనఁ ద్రాఁ
తకుఁదగ్గ యన్ని సాధనములుండె;

గీ॥ నంతఁ బృథ్వీరాజొక విశాలాసనమున
బల్లముందుఁ గూర్చుండి నిల్వెల్ల దీర్ఘ
యోజనలమున్గి కొంత సేపుండి పిదపఁ
గరమునను గాగితంబును గలముఁగొనియె. 271

--• ప్రధానమంత్రి యబ్దూరహిమాను పృథ్వీరాజును దర్శింప వచ్చుట. •--

గీ॥ అంత సేవకుఁ డపుడెంచి "యగ్రమంత్రి
గారు విచ్చేసి" రనవెళ్లి గారవించి
ప్రక్కవాఁకిటఁ జలువ చప్పరమునందుఁ
జేర్చి తానును జెంత నాసీనుఁడయ్యె. 272

క॥ "పదినాళ్లుగ నారోగ్యము
కుదురుగ లేదనుచు మీరు కొలువునఁ దెలుపఁగా
మదిఁ జింతపడితి; నెటు లు
న్నది యి"ప్డని పృథ్వీరాజనంగ సచివుఁడుఁగా. 273

సీ॥ "అచటి విశేషంబులన్ని మీకెఱిఁగింప
వలె ననియే యిట్లు వచ్చినాఁడ;

ఖానుకులస్వామి వ్రాసిన యాలేఖ
నవలోకనము చేయు నంతమాత్ర
నామహామహుఁడు లోకైకాగ్ర పీఠంబు
డిగ్గి యక్బరుకుఁ జేయొగ్గు నట్టి
దుస్థితి యేర్పడెఁ; ద్రోవయించుక లేదె
యని నాదు మనసులో మనసులేదు;
గీ॥ కమ్మఁ జదువఁగ మది జాలి క్రమ్ముకొనుచుఁ
'బదిదినంబులు బాధించె జ్వర' మటంచుఁ
బలికి తప్పుకొంటిని గాని బాధగలుగ;
దెప్పటట్లు నాకారోగ్య మెసఁగి యుండు. 274

సీ॥ పుట్టినప్పటినుండి బొంకన్న నెట్టిదో
దాని రూపమొకింత యే నెఱుంగ;
నామహారాజు వ్రాయఁగలేక వ్రాయు నా
కష్టగర్భితలేఖఁ గాంచి నపుడు
నాసత్యమెట్లు పాడై సమసిన మాసె,
ననృతంబు పలికి నే నాచరించి
ద్రోహంబు లేదని తోఁచి, యెట్టులో కష్ట
మున 'జ్వరం'బని నేను బొంకినాఁడ;
గీ॥ ననృత దోషంబునైన ధైర్యమున నోర్తు;
నామహాభాగు మదిని దైన్యమున కోర్వ
లే'' నటంచు నబ్దురహిమానుఁ డనఁగఁ
బ్రీతి యుట్టిపడంగ, నాపృథ్విరాజు. 275

సీ॥ "ఆనందమయ్యె మీ యారోగ్యవార్తకు;
నాకమ్మ సభను నేనందిచూడఁ
బదములక్రింద భూభాగ మట్టులె క్రుంగి
పాతాళమునకేగు పదిగిఁ దోఁచె;
వీరాధివీర నిత్యారాధ్య దేవతా
క్షత్ర తేజోమయ స్వర్ణమూర్తి

యువనిని బొరలుసే యని, పేరడ్లి పందిరి
కుప్పఁగూరఁగ ధాత్రిఁ గూలుసె యని,
గీ॥ దేవ! నాపరితాపంబు దేవుఁ డెఱుఁగుఁ;
గమ్మఁ బరికింప దగ్గుత్తికయు జనించి'
యింతమాట రాదయ్యె; నేనేమిసేయ
రామి, నవె నిల్చిపోతి, ఱాప్రతిమ భాతి. 276

ఉ॥ అమ్మహనీయు గౌరవము నంతయు నింతయు తగ్గఁజేయు నా
కమ్మ నొకింతయుం జదువఁగా మనసించుకలేక "నాదు నే
త్రమ్ములు పచ్చనయ్యె; లిఖితమ్ముఁ గనుంగొన లే'నటంచ స
త్యమ్మొకఁ డడ్డుపెట్టి యెటొ తప్పుకొనంగను గంటిఁ గొల్వునన్." 277

క॥ అన, లేనగ వొకయందము
నను పలుప నెమ్మొగమున కల్హారహిమా
నుసు "జిట్టిచివరఁ జక్కని
పని చేసితి రంభను సెబాసని మెచ్చున్. 278

ఉ॥ 'ఈకడఁ గమ్మ బొం'కనుచు నేర్పడదెల్పి నిజాప్త భృత్యులో
నైక సుహృత్తముం దరియ నంపఁగ సక్కరు నేత సమ్మతిన్
గైకొనివచ్చి గొప్ప యవకాశముఁ గూర్చితి రిప్డు; విస్మయై
కాకరమైన నీదు సమయస్ఫురణంబు నుతింప నొప్పెదున్. 279

సీ॥ అవిరళ త్యాగంబు నకలంక వర్తన
స్వాతంత్ర్యరక్తి దేశమునభక్తి
సౌజన్యయుక్తి నా జనపాలకులమౌళి
సకల భారతయోగి చక్రవర్తి;
కసపు రొట్టెలు స్ఫటికంపు సీరముఁ గొంటుఁ
గామధేనువు భంగిఁ గ్రాలు;నతని
నాదర్శమూని యోగ్యతఁబెంప వారు వీ
రన కందఱకును బాధ్యత యొసంగు;
గీ॥ హృదయమున వీర రసమున్న నెవ్వఁడైన
దేవ పూజాగృహమున నాధీరు విగ్ర

హాము నిలిపి షూ(డు వేళల నర్చసేయు
టర్హమను సూక్తియందు లే దతిశయోక్తి. 280

గీ॥ ఆ శిశోదియా వంశ దుగ్ధాబ్ధి చంద్రు
చరణములు పూజసేయ విజ్ఞప్తి వ్రాసి
తీసికొని వచ్చినా(డ నే; దీని( జదివి
వలయు మార్పులు గావింపవలయు" ననిన. 281

గీ॥ "అయ్య! నీకమ్మ కన్నుల నద్దుకొనుచు(
జదివి హర్షింప(గల యదృష్టంబెచాలు;
గమ్మతావుల వీ(చు నీకవనమునకు
మెఱు(గులను గూర్ప(జాలు నేర్పరులు గలరె." 282

గీ॥ అనుచు( బృథ్వీరాజు విశేష హర్షమలర
నవివు విజ్ఞప్తి పత్రంబు చక్క(విప్పి
విడివిడిగ ముత్తియములట్లు వెలయుచున్న
కమ్మయందలి ప్రత్యక్షరమ్ము చదివె. 283

సీ॥ తూ(చియుంచిన మాడ్కి( దో(చు శబ్దంబుల
హాయికి మదిలోన నలరి యలరి,
సరస స్వభావ పేశల మనోభావంబు
లచ్చొత్తి నట్లుండ మెచ్చి మెచ్చి,
యాత్మావబోధ రహస్యాంశములు నిండి
యుబుకుట(గని తలయూ(చి యూ(చి
ప్రసరించి నిలువెల్ల రసముట్టి పడునట్టి
ఘట్టంబులను జూచి కర(గి కర(గి,
గీ॥ భారతీయ గౌరవము కాపాడు మనుచు
భక్తి వేదచల్లుచో మోద బాష్పతతులు
వెల్లువలుగట్టి దూ(క, నా పృథ్వీరాజు
హర్ష జలరాశి( దేలి నీరై స్రవించె 284

ఉ॥ "ఎంత మహానుభావులరొ యెంత తపంబొనరించినారొ దు
ర్దాంత పరాక్రమాంకు(డు ప్రతాప మహీంద్రు పదాబ్జయుగ్మ మం

దెంతటి భక్తిభావము వహింతురొ వేయునునేల లేఖ యా
ద్యంతము సద్రస స్ఫురణ మంది సుధల్ గురియించు చుండెడిన్. 286

ఉ॥ ఈరచనా విశేషమును నిందలి త్యాగము వీరపూజయున్
గూరుచునట్టి మోదమునకున్ గలిగించెడు దేశభక్తికిన్
బారములేదు; నిక్కముగ భారతదేశ చరిత్రమం దలం
కార విశేషమౌచుఁ ద్రిజగంబులు మెచ్చి నుతింప నొప్పెడిన్. 287

గీ॥ ఒక్క వ్రాలున్న నిదిదేవ యోగ్యమగుచు
వెలయు' నని పృథ్వీరాజనఁ బ్రెగ్గడయును
"ననఘ యాలోపమును దీర్చునట్టి భార
మిపుడు మీపైననుండు; వ్రాలిడఁగ వలయు." 288

మ॥ అని పల్కన్విని పృథ్వీరాజు "సచివేంద్రా! నీమనోవీధి సం
జననంబౌ మృదుభావ సంపదలును నుత్సాహమ్మునన్ జేర్చి కూ
ర్చిన యీయుత్తమ లేఖకున్ జివర మీ శ్రీనామధేయంబు నుం
చినచో శీర్షముపైఁ గిరీట మిదునా చెల్వంబు దీపించెడున్. 289

క॥ అమలమయి, లోక విఖ్యా
తము నౌచు గురుత్వమందు త్వన్నామ సువ
ర్ణ మయాక్షరముల లేఖాం
తమునన్ శోభిల్లఁజేయు ధన్యప్రవరా." 290

చ॥ అని వచియించునంత వదనాంబురుహంబున వింత భావముల్
మునుకొని తోఁప, నాసచివ ముఖ్యుఁడు మోమునువాల్చి లోక పా
వన సుచరిత్రుఁడైన యల భానుకులేంద్రు కటాక్ష వీక్షణం
"బున కిసుమంత పాత్రమగు పోఁడిమిగల్గునె నన్ను బోంట్లకున్. 291

సీ॥ ఇనకులేశ్వరుఁడు నేనెవ్వఁడ ననుమాట
గూడ నెఱుంగని క్రొత్తవాఁడ;
నార్యమత విరుద్ధమైన మహమ్మదీ
య కులంబునను జన్మ మందినాఁడ;
భారతదేశంబు వాఁడఁగాను; బ్రతాప
భూ రమణునకును దూరగుండఁ;

బరమ శత్రుండంచు వారు భావించిన
క్రూరు పాదుసాహికిఁ బ్రథమమంత్రి;

గీ॥ నామహాత్మని దొడరిన యాపదలకు
నంతయో యింతయో హేతువైననాఁడ
గాన నీకమ్మ నాసంతకమ్ము మోపఁ
గాదు; నాకట్టి భాగ్యయోగంబు లేదు. 292

ఉ॥ ఆ రవివంశ్యమౌళి జగమంతకుఁ బూజ్యుఁడు నాకు: నన్నుఁబోల్
క్రూర తురుష్కు వ్రాలుఁగని కోపము నొందునొ యేమొ; శాంతి వి
స్తారము తన్మనంబెరియు జాడఁ బ్రవర్తిలఁజాలఁ నెన్నఁడున్;
క్షీర ఘటంబునన్ విషముఁ జిల్కెడు కిల్బిషచిత్తు లుందురే. 293

మ॥ తలఁతున్ నేనొకరీతి సుస్థిరముగాఁ దద్దర్శన స్పర్శనం
బులు లేకున్నను నీభవంబున జగత్పూజ్యంబులౌ తత్పదం
బుల ధ్యానింపుచు, దివ్యనామము జపంబున్ జేయుచున్, గాలమున్
దొలఁగన్ ద్రోయుదునేని ధన్యుఁడ నటందున్; లేవుపో లోపముల్.

క॥ రాజకులోద్భవుఁడవు కవి
రాజవు మఱి బందుతా విరాజితుఁడవు, రా
రాజు హితుండవు, వేఱగు
యోజన లేమిటికి వ్రాల నుంపుము వేగన్." 295

క॥ అనఁ బృథ్వీరాజు తన మన
మున నాతని భక్తి భావమున కాశ్చర్యం
బును బొంది "సచివశేఖర!
నినుఁ గొనియాడంగ నెవరు నేర్తురు ధరణిన్. 296

సీ॥ విశ్వోన్నతంబైన వీరపూజాసక్తి,
తనివోని యసమాన దైవభక్తి
సముదార భవ్య పేశల హృదయంబును,
బరిశుభ్రమగు నార్ష వర్తనంబు,
సర్వసమత్వ నిశ్చల దివ్యభావంబు,
స్తుతిసేయఁ దగినట్టి మతసహనము,

సకల దిగంత విశ్రాంత భూరి యశంబు,
స్వాంతంబు నిండ దయారసంబు

గీ॥ నలరు ఘనుఁడవు; యవనుఁడ వైననేమి
యుత్తమోత్తమ భారతీయుఁడవు; నీవు
వ్రాయు నీకమ్మ నాప్రతాప క్షితీంద్రుఁ
డాదరించుఁ దప్పక" యన, యవనమంత్రి. 297

గీ॥ "కులముఁ దలఁపక గుణ గణంబులు గ్రహించు
జ్ఞానఖని నిత్యసాత్త్వక చక్రవర్తి
యతనిమదిఁ దావుగలదె కోపాంకురమున;
కికట! యెఱుఁగక యాడితి నంతెగాక. 298

సీ॥ అతికష్టమగు పరిస్థితులందు భక్తి ర
సోద్బుద్ధమైన యీయుక్త లేఖ
నా మహామహుని దివ్యాభిదానంబె యా
ద్యంతంబు వర్ణితంబగుట, నిదియు
భారత ఖండంబు వావి చరిత్రలో
నతులితాగ్రస్థాన మాక్రమించుః
నట్టి యుత్తమలేఖ యందు నావ్రాలుంట
యసమాన పరమ భాగ్యమ్ము నిజము;

గీ॥ భక్తిమెయి నిండు వ్రాసిన పద్యమాల
భువని గురునకు విరజాజి పూలమాల
యగుచు హృదయమెక్కి కృతార్థమయ్యె నేని
మనల మించు ధన్యులులేరు క్ష్మాతలమున. 299

క॥ పామూ స్వాహారంబది
స్వామి యెదుర నుంపఁబడి ప్రసాదమగు నటుల్
పామరుఁడ యవనుఁడను నా
నామ మతనిఁజేరి పావనంబగుఁ గాతఁజా. 300

గీ॥ ఆత్మధర్మంబునెంచి కార్యంబునెంచి,
యన్నిఁటినిమించు నాపరమాప్త మిత్రు

నైన మీయాజ్ఞ నెంచి నాస్వాంత మిపుడు
వ్రాలిడుటె యుక్తమంచు నిర్ణయ మొనర్చె
గీ॥ అనుచు, వ్రాలుంచెఁ; బృథ్విరాజస్లై చేసి,
దాని నదికించి "రాణాప్రతాపసింహ
దేవునకుఁ, గైల వారాప్రదేశ" మనుచుఁ
బైన లిఖియించి, యాభిల్లభటున కిచ్చె. 302

—• భిల్లుఁడు డిల్లీపురము వీడి వచ్చుట. •—

ఆ॥ పలు రకములతిండి బండారముల తోడఁ,
గంబళమునఁ గట్టు కమ్మతోడఁ,
బైనఁ గురియుచుండు పలుదీవనలతోడఁ
దరలె భిల్లుఁ డురు ముదంబుతోడ 303

ఆ॥ "అల్లవాఁడె భిల్లుఁడంట; యక్బరు సాహి
యోలగమునఁ గూరుచుండె నంట
నాప్రతాపు దూత య్యఁట యితం''డని, మేడ
లెక్కి నిక్కిచూచి రింతులెల్ల 304

క॥ శ్రావణమాసము ముదిరెను
మేవాడ్దేశమున నభము మేఘాకీర్ణం
బై వాన లలముకొనె హా
రావళివిడి ఢిల్లిఁ జేర నరిగిరి యవనుల్. 305

శా॥ అంతన్ రాగ మెలర్ప భిల్లపతి డాయన్వచ్చి "హారావళీ
ప్రాంతారణ్యమువీడి రయ్యరులు సంగ్రామంబునన్ నిల్చె వి
శ్రాంతిన్ జెందఁగ నాదు గూడెమునకున్ రా''మ్మంచుఁ గొంపోయె దు
ర్దాంత ప్రాభవు నాప్రతాపుని సభార్యాపుత్ర సైన్యంబుగన్. 306

గీ॥ రచ్చపట్టునఁ బెనురచ్చ మ్రానిక్రింద
శబరపతి కృష్ణసింగు పార్శ్వముల నుండ
దుర్జయుఁడు లోనుగాఁగల్గు దొరలుచుట్టు
గొలువఁగఁ బ్రతాపు డొకనాఁడు కొలువుచేసె. 307

గీ॥ ఆమడయు నొక్క యడుగుగా నరుగుదెంచి
మోము ముసిముసి నగవుల మురువు గులుక
ఖిల్లుఁ డిథితులకును బ్రణమిల్లి భక్తి
దనరఁ గమ్మఁ బ్రతాపు పాదముల నుంచి 308

సీ॥ "ఎకిమీఁద పాదుషా కిచ్చితిఁ గమ్మ యా
తని యరుసంబింత యనఁగఁ జెల్ల
దూర సింగారించె నౌడఁగూర్చె నొక పెద్ద
సభ కమ్మ నందిచ్చి చదువుమనియెఁ
బృధ్వీరా జదిచూచి వెనుకకిచ్చెను బెద్ద
మంత్రిగొని చదువ మానెఁ దురక
జేఁడు తానె చదివెఁ బృథ్వీరాజు "ప్రతాప
నృపుఁ డిట్లువ్రాయఁ బోఁ; డిది యెవరిదొ"
గీ॥ యని పలికె నక్బ "రొకబంటు నంపి నిజము
నరయు"మనెఁ బృథ్వీరాజును నగ్రమంత్రి
యిరువు రేహాంతముగఁ గూడి యిట్లు జాబు
వ్రాసి శ్రీపాటములు చేరఁ బంచినారు." 309

ఆ॥ అనుచు మ్రొక్కి నిలిచె నందఱు మౌన ము
ద్రావిముద్రి తాస్యులై వెలింగి
రాప్రతాపుఁ డంత నాసలుంబ్రాస్వామిఁ
గాంచెఁ గృష్ణసింగు కమ్మఁదీసి. 310

——• ప్రతాపసింహునకు డిల్లీనుండి వచ్చినలేఖ. •——

సీ॥ మేవాడరాజ్య లక్ష్మీ ధాం ధౌరేయ
పరిణాహ దక్షిణ బాహుదండ
కమల బాంధవ వంశ కలశ పారావార
సంపూర్ణ రాకా తుషారకిరణ
బప్పరా యాన్వయాభరణ దుర్మదవైరి
తామిస్ర చండ మార్తాండమూర్తి

స్వాతంత్ర్యపూజ్య రాజ్యరమా స్వయంవ రా
స్థాన సింహాసన సార్వభౌమ
గీ॥ భవ్య భారతదేశ సంభావనీయ
సన్మతస్థాప నాచార్య సకల బిరుద
స్థిరతర పరాక్రమక్రమాజేయ విమత
భూప గజరాజసింహ! ప్రతాపసింహ! 311
గీ॥ శ్రీలఁ దనరారు విశ్వ దేవాలయమున
నలము మేవాడ గర్భాలయంబు లోన
వెలయు నర్ధేందు కోటీర విగ్రహంబ
వనఘ! నీపాదములకు జోహారులివిగొ. 312
గీ॥ గజము చర్మంబుఁ, జిచ్చుల కన్నుఁ, బూవ
చందురునిరేక కైలాసమందు విడిచి
భరత ఖండంబు నుద్ధరింపఁగ జనించు
ధూర్జటివి నీవు; రాజమాత్రుఁడవు గావు. 313
గీ॥ సత్వ భరితుండవై నిత్య సత్యమూర్తి
వగుచు ననవర తాత్మోప హారముల నొ
సంగి స్వాతంత్ర్యమును గొల్చు జ్ఞానరాశి
వీవు దైవస్వరూప మవే నిజంబు. 314
గీ॥ జగము గొనియాడు స్వాతంత్ర్య సౌధమునకు
వజ్ర సోపాన పంక్తులు పఱచుచున్న
నీయశో వైభవముల వర్ణింత్రు నిర్జ
రాంగనలు స్వర్ణమయ వీణ లాలపించి. 315
ఉ॥ తావక ధర్మయుక్తియు నుదార యశంబును దేశభక్తి హా
రావళి యొండుగాక భరతావని యొక్కఁడుగాక యింక నీ
స్థావర జంగ మాత్మకము సర్వజగంబును వేయినోళ్ళ సం
భావన సేయుటల్ చెవుల పండువుగా వినుచుందు మెప్పుడున్. 316
గీ॥ పుష్పరాశిని బడువహ్ని పోల్కిఁ, బాలఁ
బడిన విసమట్లు, కంటిలోఁబడిన ముల్లు

నటు, హరాత్తుగ నీకమ్మ యట్టె వచ్చి
స్వాంతములు వ్రచ్చెఁ; గొండంత వగవుదెచ్చె. 317

మ॥ ఘన సౌభాగ్యములూడి భారత మహాఖండంబు దాస్యాంధ కా
ర నిమగ్నంబయి యుండ లోకముల దౌర్భాగ్యంబులుం దీఱె నేఁ;
డని హర్షింపఁ బ్రతాపభానుఁ డుదయంబై యుండె; మాదుష్కృతం
బున లేమబ్బులు సోఁకి చాటుపడునేమో యంచు నొచ్చెం మదుల్.

సీ॥ "సప్త పారావార సంవృతాఖిల మహీ
వలయమేల" నటంచు వగవ వెపుడు
"ధనధాన్య వసన వాహనకోటి బొత్తుగా
లే" దంచు మదిలోనఁ గ్లేశపడవు
పార్వతీ సతిఁబోలు పాతేశ్వరీదేవి
పడు కష్టములకునై యడలఁబోవు
బాల చంద్రకళల వంటి బిడ్డలు తినఁ
గూడులేదని వంతఁ గుందవెప్పు

గీ॥ డనఘ వాతాంబు పర్ణాశివయ్యు నిఖిల
భువనములు గెల్వఁదగు వీరమూర్తి వీవు
కటకటా! నీవుపంపిన కమ్మలోని
జాలియగు పల్కువిని గుండె వ్రీలెమాకు. 319

క॥ "తొలఁగెను విభవము; రాజ్యము
తొలగెను; సిరి తొలఁగె; హితులు దొలఁగి" రటంచుం
గలఁగకుమీ దేవుని దయ
నెలకొన్నను విశ్వమెల్ల నీయదె సుమ్మీ. 320

గీ॥ తెగని కష్టంబు లలము నీదేశమందు
వెలికి యుబికె నీసత్త్వమే వెలుఁగుఁ గొంత
కనులుగుట్టు మబ్బులు గ్రమ్మ కాళరాత్రిఁ
దళుకు తళుకని మెఱయు సౌదామని వలె, 321

గీ॥ క్షత్ర ధర్మంబు క్రుంగి నాశనమునొందె;
బీరుపోయె వర్ణాశ్రమాచారవిధులు

భారత త్రాణమున కాది పద్మనాభుఁ
డిపుడు నీరూపమున జన్మ మెత్తినాఁడు. 322

గీ॥ భరతఖండంబులోని భూపాల గణము
లసమ బాహాసమగ్ర వీర్యమును, సతులు
మానమును, గోలుపోయి; రీమాట మేము
దేవ! నీమ్రోల నెటు నివేదింతు మిపుడు. 323

గీ॥ తనదు నేల్బడినంత హైందవ మహత్త్వ
మక్బ రంతయుఁగొను దొడ్డ యడితికాఁడు
మమ్ముఁ గొనెఁ;గాని సంగ్రామ మనుమనిఁ గొను
పెద్దనాణెముల్ వెలితిగా విన్నవోయె. 324

మ॥ నవరాత్ర్యుత్సవవేళ వేడుకలలో నన్ రాజపుత్రాన్వయుం
డెవఁడైనన్ దనయాత్మ గౌరవ భరంబింతేని రక్షించుకొం
చవమానంబును బొందకుండెడినె కట్టా! విత్తురున్ క్షాత్ర ధ
ర్మ వికాసంబును బాపి యంగడుల నమ్మన్ జెత్తువే నేఁటికిన్. 325

చ॥ లలిత కళావిలాస శబలంబగు చిత్రముఁ గాంచి యొక్కఁ డం
దలి యసమాన నైపుణి కెదన్ గఱఁగున్; మఱియొక్కఁడందు 'రం
గులు నునుఁగుంచె గుడ్డయును గూలియు నింతని నిర్ణయించెడున్
వెల! యెవఁడిందభిజ్ఞుఁ డనభిజ్ఞుఁ డెవండొ జగంబెఱింగెడున్. 326

గీ॥ ఈవు విశ్వప్రపంచమం దీశ్వరుని య
నంత లీలాగతులు గొనియాడె దెపుడు;
విలువ గట్టుచు రాజ్యంబుఁ గొలుచు నక్బ
రెవరి గొప్పతనంబెంతొ యెఱుఁగు జగము. 327

సీ॥ భౌతికధనము సర్వముఁ గోలుపోయిన,
రవివంశ జనన గౌరవ ధనంబు,
నభిమాన ధనము,లో కాతీత విక్రమ
ధనమును స్వాతంత్ర్య ధర్మధనము,
కడు సమృద్ధంబుగాఁ గలవాఁడ వనుచు నీ
దివ్య యశంబెల్ల దిశలమ్రోగె;

నిట్టి దుర్దమశక్తి యెటనుండి వచ్చె నీ
కని జగంబెల్లప్పు డడుగుచుండు;
గీ॥ నని యొకఁడె దోడునీడ నీకద్వితీయ
ధైర్యసారంబె నీపాలి దైవమనుచు
హర్ష బాష్పంబు లురల మాయిట్టి వార
లాడుకొను మాట లగునొ నిరర్థకములు. 328

గీ॥ స్త్రీలఁ బురుషుల రాజ్యంబు దేశమెల్ల
విలుప నీయక్కరను గొప్ప విలువకాఁడు;
బ్రహ్మకల్పంబుగా గాత్రి బ్రదుకఁ; దంద
అపుడు పునరుద్ధరింప నిన్నాశ్రయింత్రు. 329

గీ॥ కులము గుణమును జూడ కీక్షోణి జనుల
కలుషము లడఁచి నిత్య నిర్మలతఁ బెంచు
జాహ్నవియుఁ బోలె యువన సంసర్గ దోష
మడఁచి పునరుద్ధరింప యోగ్యుఁడవు నీవు. 330

సీ॥ కానియు మొదలు లక్షలుఁ గోట్లు రాసులు
రాసులై పెరిగిన ద్రవ్యములును,
బూరి గుడిసె మొదల్గా రమ్య నవరత్న
ధర్మ నిర్మిత మహా భవనములును,
బంటు మొదలు సర్వ పార్థివ వర్ణముల్
పదము గొల్చెడు సార్వభౌమ పదవి,
బడుగు గుఱ్ఱము మొదల్ ప్రబలాజి సాధన
సన్నద్ధ చతురంగ సైన్యములును,
గీ॥ గాల వాహినిలోఁ బడి కదలిఁ గలియుఁ;
చేదవడి బెంచుదేలియుఁ బెంపు నెదని
కర్మవీరుని స్వాతంత్ర్య ధర్మరతుని
యశ మొకఁడె శాశ్వత జ్యోతియై వెలుంగు. 331

ఆ॥ సూది బెజ్జమందు శుండాలముల దండు
దూర్చి వెలికిఁ దాఁటవచ్చు నేమొ.

భాగ్యభోగ రతుఁడు పరమేశ్వరుని కూర్మి
నొందలేఁడు; సౌఖ్య మందలేఁడు. 332

గీ॥ మొగిలు మేసెడు కొండ కాపురము శిలలు
సింహ పీఠముల్ పులులు నెచ్చెలుల పిండు
లారఁబండిన పండు లాహార మిట్టు
లేదీ యెటులున్నను గొఱంత యేది నీకు. 333

సీ॥ "శ్రీమించు నీదు దక్షిణ బాహుదండమే
దిక్కింక భారత దేశమునకు;
నమృత మొలుకు నీకటాక్షమేయింక నీ
హైందవులకు జీవ నౌషధమ్ము;
బెద రెఱుంగని నీదు హృదయమే భారత
స్వాతంత్ర్యలక్ష్మి కాస్థాన వాటి;
తావకనామమే దాస్యాంధ కారమ్ముఁ
బోఁదట్టు దివ్య భానూదయంబు;
గీ॥ నీ స్వరూపంబె పరదేవతా స్వరూప'
మనుచు జగమెల్ల నినుఁ గొనియాడి కొలుచు
నీవె విశ్రాంతిఁ గోరుచుఁ జేవిడిచిన
సున్నదే త్రోవ, భారతాభ్యుదయమునకు. 334

సీ॥ తలచూపరాక వానలు ముంచుకొని నట్లు
యావన ప్రళయంబు లాక్రమింప
స్త్రీల పాతివ్రత్య దీక్ష పూరుషుల క్షా
త్ర మడంగె శశి సూర్యధామ మట్టు
లేకార్ణవంబైన యీ విపత్సమయ మం
దీ విశ్వమునకెల్ల నీ వొకఁడవె
ప్రళయంబు నోఁకక వటపత్ర శాయియౌ
పురుషోత్తముని రీతి స్థిరత నిలిచి
గీ॥ తిపుడు నసిచెడ్డ సకల ధాత్రీశ హృదయ
వాటి స్వాతంత్ర్య బీజముల్ నాటెదవని

యనఘ మాకుండె బ్రహ్మాండమంత యాస
కట్టి యొనరింతె నట్టేటి పుట్టి మునుక. 335

గీ॥ బరువు పడ కిన్నియేండ్లు కాపాడినాఁడ
వనఘ! స్వాతంత్ర్య కనక గర్భాలయమునఁ
బ్రజ్వరిల్లు నఖండ దీపమ్ము; నిపుడు
కొండ యెక్కింతువే కినుకూర్మి దేవ. 336

గీ॥ పొడమి తోడనె యడఁగు బుద్బుదమువోలె
నరుని జీవితము క్షణ భంగురముగాదె
శ్రమ కడలి దేశమంధ కూపమునఁ ద్రోయు
పాప మొడిగట్టు కొనకు ప్రతాపదేవ 337

ఉ॥ చాలని కాలమై చరణ సన్నిధిఁజేరి వచింపలేని మా
జాలిని దేవుఁడే యెఱుఁగుఁ; జిక్కఁగవిప్పి వచింపలేము: నీ
కాలను ముల్లు గ్రుచ్చినను గంటను గ్రుచ్చిన యట్లు నొప్పితోఁ
దూలి యొనర్చు విన్నపముఁ ద్రోయకు పాయకు వీరమార్గముల్. 338

సీ॥ కడలెల్ల నిండఁ జుక్కలు రాలఁగాలేదు;
కులశైల శిఖరముల్ కూలలేదు;
గ్రహకోటి సంచారగతులు మాఱఁగలేదు;
గగనంబు వ్రయ్యలై పగులలేదు;
భూదేవి పాతాళమునకుఁ గ్రుంగఁగను లే;
దేడు సముద్రంబు లింకలేదు;
పవమానశక్తి స్తంభన మొందఁగాలేదు;
వహ్ని తేజము చల్లఁ బడఁగలేదు;
గీ॥ విరిసి బ్రహ్మాండ భాండంబు వ్రీలలేదు;
భువన మేకార్ణవంబయి మునుఁగలేదు
ధైర్య హేమాద్రి రాణ్ప్రతాపదేవుఁ
డాఱు మాసముల్ విశ్రాంతి గోరెనేల. 239

గీ॥ నీ యశోగానమునఁజిక్కి నిఖిలజగము
చొక్కె; నానంద మందిరి సురలుగూడ;

సత్ప్రయత్నంబు క్షణము విశ్రాంతివలదు
తంద్రి మ్రోయింపు విడక స్వాతంత్ర్యభేరి 340

గీ॥ ఉదయ గిరిపైన రవి పూరుచుండు నట్టు
లల్ల హారావళీ పర్వతాగ్రసీమఁ
గొలువు దీఱెడు నీమూర్తిఁ గొలుచు జగము;
నీకు స్వాతంత్ర్య రాజ్యాభిషేక మగుత. 341

గీ॥ సంగర తరంగ సంక్షుభి తాంగమనుచు
నలము కొనియున్న బహు విపదబ్ధి యందుఁ
జెక్కు చెదరక చిక్కక నేమమునను
నడచెడునుగాక యుష్మ దానందనౌక. 342

సీ॥ నీకటాక్ష విలాస నియతి యీక్షితికిఁ గ
ల్యాణ తోరణరాజి యగునుగాక
ముందు రాఁగల కాలమందు "స్వాతంత్ర్య దై
వత' మంచు నీపేరు వఱలుగాక
మూఁడువేళల జగంబున వీరులందు నీ
కగ్ర పూజాస్థాన మలరుఁగాక
భారతీయులు హృదబ్జములందు నీమూర్తిఁ
జేర్చి యెల్లపుడు పూజింత్రుగాక

గీ॥ మాత పాటేశ్వరి చిర సుమంగలియయి
యచల రాజాత్మజ విధాన నలరుగాక
యతులి తారోగ్య భోగ భాగ్యములతోడ
నర్కకులదీప' నీకు బ్రహ్మాయువగుత. 343

గీ॥ భవ దుదాత్త వృత్తము త్యాగవైభవంబు
మామదిని గొల్పు భక్తి యీమాడ్కి యవన
నృపు ఋణముఁగూడ మఱపించి నిన్నుఁ గొలువఁ
బురికొలిపె; సాహసమని తప్పరయకయ్య. 344

ఆ॥ నీపదాబ్జ యుగము నిరతంబుఁ గొలుచుచు
భక్తిగల విధేయ వర్తనమున

నలరువార; మిట్టు లబ్దారు రహిమాను
పృథ్వీరాజు' లనఁజరింతు మెపుడు.'' 345

క॥ అని చదివి సలుంబ్రాపతి
మనమున నుదయించు భక్తి మాహాత్మ్యమునన్,
గనుఁదోయి నొత్తుకొని లే
ఖను విభు పాదములు సోఁకఁగానిడి మ్రొక్కెన్. 346

క॥ అచ్చటి యందఱ మనములు
విచ్చి ముఖాబ్జముల నిండ వింతగు మోదం
బచ్చువడి హర్ష బాష్పము
లెచ్చంగఁ బ్రతాపదేవుఁ డెల్లరఁ గనుచున్. 347

మ॥ "నెల దాటంగను జొచ్చె నక్బరునకున్ నేలేఖ నంపించి; యీ
నెలగా నక్కట సూర్యవంశము దెసన్ నేరంబుఁ గావించి నిం
దలపాలైతి నటంచుఁ బల్మఱును జింతన్ గుందితిన్; గాని యా
కలఁతల్ సర్వముదీర్చి హర్షభరమున్ గల్గించె నీ లేఖయున్. 348

గీ॥ శత్రు పురమున యావనాస్థాన సీమ
నింత విస్వాసిక మనస్కు లింతసుగుణ
భరితు లుండుట యిప్పుడే యెఱిఁగి, యింత
వఱ కెఱుఁగనైతినే యంచు వగచుచుంటి. 349

మ॥ తన సత్కీర్తికి భంగమౌ గతిని స్వాతంత్ర్యంబుఁ దోనాడి శ్రాం
తినిఁ గాంక్షించెఁ బ్రతాపుఁడంచు వగ సంధిల్లంగ నాపృథ్వీరా
జును నబ్దారహిమానుఁ డీయిరువు రిచ్ఛోజ్ఞాన దీపంబు పెం
పున నజ్ఞానతపంబుఁ బాపుచు యశంబున్ బెంచి రెంతేనియున్. 350

మ॥ స్మరణీయంబగు వారిసాయము, కృతజ్ఞత్వంబుఁ బాటించి త
చ్చరితంబుల్ స్మరియింపకున్న ఋణమీ జన్మంబునన్ దీఱ; దా
హార భట్టారకుపేరు వెన్కఁ గడు పుణ్యాస్వాంతులౌ వీరి యి
ర్వుర నామంబులె యుత్తమోత్తమ పదంబున్ బొంది వాసిన్ గనున్.

క॥ మఱవఁ దగదు; వీరు చిర
స్మరణీయు'' లటంచుఁ బలుకంగ సంతోషము పొం

పిరివోవ సలుంబ్రా ధీ
శ్వరుఁడును మది భక్తి నావ వైభవ మలరన్. 352

—: సలుంబ్రా కృష్ణసింహుఁడు డిల్లీలేఖను గొనియాడుట. :—

క॥ పరు సుద్యోగులు, మనతో
దుర మొనరింపంగ వలయు దొరలయ్యును, న
క్పరు వీడి మిమ్ముఁ గొలిచిరి
గురుతుల్యు లటంచు నెంచుకొందుము మాకున్. 353

క॥ ద్యుతి మంతమయి జగద్వం
దితమయి యీదివ్యలేఖ దేవార్పణ పా
వితమగు కర్పూరపు హా
రతివోలెఁ బవిత్రమై విరాజిలు చుండెన్. 354

క॥ హృద్యములై, యనుభవ సం
పాద్యములై, సరళ సరస పాక కళా సం
వేద్యములై, లేఖను గల
పద్యములు పదార్థ గౌరవంబునఁ దనరున్. 355

క॥ మావంటి సేవకులు సం
భావించి పఠించి దినము పారాయణమున్
గావింపఁ దగినవై కడుఁ
దావనమై వెలుఁగు నిచటి పద్య చయంబుల్. 356

చ॥ పదిలముగాఁగ నీదుపద పంకజభక్తి మనంబు లోపలన్
మెదలెడి వారిలోన ననుమించిన భక్తుఁడు లేఁడటంచు నా
మొదలిడి నుండియున్ గరువముల్ మదినుండెను; నిప్డు "డెందమో
గదరె మహానుభావు'లను కైవడి నాకెఱుఁగంగ నయ్యెడిన్. 357

క॥ విజ్ఞాపన మిద్దానిని
నాజ్ఞా పత్రముగ నస్మదాదులు గొని మా
యజ్ఞాన ముడిపెదము ప్ర
జ్ఞామణీ! దీని నొసఁగి మమ్మేలఁ గదే." 358

క॥ అనుచుండ భిల్లపతి యా
తనిఁ గాంచుచు "భక్తియోగ ధర్మ రహస్యం
బును మిమ్ముఁ బోలె నెఱిఁగిన
మనుఁజుడు లేఁ"డనుచు రాజమణిఁ గన్గొనుచున్. 359

సీ॥ బాధ్యత గల గొప్ప పదవి తౌరుష్క సా
మ్రాజ్య లక్షిత మహామాత్య ముద్ర
యది యొకఁడే గాక యక్బరీశ్వరుతోడి
వియ్యంబు నెయ్యంబుఁబేర్మి పెంపుఁ
దృణముగాఁ జూచుచు గుణము కోరుచు నిన్నుఁ
దనతేని గర్వ శాత్రవుని గొలిచి
యే విపత్తులనైనఁ నెదిరింప సమర్థుడై
నట్టారు రహిమానుఁ డనఘ గుణుఁడు
గీ॥ కమ్ముఁ జదువఁగాఁ జదువఁగాఁ గడకతండు
పరమభక్తుని నేకలవ్య ప్రకార
శిష్యుఁడై కొల్చి మమ్ము గెల్చెనని తోఁచె"
ననిన నంతఱ దెసఁ గలయంగఁ జూచి. 360

ఉ॥ "కమ్మ నదెట్లొ వ్రాసితిని; గమ్మను బంపిన దాదిగా నన
ర్ఘమ్మగు శ్రాంతియేల వలదం చనిపించి తపించుచుంటి; నీ
కమ్మయు నాకుఁ దోడుపడెఁ గష్టమొ సౌఖ్యమొ నెత్తిఁ బడ్డ ధా
రష్టుఁ దొలంగఁ ద్రోయఁగను రాదు; రణంబె శరణ్య మెప్పుడున్. 361

గీ॥ కమ్మ వినినంత మద్భుజాస్కంధ మందుఁ
దోఁచెఁ బదివేల పీనుల బోర్నలమ్ము;
రణ మొనర్పంగఁ గోర్కె లుగ్రముగ రేఁగె
వీర విహరణ మొనరింప వెడల వలయు. 362

సీ॥ లోకముల్ తలక్రిందులుగఁజేసి భారత
స్వాతంత్ర్యమును నిల్పఁజాలుదు రని
యందఱు కొండంత యాసతో మనవైపు
చూపులు వఱపిన చొప్పుదోఁచె

నే హేతువునసైన నేము స్వధర్మ ని
ర్వహణంబు నందు దుర్బలులమైన
మేవాడకేగాక యీవిశ్వమందలి
ప్రజకెల్లఁ దప్పిన వారమగుదు

గీ॥ మస్థిరపు జీవితములపై నాసమాని
భారతత్రాణ దీక్ష నిబద్ధులమయి
దేవదానవకోటి నెదిర్చి యైనఁ
గార్య సాఫల్య మొందఁగాఁ గడఁగ వలయు. 363

చ॥ పొడమి యధర్మముల్ పొదలి పొంగుచు దాస్యము వీరధర్మముల్
ముడివడె; మాతృదేశము విముక్తికి నాదు శరీరమందునన్
గడపటి రక్త బిందువునుగాని మిగుల్చు కొనంగఁబోక నేఁ
దడిపెద నేని యీధరణి ధన్యుఁడ నయ్యెద నీభవంబునన్. 364

మ॥ దినమందైనను రేయియైనఁ ద్రుటి శ్రాంతిన్బొందఁ గాంక్షింప; నా
హవ రంగంబె నివాసమందిరము చేయన్ బోయెదన్; బ్రాణ వా
యువు లీదేహమునందు నుండువఱకెల్లోపూని స్వాతంత్ర్య దే
శ వికాసంబునుబోవ నీనని ప్రతిజ్ఞన్జేతు మీముందరన్ 365

గీ॥ అని విభుండనె భిల్లేశుఁ"డల్లె యగుత
మీవు చెప్పినంత యొనర్చుటే నిజంబు
పిలిచి పిలిచియైన రణంబు సలుపవలయు
వలచి వలచి యాపదల నోర్వంగ వలయు. 366

గీ॥ అఖిల భిల్లరాజ్యము మంత్రి కప్పగించి
పులులఁ బోల్ వేనవేలు లెంకలను గొనుచు
నను నిమేషంబువచ్చి నీయండ నుందు;
నా మహాభుజమున్న నీకేమి కొఱఁత. 367

క॥ గళమునఁ బ్రాణము లుండఁగఁ
దలపూ వాడంగనీక త్వత్పాదాబ్జం
బులఁ దలనిడి ముల్లోకం
బులు దాఁకిన నుంత ముల్లు మోవఁగ నీయన్." 368

క॥ అని యెగ్గెత్తి వచించెను
వినిన యందఱు హర్ష మనుభవింప, సలుంబ్రా
వనిపతి "దేవా, విక్రమ
మన నీసొమ్మనుచు జగము లభినందించెన్. 369

క॥ నీవెంట మాతృదేశము
సేవించి విపక్షకోటిఁ జెండాడఁగ మా
జీవితము లుపకరించిన
నీ విశ్వమునందుఁ గొదవ యేదీ మాకున్. 370

క॥ తారాగృహ మాది, సలుం
బ్రా రాజ్యాంతంబు దాఁకఁ బ్రజలును శ్రీమ
న్నారాయణ మూర్తివిగాఁ
జేరి భజించెదరు నీదు శ్రీపాదములన్. 371

గీ॥ ఆగ్రహానల దీప్త ముఖోగ్రమైన
రణ మహోదగ్ర నట్టె కర్తవ్యయంబుఁ
బట్టి యాడింపఁగలవు నీపాదభక్తు"
లనఁ బ్రతాప ప్రభూత్తంసుఁ డాస్యమెత్తి. 372

మ॥ "అమితోగ్రంబుగ యుద్ధముల్ జరుగు; నావంతైన విశ్రాంతి నొం
దము మీకున్న యమూల్య వస్తువుల వెంటన్‌గొంచు నీనాఁడె సూ
ర్యమహాల్ దుర్గముఁ జేరఁబోవలె" నటంచాజ్ఞప్తిఁ బాలించె; శీ
ఘ్రమె సేనాపతులెల్లఁజేరి దరియంగా నేఁగిరా దుర్గమున్. 373

ఉ॥ "మీరలు నాకు వంద్యులరు; మీకృతమున్ మఱవన్‌-; రణంబె నేఁ
గోరుదు; శ్రాంతి నింపుకయుఁ గోర" నటంచని పృథ్వీరాజు న
బ్దూరహిమానుఁ గూర్చి తలఁపున్ బ్రకటించెఁ బ్రతాపసింహుఁ; డ
వ్వారును నక్బరీశునకు వార్తలు దెల్పిరి సత్య మేర్పడన్. 374

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్ష వీక్షా సమాసాదిత రస వత్కావ్య నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణ పారీణ, "దుర్భాక" వంశ దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర సుజనానుగ్రహపాత్ర వెంకటరామార్యపుత్ర కవిసార్వ భౌమ- సాక్షాద్వీర ప్రతాపాది వింశత్యధిక బిరుద విఖ్యాతసుకవి రాజశేఖర "రాజశేఖరకవి" ప్రణీతంబయిన "రాణాప్రతాపసింహ చరిత్రం"బను పద్యకావ్యమునందుఁ జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర

## పంచమాశ్వాసము.

—— వసంతము. ——

సీ॥ నునుపారి మెఱుఁగు దీరిన గుజ్జు లేమావి
చిగురాకు బాకులు చికిలిచేసి,
ననలాని వగరు పెల్లునఁ గికారించు కో
యిల హుమాయీల నాయితముచేసి,
నిలువెల్ల విచ్చి తావులు చిమ్ము దాసాని
పూలతో నెఱ్ఱ జెండాలనెత్తి,
యరవిచ్చుతేకుఁ దామర తుపాకులఁ దేటి
గమి యుక్కుగుండ్ల నగాదుచేసి,
గీ॥ పరువపు వసంతుఁడను దొడ్డ తురకఱేఁడు
కలయవనపాళి పసదనమ్ములఁ గఱంచి,
లలిత రాజాతపత్ర మండలము బెరయ
దళముగొని చిల్కపింఛుతో దండు వెడలె. 1

—— యవనులు రాజపుత్రుల దుర్గములను గొనుట. ——

క॥ రణమాఱు ప్రతాపుఁడు తన
దౌ మానము నిలుపుకొనుట యరుదని యక్బర్
భూమీశు సైన్యపతు ల
చ్చో మూఁగిరి బలములెల్లఁ జుట్టును గొలువన్. 2

క॥ బల్లిదుల భటులగొని "యం
తల్లా" దుర్గంబుకడఁ బ్రతాపవిభుం డ
బ్దుల్లాఖానుని దాఁకెను
ముల్లోకము లతని ధృతికి మెచ్చుచు పడఁగన్. 3

సీ॥ తౌరుష్క భటులు మత్త మతంగజము లట్లు
తాఁకిరి రిపుసేన దద్దరిలఁగ;
రాజపుత్రులు మృగేంద్రశ్రేణిఁ బోలెఁ బై
దూఁకిరి యవనులు దొరలి పడఁగఁ;
బ్రళయభానుఁడు వోలె వెలిఁగి ప్రతాపేంద్రుఁ
డరిమధ్యమున బ్రాలి నణఁకసాగె;
వందలు వేలుగా బ్రమందిరి రెండు ప
క్షములందు; సమర ముగ్రముగ రేఁగెఁ;
గీ॥ బ్రొద్దుమాపటి వేళకు మొగలుసేనఁ
గొని ఫరీదువచ్చి కలిసికొనియె; రాజ
పుత్రులకు సంగరము తల మునుకలయ్యె;
యవన సైన్యంబుల యధీనమయ్యెఁ గోట. 4

క॥ బారులు బారులు యావన
వీరులు శైలంబులెక్కి వెడలుచు నవలన్
"దోరణగృహ" దుర్గము "చాం
దేరి" దుర్గంబుఁ గొనిరి ధృతిమేపారన్. 5

క॥ వేఱొక సేనాపతి మా
ర్వారు దెసను సేనఁగొనుచు వచ్చి మహోగ్రం
బౌరణ మొనరించుచుఁ బోలి
మేరను "నాహూరు"కోట మెట్టెను గడిమిన్. 6

సీ॥ నీల కాదంబినీ నివహంబు చందాన
సకల దిక్కుల విపత్సంచయములు
పేరినకాలంది భవిష్య దాకాశంబు
విపులాంధకార సంవృతము గాఁగ

సైన్య మంతంతకు సమసిపోయెను; దుర్గ
సంఖ్య క్రమమ్ముగా సన్నగిల్లెఁ;
నాప్రతాపుని ధైర్య మతని సాహసము ద్వి
నందిన వృద్ధినొందంగ సాఁగె;
గీ॥ నింతలోననె వర్షర్తు వెదిగివచ్చెఁ;
బర్వతము ల రేఁగెడు విషవాయువులకుఁ
గొలఁకు లందలి విషజలంబులకు స్రుక్కి
మొగలు సేనలు ఢిల్లికిఁబోయె మఱలి. 7
సీ॥ విశ్వంబునెల్లఁ బిప్పిగఁజేయఁ జాలి గుం
పులు గాఁగఁబడు పిడుగులకు నడలి
జడివట్టి కురిసి మాసముదాఁక విడువక
చెలరేఁగుచుండు వానలకుఁ జిక్కి
కుక్షిలోనికిఁ గ్రుచ్చుకొని పోయి శ్రమఁ బెంచు
నీదర గాలికిఁ బేద వడియు;
రక్తమంతటిని పేరఁగఁజేసి హృదయంబు
స్తంభన మొనరించు చలికి స్రుక్కి;
గీ॥ చిత్తయెండల వేఁడికి నత్త మిల్లి
రాజగురు సార్వభౌముఁడు రాణి వాస
మనుఁగు బిడ్డలు నలజడి కగ్గ మగుచుఁ
దాండవులు గూఁడ బడనట్టి బాధ పడిరి. 8
క॥ కొమ్మలకును బల్లవ నివ
హమ్మువలెఁ జైత్రమాస మంతట నారం
భమ్మైన యవన నృప సై
న్యమ్ములు గుంపులయి వెలసె హారావళిపై. 9
గీ॥ పాదుశాహి యానతిమెయి భరతఖండ
మందు విఖ్యాతిఁ గనిన సైన్యాధినాధు
లెల్ల వేంచేసి 'యజ్ఞార గృహము' "దేవ
గృహము"ను "విరాటగృహ" దుర్గమిన్ని గొనిరి. 10

—• "సూర్యమహల్" ధుర్గ యుద్ధము. •—

మ॥ సమదేభేంద్ర సమాన వీరభటు లుత్సాహంబుతోఁ గొల్వ, ద
ర్పము శోభిల్ల మహమ్మదీయభటు లంబర్ నుండి మర్వారు దే
శమునందుండియు వచ్చి యెల్ల దిశలన్ శైలంబు లందెక్కి సూ
ర్యమహల్ దుర్గము చుట్టు ముట్టిరి సమగ్రాటోప మేపారఁగన్. 11

చ॥ వితత కరాళ మృత్యుసమ భీకర విక్రములైన యాత్మ యో
ధతతులనెల్లఁ బూన్చుచు బ్రతాపుఁ డరాతులఁ దాఁకి సంగర
క్షితినిఁ దదీయ శీర్షములఁ జిందర వందర చేయుచుండె; నీ
గతి నొకమాసముల్ గడువఁగా యవనుల్ కడుఁజింత మున్గుచున్.

సీ॥ కోటలో నొక్క నిగూఢమార్గ మెఱింగి
గుమిగూడి పోయి ద్వారమును దెఱచి
యర్ధరాత్రము లోని కరుగంగఁ బూని, రా
సడి యెట్లొ యెఱిఁగి దుర్జయుఁడు వచ్చి
యడ్డగించెను; యుద్ధమతి భయంకరముగాఁ
జెలఁగె; మొగలులు ద్రోసికొని లోనఁ
జొరఁ బూనిరి రది చూచి చోండావతుల్ దవా
గ్నిజ్వాల లటులు క్రిక్కిరిసి తాఁకి;

గీ॥ రక్కుఁ డుడయించు నరికిఁ బోరగ్గ మయ్యె;
నంత భిల్పురాపురి నుండి యరుగు దెంచి
సూక్తసింహుఁడు తురకల స్రుక్కఁజేసి
సరభసముగ దుర్గ ప్రవేశం బొసర్చె. 13

ఉ॥ ఘోరముగా రణం బెదిగెఁ; గొన్ని దినంబులు దాఁటినంత, నా
హారపదార్థముల్ దఱిగెఁ; నంతట నొక్కయెడన్ బ్రతాప ధా
త్రీరమణేంద్రుఁ జేరఁజని "దేవ నిగూఢ కవాటమందునన్
దూఱుచుఁబోయి 'భీమగడ' దుర్గముఁ జేరఁగ యోగ్య మియ్యెడన్.

క॥ చాలన్ గాలము నిలువఁగఁ
జాలదు దుర్గంబు; తిండి సంబారములున్

జాలపు; మీరిపు·డపుగుట
యే లగ్గగు నాకుఁజూడ నిందుండి వడిఁన్" 15

మ॥ అని పాదంబుల చెంత వ్రాలుచు సలుం బ్రాధీశుఁ దర్శింప స
జ్జననాథాగ్రణి భీమదుర్గమునకున్ సైన్యంబులన్ గూడి పో
యెను; శేషించిన సైన్యముల్ భుజబలం బేపారఁగాఁబోరెఁ; సై
న నెలన్ దాఁటకమున్న దుర్గమును జెందన్ గల్గి రామోగలుల్. 16

మ॥ బలమెల్లన్ గృశియింపఁ జొచ్చినఁ బ్రతాపస్వామి జాంబూనదా
చలమున్ బోలి పరాక్రమక్రమత స్వచ్ఛందమ్ముగా నిల్చెఁ; బి
డ్డల ధార్యన్ జెఱఁబట్టి నాతఁ డగచాట్లన్ మున్గునం జెంచి సే
నలతో ముట్టిరి భీమదుర్గము నమంద స్థైర్యులై శాత్రవుల్. 17

—• యవనులు భీమదుర్గమును ముట్టడించుట •—

సీ॥ యవనులదెస ముఖ్యమై ప్రకాశించె న
త్యలఘు బృహన్నాళికాస్త్ర వహ్ని;
రాజపుత్రుల దెసరాజిల్లఁ దొడఁగెఁ బ్ర
ధానమై బాహాప్రతాప వహ్ని;
యగ్నిచూర్ణము ధాటి కాకోట నట నట
గండశిలలు కొన్ని పిండి యయ్యెఁ;
క్షణమునకు క్షణంబు గడియకు గడియ యా
వనచమూ ప్రతతిని బలము తఱిగెఁ;

గీ॥ నిప్పు లుమిసెడు నారక్త నేత్రములును
మండుచుండెడు భయదాజ్య మండలములు
రక్తసిక్తపరిచ్ఛద రాజి వెలయ
రాజపుత్రుల పోరు దుర్వార మయ్యెఁ. 18

క॥ వెల దాఁటుఁదాక యవనులఁ
గలనఁ గలఁచి నృపగురుండు కాపురముఁ దగన్
దలఁగించి బోయపల్లియ
నిలిపి పదిల పఱచి మఱల నెక్కొనె ననికిన్. 19

మ॥ పరమప్రీతిని భిల్లలోక పతి యాపాపేశ్వరీ పాద పం
కరుహ ద్వంద్వముఁ గొల్చి తోడుకొని యా 'కావా' ఖనిఁ జేర్చెఁ;నా
కరుణాసాంద్ర మనస్క యత్తఱిని భూగర్భమ్మునఁ జేరు నా
ధరణీనందన మాడ్కిఁ బెంపెసఁగె నౌదార్యంబు దీపింపఁగన్. 20

గీ॥ రాణివాసంబు భిల్ల రాష్ట్రంబుఁ జేరు
పెటిఁగి మహాబతుఖాఁసేన నురిపడిమెయి
దఱిమె; దుర్గమ వనముల నరుగలేక
గరళముఁ దన్న వేఁపుఁ గతిఁ గలంగె. 21

గీ॥ విచ్చె మొగులులు; గగనంబు విమల మయ్యెఁ;
గాపురముతోడ ననుచర గణము తోడఁ
గదలి బోయగూడెము వీడి శైలవార
సీమలకుఁ జేరె వీర లక్ష్మీ ప్రభుండు 22

గీ॥ విడిదిమార్పులు పగర రాయిడుల కూర్పు
లాత్మబలము తగ్గెడినూర్పు, లలజడిఁ గొనఁ
దొడరి తలఁకును మగటిమి త్రోపు లాడ
వెనుక జూడక నృపుఁడు ముగ్గాని వెనంగె. 23

గీ॥ ఒక్కమెయి రేయుఁబవలును గ్రుక్క గొనక
జయము దవ్వైనకొలఁది నుత్సాహశక్తి
రవులు కొల్పుచు నడిపె సంగ్రామదీక్ష;
విమతులకుఁ జిక్కెఁ గడమ దుర్గములు గూడ. 24

సీ॥ మిట్ట మధ్యాహ్నంబు మిహిరుఁ డుగ్రుండయి
చెలరేఁగె; నొకచోటఁ జెట్టు నీడ
బోయ గడ్డిని దెచ్చియీయఁ బాపేశ్వరి
రుబ్బి కాల్చుచు నుండెరొట్టి యలను;
పిడుగు పాటున వచ్చి పడియె నంబరు దిక్కు
నుండి పరీద్ఖాను దండు గొనుచు;
మను జేశ్వరుండు కొమ్మలు వంచి బుట్టల
బిడ్డల భార్యనుబెట్టి విడిచెఁ;

గీ॥ ననుచరులఁ గూడి యవనసైన్యంబుఁ దాఁకి
పదులు నూఱులుగాఁ దలల్ చిదిమివైచె;
నంత భిల్లులు వనసీమ నాక్రమించి
పిల్లలను రాణిఁ జేర్చిరి భిల్లవాటి. 25

సీ॥ షాబాజుఖాన్ గొప్ప సైన్యంబు తనవెంటఁ
గొలువంగ లోయ లోపలికిఁ జొచ్చె;
శైల సాంకేతిక సాహాయ్యమూఁద ప్ర
తాపుఁడు భటులఁ గొందఱనుఁ గూర్చి
యాకస్మికమ్ముగా నరిసేనపై మారి
మసఁగిన గతిఁ గ్రమ్మి మట్టసాఁగె;
నీయవస్థను ఖానుఁడెఱిఁగి సైన్యము వెన్క
మొగమయి పరవఁగా ముదలపెట్టెఁ;

గీ॥ దురకభటు లల్లనల్లన మరలి చూచి
రాజమణిఁ గానమికి నబ్బురమ్ము పడిరి
యాతఁ డవ్వలిదెస లోయ నరిబలమ్ము
బిట్టు దట్టించెఁ గ్రుక్కుఁ దిప్పికొన సీక. 26

మ॥ మఱలన్ వైరులు వెన్కకున్ దిరిగి; రీమాఱున్ బ్రతాపావనీ
శ్వరుఁ డవ్వారికిఁ గానరాక యెటనో శైలంబు లందుండి ముం
దఱఁ బోటోడ్డిన శత్రుసేనలఁ బ్రచండస్ఫూర్తిమైఁ దాఁకి కొం
దఱ నాత్మీయ కృపాణ ధారలను బ్రమందన్ జేసె నత్యుగ్రుఁడై. 27

క॥ "కనఁబడఁ డెట్టులు వెదకినఁ;
గనఁబడినను బట్టువడఁడు; కట్టా యిఁక నే
మొనరింతు" ననుచు ఖానుఁడు
తనసేనను గొనుచు గిరులు దాటుకొని చనెన్. 28

క॥ ఖాసింఖాను మహాసే
నా సంవృతుఁ డగుచు నవలినాఁ డురుదేరం
గా, సడి గని యాతని ని
ల్లే సిలుగులఁబెట్టి యినకులేంద్రుఁడు కలఁచెన్. 29

క॥ అటవీ మృగములవలెఁ బొం
చుటయును బైఁబడుట చీలుచుట కలఁచుటయున్.
పిటతాటనమ్ము చేయుట
త్రుటిలోఁ జాటగుట నృపతి దూర్జటి నేర్పెన్. 30

క॥ పులి నివసించెడు గుహలో
పలి కరిగెడు హరిణవితతివలె, యావన సీ
రులు రాఁగ దినదినము వం
దలుగఁ బ్రతాపుఁడు కలంచి తనువులు సించెన్. 31

గీ॥ అవిరళాజ్యాహుతుల రేఁగు నగ్నిహోత్ర
మన సలుంబ్రాధిపతి శాత్రవాటవి నటు
భస్మమొనరింప నిటు ప్రతాప ప్రభుండు
దనరె సమరాభ్రసీమ మార్తాండు పగిది. 32

క॥ ఒకపాలు సైన్యములు కొం
డ కనుమను బ్రతాపుఁడాఁకి నలిసేయుచు వే
ఱొకపాలు భిల్లదేశము
నికటమునఁ జరించె రాణినిన్ జెరఁబట్టన్. 33

క॥ "ముల్లోకము లెదరించిన
ముల్లెనను మోవనీక పూనిక మెయి నా
భిల్లునిఁ గలచెద"నని య
బ్దుల్లాఖానేగె సైన్యములఁ దోడ్కొనుచున్. 34

ఆ॥ శైల పంక్తినడుమ జావురా తగరపు
గనులలోన రాణిగారి నుంచి
వేయుఁగనులతోడ వేయుఁ జేతులతోడఁ
బ్రీతిఁ గాచుచుండె భీమచాందు. 35

క॥ అనుచరుఁ డొకదిన ముదయం
బునఁ దగరపుగనులు చేరఁబోయి మహారా
జ్ఞిని గాంచి భక్తిఁ దత్పద
వనజములకు మ్రొక్కి నిలువఁ బాటేశ్వరియున్. 36

—• పాటేశ్వరీదేవి భిల్లునితోఁ దన భర్తనుఁగూర్చి యడుగుట. •—

మ॥ "దరహాసోజ్జ్వలకాంతి కాంతమయి, యుద్యత్పద్మ పత్రాభ సుం
దర నేత్రద్వయమై, పరాక్రమకళా ధౌరేయమై, సత్కృపా
భరితంబై, రమణీయమై, భువన సేవ్యంబైన, నాజీవితే
శ్వరు నెమ్మోమును గాంచి నేఁటి కొకమా సంబయ్యె భిల్లాగ్రణీ. 37

క॥ వైరుల సైన్యము లెంత య
పారముగాఁ జుట్టుకొనెనొ వారేయెడ ను
న్నారో సమయమునను సా
హారము దొరికెడునొ మాకు సైవగతురొకో. 38

మ॥ అకటా! వైరులదాడి తగ్గదని వారాయాసముఁ జెందఁ బో
రుకదా? యెప్పటి యట్లు నవ్వుచునె పోరుఁ దీర్తురా రాజపు?
త్రకు లుత్సాహము వీడరేకద? సలుంబ్రా భర్త సర్వాంగ ర
క్షకుఁడై భక్తియెలర్పఁ బ్రాణవిధు పజ్జఁగొల్చి యుండుఁగదా? 39

సీ॥ శ్యామసింహుండు పార్శ్వమున వర్తించునే
సామంతు లందఱు సరస నుండ్రె
స్వాతంత్ర్య సమర దీక్షా మహోపన్యాస
ములు తొంటిచందాన నొలుకుచున్నె
వ్యాకోచ పుష్పంబువలె నాథు మోమున
నానంద దరహాస మలరుచున్నె
నాయాస మెప్పుడే నంది కుందఁడుగదా
యారోగ్య సౌభాగ్య మనువగుఁగద

గీ॥ యూర్జితోత్సాహ కళలతో నొప్పెడుఁగద
తలఁచు బిడ్డలదెస మది మఱలదు గద
విమతులకునెల్ల గర్వ నిర్భేదకముగఁ
దీవ్ర కరవాల ధార నర్తించెడుఁ గద. 40

మ॥ "ప్రమదంబొప్ప రణాంగణంబులఁ బ్రతాపస్వామి స్వాతంత్ర్యయో
గము సాగింపఁ దదాత్మజాతుఁడు భుజాగర్వంబుఁ బోనాడి దూ

రమునఁ దాఁగెడు నెట్లు వైరిపులవలల్ రాల్చంగ సన్నాజ్ఞ సే
యు" మటం చెప్పుడుఁ బోరు నియ్యమరసింహుఁడు బట్టనేరఁ గదా. 41

మ॥ చుఱకత్తుల్‌గొని నెట్లుపై కురికి "మ్రుచ్చుల్‌వోలె మా మాతృదే
శరమణిఁ గొల్లలుగొట్టు నీయవనులఁ శాసింతు మి"ట్లంచుఁ జిం
దరగాఁ జీల్చెదరీ యనుంగు నినువుల్ నాకన్న సంతాన; మే
కరణిన్ దండ్రికి దవ్వుగా నిలుప శక్యంబౌను నాకోటికిన్. 42

ఆ॥ విశ్వమెల్లఁ బొగడ బిల్లరాజ్యంబేలు
సత్త్వఘుండు భీమచాంద దొరయుఁ
దండ్రివోలెఁ గామఁ; దత్కృపమముఁ జీమ
సోఁకి; చెట్టికొఱఁత సూకులేదు. 43

క॥ కాని ప్రతాప చరిత్రీ
జాని పదాబ్జాత దివ్య సందర్శన సే
వానంత మందఁగోరుచు
మానస మొక్కింత వంత మరఁగి కరగెడిన్. 44

క॥ ఒకమాఱు దర్శనము చే
సికొనన్‌వలె నంటినని వచింపు" మనఁగఁ గం
చుకి పాటేశ్వరి పాదము
లకు మ్రొక్కుచు వెడలి వనములన్ బడిపోయెన్. 45

గీ॥ అవల నొక్కనాఁడు ప్రతాపుఁ డరుగుదెంచె;
బోయదొర స్వాగతంబిచ్చి పూజచేసెఁ;
బిల్లలను ఘార్వఁజూచి పృథ్వీవిభుండు
కతిపయ దినంబు లచ్చోటఁ గడపె వేడ్క 46

ఉ॥ అంతట నొక్కనాఁడు శబరాలయముం విడి యాప్రతాప భూ
కాంతుఁడు వీరయోధులును గొంతయు బిడ్డలు వెంటరా, సహ్యా
ర్యాంతర సీమలందరిగి యచ్చట మోగలుసేనఁ జూచి క
ల్పాంతకుఁ డట్లుదాఁకి సమరావనిఁ బెక్కురఁ ద్రుంచె నుగ్రుఁడై. 47

క॥ సమరము ముగిసిన సాయం
సమయమునకు శైలసీమఁ జల్లని వటవృ

క్షముక్రింద వసించెఁ బ్రతా
ప మహీంద్రుఁ డచట నావిభావరిఁ గడపన్. 48

క॥ ఆరాత్రి కొంత కడచన్
దారాపథమందు నిబిడ ధారాధరముల్
ధారాపాత్రల కరణి న
పారమ్ముగ రేఁగి ఘోర వర్షము గురిసెన్. 49

గీ॥ మాటి మాటికి హెచ్చె దెబ్బాటు వాన;
వర్షమునకన్న రేఁగెఁ బ్రభంజనంబు;
నిలువ నెలమైన తరువట్టె కలయనూఁగి
తల నొఱగునో యనెడి శంకదవులఁ జేసె. 50

గీ॥ చలికి గాలి కాఁకలికి వర్షమున కడలి
బిడ్డ లేడ్వసాఁగిరి; కట్టుగుడ్డలెల్లఁ
దడిసె; నిసుఁగులు తనచుట్టు వడఁకుచుండ
తెప్ప వాల్పక రాణి యారేయి గడిపె. 51

సీ॥ ఉదయంబె గిరినుండి కదలిరి మబ్బు తె
రల్ వాసి నభము నిర్మలతఁ దాల్చె
నట వలీఖాను సైన్యములతోడ డాస్సెఁ బ్ర-
తాపుఁడు జృంభించి తాఁకె నతనిఁ
బూర్వాహ్ణమునవని ముగిసె వెన్కకు వచ్చె
తఱిని మధ్యాహ్నార్కు కిరణదీప్తిఁ
జిన్నవాఁడొకఁడు శోషిలె వానిఁదేర్ప నొం
డొకఁడు మూర్ఛిలె వానినుపచరించి.

గీ॥ రవి కెరగి, "రిపుల్ నేఁడింకఁ గవిసిరేనిఁ
దొలఁగిపోద మెండకు నిసుంగులు బడలిరి
కొంతవడి శీతలచ్ఛాయ శ్రాంతి నొంద
వలయు" నని రాజ్ఞియర్థించెఁ బ్రాణవిభుని. 52

సీ॥ చేరువఁగల జమ్మిచెట్టు నీడలను బి
ల్లలతోడ వెళ్లి నిల్పాకయ మున్నె

ఖాసిముఖాను చెంగటఁ దోఁచె నపరి వా
రుండయి రాజగురుండు తొలఁగి
యొక గుహఁజేరి కూర్చుండె నంతట మహ
బ్బతాను గనఁబడెఁ బ్రభుఁడు చెంత
శైల శిఖరమెక్కె షాహాజుఖాఁ కొంత
సేపటి కచ్చోటు చేరవచ్చె
గీ॥ నృపవరుఁడు లోయ కరిగె; ఫరీదుఖానుఁ
డచటి కేతెంచె; భూపతి యద్రిదాఁటె
నచటికరిగె నబ్దుల్లాయు; నవనిపతియు
నేగఁ దొరకొనె "నాటూ"గి రీంద్రమునకు. 53

సీ॥ ఉదయ పురమునకు నుత్తరమ్మున రెండు
క్రోసులపైనఁ ద్రికూట మనఁగఁ
బర్వతంబలరు; నా వసుధాధరము చుట్టు
నతి సాంద్రమగు నరణ్యంబు దనరు;
నీరమెల్లెడ నూట యూరి బుగ్గలుపుట్టి
ధ్వనులెత్తి సెలయేళ్లు పాఱుచుండుఁ;
ద్రివిధ శీతోష్ణ ప్రదేశంబు లందుండు
సకల జాతుల వృక్ష సమితియలరు;
గీ॥ మొల్లలును జాజి గన్నేరు మల్లెచెట్లు
పారిజాత మందార చంపక తరువులు
కసరుఁబూలు గుబాలించు కమ్మతావి
విరియ వెదచల్లు దెసలెల్ల వెల్లిగొనఁగ. 54

గీ॥ అతి నిబిడమైన గహన మధ్యమున, సూర్య
రశ్మి సోఁకని శైల గర్భముల, నదుల
మొలుచు తావుల, భవుని కోవెలలు వెలయు
గగనమునఁ గూరిపోయు చుక్కల విధాన. 55

గీ॥ అనుచర సమూహములు వెంట నంటి కొలువఁ
బ్రకృతి రమణీయమగు నీ యరణ్యసీమ

దాఁటి యొకకొండ యెదురైన దానినెక్కి
యున్నత స్థానమును జేరనున్న యపుడు. 56

చ॥ అరిది ఛటచ్ఛట ధ్వనుల నంతట నించుచు రేఁగి గుబ్బుపుఁ
బరువునఁ బర్వతంబవలి వైపున దూరమునందు నుండి తీ
వ్ర రభసవృత్తి నుద్ధుర దవజ్వలనం బరుదెంచి వారి నం
దఱ గడుఁ జుట్టుముట్టి సముదగ్ర శిఖాతతిఁ గప్పెఁ బెల్లుగన్. 57

మ॥ పరివారమ్ములు తాను సైన్యపతులున్ బాటేశ్వరీదేవి యే
మఱిన ప్పుగ్రదవానలం బలమి ముంపన్ వీరలక్ష్మీ ప్రభుం
“డరవిందాననః చేతిబిడ్డలను నా కందిచ్చి యొక్కింత హే
చ్చరికన్ మంటనుదాటి పొమ్మనుచు వాత్సల్యంబుతోఁ బల్కినన్. 58

సీ॥ “ఇది పొట్టిగుట్టః రా లెక్కుడు గడ్డి గా
దము లంతగాలేవు దావవహ్ని
బస్సున నవలికిఁ బరువెత్తుఁ గృష్ణ సిం
హ ప్రభుతోడ మాటాడు కొనుచు
క్షేమ స్థలమునకుఁ జేరుఁడు బిడ్డ లం
దఱ వహ్నిఁబాపి భద్రమునఁ దెత్తు
నహితులఁ దాఁక మీరరిగి నప్డెన్ని మా
రులొ దవానలము మమ్మలమి యుండెఁ

గీ॥ గడిమిఁ దలపూవు వాఁడక యిడుమ కడచి
బయటఁ బడఁగల్గుటయు నలవాటె నాకు
మీకు శ్రమమేల పొం”డని మెలఁత పలికి
ప్రియము దొలుకాడ నగ్ని పరీక్ష దాఁటె. 59

గీ॥ పశ్చిమాద్రి తటంబునఁ బండి తొడిమ
జాఱి చరమాబ్ధి దొరలు కూష్మాండ ఫలము
ననుకరించి సూర్యుం డపరాబ్ధి మునిఁగె
నరిగి రంద ఱాబూపర్వతాగ్రమునకు.  60

—• ఏకలింగేశ్వరు నాలయము. •—

క॥ పున్నమ సన్నని వెన్నెల
మున్నీటను దేలు దొడ్డ పూమొగ్గటు ల
త్యున్నత సిత గోపుర సం
పన్నంబగు నేకలింగపతి కోవెలయుఌ. 61

గీ॥ తనకుఁ బటికంపు శిలలు గోడలును గోపు
రములు ప్రాకారములు నాలయములు గలిగి
దేవళంబెల్ల దవళకాంతి ప్రశస్తిఁ
బాలసంద్రంబు-చందానఁ బరిఢవిల్లు. 62

క॥ మురువగు చెవులును, మెఱసెడి
గొరిజలు బెడగారు కనులు కొమ్ములు, ననుపౌ
శిరమున నిక్కుపు వృషభము
పరిమాణం బంది నంది వఱలుచు నుండుఌ. 63

గీ॥ నందికేశ్వరు దరిఁజేరి వందనములు
చేసి గర్భాలయముఁ బ్రవేశించి పన్న
గేంద్ర పరివేష్టి తైకలింగేశ్వరునకు
బూర్ణభక్తిఁ బ్రతాపుఁడు పూజచేసె. 64

గీ॥ అందఱును గూడి వచ్చి గర్భాలయంబు
సరస నొక మండపమున విస్తారవేది
కాంతరమ్మనఁ గూర్చుండి; రఖిల సైన్య
నాయకులఁగాంచి రాజ నారాయణుండు. 65

{ ప్రతాపసింహుఁడు దేశత్యాగముఁ జేయుదునని యనుచరులకుఁ దెలుపుట }

గీ॥ "భరతఖండంబు నెపుడు ముంపంగవచ్చు
యవనసైన్య ప్రవాహమ్ము నడ్డగించి
పర్వతమువోలె నిలిచి మేవాడలక్ష్మి
శాశ్వతమ్మగు విజయంబు సంతరించె. 66

సీ॥ భానువంశము వైభవ ప్రాభవంబులు
దిర మొనర్చెను శిలాదిత్య నృపతి;

సత్య సంస్థాప నాచార్యుఁడై రాజ మం
డనుఁడయ్యె గనకసేన ప్రభుండు
శీలాద్రినుండి కాబూలుదాఁకఁ దురుష్క
పతులనెల్ల జయించె బప్పరావు
వసుధాతలంబెల్ల వడవడ వడకించెఁ
బురుషసింహుఁడు కాల భోజరాజు;
గీ॥ మఱియుఁ గోమనసింహాది మనుజ పతులు
సకల దిగ్దేశ విశ్రాంత సాంద్రయశులు;
ప్రాణములు మాతృభూమి కర్పణముచేసి
భారతోద్ధారక ఖ్యాతిఁ బడసి చనిరి. 67

సీ॥ భరతఖండము నభోభాగ మార్తాండుండు
రాణాపుత్రకులైక రాజరత్న
మా పృథాదేవీ హృదబ్జ మేలెడు దిన
స్వామి, పృథ్వీ సార్వభౌము బావ
మేవాడరాజ్యలక్ష్మి ప్రాణనాథుండు
కల్యాణసింహునిఁ గన్నతండ్రి
కగ్గార్ నదీ రణాంగణవార్ధి బడబాగ్ని
ఘోరీమహమ్మదు కుంజరహరి
గీ॥ వసుధ వ్యాపించు యావన ప్రళయ ముదుప
నవతరించిన యాది నారాయణుండు
సమరసింహ క్షమానాథు సదృశులైన
ప్రభువు లుందురె యెన్ని కల్పములనైన. 68

సీ॥ రఘుపతిసింహు శౌర్యం బెంతనఁగవచ్చు
మాహమీరుఁడు నృప మాత్రుఁ డగునె
లఘురాజు దేశ మేలాగు వృద్ధి యొనర్చెఁ
జండుఁబోల్ ధర్మవీరుండు గలఁడె
కుంభేంద్రుఁగని రణక్షోణి నెవ్వఁడునిల్చుఁ
బృథ్వీశు సాహసం బెవరుకొల్తు

సంగ్రామ శౌర్య దీక్షరతి యెట్టిది
రత్నసింహుని పరాక్రమ మలఁతియె

గీ॥ భానుకులమునఁ గాక విశ్వప్రపంచ
మందు నేవంశమున జన్మ మందినార
లిట్టి భువనైక వంద్యులొ పృథు బలాఢ్యు
లిట్టి ధర్మసంస్థాపకు లిట్టి ఘనులు. 69

సీ॥ చూడ నొప్పెయుండు నేడు కోటలతో మ
హాబ్ధిఁబోల్ సప్త ఖేయములతోడ
నభ్రంబు సోఁకు జయస్తంభ తతులతోఁ
గలువ పూలట్టి కోవెలలతోడ
వెలయు నెన్నదినాల్గు విపణి మార్గములతో
సముదార రాజమార్గములతోడ
సంఖ్యకు మీఱు ప్రాసాద సంతతులతో
జలపూర్ణ బహుసర స్సమితితోడఁ
గీ॥ పెక్కు లక్షల జనులతో వేలయేండ్లు
యవనులకు గుండెగాలమై రవికులంబు
గుత్తగొను క్షేత్రరాజమై కొమరు మిగులు
చిత్తురునుబోలు నగర మీక్షితిని గలదె. 70

గీ॥ మహిత మేవాడరాజ్య రమా సమగ్ర
విభవ భాగ్యముల్ చూడ్కికి వ్రేఁగుగొలుప
వాహినులఁగొంచుఁ బెక్కు సంవత్సరములు
మొగలుపతి "యలాయుద్దీను'' ముట్టడించె. 71

గీ॥ వ్రేటుదీటి యొకింత చెప్పుటకమున్నె
ఘూర్జరమునుండి "బహదూరు'' క్రూరుఁడగుచఁ
బచ్చి విసమును గ్రక్కుచు వచ్చి లగ్గ
పట్టెఁ; జిత్తూరు పురలక్ష్మి కుట్టువట్టె. 72

సీ॥ వైరి విశ్వంభరాపతి దుర్నిరీక్షంబు
యవన భూపాల కారాలయంబు

భాగ్యలక్ష్మి వసించు పద్మాకర వరంబు
రాజపుత్రుల మందిర ప్రవరము
భారతా ఖండాభ్ర తారావతంసంబు
భువన శౌర్యమునకుఁ బుట్టినిల్లు
గీ॥ లలిత మేవాడ లక్ష్మీవిలాస తిలక
మయి సహస్రాబ్దములనుండి యశముఁ గనిన
పురవరేణ్యంబుఁ చిత్తూరుఁ బూదిఁగలిపె;
దండు గొనివచ్చి యక్బరు దండధరుఁడు. 73

సీ॥ రాజసేవితము సూర్యద్వార రాజంబు
ప్రీలి ముక్కలుగాఁగ నేలరాలెఁ;
దన శిఖరము మాశ్వమునఁ దోఁచు కుంభ జ
యస్తంభ మూఁటాడి యవని మ్రొగ్గె;
హారతుల్ వేద మంత్రారావముల నొప్పు
కోవెల లన్నియుఁ గూలిపోయె;
వీరసంసారు లుర్వినిడాసి పోవుట
భవ్య మందిరముల పాడు వడియె
గీ॥ నలుమెఁ జెవి దిమ్మపట్టఁగా నడవి రిళ్ళు;
బలిసి యెల్లెడ ముండ్ల చెట్లలము కొనియె;
విడక బుసబుసలాడె దర్వీకరములు
వనమృగంబులు మీఱె; గూబలును జేరె. 74

చ॥ ఇరువదియైదు వత్సరము లిప్పటి కెప్పుడొ దాఁటిపోయెఁ జి
త్తూరురమ మోముపంకజము తోఁగను పుష్పముదీఱె; రేయి ని
ద్దుర బప లన్నముఁ విడిచి దుర్గమదీక్షను నిన్నియేండ్లు సం
గర మొనరించినన్ జయము గల్గదు, కల్గదు కల్గునాసయున్. 75

గీ॥ పట్టభద్రుఁడనైన యప్పటి విభవము
సంపదయు మూఁడునాళ్ళ ముచ్చటగజాఱె;
మునుపటి మహోన్నతులు గల్గునను తలఁపులు
మెఱపు లెండమావులు గాలి మేడలయ్యె. 76

సీ॥ భాగ్యనివాసముల్ పదివేల పల్లెలు
కళలూడి కాఱడవులుగ మాఱెఁ;
బరదురాసదము లెన్పదినాల్గు దుర్గముల్
తౌరుష్కవీరుల బారిఁ జిక్కెఁ;
బచ్చతోరణముల ధాసిల్లు మేవాడ
నహుషుఁ డేలిన యింద్ర నగరమయ్యెఁ;
ముప్పదియాఱు రాణ్మఖ్యవంశంబు ల
క్బరుఁ జేరి చరణ పంకజముఁ గొలిచె;
గీ॥ దేశ మెల్ల బోయెఁ; గోశంబు వమ్మయ్యెఁ;
సైన్యబలము డిందె; శక్తికుందె;
నక్కటకట! వార తావనిపై ధర్మ
మెట్లు నిలుచుఁ! గీర్తి యెట్లు పొలుచు! 77

గీ॥ హంస తూలికా మృదుల శయ్యలను బూల
పఱపులను జేటికలు జోల పాడుచుండఁ
బెరుగు నాదు సంతాన మీకటుకురాల
వాన కెండకుఁ బలుపాట్లఁ బడల వలసె. 78

గీ॥ కూడు నీరులేక నశింత్రు! క్రూరఫణులు
గఱచు; నారణ్యమృగములు పెరుగు నవక
వృక్షముల క్రేలు బుట్టలఁ బెట్టి విడుతు;
నరులు వెన్నాడఁ గాననాభ్యంతరమున: 79

గీ॥ రాత్రి కురిసిన ఘోరవర్షమున వట మ
హీరుహముక్రిందఁ దడిసి మేమెల్ల నక్లై
నిలిచితిమి; రాణిగా రాఱు నెలలబిడ్డఁ
బొదిగిఁటనె నిల్పుకొనెఁ బ్రొద్దుపొడుచు వఱకు: 80

సీ॥ చండార్కుఁ డంతరిక్ష మహాపథంబునఁ
జెల రేఁగి నిప్పులు చెఱగు నపుడు.
గడ్డి గాదము సోఁకి కడలెల్ల దరికొని
మెండుగా దావాగ్ని మండు నపుడు.

భూతలంబెల్ల దుమ్ముగలేచి సుడివడ
భీకర వాతముల్ వీచునపుడు,
హెచ్చు తగ్గులులేక యేకార్ణవంబగు
కరణిఁ బెల్లుగ వాన కురియునప్పు
గీ॥ డిల వడంక భూకంపము లెత్తునపుడు,
కడకుఁ దలఁదాఁప నొక్క యంకణముసీడ
దిక్కకయె, మేము పిల్లలు స్రుక్కుబాధ
లకట! మాగర్భ వైరులకైన వలదు. 81

సీ॥ కనక సౌధాగ్ర భాగములందు మూర్ధాభి
షిక్తలౌ రాజయోషిద్వరేణ్య
లడుగులకు మడుగులిడి కొల్వఁ గోమల
తర హంసతూలికా తల్పమందు
నెండ కన్నెఱుఁగక యుండి యింద్రాణి చా
యను దేవభోగంబు లనుభవింప
వలసిన నారాణి పాంచేశ్వరీదేవి
భువనైక సౌజన్య పుణ్యసాధ్వి
గీ॥ యకట! "యన్నమొ రామచంద్రా" యటంచుఁ
బదియు నేడ్వురు బిడ్డలు పట్టి పెనఁగ
గోడుగోడునఁ గన్నీరు గ్రుక్కుకొనుచు
నలమటలనెల్ల దిగమ్రింగి యడలవలసె. 82

సీ॥ సారవంతము శైల వారా మహామహీ
ధర పార్శ్వముల, సముధరణిఁ గట్టు
వడి దినమంతకుఁ బిడికెఁడు గడ్డియుఁ
గ్రుక్కెడు సీరంబుఁ గ్రోలికొనుచుఁ
బరిశుభ్రతరమైన స్వచ్ఛంద వాయువుఁ
బీల్చుచుఁ గడు సాధువృత్తి యలర
నక్బరుతో రణం బారంభమైన యీ
పదియును దొమ్మిది వత్సరములు

గీ॥ నందనోద్యాన వాగంబునఁ మెలంగు
కామధేను సంతానము కరణి నెపుడు
పిల్లలును మేము బయల జీవింపవలసె
మానవుల కర్హ మగు తిండి మఱచిపోయి 83

ఆ॥ కాళ్ళనిండ గుడ్డ, కడుపునిండుగఁ దిండి,
కంటినిండ నిద్ర, గాన కెపుడు
బిచ్చగాండ్రకన్న బీదలమైయుంటి,
మింక నెంతకాల మిట్లు కడచు. 84

మ॥ తఱితో నక్బరు సార్వభౌముఁడు నితాంత ప్రాభవోపేతుఁడై
ధరణీ చక్రమునేలు వేళను దరిద్రత్వంబు దిక్కేది యు
ర్వరఁ దానుండఁగఁ జోటుగానక మహా రాణాప్రతాపావనీ
శ్వరు సంసారము నాశ్రయించినది; యీపాపంబు నేమందునో. 85

శా॥ భీతిఁగొల్పు కరాళ వక్త్రమున వేవేగఁ జరావ్యాఘ్ర మీ
నా తారుణ్యము మ్రింగఁగాఁ దివిరెఁ జెంతఁబొంచి లేదిఁబలేఁ
జేతస్థైర్యముగూడ సన్నగిలె మాసెఁ సుంత యుత్సాహ మే
రీతిఁ గార్యముఁ దీర్తు నేపగిది మాతృప్రీతి సంధించెదన్. 86

గీ॥ గాలి వాన విధాన నల్గడల రేఁగు
కష్టముల కెత్తుపడి డస్సి కడిమితగ్గి
హృదయకోశంబు తన నైజ వృత్తి విడక
యాడునో! యాఁడునో' తెలియంగరాదు. 87

మ॥ చనఁగాఁ జొచ్చెను నిర్వదేఁడులు మహా స్వాతంత్ర్య యుద్ధంబుఁ జే
యను నేదీక్ష వహించి నేఁటికి; భవిష్యత్కాల తారాపథం
బున దూరమ్మునసైనఁ గొంత విజయంపుఁ గాంతి రేఖల్ మిను
క్కని చూపట్టవ యే భగీరథుఁడు డాయఁ దెచ్చునో జాహ్నవిన్. 88

సీ॥ సంతత పౌరుష్క సంగ్రామ వహ్నిచేఁ
గాలఁగా మిగిలిన కట్టెనైతి
నలిగొట్టి కుక్కయై నక్కమూల్గెడు నక్క
పైఁ దాఁటి పండూడి పడినయట్లు

రక్తమేదో మాంసరాశి తగ్గియకాల
వృద్ధత్వ మిపుడు పైకెక్కెనాకు;
నింక నెంతయొకాల మీశరీరంబిల్లు
యనువుగా నుండు నంచాసలేదు;

గీ॥ ప్రాణపదమైన మేవాడ రాజ్య పావ
నాధిపత్యంబు 'నాబూ' మహాచలాధి
పత్యమును నావి గావని వదలి యవలఁ
జనెడు కాలంబు వచ్చెఁ; సంశయములేదు. 89

చ॥ చెలులను బిడ్డలన్ సుతుల స్నేహితులన్ గులబంధులన్ గృహం
బుల ధనధాన్యవస్తు చయమున్ విడి కేవలభక్తి నాపదం
బులు మఱి దేశమాతృ పదముల్ భజియించిన మీకు నేఁటికిన్
గలుగదె సుంతియేనియు మనఃపరితృప్తి యొకింత దీప్తియున్. 90

చ॥ శ్రమలకుఁ జిక్కిచిక్కి యనిశంబును గంపలఁబడ్డ యట్టి కా
కములకుఁ బోలె ముందుఁ జనఁగాఁ దెరవింతయులేదు గెల్చు పు
ణ్య మదియు నంతయే కుల సనాతనకీర్తిని నిల్పలేని·య
ల్పమతులు మాతృభూమిపయిఁ బాదము మోపి వసింప నర్హులే. 91

సీ॥ అకట· మాసూర్యాన్వయ ప్రభూత నృపాలు
రప్రతిహతముగా నధ్వరములు
సలుపుచు బ్రాహ్మణ సంతర్పణంబుల
నొనరింప మిగులఁ బావనములైన
దుర్గంబులందెల్లఁ దురకమూఁకలు చేరి
సలుపరాని యకార్యముల నొనర్చెఁ;
గటకటా! నాకుఁ బల్కఁగ నోరు రాకుండెఁ;
బరదేవతా స్వరూపము లటంచుఁ

గీ॥ బసుపుఁ గుంకుమ లర్పించి పాదయుగముఁ
గరము భక్తిని సేవించు గంగ గోవు
లను గృపనుపీడి వధియింతు రనుదినంబు;
నిది కనుంగొని జీవించి యేమి ఫలము. 92

గీ॥ ఉండి యీ ఘోరకృతిఁ జూచు చుండలేము
తివిరి రిపుగెల్చి జయము సాధింపలేము
కడకు మనయున్కి యిచట మేవమెడచన్న
లవల నడకత్తిలోఁ బోక యట్టులయ్యె. 93

సీ॥ పలుమాఱు విశ్వ సౌభాగ్యంబు దేశ క
ల్యాణంబు నెలకొల్ప నభిలషించి
మనము చేసిన త్యాగమును మనకృషి బూదిఁ
బోసిన యాజ్యంబు పోల్కియయ్యె
మన నేత్రముల ముందల మన మాతృదేశంబు
పరుల యధీనమై ప్రజల దాస్య
జలరాశిలోన మున్కలు పెట్టుటలు గాంచి
యించుకయును సహింపఁజాలఁ;

గీ॥ గటకటా! పూర్వనృపుల రక్తములతోడఁ
దడిసి మనరక్తములఁ బునీతంబునైన
కీర్తిరాశి మేవాడ లక్ష్మికిని మనకుఁ
దీఱినట్టులె యింక నీదినము ఋణము. 94

గీ॥ ఉత్తరాయణ పుణ్య ముహూర్త మెంచి
యంప సెజ్జఁ బండిన భీష్మ ననుసరించి
వగచి వరుగై వటించి మేవాడమాత
కన్నుఁగొనలఁ బ్రాణముల నిల్పుకొని పరుండె. 95

గీ॥ ఇరువదేండ్లు రణమొనర్చి యెట్టి ఫలము
నేని మనమెల్ల సాధింపలేని చోట
నకట! భూమికి బరువు చేసైప మనంగ
నేల! పరువేల! యభిమానమేల! యింక. 96

శా॥ పావిత్ర్యంబున కాటపట్టయిన యా పంజాబుకో పర్షియా
కో వెళ్ళకాదలఁతుకా;స్వతంత్రతముగ నెక్కొల్పకాదగుకారాజ్యముకా
నా వెంటకా జనుదేరఁ గోరినను సన్నాహంబుఁ గావించి నా
రో వీరో మఱి యందఱో కదలి రారో యింక మూన్నాళ్ళకుకా. 97

గీ॥ యవనసంసర్గమును వీడియవలి కేగు
టే శుభంబని యెంతు, మీకెట్లు తోఁచు;
నెమ్మిమెయిఁ దెల్పుఁ డిపుడు; మీ నిర్ణయమును
దాల్తు శిరమున మందారదామ మట్లు. 98

సలుంబ్రా కృష్ణసింహుఁడు ప్రతాపసింహు ననుసరింతునని నివేదించుకొనుట.

మ॥ అని వాక్రుచ్చియు నిల్చినంతట సలుంబ్రాధీశు డుఁకా లేచి భ
క్తిని హస్తంబులుమోడ్చి "భారత ధరిత్రీ దాస్య నిర్మూలనం
బున దేశోద్ధరణమ్మునందు హృదయంబుకా నిల్పి యెంతెంత నే
యను సాధ్యంబగు నంతచేసితివి నీవత్యంత దీక్షారతిణా. 99

సీ॥ వేనలేల్ రిపుల నొప్పించు పట్టునఁ గర్ణ
పేయమై విందు నీ వీరగర్జఁ;
దిలఁ ద్రుంచు బహుళాపదలు చుట్టినప్పుడు
చెవియొగ్గి హుంకార రవము విందుఁ;
దిండిలేక తపించు దీనముల విధిఁజూచి
పెడబొబ్బ వెట్టు చప్పుడుల విందు;
స్వాతంత్ర్య సమరదీక్షకుఁ బూన్చు నీ యుప
న్యాసంబులను జెవులారి విందుఁ;

గీ॥ గాని కొండంత నొప్పితో గాసిపడుచుఁ
బిడుగు పడినట్లు హృదయముల్ వ్రీలఁజేసి
విన్ననై దీనమగు వాక్కు విని యెఱుంగ;
ననలమున వ్రేల్చునట్లు వామనసు పొగిలె. 100

గీ॥ నీహృదయ పద్మపీఠ నివ్యూహమెక్కి-
యలరి స్వాతంత్ర్యలక్ష్మి సహస్రభాను
కాంతులను వెల్గెఁ; దన్మహాఖండదీప్తి
కడలుకొని ఢిల్లి మొగలుల కనులుగుట్టె. 101

సీ॥ పురము రాజ్యముమాని మూఁడేండ్లు శ్రీ హరి
శ్చంద్రుండు పడిన కష్టముల నెఱిఁగి

పదునాలు గబ్దముల్ వనవాసమున రామ
చంద్రుండు పడిన కష్టముల నెఱిఁగి,
పదియు మూఁడేండ్లుగాఁ బాండవుల్ గహనాంత
రములలోఁ బడిన కష్టముల నెఱిఁగి,
యిరువది మూఁడేడు లీ వీ వనులఁ గుటుం
బముతోడఁ బడిన కష్టముల నెఱిఁగి,

గీ॥ తారతమ్యంబుఁ దూచిన వారి యిడుమ
లత్యగాధాపదావర్తమైన నీదు
చరితమున నొక్కపుట కొక్క చరణమునకు
సాటి గావని గొంతెత్తి చాట నేర్తు! 102

సీ॥ అట్టె చూచిన దోసెఁడంతైన లేదు మే
వాడరాజ్యము; సైన్యబలముగూడఁ
జాలనిదే! యుద్ధ సన్నాహ మల్పంబె!
యటులున్న నేఁబదియైదు లక్ష
లగు కాల్బలము, పదునైదు లక్షలగు గు
ఱ్ఱముదండు విస్తార రాజ్యలక్ష్మి
యేనుంగులు పిరంగు లెన్నేనిఁ గలుగు వి
శ్వంభరాధీశుఁ డక్బరునృపాలుఁ

గీ॥ దట్టె యుజ్జ్వాఁత లూఁగి తూఁగాడి పడఁగ
దాఁకఁగలిగితి; వెన్ని సాధనము లున్న
నిన్నొకని గెల్వఁజాలక తన్నుకొనెడి
ననుచు హాస్యాస్పదం బయ్యె నతని బ్రతుకు 103

గీ॥ క్షణము విడక సైన్యము లంపి రణము సేయ
నీపయిక్ నక్బ రంపించు నిరత ధాటిఁ
బరిషయుఁడేనేన 'గ్రీసు' పైఁ బరవ లేదు;
యవనులు 'జరూసలెమ్ము' పై నరుగలేరు. 104

శా॥ ఈ విశ్వంభర పుట్టుటల్ మొదలుగా నింధాఁక నేదేశమం
దే వంశమ్మనసైనఁ గష్టముల నెంతే నాత్మబంధుల్ వలెఁ

భావంబందుఁ దలంచుచున్ వలచుచున్ స్వాతంత్ర్యమున్ గొల్చిరే
నీ వొక్కండవు దక్క శాంతి నిరతిన్ నిర్నిద్ర తేజోనిధీ. 105

ఆ॥ ఇట్టి దేశబంధుఁ డిట్టి శూరోత్తముఁ
డిట్టి రాజయోగి యిట్టి త్యాగి
లేఁడు లేఁడటంచు మూఁడు లోకంబుల
ప్రోఁతలీనెఁ; గురిసెఁ బూలవాన. 106

సీ॥ అక్బరు విశ్వంభరాధీశ మౌళిది
ధనసేవ; నీయది దైవసేవ;
యాతని దెల్లప్పు డాత్మ వైభవము; నీ
యది నిరంతరము నాత్మావబోధ;
మతని కుండినదెల్ల నైహిక బలము; ని
న్నాశ్రయించినదెల్ల నాత్మబలము;
నతని దండఁగున్న లలరించు భోగంబు;
నీది జగముమెచ్చు నిండుత్యాగ;

ఆ॥ మతఁడు జగముగెలిచె; నాత్మగెల్చితివి నీ;
వాతఁ డితరజనుల నాశ్రయించు;
నీవు స్వాశ్రయుఁడవు; నీకు నాతని కెన
లేదు; జగము క్రిందుమీఁదు లయిన. 107

గీ॥ కష్టమే మనపాలిటి కల్పతరువు;
దుఃఖ మెఱుఁగని హృదయముల్ దుర్బలమ్ము;
లతి పరిమితంబయిన శక్తి యలరు నరుల
కపజయంబులు బలవర్ధ కౌషధములు. 108

మ॥ ధర సృష్టించిన బ్రహ్మ ఫాలమున నేత్రంబుండు శంభుండు, న
ప్పురుషోత్తముఁడు శౌరియున్, నరులుగాఁ బుట్టొంది యేనూఱులా
తరఃముల్ పోరినఁగాని నీకరణి స్వాతంత్ర్యంబు నిట్లింత దు
ర్భర నిష్ఠారతిఁ గొల్వలేరని వచింపన్ నేర్తు వేనోళులన్. 109

గీ॥ శక్తి దాఁపక యాత్మ వంచనములేక
నీయడుగునీడఁ దలఁదాల్చి నిన్నుఁగొలిచి

త్యాగమించక యెటిఁగితి నను యశంబు
సంతరించితి నర్హాత చాలకున్న 110

గీ॥ వాసుదేవుని చరణ పూజా సుమ మటు
నిరతమౌదలఁ దాల్తు నీ నిర్ణయమ్ము;
నీడ మేవాడనున్న నేవాడనున్న
నేను నీవాఁడ ననువాఁడ నెపుడుగూడ. 111

క॥ మూన్నాళ్ళ గడువుఁలోనన
సన్నాహ మొనర్చి మేము సంసారములన్
నిన్నుఁ గొలువంగవత్తు" మ
టన్న "నటులెచేతు'' మనుచు నంద అరుగుచున్. 112

మ॥ పరివారంబుల వెంటఁ దోడ్కొని సలుంబ్రా కృష్ణసింహాది భూ
వరు లందుండియు నాత్మసీమలకుఁ బోవన్ భీమచాం దైడువే
వుర నాకోవెలచుట్టు భిల్లులను గాపున్బెట్టి తానున్ ధను
ర్ధరుఁడై కావలిఁగాచె నయ్యెడ బహిర్ద్వారమ్మునన్ నిల్చుచున్. 113

గీ॥ ధన కనక వస్తువాహన తతులనెల్ల
బండ్లపైఁ ద్రోవ పట్టించి పంపి రాజ
పుత్రవీరులు మఱల నాబూగిరీంద్ర
మునకు వచ్చిరి ప్రభుభక్తి యినుమడింప. 114

గీ॥ మెఱుఁగు బంగారుపూలు వోల్ కిరణతతుల
బాలభానుండు ప్రకృతి శోభలను బెంప
నల సలుంబ్రాధిపతిఁ జూచి యాప్రతాపుఁ
"డేకలింగేశునకు మ్రొక్కి యిపుడెవత్తు. 115

గీ॥ అంతలోన మీరందఱు ననుచవలను
బయన మొనరింప నాయత్త పఱచుఁ''డనుచు
బలికి గర్భాలయంబు లోపలికిఁజనియె
వగలఁ బొగులుచు నాసలుంబ్రా విభుండు. 116

సీ॥ వదలన్న సామ్రాజ్య పట్టాభిషేకంబు
సలిపితి భువన మాశ్చర్యపడఁగ

బయటికి వెడలుచో వనితోన ముండ్లను
రాల్దీసి త్రోవ శుభ్రముగఁజేతు
"నాహేరియా" వేఁట కరుదెంచు నపుడెల్ల
సన్ని సామగ్రు లాయత్తపఱతు;
శాత్రవు లెదురైన క్షణమున సకల సై
న్యముఁ దీర్చి యనికి సిద్ధముగ నుంతుఁ
గీ॥ గాని, గుండెలు బరువెక్కఁగా స్వదేశ
మట్టై విడనాడి పోవుచో ననుచరులను
సర్వ సన్నాహమునఁ బూన్చు జాలి మాలి
నట్టి కార్యముచేయు టెట్టిదైన నెఱుఁగ. 117

మ॥ అదిరా! దేవుని కన్న మిన్న యని భక్త్యావేశముఁ బెంచి యి
ర్వది యైదేండ్లుగ దేశమాతకు సపర్యల్ చేసి శుష్కించి క
ష్టదశన్ గుందిన విశ్వవీరునకు దేశత్యాగముఁ జేయు దుః
ఖదశన్ దెచ్చితె! దుష్టదైవమ! హో మదగ్రంబయ్యె నీచేష్టయముల్.

సీ॥ ఎత్తినచేయి యింతేని దింపక రణా
గ్రముల శాత్రవుల శీర్షములు తఱిగె
విశ్వ విశాలమై విలసిల్లు హృదయంబు
స్వాతంత్ర్యలక్ష్మి కాస్థానమిచ్చెఁ
దనము సర్వస్వ మప్పనచేసి మాతృ దే
శారాధనమునఁ బుణ్యాత్ముఁడయ్యెఁ
ద్యాగానురక్తి ధర్మాసక్తి విశ్వోన్న
త స్థానమంది తద్దయును వెలిఁగెఁ;
గీ॥ జతు రుదధి సంవృతావనీ సార్వభౌమ
పదవి రానున్న మాతృ భూపాద సేవ
విడని రాజర్షి చంద్రుండు వెడలవలసెఁ
దనదు సీమలోఁ దలదాఁచు తావులేక. 119

సీ॥ త్రిభువ నాదర్శ వందిత పరమోత్కృష్ట
సద్గుణ గణ రత్న సలిలరాశి
రాణాప్రతాప వీరప్రభు వదన మం
దలరారు నవ మందహాస రేఖ
జీవ నౌషధముగఁ ద్రావి యెట్టెట్టులో
దినములు కడఁ ద్రోసికొనుచు నుంటి
నా యభాగ్యముమీఱి నాస్వామి తఱితప్పి
యక్కటా! దైవోప హతుఁడునయ్యెఁ

గీ॥ గట్ట! దరహాస శూన్యమై కాంతిలేని
యీమహారాజు ముఖము నేనెట్లు చూతు
నెట్లు భరియింతు నెటుమందు నేమియందు
ముందు మాకుందు డిందెటు చందమున్నె?" 120

గీ॥ అని యరిగి కొండయంత దైన్యమునఁ గుంది
యనుచరుల నశ్వములనెక్క నాజ్ఞచేసె
నల్లనల్లన గర్భాలయంబు విడిచి
వాకిటిని దాఁటి రాజ లోకైక గురుఁడు. 121

గీ॥ వచ్చి యశ్వంబుపైఁ జేయివైచి నిలిచి
యఖిల భువన ప్రపూజ్యమౌ నాగిరీంద్ర
సమతలమునుండి చుట్టు దేశంబువైపు
చూపమర్చె గ్రీఁగంటి యంచులఁ జెమర్ప. 122

మ॥ "అకటా! చేసిన యన్ని యత్నములు వమ్మై గెల్పు సుంతైనఁ జే
రక దైవోపహతుండునై యిదె మహా రాణాప్రతాపుండు తా
వక కల్యాణ పదాంబుజాత యుగ సేవా భాగ్యముఁ వీడి కూ
లికిఁ గొల్వంగాజను లన్యసీమలకుఁ; దల్లీ వీని నెట్లోర్తువో. 123

శా॥ వ్యోమం బంటెడు నీదు శైలశిఖరంబుల్ మంజులమ్మైన యా
రామ శ్యామలసీమలుఁ ప్రబల దుర్గశ్రేణులుఁ సారవ
ద్భూముల్ నీసముదార భాగ్య విభవంబుల్ వీడి పోనుంటిఁ; ద
ల్లీ! మేవాడ సతీమతల్లి! మదిలోఁ గ్లేశంబు రానీకుమీ. 124

గీ॥ ఇరువదేండ్లుగ నుత్తమ పరికరముల
భక్తిఁగూర్చి నాపావన స్వాంతమందుఁ
దల్లి! నేఁగట్టుకొనిన స్వాతంత్ర్య వజ్ర
భవనరాజంబు కన్నిటి వఱఁద మునిఁగె. 125

శా॥ నామేనన్ గల రక్త మాంసములనున్ నాశల్యముల్ ప్రాణమున్
నీ మేల్గూఱిచి ధారపోయుటకు సందేహంబు నుంతేని లే
దే మేల్గూర్పఁగలేని వ్యర్థమతినై యించుండి జీవింప నే
ధీమంతుల్ సహియింత్రు నావ్యసన మాదేవుం డెఱుంగున్ జుమీ. 126

మ॥ అతిభీమంబుగఁ బెల్లురేఁగి నిబిడంబై మూఁగి యీసర్వభా
రతదేశంబును ముంచివైచిన మహోగ్రంబైన దాస్యాంధ కా
రతతిన్ దేవుని దృష్టిగూడ నణుమాత్రంబున్ జొరన్ బోని దు
స్థితి సంధించెడు పాపికాల మరుదెంచెన్; జూచి యెట్లోర్తునో. 127

సీ॥ విశ్వపావనమైన వృత్తి వర్తించు గో
బ్రాహ్మణులకుఁ దగ్గుపాటు గలిగె;
గాత్మనిఘల్ మునుల్ స్థాపించు వర్ణాశ్ర
మాచారవిధి లఘుగంటి వోయెఁ;
బెట్టని కోటలై వెలసి నిన్ గొల్చు వీ
రుల పౌరుషము గంగఁగలిసి పోయె;
మంగళలక్ష్మి సమానలౌ సాధ్వుల
సౌశీల్య గరిమ కార్శ్యంబు నొందె;
గీ॥ వేయునేండ్లుగ వ్రేటుపై వ్రేటు దగిలి
చిక్కి నసిదక్కి స్రుక్కి కృశించి నాదు
పాలనమున మంచముపట్టి డీలుపడఁగఁ
బాలుపడితివె! తల్లి! మేవాడలక్ష్మి. 128

సీ॥ మాతృదేశము శుద్ధమతిఁ గొల్వఁగాఁ జాలు
సుతుఁడును లోకవందితుఁ డటంచు,
భౌతికసుఖము సర్వము సన్న్యసించి ధ
ర్మైకవర్తనుఁడవై యిన్నినాళ్లు

రక్తమేదో మాంసరాశి నూర్చుచు నిన్ను
నుద్ధరించి కృతకృత్యుండ నగుదు
నని కృషిచేసితి; నక్కట! నాపాపి
హస్తము లాభాగ్య మందలేదు

గీ॥ పూర్వవైభవమున నీవు పొదలుచుండ
నాకలుష నేత్రములఁ జూడలేక పోతి
నాశ లడుగంటెఁ బ్రాణంబు లవిసిపోయెఁ;
బ్రతుకె వృథయయ్యెఁ దల్లి మేవాడలక్ష్మి. 129

సీ॥ పసితనమ్మున లేడివలె లాఘవమ్మున
నద్రుల కెగఁబ్రాకి నట్టిచోట్లు
పట్టాభిషేక సంపద్విభూషితుఁడనై
యధికృతి నెఱపిన యట్టిచోట్లు
కవచ ఖడ్గములూని కదనరంగముల ఘో
రారులఁ గడతేర్చి నట్టిచోట్లు
నొకఁడనై శత్రుల నుడికించి జగమెన్న
నపజయంబు వహించి నట్టిచోట్లు

గీ॥ కట్ట బట్టయుఁ దినఁ గూడు గానకున్న
నచల భక్తి నిన్ సేవించి నట్టిచోట్లు
హృదయ ఫలకమ్మునందు ముద్రితము లయ్యె;
మఱువలేనమ్మ! ననునేను మఱచుదాక. 130

గీ॥ వీరు లాత్మీయు లాప్తులు పృథ్వివరులు
బంధువులు నీగిరీంద్ర గర్భముల నొఱఁగ
విరికి దొంగసుగా నిన్నుఁ దొఱఁగి జాఱ,
వ్రాసె నాతలధాత మేవాడమాత. 131

గీ॥ తలఁ దఱుగనోపు బహు విపద్దశలనైనఁ
గాంతి యించుక చెడని నాకన్నుదోయి
నశ్రుకణములు వొడమె; నీయడుగుదోయి
నమ్మ! ముక్తాభిషేకంబు నాచరింతు. 132

శా॥ నేనేగాక మఱొక్క ధీరుఁ డెవఁడే నీకా నిన్ను సేవింప నే
తేనిన్ బూనినవాని పుణ్యమున నేనీనాఁడల్లి మేవాడ ల
క్ష్మీ! నిత్యోత్సవ నిత్యమంగళ జయశ్రీ నిత్య సౌభాగ్య రే
ఖా నిత్యప్రభలెల్ల నీకుఁ గలుగున్ గాకంచు గాంక్షించెదన్. 133

సీ॥ హారావళీశైల మనుపమ స్వాతంత్ర్య
వీర దుందుభుల శబ్దించుఁగాక
గుట్టలు పుట్టలు గుహలు స్వధర్మ త
త్పరుల యశంబు మార్పలుకుఁగాక;
మేవాడరాజ్యలక్ష్మి పరాక్రమ మెల్ల
వేళల భువిఁ దాండవించుఁ గాక;
త్యాగైకధనుల సత్య స్వరూపులచే ర
హించి నీకడుపు ఫలించుఁ గాక;

గీ॥ భానుకుల గౌరవంబు నిల్పంగ నోడి
త్యాగమునఁ గుంటుపడి నీపదములఁ గొలుచు
పున్నెములులేక దూర భూములకు నేగు
మమ్మ మాపేళ్ళు లోకంబు మఱచుఁగాక » 134

గీ॥ అనుచు భక్తి నిజూపి వందన మొనర్చి
మఱువఁజాలక చేరెఁడు మట్టిదీసి
కనులనద్ది రుమాలునఁ గట్టి యూర్చి
యా ప్రతాపుఁ డశ్వంబుపై నధివసించె 135

క॥ ఘకృతి మోరమునుండి త
దేక ధ్యానంబుతోడ వీక్షించి సలుం
ద్రా కృష్ణసింహవిభుఁ డతి
లోక మహాద్భుత విలాస లోలాత్మకుఁడై. 136

మ॥ "అరరే! యీ భువనంబులెల్లఁ దలక్రిందై పోవు బల్ విస్మ యా
కర దృశ్యంబిటు సాఁగె నేఁడిచట లోకం బుద్భవంబంది వ
త్సర సాహస్రములెన్ని దాఁటెనో మహాశ్చర్యాస్పదం బిట్టి బం
ధుర కార్యంబును జూచియున్ వినియు నెందున్ గాన రెవ్వారలున్. 137

సీ॥ విశ్వంబు తనకనుల్ విచ్చుటాదిగ దేశ
భక్తులెందఱొ మాతృభక్తి పరత
సర్వస్వ మర్పించి శ్రమచేసి కడకు స్వా
తంత్ర్యంబు నిల్పెడు దారి చెడుచు
నాత్మరాష్ట్రము వీడి యరిగియుండఁగవచ్చుఁ
గాని నాదేవుఁడు కట్టకడకు
మేవాడ విడనాడి పోవుచు మాతృ వం
దన మాచరించియుఁ దనివి సనక

గీ॥ యెచటికిని దానువెల్లిన నచటఁగూడ
మాతృదేశ మారాధించు మమతఁబెంచి
తల్లినేలను గల మట్టి నల్లనఁగొని
పై రుమాలు చెంగున దానిఁ బదిలపఱచె. 138

సీ॥ పరిషియాచేరి సుస్థిరవాస మేర్పడు
తఱి నిప్డు గొనిన యాతల్లి మట్టి
దేవతార్చనమున సౌవర్ణపేటి కా
భ్యంతరమున నుంచి యహరహంబు
ధూప, దీపాది నిత్యోపచారములు గా
వించి పూజించి సేవించు నిజము
అద్దిరా! యీతని కాత్మదేశము నెడ
భక్త్యభిమాన మిభ్భంగి దనుచు

గీ॥ భువనముల విస్మయాంభోధి ముంచి తేల్చు
నీమహాకార్య మొక్కఁడే యెఱుకచేయు
నప్రతిమ దేశభక్తికిఁ ద్యాగదీక్ష
కీతఁ డధిదేవత యటన్న నిది ధ్రువంబు. 139

సీ॥ ఇందు కిర్వదియు మూఁడేండ్లకుఁ బూర్వ మి
ర్వదిరెండు వేల్మంది ప్రతినఁబట్టి
యప్రతిహత దీక్ష నాత్మదేశ స్వతం
త్రతకుఁ గష్టించి రక్తంబు మాంస

మూడివి కడకు దైవోపహతుల మౌచు
దేశంబు విడనాడఁ దివిరియుంటి
మందఱ మదుల దేశారాధ నాసక్తి
త్యాగ దీక్ష సమాన మగునుగాని.
గీ॥ తల్లి మట్టిచేసాను బుద్ధి తదితరులకు
నేరికిని దోఁప దితఁడె లోకైక పూజ్య
దేశ భక్తాగ్రగణ్యుం డుదీర్ణహృదయుఁ
డితఁడే దేవతామూర్తి యితఁడె గురుఁడు 140

మ॥ అనయం బీతనికున్న యంత నిబిడంబై దేశపుం భక్తి మా
మనసుల్ నిండిన నెట్టు లియ్యది స్ఫురింపఁగా బోవ దీకారణం
బున నేఁడొక్క ప్రతాపదేవుఁడె జగంబుల్ దాటు భక్తుండు త
క్కిన వారందఱు తక్కులాఁడులె వితర్కింపంగ నొంపొండునే. 141

సీ॥ అఖిల లోకాతీతమైన యీఘను మహో
న్నత దీప్తి యెఱుఁగ రిన్నాళ్ళు నేను
పొరవడి పలుమాఱు దరియుచుఁ బలుకరిం
చుచుఁ దాపచును గొల్చుచును దిరిగితి
నిది తలంపఁగ నిప్పు డెడఁద జలదరించు
నాకును నీమహా నాయకునకు
నత్తకు నత్తుకు నక్కకు నాకలో
కమున నున్నంత దూరము రహించు
గీ॥ దూరమున నిల్చి యితని పాదారవింద
ములకు మ్రొక్కుచు నాజ్ఞ నౌఁదలను దాల్తు
నితఁడె నాతను ప్రాణంబు లేలుకొనెడు
ప్రభువు! పరమగురుఁడు! పరబ్రహ్మమూర్తి. 142

సీ॥ డెబ్బదియేండ్లు దాఁటినవి భార్యా పుత్ర
కులు సలుంబ్రా మహాక్షోణి రాజ్య
మణువంత నాకుఁ బ్రియంబులు గావు నా
జీవిత శేష మీపావనాత్మ

చరణారవిందముల్ పరమ భక్త్యావేశ
మలరారఁ గొలిచి ధన్యత వహింతు
నిది సత్వరాశ్రిత్య మిది తరణోపాయ
మిది సదారాధ్యమౌ నేఁడు గడయుఁ;
గీ॥ గంటిఁ గంటినేను విముక్తిఁ గాంచు త్రోవ''
యని చివాలునలేచి వందన మొనర్చి
తల్లి మట్టి పెకల్చి మస్తమునఁ దాల్చి
వడి వడిగవెళ్ళి యుత్తమాశ్వంబు నెక్కె. 143

క॥ ఆరీతి వీరు లందుఱు
చేరెఁడు చేరెఁడుగ మట్టిచేకొని తలలఁ
జేరిచి మ్రొక్కుచుఁ బయనం
బారంభించిరి ప్రతాపుఁ డందఱ నడుమఁ. 144

గీ॥ ఆత్మదేశంబు విడనాడ నడరు పొడమి
గుండె బరువెక్కె; నెలుఁగు డగ్గుత్తిక వడె;
నచలరంగంబు వదలి వాయవ్య దిశకుఁ
దరలి రందఱు మౌనముద్రలు వహించి. 145

సీ॥ తానెల్ల యపుడ భేదప్రతిపత్తి మై
త్రిని బెంచి గుహుఁడంచు దేవుఁడంచుఁ
దద్దయుఁగొలుచు ప్రతాపుఁడు దేశంబు
విడిపోవు ననువార్త వినిన మొదలు
స్వాంతమెంతయు నొచ్చి పచ్చిపుండై లోనఁ
గుమిలి కుమిలి ప్రీలి కూలు కతనఁ
దొలి దినంబున నుండి పలుకొండురాక యా
కసము పైప్రాలిన కరణి మౌన
గీ॥ ముద్ర వహియించి యెడఁబాసి పోవఁ గాళ్ళు
రాక, మదిరాక వెంట దూరమ్ము నడచి
తుది నమస్కార మొనరించి యొదిగి నిలిచి
భిల్లగూడెంబు దెసమళ్లె భీమచాందు. 146

గీ॥ ఒకరి నొక్కరు పల్కరింపకయె యస్రు
ధారలఁ దోఁగి దైన్య ముద్రలను సూగి
యాప్రతాప పురోగము లగుచు నెల్ల
వార లరిగిరి గిరిపొలిమేరఁ జేర. 147

—• ఛామాసాహి మేవాడకు వచ్చుట •—

సీ॥ ముడుతలు వడ్డ మోమునఁ బట్టెవర్ధనం.
బఱుత జందెంబు బ్రాహ్మణతఁ దెలుప,
నిండార నెరసి పండిన శిరోజమ్ములు
కమియ మాఁగిన వయోగరిమఁ దెలుప,
వ్రాలిన బొమల వెల్వడు వాఁడి మనుఁజూపు
లేదిరి డెందముఁ జొప్పు పదను దెలుప,
నధరంబుపై నంటియుంటని చిఱునవ్వు
తొలకని నిత్య సంతుష్టిఁ దెలుప.
గీ॥ బుజమునను బైరవాసము, మొగమునందు
బ్రహ్మవర్చస ముదితమై పరిఢవిల్ల,
సుక్కుఁ డునుకఁబోలిన యశ్వమెక్కి యొక్క
శాంతమూర్తి బ్రాహ్మణుఁడు సాక్షత్కరించె. 148

సీ॥ అగుంపునకు నెల్ల నగ్రభాగమున వ
ర్తించు ప్రతాపేంద్రు దెసను జూచి
యావృద్ధభూసురుఁడశ్వంబు నిలిపి "యో
వీరపుంగవ' నేను సూరదేశ
మందుండి వచ్చితినయ్య' యే కొండల
యందుఁ బ్రతాపేంద్రుఁ డధివసించు
నెఱుఁగుదురే కద! యెయ్యది త్రోవ నా
కెఱిఁగింతురె కృప వహించి" యనిన
గీ॥ నాత్మదేశంబు విడువఁ గొండంత వగపు
దోఁపఁ దలయెత్త కరుగు ప్రతాపదేవుఁ

డా మహీదేవు దివ్య వాక్యమ్ము లపుడు
విని వినక తన క్రోవసు జనుమనుండె. 149

శా॥ "ఏమయ్యా! దయయుంచి యిట్లు కనుగొమ్మీ వృద్ధుఁడన్ దూరపున్
సీమల్ దాఁటుచుఁ బెక్కు కష్టముల గాసిన్ బొంది నే వచ్చితిన్
భూమీశుండు ప్రతాపుఁడీ గిరుల నెందున్ గాపురంబుండు నెం
దేమీరాతనిఁ జూచియున్న నెలవిం డీ"ష్టంచుఁ బ్రార్థించినన్. 150

క॥ కనులెత్తి రాజమణి వి
ప్రుని వదనముఁ గాంచి యశ్వమును నిలుపుచు "నో
యనఘా! మీరెవ! రెందులఁ
జనుదెంచితి" రనద్విజన్మ సత్తముఁ డంతన్. 151

సీ॥ "పరిషియానుండి నేవత్తు; ఘామాసాహి
నాపే"రనినఁ దక్షణమ ప్రతాపుఁ
డాస్యంబు వికసింప నశ్వంబు డిగి భక్తి
తాత్పర్య విహిత ప్రదక్షిణంబుఁ
జేయుచు నల్లనఁ జేతులు జోడించి
"నిరతంబు నీపాద నీరజములం
భజియించు నీదు సేవకుఁడు రాణాప్రతా
పుఁడు మ్రొక్కుచుండె నీయడుగు దోయి"

గీ॥ నని నిలువ, నంద అనుచరు లబ్బురమున
నశ్వములనుండి దిగిరి ధ రామరోత్త
ముఁడు తురంగము డిగ్గి యప్పుడమి జేనిఁ
గౌఁగిఁటనుజేర్చి హర్షాబ్ధిఁ దోఁగి నిలిచి. 152

శా॥ "నా విశ్వోన్నత దివ్యకల్ప తరువున్ నావజ్ర కోటీరమున్
నా విస్తార మనోంబుజాత తరణిన్ నాకీర్తి నిక్షేపమున్
నా వేల్పున్ మణి నాదు రాజధనమున్ నాస్వామి దర్శించి నా
సేవన్ గూర్పఁగ వచ్చినాఁడఁ; గృప వీక్షింపంగదే భృత్యునిన్. 153

క॥ పరిశుభ్రతర సుధా సా
గర వీచిక లట్లు వీదు ఘనకీర్తి కళల్

మెఱనె దెసల; నీయంతటి
పరమోత్తమ ధర్మవీర వరుఁ డుందెడునే. 154

సీ॥ స్తిమితమ్ము తుదల ఏచ్చి యుదార గంభీర
కాంతు లీను వెడంద కనులతోడఁ
బరువంపు బుగ్గలపైన రెక్కొను మీస
ల వెలుంగు మోము వాలకముతోడఁ:
వీర మహాలక్ష్మి విహరించు దుర్గమై
విరిసిన బలితంపు టురముతోడఁ:
చలమెత్తు వాఁడి కుంతముఁ గేల నూఁది ధీ
రత యుట్టిపడ నిల్చు రాణతోడ;
గీ॥ నొచలఁ దురాయి, వీరతేజోదురీక్ష
వదనమునఁ గుంకుమపు బొట్టు వజ్రవర్మ
మొడల వెలుగొంద సలరు నీ పొడవుఁగంటి,
నెంతకళ గల తండ్రి వోయీ! ప్రతాప! 155

సీ॥ సత్వబుద్ధిని రిపు షడ్వర్గము నెదిర్చి
గెల్చినా, వరులను గూల్చినావు
తులలేని దేశభక్తులయందు మేటివై
హెచ్చినావు, యశంబుఁ దెచ్చినావు
ఇరువదేండ్లుగఁ బైన నొఱగు నాపదలెల్ల
నోర్చినావు, జయింప నేర్చినావు
కుల సనాతన ధర్మములను సుస్థిరముగా
వించినావు, ప్రదోఛ మొంచినావు
గీ॥ నొక్కపరి నిన్నుఁ గననెంచి యుంటి నిదియె
తరుణ మనుకొంటి నీదివ్య ధవళ యశము
నెంచు కొనుచుంటి నితరులకిది యలభ్య
మంటి. నూఱేండ్లు నీకు దీర్ఘాయు వంటి. 156

క॥ అని యాశీర్వాద మొన
ర్చిన విప్రోత్తముని జూచి నృపగురుఁరుడును "దే

పునియట్లు చేరవచ్చిన
నినుఁ గని ధన్యుండ నైతినే నియ్యెడలన్. 158

మ॥ మును చాణక్య యుగంధర ప్రముఖులన్ బోలెన్ మహానీతి వి
ద్యను మేవాడనృపాళికిన్ గఱపి రాజ్యం బూర్జితంబై విసూ
తన కల్యాణ జయోదయాదికము లందన్ జేసి మాభక్తి కె
ప్డును బాత్రమ్మగు నీదు దివ్యచరణంబుల్ గంటి నీనాఁటికిన్. 159

మ॥ భవదత్యుత్తమనామ మెల్లపుడు మేవాడ్దేశమంచెల్ల గౌ
రవదామంబయి యొప్పుఁ; గట్టకడ కుగ్రామంబులందున్ బ్రజా
నివహం బద్దమరేయి మాటవరుసన్ నీపేరు విన్నంత భ
క్తివిరాజిల్ల నమస్కృతుల్ సలిపి నిన్ గీర్తించు నోసద్గురూ! 160

గీ॥ పరిషియా కేగుదెంచి నీ చరణపూజ
సలుప వలెనంచు నెన్నిమాఱులొ తలఁచితి;
నిమిష మూపిరి వోని యుద్ధముల మునిఁగి
కాలు గదలింపలేక యాలీలనుండి." 161

గీ॥ అనుచు వచియించి నంత హర్షాంబురాశిఁ
దేలి భూదేవమణియు "నోదేవ! నేను
నిన్నె యనుకొని యనుకొని యెట్లొ నేఁడు
కాలు గదలించుకొనుచు రాఁగలిగి నాఁడ 162

గీ॥ అనయ మేఁగొల్చు పూర్వ మహా మహీంద్ర
శుభ తపః ఫలమును నిన్నుఁజూచు కతన
జన్మ చరితార్థమయ్యెఁ; నెచ్చటికి నేఁటి
పయనమోయన్న" యనఁ బ్రతాపప్రభుండు. 163

గీ॥ "స్వామి! నీదివ్య చరణాంబుజములు గొలువ
పరిషియాచేర నిటు నేఁడు వచ్చుచుంటి
వెదుకఁ బోయిన తీవయ్యే యెదుర వడిమె
నన్ఁగ నిందె నీదివ్య దర్శనము గలిగె. 164

గీ॥ మేరువును బెల్లగించి కోటీర మిడుదు
నుదయపురలక్ష్మి కనిలోక మురలఁదాఁకి

ఇరువదేండ్లు పోరితి; నా యదృష్టమెల్లఁ
చెడియె నీవిధమున నేమి చేయువాఁడ." 164

— ఫామాసాహి ప్రతాపసింహుని దండించుట. —

సీ॥ అని దైన్యమడరఁ బల్కినను ఫామాసాహి
విని విన్నవోయి యాననము వంచి
"శ్రీహరీ, నాదురదృష్ట మేమందు, నీ
వలన నింతటి వేఁడి పలుకు వింటి;
నీ వార్తవిని వ్రీలదే, హృదయము శిలా
ఫలకమో! లోహమో! వజ్రమొక్కొ-
నూఁటామడల దూరమీరీతి వచ్చు న
త్సాహంబు సుడిసి విధ్వస్త మయ్యె
గీ॥ నకట! నామేనఁ గొనయూపిరాడు చుండఁ
బరమపుణ్య స్వరూప మేవాడ లక్ష్మి.
వైభవ ప్రాభవాంకంబు భాను కులము
చెడిన నోర్తునె, విధి వ్రాలుతుడుతుఁ గాఁక. 165

మ॥ అకటా, యుత్తమ భారతీయుఁడవు ఘోరాప త్సమూహంబు నిం
చుక లెక్కింపని విశ్వవీరుఁడ వటంచుఁ నిన్ను లోక ప్రజా
నికరం బెప్పుడు సంస్తుతుల్ సలుపఁగా నీవే స్వకృత్యంబు నూఁ
దక పోనాడిన ధర్మమెట్లు కొమరొందఁ నేర్చు లోకమ్మునఁ 166

గీ॥ నడి చెఱుంగని కర్మ వీరుఁడవు నీవు;
నీదు జయమైన నదియు లోకైక జయము;
నపజయంబైన నదియు లోకాప జయము
నై ప్రపంచాప జయము నౌనసఁగ వలయు. 167

గీ॥ పెక్కువేల్ మైళ్ళ పైనున్నవిందు నెపుడు
నీదు పరిపాలనముఁ గూర్చి నీ యఖండ
కదన దీక్షను గూర్చి త్యాగంబుఁ గూర్చి
సాహసముఁ గూర్చి కర్ణ రసాయనముగ. 168

సీ॥ మాపూర్వు లెప్పుడు మీపూర్వ నరపాల
మౌళుల చెంగట మంత్రులగుచు
వెలలేని భక్తితోఁ గొలిచిరి; నిరుపమ
సాహసాంకుండైన చండుఁడును, బ్ర
ధానప్రధాని పదమునొందు పిదప రెం
డవ మూఁడవ ప్రధాను లగుచు నాదు
పితరులు నేను సేవించుచుంటిమి; సర్వ
దేండ్లయ్యెఁ బరిషియాకేగి నేను
గీ॥ బరమ ధార్మికులైన మేవాడ నృపుల
నెమ్మది స్మరింపకయే యీదినమ్ము దాఁక
దేవ! పిడికెఁ డాహారముఁ దిని యెఱుఁగము;
నాశరీరంబె మీది ప్రాణంబె మీది. 169

మ॥ వితత ప్రేమను నేనుగొల్చెడు మహీభృద్వంశ మందిట్టి ద
ర్పిత శౌర్యాంకుఁడు నిన్నుఁ బోలిన మహావీరుండు జన్మించె సం
చతి హర్షమ్మున మండువేసవి నుదగ్రాయాస ధారంబు నో
ర్చితి; దూరమ్మిటు లేగుదెంచితి; భవచ్ఛ్రీ పాదముల్ గొల్చితిన్.

క॥ కడు వృద్ధుఁడ; మేవాడ్ భ
క్తుఁడ; సచివుఁడ; భూమిసురుఁడఁ; దోచినమాటలో
నుడివెద; విని నీ తోఁచిన
వడువున మెలఁగంగవచ్చు వలదనను నృపా 171

సీ॥ మేవాడవిడిచి యింకే వాడలకునైనఁ
బరువెత్తి పోవుట భావ్యమగునె
పాదరసము వోలెఁ బరిపరి విధములఁ
బాఱిపోయిన దానఫలము గలదె
నిలువుము; ధైర్యంబు నిలిపి నీయిప్పటి
స్థితులెల్లఁ జక్క యోజించు కొనుము
అత్రమేటికి? శాంతి నందుము; నీనుండి
నీవెప్డు దూరంబు పోవఁగలవె

గీ॥ చక్రవాళాచలము దాఁటి చనినఁ గాని
వనధి సప్తకమున మునింగినముగాని
కడ కెచటికేగినను బ్రతాపుఁడవుగాక
మాఱి మఱియొక్కరుఁడవగు మాద్రిగలదె. 172

గీ॥ చనదు కృషి విరసింపఁగా సాధకునకు
నదియ యన్నిఁట నరుని యోగ్యతను బెంచుఁ;
గృషిని రోయు వానికిఁ జోటు క్షితినిలేదు
వసుధకెల్ల శుభం బట్టివాని పోక. 173

గీ॥ అలజడిని మున్గినపుడె సత్యము జయించుఁ;
నపజయంబుల నదిపెంచు నాత్మశక్తి
యనుపమ త్యాగమును సత్య మాప్త మిత్రు
లంద్రు స్వాతంత్ర్య తత్త్వజ్ఞులైన బుధులు. 174

గీ॥ అఖిల దిశలందు నాపద లలముకొనుచు
దిక్కు దోఁపని విషమ సందిగ్ధ దశల
ధైర్యమును జిక్కపట్టక తలఁగెదేని
నీబలము చాలదనియె నిర్ణయింతు. 175

గీ॥ ప్రాణమున కెక్కుడైన మేవాడ వీడి
వెడలిపోఁగాదు; పోఁగాదు; వినుఁడు నాదు
ప్రార్థనము కాదు కూడదటంచుఁ బోవఁ
దలఁతు రేనియుఁ బోనీక నిలువరింతు. 176

ఉ॥ "పూవులురాలె; నాకులును బోయెను మున్గ్లును మ్రోడునిల్చె; నీ
వీవిధిఁ గేతకిన్ విడువ కేటికిఁ జుట్టె"దనన్ "వసంత ల
క్ష్మీ విభవంబు సోఁకినఁ జిగిర్చి తరుల్ కుసుమించు నన్న యా
శావసరంబుచే నిలుతు"నంచు వచించుఁ గుమార భృంగమున్." 177

గీ॥ అని వచియింపఁ బ్రతాపుని
కనులను ముత్తెంపు టశ్రు కణములు జాల్వా
రిన విప్రసచివుఁ గని "యే
మని నీవాత్సల్య గరిమ నభినందింతున్. 178

చ॥ పరిమితశక్తుఁ డొక్కెడ విపర్యయవేళ స్వధర్మ మార్గముం
దొఱఁగునయేని వత్సలతఁ దోచి మహాపురుషాకృతిం బరా
త్పరుఁడు ప్రబోధ మిచ్చుచు నపాయముఁ గాచి పథంబుఁ జూఁపునం
చెఱుఁగుదు మిమ్మువంటి విబుధేంద్రుల మూలమునం గురూత్తమా.

గీ॥ స్వామి! నాపైనఁ బరమ వాత్సల్య వశత
నింత దూరము చేంచేసి యిటులపార
పురుష కారము నేర్పు నమూల్య హితము
దైవ నిర్మాల్య మటు శిరసావహింతు. 180

గీ॥ అఖిల భువనావనంబు నీయమృత గీతి
నాహృదయ తంత్రులను మీటి నను గఱంచె;
హరగురు పదంబులటు నీపదాంబుజమ్ము
లనఘ! యనవరతమ్ము సేవ్యములు నాకు. 181

సీ॥ అభిలషించినరీతి నాజ్ఞసేయుచు దేవ
పనిగొను"మని వచింపంగ, విప్ర
సత్తముండును "క్షణక్షణ మమూల్యం బిప్డు;
కాలంబు వృథసేయఁ గాదుమనకుఁ,
జర్చింపఁ దగిన విషయము కొంచెమె; నిమే
షము మాటలాడినఁ జాలు ప్రకృత
మనుసరింతము! లేదు వ్యవధి! జాగేటికి
రమ్మల్ల నింబ వృక్షమ్ము దరికి;

గీ॥ మఱియు నొకమాట వినుతు నీ మంత్రిమౌళి
యనుభవజ్ఞుండు స్వామి భక్తాగ్రగణ్యుఁ;
డల సలుంబ్రాధిపతిఁ బిల్వు; మాయనఘుఁడు
లేని మంత్రాంగము మనసులేని పూజ." 182

మ॥ అని బోధింపఁ బ్రతాపసింహుఁడు సలుంబ్రాధీశు నెమ్మోముఁ గాం
చిన, నాధన్యుఁడు చేరఁగా నరిగి "మీ శ్రీపాదరాజీవ ద
ర్శనముం జేసెడి యీవిధేయుఁడె సలుంబ్రాకృష్ణసింహాం"డటం
చని సాష్టాంగ నమస్కృతుల్ సలుప నయ్యాచార్యుఁడుం బ్రీతుఁడై

—• భామాసాహి-ప్రతాపసింహునకు రాజనీతి నుపదేశించుట. •—

క॥ లెమ్మనెఁ; జని ముప్వురు వృ
క్షమ్ముదరిఁ జేరి; రధిక సంతోషము చి
త్తమ్మున వెలయఁగ నృపు నా
స్యమ్మును గని "యవధరింపు మవ ధానముతో. 184

గీ॥ స్వామ్యమాత్య సుహృత్కోశ సైన్య దుర్గ
రాష్ట్రములు నను నివి యేడు ప్రకృతు లండ్రు;
ప్రకృతి బలమున్నఁనే కాని పార్థివునకు
నించుకేనియు నాస్తిక్య మెసఁగఁబోదు. 185

గీ॥ ఇన్నిఁటను నెన్నియున్నవో యెంచి చూత;
ముత్తమ కులీనతయు మహోదాత్త వీర
వర్తనము సత్యసంధత వఱలునీకు
రాజరాజుగ నుండ నర్హతయ కలదు. 186

మ॥ సువిశాల స్థిరబుద్ధియై యనుభవజ్ఞుండై కడుఁ స్వామి భ
క్తి వికాస స్ఫురితుండునౌ నృపతినీతిజ్ఞుండు నుత్సాహ వై
భవుఁడే మంత్రిగనుండ నర్హుఁడు; సలుంబ్రా కృష్ణసింహేంద్రు వం
టి విశేషజ్ఞు గడింపఁగా నగునె మంత్రిత్వంబు సంధింపఁగన్. 187

మ॥ బలవంతుం డనురాగ వంతుఁడును శోభావంతుఁడున్ వాహినీ
బలవంతుండును ద్యాగవంతుఁడును ఛత్రస్వాంతుఁడై ధీరునిన్
దలపన్‌బోలు సుహృద్వరుండని కిరాతిస్వామి నీభీమచాం
దలఘు స్వాంతుఁడు; వానిమించిన వయస్యశ్రేష్ఠుఁడే లేఁడుపో. 188

గీ॥ ధన-చమూ దుర్గ-రాష్ట్ర సంతతులలోనఁ
బ్రథమమే యగ్రగణ్యమై వాసిఁగాంచు
నది ప్రపంచైక సార సర్వాత్మకంబు;
దానిఁబట్టి తక్కిన మూఁడు తనరుచుండు. 189

ఆ॥ ద్రవ్యబలము గలుగఁ దనరు సైన్యబలంబు;
ధన-చమూ బలములు దనర, దుర్గ-

రాష్ట్రబలము లలదు; ద్రవ్య మన్నిఁట మేటి;
యదియ నీకు లోప మాది నుండి. 190

గీ॥ ఆశ్రయ-యాసన విగ్రహ-యాన-భేద
సంధులను నాఱుషడ్గుణ సమితియందు;
రేపు డెటుల వీని నడపు కీలెఱిఁగి నట్టి
ధాత్రిపతి యన్నిరీతుల ధన్యతముఁడు. 191

గీ॥ అవసరమ్మైన శక్తిత్రయమ్ములోన
నతులితోత్సాహశక్తి నీ కలదుఁ;గాని
మంత్రశక్తిఁ బ్రయోగించు మాద్రిలేదు
మఱియుఁ బ్రభుశక్తి మొదలంట మాసియుండె. 192

సీ॥ స్థిరతర ధైర్యైక జీవివై జంకక,
వెనుబోక, తగ్గక విసుఁగుపడక,
కష్టంబులకు జిక్కక ప్రపంచోన్నత
ప్రబల విరోధితోఁ బ్రతిఘటించి
సంగ్రామ మిన్నేండ్లు సాగించి యుంటివి;
నిన్నెఱుంగని వారు నీయహితులు
భవ దుదార యశము వర్ణించెదరు; కాని
కోశ-సైన్యబలముల్ కొఱతగాఁగ
గీ॥ నెన్నికల్పంబులని చేసి యేమిలాభ
మెటు జయముగల్గు నీకక్క రెటుల గోఁగు
'నిర్వదేండ్లుగ నాకాల మిట్లె వృధగఁ
జెల్లె'నని మాత్రమిపుడు చింతిల్లఁబోకు. 193

ఆ॥ అదియు నాత్మశిక్షకై చెల్లె ననుకొను;
మింక నిట్లె కాలమేఁగ నీకు;
దేశ ముద్ధరింపఁ దివురు; మొండొక మాట:
వినుతు; వలవ దనక పనియొనర్పు. 194

మ॥ పరమప్రీతిని దేశ మాతృపద సేవా భాగ్యముఁ గోరి నా
సరసంగల్గు ధనంబు నీదు చరణాబ్జాతంబు లందుంతు; సం

బర మొప్పారఁ బరిగ్రహింపఁ దగు. మేవాడ్ దేశముఁ గొల్చి య
క్బరు సాధించి యపార వైభవమునన్ వర్ధిల్లు రాజోత్తమా. 195

క॥ నెనరుంచి నాదు ప్రార్థన
విని దేశము నోము" మనుచు విప్రుం డన, నా
తనిఁ గని టానపతి "నీపం
పును సలుపుమఁ గాక; త్రోసి పుచ్చకె యెపుడున్. 196

మ॥ అనఘా' జేసెఁడు మేర యేనియును రాజ్యం బొక్క కానేనియున్
దనమున్ బొల్తటినుండి లేకయ దరిద్రత్వంబునన్ వెళ్లఁబో
యనె లోకమ్మునఁ బుట్టు వొందిన యభాగ్యచ్ఛత్ర సంపన్ను, నన్
ధనికున్ జేసి కృతార్థుఁ జేయఁ గరుణన్ దైవంబవై తోఁచితే. 197

చ॥ ధనము నొసంగి, వస్తు సముదాయ మొసంగి యనర్ఘరత్న మం
డనము నొసంగి, బ్రాహ్మణుల నారవివంశజులెల్లఁ బొల్లి య
ర్చన మొసరించుచుందు; రది సర్వము భూసురమౌళివైన నీ
ధన మిపుడేను గైకొనుట ధర్మము గాదని తోఁచె నామదిన్." 198

క॥ అని టంకుచు సంతోషిం
చిన ధామాసాహి "యిమ్ము సేవించి గడిం
చిన ధన మిత్తటి మీ క
ప్పన మొసరించుటయ పరమ భాగ్యము నాకున్. 199

క॥ మేవాడదేశ ధనమే
మావాడల నుంచు; దాని మాతృపద శ్రీ
సేవావిధి కర్పింపని
జీవన మేమిటికి వట్టి సిరి యేమిటికిన్. 200

క॥ మనసార నిత్తుఁ జేకొను;
వినుము కలిగినపుడు మఱల వృద్ధియు మూలం
బు నొసంగుము కొనెదను; వల
దనకుము; నామాటచూడు; మగును శుభంబుల్. 201

మ॥ తడవున్ జేయకబోయె పాళెమునకున్ ద్రవ్యంబు నంపింతు న
క్కడకున్ మీరును బోయి యాశబర లోకస్వామి దర్శించి యె

క్కుడుగా సేనలఁ జేర్చుకొండిపట నాకుఁ నిల్వఁగాఁ దీర; ది
ప్పుడె నేఁబోవుదునంచు లేచి తురగంబుఁ డాసి పైనెక్కుచుఁ. 202

కః తనకభిముఖముగ నిలుచుం
డిన సేనాధీశ్వరులను నిఖిల సుభటులఁ
గని వీర రసోత్సాహం
బున ధామాసాహిమంత్రి పుంగవుఁ డంతఁ. 203

—• ధామాసాహి రాజపుత్రులను బురికొలుపుట •—

సీ॥ "సిరికిఁ దానకమైన చిత్తూరు పురలక్ష్మి
యనదయై పాటుఁ వనఁట మునుఁగ
నుర్వియంతయు మెచ్చు నుదయపుర విభూతి
బూది పాలగు హోమముగఁ జెడంగఁ
గోటలన్నిఁటిలోన మేటి 'కుంభల్ మియర్'
యవనులచేఁబడి నవని ఖోవఁ
బావనోన్నత మేఘభవనంబు తురక తె
క్కముల గాడ్పులు సోఁకి కీడువడఁగ
గీ॥ నట్టి హారావళీ పర్వతాంతరముల
నిరువదేండ్లని చేయు పెంపెల్లఁ బొలియఁ
గడుపుఁకూటికై వంశ విక్రమము మఱచి
వెడలుచున్నారెః మేవాడవీరురారః 204

సీ॥ శార్దూలరాజ ఘటాపేరి ప్వారి చే
యుఁగఁజాలు ఝాలా భటాళు లుండ,
బాలురై రిపుసమవర్తులై ఖండించు
ప్రబలచొండావన్న ్రపాలు రుండ,
విమతరాడ్గర్భ నిర్భేదకప్రౌఢి దీ
పించు రాఠోడ్కుల వీరు లుండ,
ముజ్జగంబులనైన ముంజేతఁ బోఁదోృియఁ
గలిగిన చోహాణ బలములుండ,

గీ॥ మా ప్రతాపుఁడు బ్రదికి సేమమున నుండఁ
గృష్ణసింహు నొడల నూపి రెసఁగి యుండఁ
గులసనాతన వీర్యంబుగుంటఁ బెట్టి
పాఱుచున్నారె! మేవాడ వీరులార! 205

సీ॥ రాజ్యంబు పోయినఁ, బ్రాభవం బూడిన,
సకల భాగ్యంబులు సన్నమైన,
బలమెల్ల జెడినఁ, గోటలు పోయినను, సారె
కపజయంబులు క్రమ్మి యడలొదవిన,
గడ్డి యాహారమ్ముగాఁ, జెట్లనీడలు
నెలవుగా, మృగములె స్నేహితులుగ,
నిల్లాలి నెడఁబాసి పిల్లల విడనాడి
కట్టుగుడ్డలు లేక గాసి పడియు

గీ॥ విడక స్వాతంత్ర్యమును గొల్చు వీరు లనెడి
యశముఁ బోఁద్రోసి యాభిజాత్యంబు రోసి
కటకటా! దేశ మరుల కగ్గంబు చేసి
విడుచుచున్నారె! మేవాడ వీరులార! 206

సీ॥ తెలుఁగువల విమల పాతివ్రత్య మహిమంబు
సన్నగిల్లినఁ గనుల్ చల్లవడెనొ
సకల దిగ్దేశ రాజన్య ప్రతాపాగ్ని
చల్లార హృదయముల్ శాంతిఁ గనెనొ
భరతఖండమున గోవధలు సాఁగినఁ జూచి
యంతరాత్మకు సౌఖ్యమలవడియెనొ
దాస్యాంధ కారంబు దశదిశల్ గవియ దే
హముల నాప్యాయనం బలము కొనెనొ

గీ॥ కనులు తిరిగెనొ! బాహు విక్రాంతి చెడెనొ
బుద్ధి తఱిఁగెనొ! చేడువేళ ముసురు కొనెనొ
కానిచో మాతృదేశంబు మాని పోవు
వెట్టి యెటు గల్గె మేవాడ వీరులార! 207

సీ॥ యవన గజేంద్ర సింహఖ్యాతిఁ గాంచిన
బప్పరాయనిఁ గన్న భవ్య మాత
జీవితం బరికోటిఁ జెండ నర్పించు హ
మీర సింహుని గన్న మేటి తల్లి
దానువంశ క్షమాపతిమౌళి యన నొప్పు
సమరసింహునిఁ గన్న చల్ల నమ్మ
యతి దీక్షతో మొగల్ యాగముఁ దీర్చు సం
గ్రామసింహునిఁ గన్న రాజ జనని

గీ॥ యందఱను మిమ్ముఁ బెంచిన యసమ ధాత్రి
తల్లి దండ్రియు గురువునై తనరు సీమ
యకటకట, స్వర్గమున కన్న నధికమైన
మాతృదేశంబు విడిరాదు మఱల రయ్య! 208

సీ॥ కడుపు కక్కుఱితి కీగతిఁ జేయఁగారాదు;
తినినఁ దినకయున్నఁ జనును గాల;
మక్కటా! ప్రాణంబులంత తీపైయున్నె
పిఱికి పంద లటన్న పేరు రాదె
బవరం బనిన నొడల్ వడఁకెనే మీకు భా
ర్యా పుత్రులం దంద యాస తగునె
చిరకాల మపకీర్తి చేరదే! హృదయాభి
మాన ధనంబెల్ల మాసి పోదె

గీ॥ తగదు పయనింప, వెనుకకుఁ దరల రయ్య
బలముఁ గొనరయ్య! కోటలు గెలువ రయ్య
యరుగవలె నాకు సెలవియ్య; వయ్య," యనుచు
నశ్వమును ద్రిప్పి వెనుకకు నరుగఁ దొడఁగె. 209

గీ॥ విరిసి విరితేనె వాఁక జొబ్బిలిన యట్లు
వీరరసము పొంగి పొరల వీరులెల్ల
వెడలి పోవుచునున్న యా విప్రు చరణ
సరసిజములకు మ్రొక్కి యశ్వముల నెక్కి. 210

క॥ పరివారమ్ములఁ దోడ్కొని
త్వరమై నశ్వముల నెక్కి తరలెడు తఱి నా
ధరణీపతి సలుంబ్రా ధీ
శ్వరుఁగని సంభ్రమము వెఱఁగు సందడి గొనఁగన్. 211

సీ॥ "ఎన్నేండ్లు పూర్వమో యిచట మంత్రిగనుండె
నుపకార వేతనమొంది యొదిగె
విప్రుఁ, డంతర్ముఖి, వేదరాశి, విదేశ
ములనుండి యిర్వది మూఁడువత్స
రములుగా తెప్ప మార్పని దృష్టి దాన మహో
ద్యమము శోధించి లోపములు గాంచి
యెండ కోర్చుచు శతవృద్ధయ్యు నూఱామ
డలువచ్చి హితబోధ మొలుకఁ జేసె

గీ॥ నౌర! మేవాడ యనిన నియ్యనఘ మూర్తి
కెంత యభిమాన మున్న నిపుడు తెలిసె
దేశభక్తి పుంరూప మొందినటు తోఁచె
నితర కడనిల్వ మనకు యోగ్యతయుఁ గలదె? 212

సీ॥ మన మపారక్షాత్రమును నఖండ త్యాగ
మునుజూపి దేశమాతను గొలిచితి
మని యుబ్బుచుంటి! మీ యఖిలైక పూజ్యుఁ దే
తెంచి యించుక విమర్శించి నంతఁ
జిటికెల పందిరి యటు గాజు టిలు మాడ్కి
మనమ్మొగ వృథమైనమాద్రి తోఁచె
నిరువది మూఁడేండ్ల యీ మహోద్యమము గా
ఢాంధకార నిమగ్న మగుచుఁ జెడియె

గీ॥ బ్రాహ్మరూపంబుతోడ, విశ్వము నగల్చు
క్షాత్ర తేజోమహాగ్నిని జల్లు నవ్వు
డాస్యమును గాంచి మాటాడుటట్టు లుండ
నఱత నిలుచుంటకే నాకు వెఱపు తోఁచె. 213

మ॥ మునుపా యక్బరు సార్వభౌమునకు జాబున్ వ్రాసి పంపించి న
ప్పును 'నేఁడీగతి దేశముల్ విడుచు నప్డున్ నేను గొండంత త
ప్పునె కావించితి నిక్క మాధరణి దేవుండెంత గాసిల్లె మె
త్తని మాటాడఁగ నోఁచనైతినీ మనస్తాపంబు చల్లారఁగన్. 214

మ॥ అతిభక్తి స్థితిఁ దానుగొల్చిన ప్రపంచాతీత తేజో బలో
ద్ధత సూర్యాన్వయ మందునన్ బొడమి యీతండిట్టులాత్మాన్వయో
న్నతిఁ బాటింపక వీడె దేశమను సంతాపాగ్నిచేఁ గోప ఘూ
ర్ణితుఁడై నాపయికెత్తివచ్చు ఎవరేనిన్ బాడిగా దందురే. 215

ఆ॥ ఆమహానుభావు నకుత నేనెంత నా
త్యాగమెంత బుద్ధి దార్ఢ్యమెంత;
యణువునకు శతాంశ మైనను గానంచు
గర్వ మెడలి నమ్రగతి వహింతు." 216

మ॥ అని వాక్రుచ్చినఁ గృష్ణసింహవిభుఁ "డ య్యాచార్యుఁడున్ నేర్పి పో
యిన బోధంబది వేదతుల్యము పరాకింతేని లేకుండ నేఁ
డనువర్తించి బలంబుఁ జేకొని విపక్షానీకమున్ గెల్చి గ్ర
క్కున స్వాతంత్ర్యము మాతృదేశమున నెక్కొల్పంగ నర్హంబగున్.

క॥ కనికరము వెల్లి విరిసెడు
మనమున నరుదెంచి దేశ మాతృ క్షేమం
బును మన నేమముఁ జూపెను
మనోరథములెల్లఁ దీఱుమార్గముఁ జూపెన్. 218

క॥ మన యత్నమునను లోపము
కనపడకుండంగఁ గడఁగి కార్యా చరణం
బొనరింత మాలసింపఁగఁ
జనదిఁక"నని తాను నృపుఁడు సైనికు లెల్లన్. 219

—• రాజపుత్రులు వెనుదిరిగి భీమచాందు నివాసమునకు వచ్చుట. •—

మ॥ త్వరమై నద్దమ రేయికిన్ హిత కిరాతస్వామిని గూడెంబులన్
దరియన్ బోయి బహిః ప్రదేశము కడన్ ధాత్రీనభోభాగముల్

విరియఁగ శంఖము లూఁదిరంత శబరోర్వీ నాథుఁడుఁగ మిత్ర శం
ఖ రవంబుల్ గుఱుతించి స్వాగత మిడంగావచ్చె సాశ్చర్యుఁడై, 220

గీ॥ రచ్చపట్టు మ్రోల మహాగ్ని రగులఁజేసి
పిలపిలని మూఁగి భిల్లులు బలిసి కొలువ
భీమచాం దందుఁ జేరిన వీరులకును
సాత్త్వికాహారము లొసంగి సత్కరించె. 221

క॥ తెలతెల వాఱెను భానుఁడు
మొలిచెను బూర్వాద్రి వీర పుంగవులు మహీ
తలపతి పదముల కెఱగుచు
సెలవుఁ గొనుచు వెడలి రాత్మసీమలు చేరఁగ. 222

శా॥ "ధామాసాహి ధరామరేంద్రుని కృపఁగ స్వాతంత్ర్య దుర్వార సం
గ్రామ క్రీడలు వెంచి శత్రుతతులఁగ ఖండింపఁ గాంక్షించె రా
రో! మీరందఱు దేశభక్తి పరిపూర్ణుల్ బాలురుఁగ వృద్ధు లు
ద్దామాటోపుఁ బ్రతాపుఁ గొల్వఁగఁ గిరాతస్వామి గూడెంబునఁగ"

చ॥ అనుచును రోదసీ కుహర మంతయు వ్రీలెడు భంగి డిండిమ
స్వనముల రాజపుత్రకులు పల్లెలు పట్టణముల్ పురంబుల
న్ని నగరముల్ గిరీంద్రము లనేక గుహాకుహరమ్ము లందునఁగ
వినఁబడఁ జాటఁజొచ్చి రొకవేయి విధంబుల దేశమంతటఁగ. 224

—* రాజపుత్ర సైన్యములు గుంపులుగావచ్చి ప్రతాపసింహుని జేరుట. *—

సీ॥ అలసలుంబ్రా విధుండహిత దుర్వార చోం
డావద్బలంబుతో నడచి వచ్చె
బేడ్లా కొఠేరియా పృథ్వినాయకులు చో
హాణ వర్గములు కొల్వనరిగి రంత
నా షాపురా బునేరాధీశులు శిశోది
యాభటుల్ కొలువఁ బ్రయాణమైరి
హరిదాసుఁడు ముకుందుఁ డరిగిరి భయదోగ్ర
రారోడు సుభట వర్గములు గొలువ

గీ॥ శ్యామసింహుఁడు చనుదెంచె సాద్రినుండి
భిల్సురానుండి సూక్తుండు వెడలెఁ దేవ
గృహమునుండి దూదాసింహుఁ డేగుదెంచె
దుర్జయుఁడు వచ్చెఁ జోండావతులనుగూడి 225

గీ॥ అంత నొకనాఁడు సేవకుండరుగుదెంచి
భిల్ల పరివృతుఁడగు నృపతల్లజుఁ గని
"స్వామి! మంత్రి భామాసాహిబండ్లు వచ్చి
నిలిచెఁ! జూతురుగా" కంచుఁ బలికి కొలిచె 226

గీ॥ భిల్లనృపతి ప్రతాపుఁడు వెడలి సాద్రి
వైపునను రెండుక్రోసులవఱకు నిలుచు
భటులు నాల్గు వేల్మంది ద్రవ్యంబు గలుగు
బండ్లు వేయును గని హర్ష భరితులైరి 227

గీ॥ నెలకు నైదును బదిరూప్యముల కొలంది
పదియు రెండేండ్లదాఁక నిర్వదియునైదు
వేల భటులకు భృతినీయఁ జాలుననుచు
భిల్లమణి రాజమణి లెక్కవేసి రపుడు 228

—* ప్రతాపసింహుఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట *—

"క॥ కనఁబడె దివి నింద్ర శరా
సన మిది! రణమునకు మంచి శకునంబ"ని భి
ల్ల నృపాలుఁ డనఁగ జనపతి
యని కాయత్తం బొనర్చె నాత్మ చముపుల౯. 229

క॥ ఎలనవ్వు వెలయఁగా న
ర్మిలి బిడ్డల నక్కుఁజేర్చి మేను నిమిరి పుం
చులు దువ్వి ముచ్చటల ము
ద్దులబడి గుఱియించెఁ గూర్మి దొంతరకట్టు౯, 230

మ॥ పరమ ప్రేమమున౯ బ్రతాపవిభుఁడు౯ బాటేశ్వరి౯ జేరి "యా
పరిపంథి ప్రకరంబుల౯ దవిలి నే స్వాతంత్ర్య సంగ్రామము౯

జరపఁగోరి ప్రయాణమౌదు నిపుడే; సంపూర్ణ చిత్తంబుతో
నరవిందేక్షణ! సమ్మతింపుము శుభప్రారంభ యాత్రారతిన్. 231

గీ॥ నీ సుధాస్వాదు లజ్జా విలాసరేఖ
చిత్తమున హత్తి మెఱయుచు స్మృతికిఁ దెచ్చు
మనకుఁ గలయిక నెలకొక్కమాఱు గలుగుఁ
బరమ సంతోషమున నన్నుఁ బంపు మిపుడు. 232

గీ॥ నీవు బిడ్డలు కొన్నాళ్లు నిలువుఁ డిందు
బిల్లు లేవేళ మిమ్ముఁ గన్పెట్టి యుంద్రు
భీమచాందుగా రిపుడు నావెంట వత్తు”
రనినఁ బాటేశ్వరీదేవి యాస్య మెత్తి. 233

—* పాటేశ్వరీదేవి ప్రతాపసింహుని విజయ యాత్రకుఁ బంపుట. *—

ఆ॥ స్మితకళా మరీచి మీమోమునం దోఁచే
నింతకన్న భాగ్యమేమినాకు
శైలతలము నిండ సైన్యముల్ చెలరేఁగె
వెడలి విజయలక్ష్మి వెంట రండు. 234

గీ॥ సిద్ధసంకల్ప భరితమౌ చిత్తమందు
వలచు చోటీయ నాకుఁ బిల్లలకు” నంచు
పెడఁదకనుల ముత్తెఁపుజాయ విరియఁ దుదలఁ
గప్పు ఱెప్పల నాసతోఁగాంతుఁ గనియె. 235

మ॥ “నినుఁ బ్రార్థించుచు నెన్నియేండ్లొ కడచెన్ స్నేఁడైన మాతంద్రి వె
న్కను పౌరుష్కులఁదాఁకి పోరఁగ ననుజ్ఞన్ గూర్మిఁబాలింపు మొ
క్కనిమేషంబిట నిల్వలే”నని కలంగన్ బాఱు నీపుత్రు వెం
టను గొన్పొండు! మహాగ్ని కల్పు నితనిన్ వారింప నాసాధ్యమే” 236

మ॥ అని పాటేశ్వరి పల్కుచుండఁగఁ బ్రతాపాధీశ్వరుం డయ్యెదన్
దనపాదంబుల వ్రాలు నందను నమందప్రీతిమై ‘వత్తులె’
మ్మని మన్నించె; నతండుతోడనె నలుంబ్రాధీశ్వరులన్ డాసి భ
క్తి నమస్కార మొనర్చి గారవము నొందెన్ నేన కధ్యక్షుఁడై. 237

సీ॥ విజయ సూచకముగా ఢిల్లభటులు చుట్టు
మ్రోఁగుచు గైవారముల నొనర్ప
బోయగుబ్బెతలు గుంపులుగట్టి చిఱునగ
వలదు మోములఁ బాడి యాడు చుండఁ
బాణేశ్వరీ దేవి వజ్రమ్ములు ప్రవాళ
ములును మాణిక్యముల్ ముత్తియములు
హాటక పాత్రంబులందుఁగైకొని నిజే
శ్వరునకు మేల్మి నివాళి దీర్చి

గీ॥ రాగమలరఁ గప్పురము హారతు లొసంగి
సిరుప మామోదమున సెజ్జనీళ్ళు దీసి
"జరగుఁ గావుతఁ గల్యాణ క్షేత్రయాత్ర"
యనుచు శ్రీపాదములు నుదురంట మ్రొక్కె. 238

సీ॥ జంభదైత్యేంద్రుని సమయింప నరిగెడు
నపుడు బిడౌజునకైన జయము
ఖరదూషణాది రక్షశ్శ్రేణిపై నేగు
నపుడు శ్రీరామునకైన జయము
నరకాసురునితో రణంబు సేయఁగఁ జను
నపుడు శ్రీకృష్ణునకైన జయము
కాలకేయాదుల గసిమసంగఁగఁ బోపు
నపుడు కిరీటికినైన జయము

గీ॥ సకల శాత్రవ జయము, శాశ్వత జయంబు,
భువన జయమును నిరుపమామోద జయము,
వెల యెఱుంగని జయమును సులభ జయము
జయముపై నీకు జయములు జరుగుఁ గాక. 239

క॥ అని తననాదు మహోద్యమ
మున కభినందనముఁ దెలిపి పూర్ణోత్సాహం
బున నమరసింహు దరియఁ
జని కడు వాత్సల్య భరము సందడి గొనఁగన్. 240

గీ॥ అమర సేనాధిపత్య పట్టాభిషేక
మగుచుఁ గ్రౌంచాద్రి భేదింప నరుగు నపుడు
మా కుమారున కట్టులు నా కుమార!
యమరసింహ! నీకగుత లోకైక జయము." 241

గీ॥ అనుచు నిండారు మనమున హస్తయుగము
నెత్తి యాశీర్వదింపఁగా నృప గురుండు
నగవు మొలకెత్తు చూపుల మగువ నెలవు
నంది యచ్చోటు విడిచెఁ సైన్యములు నడిచె. 242

గీ॥ గూడెముల నిండ్ల కోపులఁ గొండ పేటు
లందు, గండోపలము లందు నధివసించి
శబర సతులెల్లఁ బూలు లాజలును జల్లి
రా ప్రతాపుని పైన, సైన్యముల పైన. 243

క॥ ఈరీతి చైత్రయాత్రా
ప్రారంభము చేసి యర్ధరాత్రమునకు ధా
త్రీ రమణుం డరిగెను దే
వేరీ దుర్గము కవాట వీథిన్ జేరన్. 244

—• దేవేరీ ద్వితీయ యుద్ధము •—

మ॥ "బలముల్ లేని కడున్ గృశాంగుఁడు ప్రతాపస్వామి మాధాటికిన్
గలఁగన్ బాఱెను! గోటకున్ భయము గల్గన్ బోవ"దం చెంచి తా
మ్ములపైఁ జేయిడి యేండ్లు యావన బలంబుల్ హాయి నిద్రించె వా
కిళులం దెందును మన్ను పేరుకొనియెక్కన్ మూరెఁడం తెత్తుగన్ 245

క॥ అలకోట గవను దెఱచిన
పొలకువఁ గని సకల రాజపుత్ర చమూ నా
థులు చొరఁబడఁ గడఁగిన వా
రలను 'నిలుఁడు పోకుఁ డనుచు రాణా యంతన్. 246

సీ॥ "తురకల బలము నిద్దురఁ బోవుచుండు నీ
స్థలమెల్ల మిగుల నిశ్శబ్ద మయ్యె

నిదుర వోయెడువారిఁ గదిసి చంపుట క్షాత్ర
మహితుల యందు ధర్మంబు గాదు
బహు శతాబ్దంబు లప్రతిహత శక్తితో
నీకోట మాపూర్వు లేలినారు
దొంగపోటున దూఱి దుర్గంబుఁ బట్టుట
నాకు నచ్చిన వర్తనమ్ము గాదు
గీ॥ పౌరుషముననె దీనిఁ జేపట్టుద"మని
యుబుము తెలుఁగునెఁ దనశంఖ మొత్తెఁ! నమర
సింహుఁడును సింహనాదంబుచేసెఁ! భీమ
చాందు బూరగ మ్రోయించె శైల మదర. 247

ఉ॥ కంపము నొందె ధారిణి! జగద్దురుఁ డంతట దుర్గముఁ బ్రవే
శింపు; డనంగ నయ్యమరసింహుఁడు గుఱ్ఱముఁ దొ త్తిలోన దూఁ
కింపగ సూక్తునశ్వమును గ్రేళ్లరికెఁ, వడిఁ గృష్ణసింగు గ
ర్జింపుచు దూఁకెఁ! గంతులిడె సేనలు భూపతి వెంట నంటుచున్ 248

సీ॥ ఆ రాజపుత్ర సేనా రణోద్భట విజృం
భణ మహారవము షాబాజు ఖానుఁ
డాతని పదివేలు యవన భటుల్ విని
యదరు పాటున గుండెబెదరి చెదరఁ
దబ్బిబ్బుపడుచుఁ దొందరగ రణోచిత
వివిధ సాధనములు వెదకు చుండఁ
దనసేనకన్న ముందఱఁ బ్రతాపుఁడు సింహ
మటు వారి యెదురఁ బ్రత్యక్ష మయ్యెఁ
గీ॥ నలముకొని యున్న శత్రుసైన్యముల, విలయ
ధండధరుఁ బోలు రాణాప్రతాపుఁ జూచి,
తురకలు పలాయనము చేయు తెఱవులేక
పెనఁగిరి రణంబొ మరణమోయని తెగించి. 249

గీ॥ కాఱు చీఁకట్లు క్రమ్మిన కాళరాత్రి
దుర్గమునఁ గోటలంతి! యుద్ధరతఁ బోరు

భటు లఱువదైదు వేగురు భయముఁ గొలుపు
నాఁటి రణధాటి యీ పాటినాఁగ వశమె? 250

గీ॥ యవనులని రాజపుత్రకులని తెలియక
యుభయ సైన్యముల్ తలపడెనుగ్ర రీతి
నెవరివారల వారె యాహవము నందుఁ
దఱిగిపోసిరి వేఁడి నెత్తురులు దొరఁగ.

గీ॥ భిల్లభటు లేరితెచ్చి రాపిడుల రగులఁ
బెట్టు కజ్జల దివటీల వెలుఁగునఁ గను
పట్టెఁ బొలికల నొకచోట పట్టు పగిది
నచటి బలములు కొఱవి దయ్యముల పోల్కి 252

గీ॥ అంటగాఁరాని భయద దావాగ్నికీల
యతిబలాటోప దుర్దాంతు డమరసింహుఁ
డెచట రణ మతిభీమమౌ నచటఁ జేర
దాఁట్లుకొనిపోయి శత్రుమధ్యమునఁ దూఁకు. 253

మ॥ కరముల్ వెల్గెడు భానుబింబము పతాకం బొక్కచేనుండ, దు
ర్భర ఖడ్గంబు మఱొక్కహస్తమున నొప్పన్ శ్యామసింహుండు, కే
సరి మాతంగ సమాజముల్ దగులు నోజన్ రూక్షతామ్రాక్ష భీ
కరుఁడై బొబ్బలుపెట్టి వైరులు వడంకన్ ముట్టె నత్యుగ్రుఁడై. 254

మ॥ ప్రళయాంభోధరముల్ హసించుచు నలుంబ్రాభర్త చెంతన్ మహా
చల శృంగంబులు వ్రీలి కూలఁ బటు గర్జారావమొప్పన్ దురు
ష్కుల సైన్యంబులఁదాఁకి నూర్లు పదులంచున్ లెక్కకున్ రాని లీ
లల శీర్షంబులు కుప్పతెప్పలుగ రాల్పన్ సాఁగె నత్యుద్ధతిన్. 265

గీ॥ అగ్ర హోదగ్ర భయద దీప్తాస్యుఁ డగుచుఁ
దన ద్విధారా కృపాణ దుర్దాంతధార
నృపగురుఁడు చీల్చ రిపులెల్ల నేలఁబడిరి
మిడుత గమి చిచ్చుఁ బడి మ్రగ్గుపడువు తోఁప. 356

క॥ హరిదాసుఁ డాగ్రహమ్మున
హరి రక్షశ్శ్రేణి నొంచునట్టులు యవనో

త్కారముల పైఁబడి నఱకెను
శిరములు రాఠోడులెల్లఁ జిక్కఁగఁ గొలువన్. 257

క॥ ఝాలా భూపతిసింహుఁడు
సాలమునన్ బోలెఁ దురక సైన్యము మేనుల్
జీలిచెః మేకొని సూక్తుఁడు
కాలాహి విధాన శత్రుగర్వముఁ జొచ్చెన్. 258

గీ॥ దేవ గృహదుర్గ సీమలఁ దిరుగు వ్యాఘ్ర
ముగ్రమూర్తి దూడాసింగు యుద్ధమందు
దేరిచూడఁగ రానట్లు దీప్తి మెఱసి
దోమలను బోలెఁ గూల్చె శత్రువులఁ దాఁకి. 259

సీ॥ గుణరాశి రాఠోడ్ముకుంద దాసుఁడు షాపు
రా బుఁసీరా ప్రభుల్ ప్రకట బలులు
మఱియు బేడ్లారాజమౌళి కేశవదాసుఁ
డింకఁ గోఠేరియా నృప వరుండు
తక్కన రాజపుత్ర చమూపతుల్ వారి
వారి శౌర్యంబుల పగిది రిపులఁ
బట్టి నిర్జింపంగ బగ్గము పాడౌచు
నొగిలి పగుల సాగె మొగలు తెగలు
గీ॥ సమధి కోద్దండ దోర్దండ సముపముక్త
భీక రాశుగులై భిల్ల వీరు లెల్ల
నట్టహాసంబు లొనరింప నా శరములు
నాలుకలు గ్రోయుచున్ వ్రాలఁగూలి రరులు. 260

ఉ॥ వీరులలోన మేటియగు వీరుఁడు భిల్లనృపాల మౌళియున్
పౌరుష రాశియై యడవి పక్షుల మెత్తని యీఁకలన్ గరుల్
కూరుచు భీకరాశుగములున్ దశకంబు శతంబు గుప్పుచున్
వైరిభట వ్రజంబుల నపారముగాఁ దునుమాడె నత్తరిన్ 261

ఉ॥ రూక్ష పరాక్రమ స్ఫురణ రోజుచు నాసహబాజుఖానుఁ డా
తక్షకమూర్తియై రిపులఁ దార్కొని పెక్కురఁ గూల్పఁగా, ఖగా

ధ్యక్షుఁడువోలెఁ బైఁబడి ప్రతాప నృపేంద్రుఁ డమాన సాహసా
పేక్షఁ దదీయ మస్తకము వ్రీలఁగ నేసెఁ గృపాణ ధారలన్. 262

గీ॥ తనదు సుభటుల నుసికొల్పి దస్యుతతుల
పైన డీకొల్పి యాప్రతాప ప్రభుండు
దుర్గమును ఛిద్రముగఁజేసెఁ దురక పురువు
పేరు లేకుండఁ దుదముట్ట నేరి వైచి. 263

మ॥ నలినాప్తుండును బూర్వ పర్వతము పైనన్ దర్శనం బిచ్చె; నా
యిలువేల్పున్ గొలిచెన్ బ్రతాప ధరణీ భృన్మౌళియున్; రాజపు
త్రులు సంతోష మెలర్ప నందుకొని రాదుర్గంబు; నందన్ని ది
క్కుల సూర్యధ్వజకోటి క్రాలెఁ; జెలఁగెన్ గోలాహల ధ్వానముల్

క॥ వైరులు తుదముట్టి చనం
గా రాణా సంతసంబు గడలుకొనఁగ "దే
వేరీ జయంబుఁ దనదే
వేరికిఁ దెలుపుదమని యొక్క ఖిల్లుని బనిచెన్. 165

చ॥ మనుజవరేణ్యుఁ డంతట నమాయిత పర్వత దుర్గసీమకున్
జని తనరాజపుత్ర భట సంఘముఁ దోడ్కొని లోనదూఁకి క్రాం
తినిగొను వైరులన్ బిలిచి త్రెళ్లఁగనేసి గ్రహించె దుర్గమున్
దనరె రవిధ్వజంబులు శతంబు సహస్రము దృశ్యమానమై. 266

—• ప్రతాపుఁడు కుంభల్‌మియరు దుర్గమును జేకొన నాలోచించుట. •—

మ॥ తనసామంతుల నందఱన్ బిలిచి చెంతన్ జేర్చి "యీ దుర్గముల్
గొనుటల్ ముఖ్యముగాదు నాకిపుడు; మా కుంభక్షమాజాని చే
కొని నిర్మింపఁ బవిత్రమై వెలయు నా కుంభల్ మియర్ దుర్గమున్
గొనుదాఁకన్ గననొల్ల నిద్దురయుఁ గైకోనొల్ల నాహారమున్." 267

మ॥ అను రాజేంద్రుని మోముఁగన్గొని సలుంబ్రాధీశ్వరుం 'డీక్షణం
బుననే పోద'మటంచుఁ గోత్తల దళంబుల్ రేఁపి సాగించి శై
ల నికాయంబులు లోయలున్ వనులు లీలన్ దాఁటి యుత్సాహమున్
గొని ముందేగఁ బ్రతాపుఁ డరిగెన్ గుంభల్ మియర్ చేరఁగన్.

గీ॥ శైలసామ్రాజ్యలక్ష్మి మస్తకము మాడ్కిఁ
బర్వతముపైన శృంగంబు వలుచుండు
మూర్ధమున వెల్గుహాటక ముకుట రాజ
మట్లు కుంభల్ మియర్ దుర్గ మలరుచుండు. 269

సీ॥ అచలనితంబంబు నటు లెక్కుచో నార
మున నుండి దుర్గ గోపురము దోఁప
నాప్రతాప నృపేంద్రుఁ డత్యంత హర్ష రో
మాంచిత గాత్రుఁడై మస్తమెత్తి
కనుల పండువుగాఁగఁ గని "పదునాలేండ్ల
పై నయ్యెనకట' నిన్నుబాసిపోయి;
నీ "మేఘ భవనంబు" నీ "భవానీదేవి
కోవెల" నీదు సరోవరంబు

గీ॥ కనులఁగట్టిన యట్లు నేఁ గాంచుచుందుఁ;
గలిగిన దొసంగులకు మదిఁ గలఁగుచుందుఁ;
గాని కాలము నన్నిట్లు కట్టి వైచెఁ;
జూచుచుందుమి' యిపుడు నీ సూడు దీర్తు." 270

క॥ అని కేల్గవ మొగుడ్చుచు మన
మున నుత్సాహంబు ద్విగుణముగ, బలముసు ర
మ్మని హెచ్చరించి దుర్గ
మ్మును డాయఁగ దూఁకి శంఖమును బూరించెన్. 271

క॥ కల్లోలాబ్ధి తరంగము
వెల్లివిరియు గతిని గవియు విమత బలము న
ట్టుల్లాఘన మార్కొనెఁ గ్రో
ధోల్లసితుం డగుచు విజభటోత్కర మెనయన్. 272

గీ॥ కనులు నిప్పులఁ గురియ ఖడ్గంబు మెఱయ
నహిత తౌరుష్క సైన్య మధ్యమునఁ దూఁకు
నాప్రతాపేశ్వరుని ధాటికాగి నిలువ,
వరుల మాటేల! సురలకైనం దరంబె! 273

మ॥ అవధూతాఖిల వైరివిక్రమ సలుంబ్రాధీశ దోఃఖడ్గ సం
భవ దుర్వార దురీక్ష దావ దహన జ్వాలా పరివ్యాప్తి ద
స్యువితానాటవి నిల్చె భస్మమయి రాసుల్ రాసు! లవ్వీరుఁడా
హవభూమిన్ విహరించె నాప్రళలకాలాభీల రుద్రాకృతిన్. 274

చ॥ ఉదధిని రెండు పార్శ్వములనుండి యుదగ్రతరంగముల్ భయా
స్పదముగ రేఁగి తీవ్ర రభసమ్మునఁ దాఁకిన వీఁక, శౌర్యసం
పద పొలివోవనీక యిరువాగులయోధు లొక ళ్లొకళ్లపైఁ
గదియుచు హుంకరించి పయిఁగ్రమ్మిరి వీర రసావతారులై. 275

సీ॥ యపన బృహన్నాళికాస్త్ర నిర్గత ధూమ
సంఘాతములు మేఘ సమితిగాఁగ,
రాజుపుత్రకుల నిర్భర సింహనాదముల్
ఘన ఘనాఘన రణద్గర్జగాఁగ,
భట హస్త తరళ కృపాణధారా తళ
త్తళలు సౌదామనీ తతులుగాఁగ,
శబరనాయక శరాసన నిస్సర త్తీవ్ర
విశిఖ సంతతి కుంభవృష్టిగాఁగ,
గీ॥ నుభయపక్షంబు వీరుల యొడవఁ దొఱఁగె
పాఱు రక్తప్రవాహముల్ పర్వతాగ్ర
గళిత గైరిక శోణ శైవలినిగాఁగ,
సమరరంగంబు నిబిడ వర్షర్తు వయ్యె. 276

మ॥ తన ముత్తాతలనాఁటి దుర్గమును బొందన్ దొందరన్ జెంది ద
స్యునికాయంబును జీల్చ నయ్యమరసింహుం డుగ్రుఁడై పైకొనెన్;
దన ముత్తాతలనుండి వచ్చిన యుదాత్తక్షాత్ర తేజోవిక
స్థనమౌ వెచ్చని నెత్తురుల్ మరఁగి యంతర్నాడులం దోఁడఁగన్.

గీ॥ రాజపుత్రుల భయద వీర స్వనములు
స్రగ్గి మ్రగ్గు యావనభటార్త స్వనములు
రాజగురుమౌళి సింహగర్జా స్వనములు
ఘననభోంతరాళమున మార్మ్రోఁత లీనె. 278

గీ॥ పీన వితత వక్షులును గౌపీన ధరులు
కృష్ణవర్ణు లయఃకల్పదృఢ శరీరు
లాలయస్థ శిలా విగ్రహముల మాడ్కి
ఖిల్లులు రణాంగణమున శోభిల్లి రపుడు. 279

సీ॥ బవరం బుగాది పండువునాఁగ జెల రేఁగి
యమరసింహుండు దీవముగఁ బెనఁగెఁ;
నతని ప్రతాపాగ్ని యవన చమూసమూ
హమ్ములు శలభమ్ములట్లు సమసెఁ;
దుర్వారవీర్యుఁ డబ్దుల్లాచమూపతి
మత్త మాతంగంబు మాద్రి దాఁకెఁ;
నందఱు వెఱఁగంద నావీరమణి వాని
శిర మూడ్చె ఘోర నిస్త్రింశధార;
గీ॥ సైన్యపతులును జముపులు శబరవీరు
లందఱును జేరి యెందఱ ద్రుంచఁజేసి-
రమరసింహుఁ డొక్కఁడ కూల్చె నందఱ నన,
వాని విక్రమధాటి విశ్వమున కెఱుక. 280

క॥ మెడలు తెగి పుడమిఁ బడఁగాఁ
బొడుచుచు మొగలుల యుద్ధభూమికి బలిగా
నిడి మోదం బడరఁ బ్రతా
పుఁడు కుంభల్మియరు దుర్గముఁ జైకొనియెన్. 281

గీ॥ ద్వారములఁ గ్రాలఁ బచ్చని తోరణములు;
నలరె దుర్గమంతటను సూర్యధ్వజములు;
పరగెఁ గ్రమముగఁ బుణ్యాహ వాచనములు;
మేఘభవనమ్ము నన్ గ్రొత్త మెఱపు మెఱసె. 282

ఉ॥ పూఁచిన పూలమొక్క లటుపొంగి భుజంబులు మూఁడుగాఁగ సే
నాచయముల్ తదీశ్వరు లనంత ముదంబుధిఁ దేలి; రంత దా
నోఁచిన నోముపంటలగు సూత్నమనోరథ సంచయంబు లెం
తో చెలరేఁగి రాజమణి యొప్పుగఁ గాపుర ముండె నయ్యెడన్. 283

మ॥ మును పింగ్లాంషినుండి ఢిల్లి నగరంబుఀజేర్పఁ గొనోప్వు వ
స్తు నికాయంబుల రేవుపీడు పిదపఀ సూరత్పురీ మార్గముఀ
గొని యీశాన్యపు భాగమం దరుగుచుఀ గుంభల్మియర్ కోట ప
జ్జను శైలంబుల దాఁటఁ జేయుటయు నాచారంబుగా సాగెడిఀ. 284

గీ॥ నొగలిపై నాదమఱచి నిద్రఁగను చోద
కులను శకటమ్ములను నందుఁగల సమస్త
వస్తువుల వృషభములను బట్టి రాజ
పుత్రు లిడిరి కోటను మూలమూల లందు. 285

క॥ దినదినము గొల్లగొని కో
టను జేర్చిన విలువగల బిడారమ్ముల పె
ల్లున భాగ్య సమృద్ధంబై
పెనరెఀ సామగ్రి బలము ధరణీశునకుఀ. 286

సీ॥ అన్నిమూలలనుండి యరుగుదెంచి ప్రతాపుఁ
జేరు వీరుల సంఖ్య చెప్పరాదు;
దైనందిన ప్రవృద్ధంబుగ సేనాబ
లంబును గోశ బలంబు దనరెఁ
జైత్ర యాత్రారతుల్ జరపి ప్రతాపుఁడు
శత్రుల సర్వ నాశన మొనర్చె
హారావళీసీమ న చిరకాలమున ము
ప్పదిరెండు కోటలు పట్టువడియె;

గీ॥ నాప్రతాపేంద్రు దిగ్విజయాంక కథలు
గుహలు లోయలు దేశంబుగూడ నిండి
బూరటిలి పొంగి పొరలుచుఁ బోయి ఢిల్లి
చేరి సూటిగ నక్బరు చెవిని మ్రోసె. 287

గీ॥ అంతరంగికులగు నమాత్యాగ్రణులను
వాహినీపతులను సభాభవనమందు
నవసర విశేష సభకు రండనుచుఁ జేర్చి
కడు విషాదంబు తోఁప నక్బరు విభుండు. 288

—* అక్బరు సార్వభౌముని విషాదము *—

సీ॥ అకట! దేవేరీ మహాయుద్ధమున సైన్య
పటలితో నోడె షాబాజుఖానుఁ
డవ్వల సూర్య మహల్ దుర్గమునఁ గడు
దర్పాఢ్యుఁడు మహబత్ ఖానుఁడోడె
నచల గృహము దుర్గమందు వాహినులతోఁ
గడతేఱెను ఫరీదు ఖానుఁ డింకఁ
గుంభల్మియర్ కోటగూరు బలోద్దాముఁ డ
బ్దుల్లాపతి ససైన్యముగను బడియె
గీ॥ నణఁగి వెన్కకుఁ బోయిన యాప్రతాప
సాగర మహాతరంగంబు సరభసముగ
నిప్పు డుప్పొంగి యట్టె పైకెత్తి వచ్చెః
నింక నెట్లోర్తు' మేవాడ యెట్లు నిలుచు" 289
క॥ అని మోము డిల్లవడి పో
యినఁ గని హరివిజయసూరి "యిన్నేండ్లు రణం
బును దఱుముచు నడపఁగ నో
పని రాణా కిప్పుడింతబల మెటు లొదవెఁ" 290
సీ॥ అనిన, నక్బరు విభుండతని వీక్షించి "బా
మాసాహియను పూర్వమంత్రి యొకఁడు
పరిషియా కడనుండివచ్చి దూరపు సీమ
కరుగుచున్న ప్రతాపు నడ్డగించి
కేవల ధర్మదీక్షా వర్తనము మాన్పి
రాజనీతి ప్రకారమ్మ్ఁ గఱపి
గణుతికి మీఱు పైకము వేయుబండ్ల నం
పించినాఁడని మొన్న వేగు లనిరిః
గీ॥ యాత్మదేశంబు విడి సరిహద్దు దాఁటి
చనఁగ నున్న ప్రతాపుఁడు మనసు మార్చు

కొని సమస్త బలంబొనఁ గూర్చుకొనుచు
నీమహా సంగరారంభ మిట్లు చేసె" 291

క॥ అన నైన గురువరుం డా
య్యన "బామాసాహి త్యాగ మతి వంద్యం; బ
య్యనఘుండు పాత్రదానం
బునను గృతార్థతను గాంచి పుణ్యుం డయ్యెన్. 292

మ॥ పెనుకష్టంబుల మున్గికాంతి చెడి పిప్పిన్ దేలు నాదేశ మా
తను సేవించి సకాలమందు నిరతోద్ధారంబు గావించు పా
వన భాగ్యం బది పూర్వజన్మమునఁ గొల్వన్ రాని పుణ్యంబు చే
సిన శుద్ధాత్ముల కబ్బుఁ; దక్కొరులకున్ సిద్ధింప దెప్పట్టునన్. 293

క॥ బామాసాహి బుధేంద్రుని
చౌ మహిత యశో విభూతి యజరామరమై
భూమియు దివమును నిండు; మ
హామహుఁ డతఁ; డనఁగ, నక్షరార్తిన్ బడుచున్. 294

మ॥ "మనకీరీతి సభాముఖంబునను "భామాసాహి పుణ్యాత్మ కుం
డని, కాఁడంచని" చర్చ యేటికిఁ: బ్రతాపాధీశ్వరున్ గెల్చి యా
యన నోరన్ దనకే నధీశ్వరుఁడనం చన్పింతునం చాస లుం
డెను గొండంతలుగాఁగ; నిప్పు డవి యూడెన్ నామనంబేర్చుచున్.

సీ॥ పదునైదు లక్ష లశ్వబలంబు పాదాతి
బల మేఁబదైదు లక్షలును గలిగి,
యుర్వినెల్ల జయింపనోపు పదాఱు వం
దలమంది వాహినీశులను గలిగి,
విశ్వం బదరఁ బదివేల పిరంగులు
దశసహస్ర ద్విపతతులు గలిగి,
వరుసలు వరుసలై పరగు భాండాగార
భవనముల్ నిండ ద్రవ్యంబు గలిగి,

గీ॥ రాజరాజుల గెలిచి విక్రమము వలచి
భరత ఖండ మేలెడు సార్వభౌముఁడనయి

పేదయగు ప్రతాపున కోడిబెండు వడినఁ
'జీ' యనఁగఁ బోదె జగము! నాసిగ్గు చెడదె? 296

సీ॥ రాజ్యంబు లేక దుర్గబలంబు లేక సై
న్యబలంబు లేక ద్రవ్యంబు లేక
సాయ మేమియు లేని సమయంబునసె మహా
రాణాప్రతాప దుర్వారమూర్తి
యవనుల గళము కోఁత్ఱయి రణంబుల బలి
గొట్టెలుగాఁజేసి కోయు చుండె
బలవంతుఁడును ద్రవ్యవంతుఁడు దుర్గవం
తుఁడు రాజనీతి మంతుండు నయ్యుఁ
గీ॥ దొలుత నణఁపరాని మహాగ్ని! తోఁపు దవిలె
గాలిఁ యిఁటిలోక మంతయుఁగాల్చు టరుదె
యతని నెటుగెల్తు నను చింతయంత కంత
కెచ్చెఁ! దెరపేది తోఁప దింకేమి సేతు? 297

మ॥ కల వాయింద్రుని కేనిలేని వరభాగ్య శ్రీరతుల్, పాద మి
య్యిలపై మోవఁగనీక కొల్వఁగల వారెన్నేని కోట్లుందు' రే
సిలుగుల్ పైఁబడ; వాప్రతాపు దెసనౌ చింతాగ్నియుణా గేసకీ
దళ గర్భమ్మునఁ జేరు నాగువలె డెందం బంది హరించెడుణా 298

గీ॥ అమరులకు లేని భోగ భాగ్యము లొనరియు
నాప్రతాపుని దెస నీర్ష్యనడఁగు చుంటి;
నేమి లేకున్న దేవుని కృప గడించి
యతఁడు లోకాతిశాయి శౌర్యమును మెఱయు. 299

మ॥ అకటా! యక్బరువాసి లోకములు కొండాడంగనే కాని యే
టికి నెక్కుణా! నిజుపేదలేని నొకనిణా డీకొంచు గెల్వంగఁ జా
లక యల్లాడుచు నుండె నంచు జగముల్ నవ్వంగ జీవింప నే
టికిఁ బ్రాణంబులపైననే విసువు పుట్టెణా వేదనల్ హెచ్చెడుణా".

మ॥ అని నిట్టూర్చుచు మోము వాల్చి కడు దైన్యంబంద నిర్వాత దీ
పనిభంబై గనుపట్టెఁ గొల్వు; సభికుల్ ప్రాభాత చంద్రోప మా

వనముల్ వంచిరి; మానసింహుఁ డరిమాన ప్రాణ విధ్వంసన
ధ్వనితాశాంత యశోవిశాలుఁ డపు డక్బర్ నేత వీక్షించుచున్. 301

—• { మానసింహ ప్రభు వక్బరు సార్వభౌమునకు మనస్తాపోపశమనంబు చేయఁ బూనుట } •—

సీ॥ అరిరాజ మర్దనోద్ధురశక్తి గాంధార
సీమ నీసీమగాఁ జేసినాఁడ
నడిగి నంతనె వెళ్లి గడియలో ఢిల్లికిఁ
గాశ్మీరమును దెచ్చి కలిపినాఁడ
మానవుల కసాధ్యమైన కాబూలు గె
ల్చి భవత్పదంబులు చేర్చి నాఁడఁ
గడు విశాలములు వంగ విహార దేశముల్
గెలిచి నీకు యశంబు గొలిపి నాఁడఁ
గీ॥ దలలు బలియుట గెలువఁగా నలవి గాని
దేశముల నెన్నియేని సందిటను దెచ్చి
నీకు లోఁబడఁ జేయు నిర్ఛిద్ర శౌర్య
పరుఁడ నేనుండ నీకేలవనఁట మునుఁగ. 302

చ॥ వ్యవధి రవంబులేని కలహంబుల పెల్లునఁ జిక్కి రాజకీ
యవితత కార్యజాలములయందు మునింగి విదేశమందు నుం
డవలసి కొన్ని మాసము లెడంబు జనించి ప్రతాపుతోడి యా
హవము నుపేక్ష చేసినటులౌటయు నిక్కము; యేమి చేయుదున్. 303

మ॥ అవనిన్ జూడ్కులు వాల్చి నీవడలి దైన్యం బందినన్ నామనం
బవియున్; నాకుఁ బ్రతాపసింహునకు బాల్యంబాది వైరానిలం
బు విజృంభించుచు నేఁటి కింకను మనంబున్ గాల్చుఁ, జల్లార లే
దు, వితానేయక తాఁకి నొంచి యుడికింతున్, ద్రుక్కఁ జేతున్ ప్రభూ.

సీ॥ చీమయుఁ జొరని కాశ్మీర దేశములోని
కొండలన్నియుఁ బిండిపిండి యయ్యె
మనకుఁ బరిషియాకు మధ్య సాంద్రాటవుల్
పగిలి బీఁటలువాటి బాట లొసఁగె

దక్షిణాపథము వింధ్యము పాదఘట్టన
గురుత కోర్వక భూమిఁ గ్రుంగి పోయె
నీగ కనువుగాని హిమగిరి ప్రాంత రా
జ్యములెల్లఁ దలక్రిందులగుచుఁ ఒరిగె
గీ॥ నా ప్రతాపుఁ డెంతః యాతని బల మెంత
త్యాగ మెంతః యతని ధైర్య మెంత
పోవ నిమ్మటంచు నే వీడితిని గాసి
కన్నఁదెఱవ నెపుడొ కాలి పోఁడె. 305

సీ॥ ఆఫ్రికాఖండంబు నంతయుఁ దెచ్చి వం
గ మహాంబురాశిని గలిపి వైతుఁ
బ్రాలేయ శైలంబు బాదుతోఁ బెకలించి
యావరణాచలం బవలఁ ద్రోతు
నీపదమ్ముల చెంత నీలోత్పలంబుగా
నీలాంబురాశి తక్కోలు నేతు
నుత్తర కురుభూములొక క్షణంబున గెల్చి
గురుదక్షిణగ నీకుఁ గుదురు పరతు
గీ॥ నాసియాఖండ మెల్ల నీయాజ్ఞ నుంతు
నిట్టిచో నొక్క మేవాడయెంత నాకుఁ
దెలియవే మద్భుజాబలో దీర్ఘ శక్తి
తలుపులను మ్రింగువాని కప్పశము లెంత. 306

క॥ కావరము పెచ్చు పెఱిఁగిన
మేవాడఁ బ్రతాపసింహు మ్రింగుటకై నా
జీవితము మీఁదు దీయుఁదు
నే వెలితికి సందు దొరక నీయకు మెదఁదఁ. 307

క॥ ఈపని నెరవేర్పనిచో
నాపేరునఁ బిల్వబోకు "నా విని యక్బర్
భూపతి యందఱఁ గనుగొని
యీపగిది నికెంత కాలమిటు వేగింతుఁ". 308

సీ॥ మేవాడ జయము నమ్మి యనేక లక్షలు
సేనల నాహుతి చేసినాఁడ
సమర సన్నాహముల్ జరుపుచో ధనము గో
టులు గోట్లు నష్టపఁ గలిపినాఁడ
నొక్కొక్కరు జగంబు నువ్వెత్తు గొనెడు చ
మూనాయకులను గోల్పోయినాఁడ
నిరువ దేండ్లుగ క్షణంబేని పీడని మాన
సిక దుఃఖపరత శోషిల్లినాఁడ
గీ॥ బడఁగరాని కష్టంబులు పడినవాఁడ
నడువరాని దుష్పథముల నడచినాఁడ
నట్టి యాసించి యాసించి యాస లుడిగెఁ
దాల్మి యుడివోయె మిగుల సంతాప మొదవె. 309

మ॥ ఎవరుఁ జెప్పినఁగాని నమ్మకము నాకింతేనియుఁ లేదు నే
నెవరిఁ గోరను సాయముఁ సలుప రమ్మీయంచు నాకెవ్వరుఁ
లవముఁ మేలొనరింప లే రురక కాలంబెల్ల నందంగ రా
ని వృథాశారతిఁ జెల్లెఁ! జింత యెకఁడే నిల్చెఁ మదియాంశమై 310
గీ॥ 'పీడి చనెదె ప్రతాప, మేవాడసీమ
చాలునికమీదఁ దవ గతి స్తవ యటంచు
మమగతి ర్మమ'యని చింతమాని యుంటిఁ
గూళపాఖండు నా కొంపఁగూల్చె నకట! 311
గీ॥ ఏమిచేయుదు, నావింతయిపు డొకింత
యణఁగఁ గల త్రోవ లేదు! నా కతనితోడి
ఘోరు తలమున్కలయ్యె' నంచీ రసమునఁ
బలుక, నబ్దుదు రహిమాను గళము నెత్తి. 312

—* అబ్దురహిమాను ప్రతాపసింహునిఁ బ్రశంసించుట. *—

మ॥ "ఎదురాడఁ గలవాఁడఁగా నెపుడు గానీ, విశ్వలోకైక పూ
జ్యా దయావార్ధి ప్రతాపసింహునెడ నీయుక్తుల్ వగఁ బెంచి, నా

హృదయంబంతయుఁ బచ్చిపుండువలె నయ్యె౯ః నీపదాబ్జాతముల్
మది ధ్యానించుచు నొక్క-మాట వినుతుఙా మన్నించి యాలింపుమీ.

సీ॥ రాజు లాత్మాంఘ్రి నీరజముఁ గొల్వఁగఁ బొల్చు
రాజయోగానంద రమ్య మూ_ర్తి
జన్మ దేశమునకై సర్వస్వ మర్పించు
నసమాన దేశ భక్తాగ్ర గణ్యుఁ
డంబుజాతా_ప్త మహావంశ దుగ్ధాబ్ధి
జనియించు సంపూర్ణ శశ ధరుండు
చతురబ్ధివృత మహీచక్ర మర్పించిన
నంటనొల్లని మహాత్యాగ ధనుఁడు
గీ॥ పౌరుష భగీరథుండట్టి ప్రభు వరుండు
మనకులమునఁ గాఁదికఁ లోకమునను గలుగు
నే కులమ్మునలేఁడు నాయెఱుఁగు దాఁక
న_త్తమో_త్తముఁ డతఁడందుఁ జి_త్తగింపు. 314

సీ॥ అంసమందున సహస్రాంశు లీనెడు రవి
ధ్వజరాజము గరుడధ్వజము గాఁగ
నద్వితీయంబు ఖాండాద్విధారాకృపా
ణంబు దుర్దాంత నందకము గాఁగ
మైనిండఁ దొడుగు హేమతనుత్రరాజంబు
రంగారు పీతాంబరంబు గాఁగ
విలువైన మగరాల కులుకు కల్కి-తురాయి
రమణీయ బర్హి బర్హంబు గాఁగఁ
గీ॥ బుండరీకములకుఁ దోడఁ బుట్టులైన
వెడఁద కనులు కృపామృత వృష్టిఁ గురియఁ
గదలివచ్చి హాల్దీహాటు కడఁ బ్రతాప
రాజ నారాయణుండు దర్శన మొసంగె. 315

సీ॥ ఐరావతంబుపై నరుదెంచు నిర్జర
సార్వభౌముని మేలు చక్కఁ-జేసి.

వృషభ వాహనమెక్కి యేతెంచు కైలాస
వాసు విలాసంబుగాసి చేసి,
హంస రాజము నెక్కి యరుదెంచు భారతీ
శ్వరుని రూప విభూతిభంగ పఱచి,
శిఖిరాజ వాహన శ్రీమీఱ వచ్చెడు
స్కందు నందము నెందు డిందు పఱచి,

గీ॥ మనుజపతి మౌళి మన్మథ మన్మథుండు
చైత్ర కాశ్వముపైన సాక్షాత్కరించి
దివ్య దర్శన మిచ్చె! నా తేజమునకు
నంజలి ఘటించి యాత్మోపహార మిడితి. 316

గీ॥ ఆత్రిభువన కల్యాణ పరాయణుఁ గని
నపుడె యాత్మావలోకనంబయ్యె నాకు
నని మునిగిసి ఢిల్లి చేరి, నేనరసి చూడ
నాత్మ యతనికై నీకు దేహంబు దక్కె. 317

మ॥ అకటా! నీవలె ధర్మముల్ దెలిసి రాజ్యం బేలఁగా లేఁడొ, మ
చ్చికమై భూప్రజఁ బుత్రులన్ బలెఁ గృపా శ్రీఁజూడఁగా లేఁడొ! పా
యక వర్ణాశ్రమ ధర్మపద్ధతి తిరంబై నిల్పఁ గాలేఁడొ! యెం
దును నాతండు స్వతంత్రుఁడై నిలువఁ గాదో యానతీఁ గోరెదన్.

సీ॥ తలఁగని రణములఁ దగులు కొన్నను స్వధ
ర్మత్యాగ మాచరింపంగఁ బోఁడు
తినఁ దిండిలేక కుందెడు నప్పుడైనను
దైవభక్తి యొకింత తలఁగ నీయఁ
డనుపమాన ప్రవర్తనమున జగమున
కాచార్య పీఠమై యలరి నాఁడు
స్వాతంత్ర్య సమర దీక్షా నిబద్ధాత్ముఁడై
సతతోప వాసముల్ సలిపి నాఁడు

గీ॥ కలియుగంబున నిట్టి యోగ్యతముఁ గనము
వెఱ్ఱి నని నన్ను జగము భావించుఁ గాక

యినకులంబు గాలించి చూచినఁ బ్రతాపు
సంతతి మహాపురుషుఁ డుండడని వచింతు! 319

గీ॥ ఆమహారాజు కీర్తి చంద్రాతపమునఁ
జల్లఁగా జీవితమ్ములు జరపు కొనుచు
మనము సమకాలికుల మౌచు మనఁ గలిగితి
మిదియ దేవేంద్ర భోగ మంచెంచ వలయు. 320

మ॥ ప్రకట శ్రీకర మామహాత్ముని క్షమా భావంబు శ్రీరామ ర
క్షకదా మీఁ కతఁ డాసనొందుచు వనాశా నిమ్నగన్ దాఁటి చెం
తకు నిచ్చేసిన యానిమేషమె భవత్త్రారుపక్క సామ్రాజ్య ల
క్ష్మికి నూతేఁచులు నిండు నిక్కమని ఘోషింతున్ నిరాఘాటతన్ 321

సీ॥ ప్రతిలేని వైభవ ప్రాభవంబులు నీవు
నెఱపు నీ హస్తినాపురమునందు
గాఢాంధకార సంగతమైన యొకనాఁటి
రాత్రి యొంటరిగ నారాజ మౌళి
యడుగుపెట్టినయేని నాసడి తెలిసిన
క్షణమునఁ బుట్టు నఖండ సేన
విడక నీ విందుండ వీలౌనొ పాఱి పో
వలయునో యోజింపవలసి యుండు

గీ॥ శ్రీరమా భర్త సాక్షాత్కరించి నట్టు
లాప్రతాపుఁడు కనుపించునపుడు నీవు
సేవకుఁడ వైన నీసేవచేయఁ గలవొ
యవలఁ దొలఁగుదువో తెలియంగ రాదు. 322

మ॥ మఱి యేదే నొక కారణంబుమెయి గంపం బొందు తూఁగాడి యీ
ధరణీచక్రము సర్వ మొక్క మొగి పాతాళంబునన్ గ్రుంగి యు
క్కఱినన్ సుంత చలింపఁ బోవను! ప్రతాపాధీశు సత్కీర్తి కె
వ్వ రపాయం బొనరింపఁ జూచినను నోర్వన్ బోను ప్రాణంబుతో.

సీ॥ ఒక నృపాలకుఁ డేలు నొక్క రాష్ట్రంబులో
నొక టంకసాలలో నుదయించి

పరిపరి విధములై పరగు నాణెము లట్లు
మతము లన్నియును నీక్షితి రహించు
మనుజుల నుద్ధరింపఁగ వీని నేర్పఱ
చిరి బుధుల్ లోక ప్రసిద్ధ మతులు
ప్రతిమతంబునను సర్వాత యుండ నేయున్న
దీశ్వర దృష్టిలో నిన్ని సమము
గీ॥ లన్య మతమువాఁడు ప్రతాపుఁడనకుఁ! డతని
దుత్తమోత్తమ మతము! మర్త్యుండు మాత్ర
దేశమున కప్పువడె నంచుఁ దెలియని మన
యావన మతం బొకండె నిరర్థకంబు. 324
శా॥ ఆపద్మాప్త కులాబ్ధి చంద్రుఁడు ప్రపంచాతీత సద్ధర్మ ర
క్షాపారంగతుఁ! డుత్తమోత్తమ నృపా కల్పుండు! స్వాతంత్ర్య ల
క్ష్మీ పుంరూపము! రాజయోగిమణి! యక్షీణ ప్రతాప ప్రతి
జ్ఞా పారీణుఁ డటంచుఁ దద్యశము విశ్వంబెల్ల ఘోషించెడుఁన్. 325
శా॥ ఎన్నోరీతులఁ జర్చయేటికిఁ? ప్రతాపేంద్రుంతు సౌజన్య సం
పన్నుం డచ్యుత ధర్మదీక్షితుఁడు! విశ్వత్రాత! యేకొంచె మా
పన్నత్వం బెఱుగంగఁ బోని ఘనుఁ! డా భవ్యాత్ముతో నొక్క శ్రీ
మన్నారాయణమూర్తి కొంత యుపమింపన్ జెల్లునేమో సుమీ.
చ॥ కటకట! యామహాత్ముఁ డొక కైవడి లోఁబడఁ! డీవునున్ జగం
బెటులను నిల్వనీవు! శ్రమమింతయు నొక్కని గెల్వనే కదా
గుటికెఁడు పాలకై బొదుగుఁ గోయుదురే! యొకపండు కోసమై
విటపముఁ గూల్తురే! ఫలము వెల్తి, శ్రమంబధికంబు కాదొకో 327
సీ॥ రాజపుత్రకులు దుర్వార విక్రమయుతుల్
తెలవ లఖండ సాధ్వీమతల్లు
లాకులమ్మున బాలుఁడైన వీరులలోన
నగ్రగణ్యుల నైన నడఁపఁ గలఁడు
పరిపుల్ల సురుచిర ప్రమదావన వతంస
మనుపమ నిత్య కల్యాణ సీమ

పరమ శోభన నిత్యవైవాహిక గృహంబు
క్ష్మాసతీ కంఠ ముక్తా స్రజంబు
గీ॥ నైన మేవాడ పైకేగు టనుచితంబు
రాజపుత్రులఁ దొఁగర ఘోరతమ పాప
మాప్రతాప పురోగమమైన కులము
దండనకు నర్హ మేఁ ప్రమొక్కఁదగును గాక. 328

గీ॥ దైవమును దూరముంచి యిందాఁక వారి
కాచరించిన కొండంతయఘమె చాలు
నింక భూదేవి భరియింపఁ జెప్పు దేవరి
కెచట నీగతి పట్టునో యెవ్వఁ డెఱుఁగు. 329

సీ॥ నాగ్లేండ్లవాని నింతఁగఁ జేసితివిఁ చదు
వులను నేర్పించితిఁ బుద్ధిఁ గఱపి
తున్నతోద్యోగ సంపన్నుని జేసితి
కూరిమి వియ్యంబుఁ గూర్చియుంటి
నీదేహమే నీది: యీ ప్రాణమే నీది
యీజీవితంబె నీదెల్ల యపుడు
నాశరీరమ్ము నందలి రక్తమునఁ బ్రతి
బిందు వెల్లపుడు నీపేరె పలుకు
గీ॥ నీదు నేమంబు నెంచి నిర్నిద్ర యశము
నెంచి నీయెడ గౌరవమెంచి నీదు
ప్రభుత కేవేళ మేలెంచి పలుకు నాదు
ప్రార్థనముఁ ద్రోసిపుచ్చకు”మనెడు నంత. 330

## అబ్దురహిమాను మాటల కంచఱు హర్షించుట

సీ॥ “ఈమాట లోక మెంతేని నొదలఁ దాల్ప
విహితమౌ”నని హరి విజయసూరి
యద్దిరా! యియ్యవి యమృత వాక్యమ్ములు
తథ్య మనియె సూరిదాస సుకవి

రాజపుత్రులతోడ రణ మొనర్చుట కలు
షమ్ము పొమ్మనె ఫెరిస్తామసీషి
యాప్రతాపుఁడు దేవునవతారమే యని
విశ్వసింతు ననియెఁ బృథ్విరాజు
గీ॥ నంద జూడెడు మాటల నాలకించి,
యందు నందును గలయుక్తు లాదరించి
యాత్మభావంబుఁ గొంత గోప్యముగ నుంచి,
చిఱు నగవు వెల్వరించె నక్బరు విభుండు. 331

—• మానసింహుఁడు యవనసభను దృణీకరించి మాటాడుట. •—

క॥ అందఱను గలయఁగని వగ
చెందిన మదితోడ మానసింహుండును మీ
రంద ఱెటులఁ దరిమిన నా
కుం దోఁచినయట్లు నడచుకొనఁగల వాఁడన్. 332
గీ॥ ఆప్రతాపుఁడు భృతి యిచ్చి యాదరించు
భట్టులవిధానఁ బొగడంగఁ బాలు పడితి
రౌర! యాత్మాభిమాన మింతైన లేక
యేమి చేయుదు' మీశౌర్యమిట్టు లుండె. 333
మ॥ ఇదె నేఁగాదని పట్టి పట్టుతిన యే నిందున్న యీమంత్రులున్
బదునార్వందలు వాహినీశులు ప్రతాపక్ష్మాధిపున్ జేరి న
న్నెదిరింపన్ జనుదెంచు మీరలిట్టుపై నేమౌదురో చూతు రు
న్మదశార్దూలము చెంగటన్ నిలువ పీ మార్జార గర్జార్భటుల్. 334
మ॥ పరు లాఱెని గుఱించి యేల పలుకన్ బ్రత్యేక శత్రుత్వముల్
వఱలున్ నాకుఁ బ్రతాపసింహునకు నంబర్ సేనతో నేగి యు
ద్ధుర శౌర్యంబునఁ దాఁకి యాతని జయింతున్ మానసింహేంద్రుఁడొ
క్కరి సాయంబు నపేక్ష సేయమికిఁ దార్కాణంబు చూపించెదన్.
క॥ స్థావర జంగమయుత ధా
త్రీవలయంబెల్ల నెదురు తిరిగి నిలిచినన్

గావుగానవేర్తు క్షణమునే
నీవిశ్వము విస్మయమున నెదిపడు చుండఁగా. 331

గీ॥ సేనలు ధనంబు రాష్ట్రంబు జీవితంబు
నతని గెల్వంగ నర్పింతు”ననుచు రౌద్ర
మ్ముల్లసిల విజృంభింపఁగా నెల్లవార
లేమనఁగ లేక నిల్చి రాపృథ్వీరాజు. 337

—* పృథ్వీరాజు మానసింహు నధిక్షేపించుట *—

సీ॥ అతిపావనుఁడు ప్రతాపాధీశు నెవనిగా
విశ్వసించితివో! ద్వావింశతి యగు
రాజపుత్రక మహారాష్ట్రంబులకు రాజు
లకు నగ్రగురుఁడు కాలంబు చక్క
జరిగియుండినను నందఱు రాజపుత్రు లా
ధన్యు నంఘ్రుల మ్రోలదాసులె కద
శ్రీసలుంబ్రా కృష్ణ సింహునిచే మొట్టఁ
బడి తలదిమ్మెక్కి పడియేయుండు

గీ॥ పాదుసాహి ప్రాపుపట్టి మిన్నందుదు
వాదినములు మఱచి తయ్య! యిప్పు
డీఁక తోఁక దొడిగి యీఁగ బెబ్బులివైన
సాటి మాట నీక పాటి కెక్క. 338

సీ॥ సైన్యాధిపతులు పజ్జనుజేరి “కైలవా
రా సీమ ఫలవృక్ష రాజి నసలు
నఱికిరి, తిండి చేకుర”దన్న నప్పుడు
“వైరులు చెఱుపంగ వలను పడెదు
తిండి చేకొనుట సంధిలె లోప; మింక శా
త్రవులెల్ల సంవత్సరముల కొలఁది
పనిచేసి చెడుప నోపని తిండి జూతు; బ
చ్చిక రుబ్బి రొట్టెలుచేసి తింద”

గీ॥ మనుచుఁ బందొమ్మిదేండ్లు తోయమును గడ్డి
దినుచు సతతోపవాస మూనిన తపస్వి.
యతనిదెస వ్రేలు చూపు శౌర్యపరుఁ డున్నె
విశ్వమంతయుఁ ద్రుటిని స్తంభింపఁ జేయు. 339

గీ॥ దేవ పూజార్హుఁ డతని నిందించి నీవు
గురువులకుఁ బంగనామముల్ గూర్చు టయ్యెః
లేఁగి గ్రుడ్డు పిల్లను వెక్కిరించుటయ్యె;
వినఁగ లేము పాపార్థినిమనుఁగ లేము. 340

సీ॥ భాగ్యంబు లెన్ని సంపాదించి యున్నను,
నెన్నేని భోగంబు లెసఁగి యున్న,
రవి ప్రకాశించు నీ రాజ్యమంతయుఁ గొన్న.
జయముపై జయమొందఁ జాలియున్న.
విక్రమ సూచక బిరుదముల్ వేలున్నఁ
జెల్లుబడియుఁ దద్దఁ జెలఁగియున్న,
నిది యేమి యని యొరు లెదురాడ కున్నను,
ధరయెల్ల మనయాజ్ఞఁ దాల్చియున్న.

గీ॥ ఫల మొకింతయు లేదు; రాఁగల యుగముల
దేశవిద్రోహులకు వంశ నాశకులకు
నాత్మ గురుదూషకుల కుదాహరణముగను
నెల్లరును జూపఁగలరు వ్రేలెత్తి మనల. 341

మ॥ అకటాః కానలఁ బుట్టియుండె బలితం బైజాలియే లేని ఘా
తుక సత్వంబులు గూడ నాత్మకుల జంతుచ్ఛేదముఁ మాని వే
టొకఁటఁ గుక్షి భరించుచుండుః నిజధర్మోద్వాసముఁ జేసి స్వీ
య కులధ్వంసము చేయుచుంటివి; మనుష్యత్వంబు చేఁదయ్యనే. 342

సీ॥ పాల మున్నీటి లోపల నెన్నొ వస్తువు
ద్భవ మొందె; నొక చంద్ర దర్శనమున
నుప్పొంగుచుండుఁ బయోధి; యట్టులె రాజ
పుత్ర పావన కులాంభోధి యందు

మనమందఱము జనించినను రాణాకీర్తి
చంద్రికయే తదుత్సాహకారి;
మేవాడకే గాద యీ విశ్వమున కెల్ల
నతఁడు వీరుఁడు గురుండగుచుఁ దొలిచె;

గీ॥ నట్టి స్వకులదీపకు స్వామి నాత్మవేత్త
నిరత మౌదలఁ దాలిచి చరణపూజ
సలుపక తృణీకరించు విశ్వాసహంత
యిలను మననేమి! పరలోక మేగ నేమి 344

గీ॥ పూల దొరసాని మల్లె పూవూచు వఱకు
'నేను సాధారణమ్మైన నేలనె' యనెఁ
గన్నెతోటః ప్రతాపునిఁ గన్న పిదపఁ
దనరె భూదేవి నిజము పుత్రవతి యగుచు. 345

గీ॥ భరతఖండ మహాలక్ష్మి భాగ్యమయ్యె'
నని ప్రతాపుని యశము కీర్తనము చేయఁ
బాదుసా చెవి నిలు గట్టి పచ్చి విసము
నెత్తఁ దగునయ్య! విసపాల విత్త వగుచు 346

చ॥ యవన మహామహీశ్వరుఁ డుదార హృదంతరుఁడౌట నెందు నె
ప్డెవ రెటు లాడినన్ విని సహించు నటంచుఁ బ్రతాపదేవు గూ
ర్చి వృథగ నిందలాడెదవు! చేసిన పాపమె చాలుఁ జాలు' నా
చెవులకుఁ జేదు గ్రమ్మెడు; నిసీ"' యని ధిక్కృతిఁ జూచి నిల్వఁగన్.

క॥ వడిఁదోఁకఁ ద్రొక్కు భుజగము
వడువున నంబరు విధుండు పైదూఁకఁ దొడం
గెడు నడిఁ గనుఁగొని యక్బరు
కడు సమయ స్ఫురణ గలిగి కార్యజ్ఞుండై. 348

—• అక్బరు సార్వభౌముఁడు శాంత వచనములు పలుకుట. •—

చ॥ "పలువురు మీరు మీహృదయ భావములన్ దెలియంగఁగోరి నే
సలిపితి నాతనిన్ గుఱించి చర్చ యొకింత! కలంతపట్టు మీ

పలుకుల సారముఙ్ విశదభంగి నెఱింగితి; నామనంబునఙ్
గల తెఱఁ గంతయుఙ్ దెలియఁగా వినిపించెద; నాలకింపుఁడీ. 349

చ॥ సమరము లొక్కరీతిఁ గొనసాఁగఁగఁజేసితి; నిట్లు కొంతకా
లము కడచన్న నొప్పఁడె చలంబటి నాదు ప్రభుత్వమంచు; ని
క్కముగఁ బ్రతాపభూపు నెడఁగల్గ దొకించుక యీర్ష్య నాకుఁ; గ
య్యములను బ్రొద్దుపుచ్చుట ప్రియంబనఁ జెల్లునె; యెట్టి వారికిఙ్.

గీ॥ ఆ మహానాయకవతంస మాప్రతాపుఁ
డెన్ని గతుల యోజించిన నన్నుఁబోలు
కోటిమంది రాజులు చేరి కొలువఁదగిన
క్షాత్రనిధియను మాట వజ్రాల మూట. 351

సీ॥ ఆరమణీయ దుర్వార తేజోమూర్తి
సందర్శనమున నానంద మొంద
వలయు నటంచుఁ గొండలుఁ గోట్లుగానాకుఁ
గోర్కులు మదిలోనఁ గొనలుసాగుఁ
గాని యిన్నేండ్లుగాఁ గాలమంతయు నిట్లె
కడచెఁ నా కట్టి భాగ్యంబు గలుగ;
దతని దర్శింప నా కిర్హత యున్నదే
యని పలుమాఱు జం కడరుచుండు;

గీ॥ గురువు దైవంబుఁ జూడక క్రూరబుద్ధి
నామహారాజునకును చేనైనదాఁక
నెగ్గు గావించి తగుదునంచిపుడు పోయి
చేరి సాన్నిధ్యమున నిల్వ సిగ్గు దోఁచు. 352

గీ॥ ఆమహాభాగుకీర్తి గానామృతమునఁ
జిక్కువాఁ డెల్ల ఎను నిందచేసి తీఱు;
నతి ధవళమైన యాతని యశము వోలె
నాదు దుష్కీర్తి శాశ్వతంబై దనర్చు. 353

గీ॥ నాదు జీవితశేష మంతయుఁ బ్రతాపు
సేవఁ గడిపినఁగాని దుష్కీర్తి పోవ;

దా ధరాధీశుతోడి విరోధమునకు
నీళ్లు విడిచి నే నుఱక శాంతించువాఁడ. 354

ఆ॥ బ్రతికి నన్ని నాళ్లు బ్రతుకము; రాజ్యతృ
ష్ణకును మేర గలదె? చాలు! నున్న
దానితోడఁ దృప్తి దనరుట మేలంచుఁ
బలికెఁ మానసింహు వైపు చూచి. 355

గీ॥ వట్టి పాండవ బీడు మేవాడసీమ,
పరక పాతికె గాని లాభంబు గలుగ
దా మహారాజు దేశంబు నాతఁడే గ్ర
హింప నిమ్మింక; నష్టంబదేమి మనకు. 356

క॥ కదచనె నేఁబదియేఁడులు;
ముడుతలువడి తెల్లవడియె మోమును బొమలుణా;
గడిమి చెడె; నొడలు సడలెను;
కిటు వృద్ధుఁడ నైతి; శాంతి గానఁగ నైతిణా. 357

మ॥ సకలప్రాభవ వైభవంబుల మొగల్సామ్రాజ్య మేలంగఁ ద
గ్గ కుమారుండు 'సలీము' దేహము చెడంగాఁ ద్రాఁగుబోఁతయ్యె! మా
మక చిత్తంబును బాయదీ నెగులు మర్మ చ్ఛేదియై' దుష్ట దం
శక సంగంబున స్రగ్గుమొగ్గ యది పుష్పంబై సుబాళింపునే! 358

క॥ పదియేండ్ల ప్రాయమాదిగఁ
గదనము కడనం బటన్న కలతలతో న
ల్వదియేండ్లు కడవిచనె' మన
బ్రతుకులు పోరులనె తెల్లవాటిన వకటా! 359

గీ॥ ఆప్రతాపుతో నింక కయ్యంబు వలదు
వలదు' వలువుర నోళ్లలోఁ బడఁగఁ జాల
మందఱము జీవితమ్ముల యందలి తుది
రంగముల శాంతితోడఁ దీర్పంగనిమ్ము". 360

—* అక్బరు నిర్ణయమును మానసింహుఁడు సమ్మతింపక పోవుట *—

మ॥ అని శాంతంబు నయంబు నచ్చుపడ మాటాడంగ నా వాక్యముల్
విని యంబర్ పతి "నీ వచస్సులు మదిన్ వేధించు! విశ్వంబు భ
స్మనికాయంబుగఁ జేయు నాజ్వలనమున్ జల్లారె! నేదెట్లు పో
యిన నీవింతకె యింత మెత్త వడెదంచే నెంచనైతిన్ జుమీ. 361
మ॥ ప్రమదోద్యానముఁ బోలు నీ యవన సామ్రాజ్యంబునన్ గంట కో
గ్ర మహీజంబయి నెవ్వగన్ బెనిచె నీరాణా ప్రతాపుండు త
త్సముదౌద్ధత్య మడంప లేనియెడ నీ దర్పంబు నేనొల్ల ఖ
డ్గము నేనొల్ల" నటంచు నేల విసరెన్ గాలాహి నా రోఁజుచున్. 362
గీ॥ పరమ గంభీర మాతని వదనమందు
వీరతేజో మహాలక్ష్మి ద్విగుణితకళ
వెల్గెఁ; సభయెల్ల మౌనముద్రలఁ జెలంగె
నంత నక్బరు నృపమౌళి యతనిఁ గాంచి. 363

—♦ అక్బరు సార్వభౌముఁడు మానసింహుని శాంతింపఁ జేయుట. ♦—

క॥ కనుఁగవ జేగురుగొన. మన
మున మిడుకఁగనేల; శాంతమునుగొని నాచె
ప్పిన మాటలాదరమ్మున
విని మన కిరువురకు సుఖము వెదుకఁగఁదగదే. 364
మ॥ మనయబ్దూ రహిమాను శీలము జగన్మాన్యంబు, స్వచ్ఛంద వ
ర్తనుఁ, డేనాఁడు నసత్యదోషమును జెందన్ బోనివాఁ, డేను పెం
చినవృక్షం, బితఁడెల్లవేళలను నాశ్రేయంబ కాంక్షించు నీ
తని మాటన్ శిరసావహింపఁ దగుఁ గాదా! నాకునున్ నీకునున్. 365
చ॥ సరసుఁడు పృథ్వీరాజు కవిచంద్రుఁడు, మాన్యతముండు, నీకు సు
స్థిరతర బంధువర్గమునఁ జేరినవాఁడు, ప్రతాపసింహు సో
దరునకుఁ గూర్మియల్లుఁడు; కృతం బెఱుఁగన్ గల పుణ్యమూర్తి స
త్పురుషుఁ డితండు నేర్పుహితమున్ దలఁ దాల్పకయున్న నేమమో?
గీ॥ హరివిజయ సూరియును భువనైక గురుఁడు
సూరిదాస మహాకవి సుగుణ రాశి

యా ఫెరిస్తాదు లందఱు నట్టివారె
యెవరి మాటఁ ద్రోయ్యఁగనేర్తుమిపుడు మనము. 367

చ॥ వితరణశాలి, రాజులకు వేల్పు, కుటీరనివాసి, లోక వం
దిత సుచరిత్రుఁడుఁగా, భువనధీరుఁడు రాజరాజ సం
హతులకు మేటియుఁగా, బరమహంస, ప్రతాపు నదంపఁ బూనుటల్
చతురతగాఁ దలంపకుము, ఱాజులు వేఁతురె మంగలంబునన్. 368

గీ॥ ఇప్పు డొక్కఁడే నిర్ణయమింక ముగింతు
సభను, మేవాడఁగల మొగల్ సైన్యపతులు
సేనలను జేర్చుకొని ఢిల్లి జేరుఁడనుచు
నాజ్ఞసేయుదు”ననుచుఁదానట్లు చేసె. 369

మ॥ నవరత్న స్థగితంబు స్వర్ణమయమున్ సవ్యప్రభాభాసురం
బవు సింహాసనమంత డిగ్గిచనె, నయ్యాస్థాన మందున్న సై
న్యవిభుల్ మంత్రివరేణ్యు లందఱును గుంపైలేచి యుత్సాహ పూ
ర్ణ విలాసంబుల స్వస్వగేహములు చేరన్ బోయి రొక్కుమ్మడిన్. 370

మ॥ నెలయున్ దాఁటకమున్నె వార్త లలమెన్, మేవాడ దేశంబు లో
యల దుర్గంబులఁ గల్గు నమ్మొగలు సైన్యంబుల్ గుడారమ్ములన్
దలఁపన్ బీకి సమస్త వస్తువుల వెంటన్ గొంపు గుంపౌచు మో
ములనున్ వాల్చుచుఁ బోయి ఢిల్లి నకరంబున్ జేరె నల్లల్లనన్. 371

—♦ రాజపుత్రులు తమదుర్గములను మఱలఁ బట్టుకొనుట ♦—

సీ॥ హారావళీ పర్వతాభంగ శృంగముల్
తునియలుగాఁగ దుందుభులు మ్రోఁగె
నతి మంగళాకారులగు రాజపుత్ర యో
ధులు గుంపు గుంపులై లేఁచి రిపుడు
వారి సంబరమును వారి యుత్సాహంబు
వారి భక్తి వచింప వశము గాదు
తోరణ గృహమాది దుర్గముల్ పెక్కింటి
విడువ కయ్యెడఁ బ్రతాపుఁడు గ్రహించె

గీ॥ నాఱు మాసంబు లరిగెడు నంతలోన
నొక్క చిత్తూరు దుర్గంబుతక్క గడమ
యెనుబదియు మూఁడు దుర్గంబులెల్ల దేశ
మాప్రతాప ప్రభూ త్తంసుఁ డాక్రమించె. 372

క॥ తన సామంతుల నొకదిన
మునఁ గనుఁగొని యా ప్రతాప భూపమణియు "దే
వుని కృపతో మనరాజ్యం
బును సర్వముఁ గొంటి మింకఁబోరు నిలుపుదుఁౘ. 373

క॥ మనదేశము సరిహద్దున
కును చెంగటిపురమొకండు కొల్లగొనఁగ నా
మనసయ్యెఁ, గాని యందలి
మనుజుల బాధింపగరాదు మనకేభంగిౘ. 374

క॥ అన 'నీ యాజ్ఞాపించిన
పని శిరమునఁదాల్చిచేయ వాడుకయగు నెం
దునకిని యడిగియెఱుంగము
చని నొంతుము జగము ద్రింగు శత్రువునైనౘ." 375

సీ॥ అని కృష్ణసింహుఁ డాడిన రాజమౌళియా
దల యూఁచి లేచె, నందఱును గదలి
యుత్తర దిగ్విజయోత్సాహు లగుచుఁ గ
తిపయ ప్రయాణముల్ తీర్చి యొక్క
దినమునం దంబరు దేశంబునుౘ జొచ్చి
ప్రతి లేని భాగ్య వైభవ సమగ్ర
భవనంబులై ముఖ్యావర్తక స్థానమై
వఱలుచునుండు మాల్పురముఁ జేరి

గీ॥ ధన కనక సర్వవస్తు సంతతులు మూల్గు
గొప్పయంగళు లన్నియుఁ గొల్లగొట్టి
పట్టి సామగ్రియంతయు బండ్లకెత్తి
రా పురము సర్వవస్తు శూన్యముగఁజేసి. 376

గీ॥ భువనమెల్లెడ నిండి మాల్పురము కొల్ల
గొట్టఁబడెనను వార్త లెక్కుడుగఁ బొంగె
సిగ్గునెడి మానసింహుండు శిరము వాల్చె
నాప్రతాపుఁడు మొలక నవ్వలరఁదాల్చె. 377

గీ॥ ధాన్య ధన హేమ వస్తు సంతతులతోడ
నిత్యలక్ష్మీ నివాస మందరము నగుచుఁ
దొంటిమాడ్కిఁ గుంభల్ మియర్ దుర్గ మపుడు
మేరుగిరి దుర్గముల కాంతిమ్రింగి యుమిసె. 378

సీ॥ నెలనెల మూఁడు వానలు కురియఁగ సాఁగెఁ
బదనై యవని సారవంత మయ్యెఁ
బొలమును దున్ని విత్తులు చల్లెఁ గృషికుండు
పైరు లన్నియుఁ బ్రోదివడయ సాఁగెఁ
గైలవారా మహాకాననంబున ఫల
తరువులు తామరతంపరయ్యె
మొలలెత్తు, బీటినేలల గడ్డి పెంపొందె
గణనకుమీఱి గోగణము పెరిగె

గీ॥ గోపురము లందుఁ బలుకోట కొమ్మలందు,
నగరముల యందు గ్రామకంఠంబు లందు
నచల శృంగంబు లందు, సూర్యధ్వజములు
వందలుగ లేచి పూర్వ వైభవముఁ జాటె. 379

సీ॥ భువనమందెల్లెడఁ బూలుపూచిన యట్టు
లాప్రతాపుని కీర్తి యతిశయించె
దేశదేశమునుండి దినదినం బామహీ
విభుని దర్శించి సేవింప వచ్చు
పుణ్య యాత్రిక బృందముల సంఖ్య యింతయు
నంతని గణన సేయంగ రాదు
యవనులుగాక హైందవులుగాక సమస్త
కులములవారు సేవలనొనర్చి

ఆ॥ రొకఁట వింధ్యశైల మొకఁట ధారు పెదారి
యొకఁట హిమనగేంద్ర మొకఁట జలధి
మధ్యఁగలుగునేల మనుజ సమ్మర్దమై
క్రాలె నిసుకవేయ రాలకుండ. 380

క॥ తనదేశము నుండియు సిం
హ నికాయంబట్టి భట సహస్రంబును బా
వనమూర్తి కృష్ణసింహుఁడు
కొని కుంభల్మియడు కోటకును విచ్చేసెన్. 381

—◆ స్వాతంత్ర్య దినోత్సవము. ◆—

మ॥ స్తవనీయంబు ముహూర్త మేర్పఱచుచున్ స్వాతంత్ర్యలక్ష్మీ మహో
త్సవముల్ చూడఁగ రండటం చఖిలరాజన్యాళికిన్ సర్వబాం
ధవ వర్గంబుల కాశ్రితావళికి మిత్రశ్రేణి కాహ్వాన ప
త్ర వితానంబులు వ్రాసి పంపెను సలుబ్రాకృష్ణసిం గయ్యెడన్. 382

గీ॥ వేనవేల్ పుట్లు ధాన్యంబు దానికిఁ దగు
నన్ని సంబారములు గూర్చి యుచటఁజేరు
రాజు లాప్తు లుండఁగ గుడారంబు లెత్తి
రొక్కొకండొక్క పురమునా నొప్పుచుండ. 383

గీ॥ గడియ గడియకు వేలు లక్షలుగ వచ్చు
ప్రజల సందడిని హనుమద్ద్వార మలరె
నూఱు తిరుణాళ్ల లెసఁగిన దారిఁ గోట
వేలు మోపంగ సందు గన్పింపదయ్యె. 384

సీ॥ శుభ వాసరమ్మున శుభముహూర్తమ్మున
నభ్యంజన స్నాన మాచరించి
పాటేశ్వరీదేవి ప్రభుమౌళి యమరసిం
హుఁడు నూత్నవస్త్రంబు లొనరఁదాల్చి
సకలకల్యాణ భూషణములు ధరియించి
యవనీసురులు మంత్రు లాప్తవరులు

పార్థివు లనుసరింపంగ ముత్తైదువుల్
పాటలు వాడుచుం బజ్జనడువ

గీ॥ గూడుకొని భవానీదేవి కోవెలకును
వెళ్ళి గౌరిని బూజించి వివిధరత్న
ఘటిత హాటక మకుటంబు గాన్క యిచ్చి
మ్రొక్కి యందఱు నాస్థానమునకు వచ్చి. 385

సీ॥ వేదిపై దర్భలువేసి యాపై రత్న
ధర్మాసనంబులు వఱలుచుండ,
రెంటిపైం బాటేశ్వరీ ప్రతాపు లెలర్చి
రా హరభట్టార కాత్మజులును
జంద్రభట్టారకు సత్పుత్రు లెదురుగా
నున్న పీఠములం గూర్చుండి రవల
వెలుంగు నాసనములం గులవృద్ధులును సూక్తిం
డఖిల సామంతులు నవని పతులు

గీ॥ గుంపులుం గుంపులుగం జేరి కూరుచుండి
రవ్వల మహోన్నతమగు దివ్యాసనమున
నుండె సముదార విక్రమోద్దండమూర్తి
ఖిల్ల లోకైకనాథుండా భీమచాందు. 386

గీ॥ అతుల సువిశాలవేది కాభ్యంతరమునం
బ్రముఖ మగు నొక్క దివ్యాసనమున నుండె
శాంతమూర్తి తేజోరాశి సత్త్వ ఘనుండు
మాన్యతముండు భామాసాహి మంత్రిమౌళి. 387

గీ॥ అందునిందన కాస్థానమందు నెందుం
దానయై కార్యభారంబుం దలసుదాల్చి
సలలి తోత్సాహ మూర్తియై మెలంగె స్వామి
భక్తి పూర్ణాత్మకుండు సలుంబ్రావిభుండు. 388

క॥ కలనాదమ్మున శంఖం
బులు మంగళ దివ్యతూర్యములు దుందుభులున్

జెలరేఁగి మహానందముఁ
గొలిపెన్ బహు విప్ర వేద ఘోషము చెలఁగన్. 389

గీ॥ బ్రాహ్మణోత్తముల్ రాజదంపతులచేత
గణపతికిఁ బూజ చేయించి కరముభక్తి
నఖిల దేవతావాహనం బాచరించి
స్వస్తి పుణ్యాహ వాచనోత్సవము నెఱపి. 390

సీ॥ పాతేశ్వరిని బ్రతాపప్రభు మౌళిని
నవరత్న సింహాసనమున నిలిపి
వేదమంత్రాశీ ర్నినాదముల్ వెలయంగ
"విపుల రాజ్యరమాభి వృద్ధిరస్తు
శ్రీరస్తు వైభవ శ్రీరస్తనుచుఁ జల్లి
రమల ప్రసూన లా జాక్షతములు
వందులు జయజయ ధ్వాన పూర్వముగఁ బ్ర
తాపుని కీర్తి నందఱును బొగడి

గీ॥ రచల నందిని బోలెఁ బుణ్యవతులైన
బ్రాహ్మణ స్త్రీలు పాటలు పాడుకొనుచు
రాజ దంపతులకును హారతుల నిడిరి
బంగరు హొరంగు దీపాల పళ్లెరముల. 391

గీ॥ ఆప్రతాపు సింహాసన మవల నొక్క
హేమమయ మనోజ్ఞాసన మెక్కఁజేసి
యమరసింహుని యౌవరాజ్యంబునకును
బట్ట భద్రునిఁజేసి సంబరముఁ గనిరి. 392

మ॥ విమలానర్ఘ మనోజ్ఞ భూషణములున్ విచిత్రైన సౌవర్ణ వ
స్త్రములున్ హాటక రత్నపాత్రలు నలుంద్రా కృష్ణసింహాద సై
న్య మహానాధులు కానుకలిచ్చుచుఁ బ్రతాపాధీశు దివ్యాంఘ్రి యు
గ్మము సేవించిరి భక్తిపూర్వక నమస్కారంబు లర్పించుచున్. 393

మ॥ తన దేశంబుననుండి సేవకుల చేతన్ గంపలన్ ముంచి యొ
య్యనఁ దెప్పించిన ముత్తియంబులు ప్రతాపాధీశ్వరున్ బ్రాసు నం

దునఁ గూర్చుండఁగఁ జేసి వాని సరియెత్తుల్ దూఁచి మేవాడ భూ
జనులం దంతటఁ బంచిపెట్టె శబరక్ష్మానాథుఁ డత్యాదృతిన్. 394

క॥ అందఱు హర్షధ్వని మి
న్నందఁగ సింహాసనంబు నఱుత నిలిచి కే
లుం దమ్ములు ముకుళించుచుఁ
గందో యఱమోడ్చి మధుర గళ సంపదతో. 395

మ॥ "అనిదం పూర్వపు దేశభక్తి యనివార్యంబైన త్యాగైక వ
ర్తన మట్ఠాకలులేని విక్రమకళా ధాటిన్ బ్రసాదించి యీ
మన స్వాతంత్ర్య మహోద్యమంబు జయ సన్మాన్యంబుగా నుద్ధరిం
చిన సర్వేశ్వరు పాద పద్మములు నేసేవింతు సద్భక్తితో. 396

క॥ మనలోని యోగ్యతాలవ
మును నౌరసి ప్రపంచమునకు స్ఫుటపఱచిన యీ
వన నృపతి యక్బరీశున
కనువు పడెడుఁగాక యాయురారోగ్యంబుల్. 337

క॥ కలనైన నౌరులదెసఁ బగ
మొలువక యుండెడిని నెల్లపుడు నా"కని ని
శ్చల హృదయమ్మున దేవునిఁ
దలఁచి ప్రతాపుఁడును భక్తి దళము కొనంగన్. 398

—* ప్రతాపుఁడు తనవారిని సత్కరించుట. *—

మ॥ "గురుఁడెల్లప్పుడు నగ్రపూజ్యుఁడని వాక్రుచ్చున్ శ్రుతుల్ పెక్కు లీ
చరణాబ్జంబులు నాకహర్నిశములున్ సంసేవ్యముల్ వీని నే
మఱువన్ జేయకు మ్మంచు నీశ్వరుని సంప్రార్థించు మేవాడ యే
మఱువన్ జాలదు నీమహోపకృతి భామాసాహి మంత్రీశ్వరా, 399

మ॥ నను నారాజ్యము నాప్రజావళి నఖండ త్యాగమున్ బెంచి ప్రో
చిన దైవంబవు నీవు సంతతము నీ శ్రీపాద సేవా వినూ
తన భాగ్యంబు స్థిరంబుసేయుము నినున్ ధ్యానించి కీర్తించుచున్
మనువాఁడన్ గనువాఁడధన్యతను భామాసాహి మంత్రీశ్వరా. 400

గీ॥ అనుచు ముందున కరిగి యయ్యవని దేవు
చరణ పద్మంబులకు మ్రొక్కి సరస నున్న
తక్కి గురువుల కెఱఁగి వస్త్రములు కనక
భూషణము లిచ్చి యడుగులు పూజ చేసి. 401

చ॥ "ఇరువదియైదు వత్సరము లెన్నియొ బాధల కోర్చి నాపయిన్
దొరఁగు విపత్ప్రవాహములనున్ గడఁబెట్టుచు దేశసేవలన్
గఱపుచు నుద్ధరించిన జగన్నుతకీర్తివి! నిన్ను మిత్రుఁడున్
గురుఁడును నింక దైవమని కూడ భజించెద నాదు పాలికిన్. 402

సీ॥ గణుతింపరాని భోగములు గల్గి స్వతంత్ర
నృపుఁడవై కష్టంబు నెఱుగఁకుండ
నడచు మహానుభావుఁడ వయ్యు నన్ఁగూర్చి
వలచి వలచి కష్టములను నోర్చి
ధనము సైన్య మొసంగుచును స్వయమ్ముగ యుద్ధ
ములు చేసి నాయిడుమలను నీదు
నిడుమలుగా నెంచి యింత కాలముసుండి
వరమైత్రి నాయెడఁ బరపినావు!
గీ॥ గిరి తటము లందు భటులను నెఱపి వేయి
కనుల నాయాలు బిడ్డలఁగాచినావు
నిబిడమై నిత్యమై యొప్పు నీదు కృపరుఁ
బారమే లేదు భిల్లసర్వజ్ఞమూర్తి! 403

క॥ నీయప్పు తీఱనిది బ్ర
హ్మాయువు నేనొందియైన నర్హోప కృతిన్
జేయఁగలే! నీమణులును
హేయపు వస్త్రముల నొసఁగి యీఁగఁగఁ గలనే. 404

క॥ అని శబరలోక నాథున
కును వందన మాచరించుకొని కౌఁగిటి యం
దున నిలిపి సలుంబ్రా కృ
ష్ణుని జేరఁగఁ బోయి పేర్మిశోభిలు చుండన్. 405

మ॥ "నను వీడన్ జన కెప్పుడున్ మెలఁగుచున్ నానీడయున్ బోలెఁ గం
టిని ఱెప్పన్ వలెఁ గాచి ధర్మవితతిన్ నేర్పించి, సంపూర్ణ భ
క్తిని నాతోడిద లోకమంచు నను రక్తిన్ గొల్చు నీ యీ ఋణం
బును నేఁదీర్పఁగఁ జాలఁ బెక్కుభవముల్ పుత్త్రుండనై పుట్టినన్ 406

మ॥ కడుదూరంబునఁ దోఁచు నాపదఁ బొలంగన్ జేయఁగా ముందుకున్
బడి యత్నించెదు, సుంత సౌఖ్యమయినన్ స్వారాజ్యమే యిచ్చిన
ట్లెడఁదన్ బొంగెదు! నాయభీప్సితమె నీ యిష్టం బటంచుం దమా
త్యుఁడవం చెప్పుడు చూడ, దేవుఁడ వటంచూహింతు నాపాలికిన్.

మ॥ త్వ దధీనంబగు సైన్యమున్ సిరి మనో వాక్కాయ కర్మంబులన్
మ దధీనంబులుచేసి యెల్లయపుడున్ నాశ్రేయమున్ బెంచు నీ
సదయాంతఃకరణంబు నెంతని ప్రశంసన్ జేయ! నీ బాహుసం
పద మేవాడకు వజ్రదుర్గమయి కూర్పన్ గల్గెఁ గీర్త్యున్నతుల్. 408

మ॥ ఇఁక రానుండెడి కాలమందున జనంబేదేశ మందైన నూ
ఱక ప్రస్తావము పేర్మి నొక్కెడ 'సలుంబ్రా కృష్ణసింహు'ం డనన్
మొకముల్ విప్పఁక స్వామిభక్తి యొకచోఁ బుం రూపమున్ జెంది వా
రికి సాక్షాత్కృతియై తనర్చెడిని, దండ్రీ! యెంత పుణ్యుండవో."

మ॥ అని పాదంబుల మ్రోల వాలుచు నమాత్యాధీశ్వరున్ బూజ చే
సిన నాతండు సమోద బాష్పనయన శ్రీమీఱ సాష్టాంగ వం
దనమున్ దీరిచి భక్తితో నిలిచె నాగాత్రీశ్వరుం డంతఁ జెం
తనె సూక్తాది సహోదర ప్రతతి సేనా భర్తలన్ జూచుచున్. 410

మ॥ "తిన నాహారములేక యుండినను భక్తిన్ బెంచుచున్ దండ్రి రీ
తి ననున్ గొల్చుచుఁ ద్యాగమున్ నెఱపుచున్ దేశంబు సేవించి శో
భన సత్కీర్తి పరంపరల్ నలుదెసల్ ప్రాకంగ వర్తించి నా"
రనుచున్ వారిని వారివారిఁ గడు నాహ్లాదంబునన్ జేరుచున్. 411

క॥ విలువగల వస్తువుల భూ
షల నొసఁగు నర్హరీతి సన్మానములన్
సలుపఁగఁ ఢామాసాహియు
నిలిపెను సింహాసనమున నృపలోక గురున్. 412

—◆ భామాసాహి ప్రతాపసింహు నాశీర్వదించుట ◆—

సీ॥ బహుళ విద్యుద్దీప పటల ప్రభాభాసి
యగు రాజమార్గంబు ననుకరించు
నీ జీవితంబును నిరతంబు, హైందవు
లనుపమంబగు భక్తి ననుసరింతు
రనఘ' నీవంటి మహానుభావుల లోక
పావన జీవితపటల మెపుడు
దేశచరిత్రపై తేజరిల్లుచునుండు
ధారుణీ జనుల కాదర్శ మదియ

గీ॥ నీ చరిత దేశదేశముల్ నిండియుండు
నీ యఖండ శోభన నామధేయము విను
వార లాపదలకు జంకుపడక ధైర్య
పర్వతములౌచు శాశ్వత ప్రభ వహింత్రు. 413

మ॥ నిను దర్శించుచు నీదరిన్ మెలఁగుచున్ నీతోడ భాషించుచున్
నిను సేవించుచు నిన్మదిన్ దలఁచుచున్ నీపూజలన్ జేయుచున్
మనగాఁ గల్గుట మేటిభాగ్యమనుచున్ మాబోంట్ల మెల్లప్పుడున్
నిను దేవున్బలెఁ జూచుచున్ గొలుతుమో నిర్నిద్ర తేజోనిధీ! 414

సీ॥ కోటికష్టము లైన గోట మీటఁగ జాలు
వీక్షలఁ బరము గాంభీర్య మలర
నవ శరచ్చంద్రి సౌందర్య మందిరమైన
ముఖము శాంతసమగ్రభూతి నెఱప
వ్యాకోచ మల్లికా ప్రసవ రాజంబట్లు
చిఱునవ్వు పెదవిపై సిరులునింప
అందమై పుష్టమై యాజాను దీర్ఘ బా
హార్గళ యుగళంబు హౌసుఁజెంప

గీ॥ వార్ధి సంవృత మేదినీ వలయమెల్ల
వశము చేసికొనన్జాలు ప్రభుత దనర

వెలయు నీవిశ్వమోహన వీరమూర్తి
విడక మామనసులఁ దాండవింపుఁగాక. 415

మ॥ అమితోత్సాహముఁ దేశభక్తి రతి నీదైయుండు; నీమేని ర
క్తమునందుఁగల బిందువొక్కొకఁడు స్వాతంత్ర్యంబు స్వాతంత్ర్యమం
చు మహాదీక్షను బల్కుఁ; నీకు సమ లీక్షోణీ స్థలిఁ లేరు; భ
క్తి మహత్త్వంబున నిన్నుఁగొల్తుఁ గరుణాదేవీ కుమారోత్తమా 416

సీ॥ రవివంశ కలశ సింధువు రాజరత్నాళిఁ
దరతరంబుగ వెలువఱచుఁ గాత
మేవాడ జనిఁబుట్టువా వ్రజమెల్ల స్వ
తంత్రతాశాణ దీప్తమగుఁ గాత
రాజపుత్రాన్వ యారణిజ తేజము ధర్మ
దీక్ష నాహవవేదిఁ బెరలుఁ గాత
పాటేశ్వరిని బోలు పతిదేవతలకు హైం
దవభూమి పుట్టినిల్లగును గాత

గీ॥ భూజనులు విప్లవమ్ముల మ్రుంగు నప్పు
డడరు లడఁచి క్రొందలిరుల నలవరింప
నిన్నుఁబోలు మాధవుఁడు జన్మించుఁగాత
చన్న గజరాజ సింహ! ప్రతాపసింహ!". 417

గీ॥ అనుచు నానంద బాష్పంబులతిశయిల్లఁ
జారునవరత్న సామృతనారికేళ
ఫలము దోసిటఁ గొనిపోయి ప్రభున కిచ్చి
చేతు లెత్తుచు నిట్టు లాశీర్వదించె. 418

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

## ఉపసంహారము.

శా॥ నే నెల్లప్పుడు భావనా బలమునన్ నీరూప నామ క్రియా
ధ్యానంబుల్ గొని తన్మయత్వమున నన్యాకాంక్షలేకుండు నీ
వే నేనై తినొ నేనె నీవయితొ రూపింపంగ రాకుండె, ని
త్యానందంబు ఘటించె నీకృతి ప్రతాపా విశ్వలోకార్చితా. 1

మ॥ పదియేండ్లయ్యెను నిన్నుఁగూర్చి పరియింపన్ సాఁగి యిన్నేండ్లు నా
మదిలోనన్ భవదీయ విక్రమ కళామాధుర్య సౌభాగ్యముల్
కుదురై నెక్కొని వేఱు పాఱుకొనియెన్ గొండంతలౌ కోరికల్
వొదలెన్ నిన్నునుతింప! నీదుచరితంబున్ వ్రాసి హర్షించితిన్. 2

మ॥ చదలే అట్టులు ముజ్జగంబుల భవత్స్వచ్ఛంద కీర్తిచ్ఛటల్
వెదచిందన్ గనుఁగొంటి! భారతమహోర్విన్ వీడి మున్నాట ము
ప్పది యాఱేఁడులు దాఁటె! నీచరితమున్ వర్ణించు భాగ్యంబు నా
కొదవెన్ నేఁటికి నన్నువంటి కృతకృత్యుల్ లేరు లోకంబునన్. 3

మ॥ దినరాజున్ బలె నుగ్రకోపనుఁడవై తీండ్రించి శైలంబు నిం
డిన తౌరుష్కులదాఁకి నీనడపు హల్దీఘాటు యుద్ధాంగణం
బున విశ్వోన్నతమైన నీదు విభవంబున్ గొంత నేఁ బంచుకోఁ
గనకున్నన్ నినుగూర్చి యింత యనురాగం బిట్టు లుప్పొంగునే. 4

చ॥ ఇలఁగల వీరపుంగవుల నిట్టి బలోన్నతుఁ డిట్టి ధీరుఁడున్
గలుగఁ డటంచుఁ బేర్గనిన గండఁడ వీవిఁక నిల్లువీడి వీ
ధులఁ జరియింపలేని కడు దుర్బలదేహుఁడ? నన్ను నేగతిన్
వలచితొ! నీ చరిత్రమును వర్ణనచేయఁ బ్రతాపభూవరా. 5

మ॥ "వనజాతాప్తుని వంశమేడ? కడు నల్పజ్ఞుండ నే నేడ" నం
చనె విశ్వోన్నత సత్కవిప్రవరుఁడౌ నాకాళిదాసుండు నీ
వినవంశాభరణంబ, వుత్తముఁడవౌ, దీ నీ చరిత్రంబు వ్రా
యను గించిద్జ్ఞుఁడ నాకు యోగ్యతయు మృగ్యంబంచుఁజింతించెదన్

గీ॥ భువనశౌర్యాంకమైన నీమూర్తిఁగాంచి
యనుపమంబైన నీకథ లాలకించి

రసమునను దేలి పొగడని రసికు లుండ
రెట్టి నాయకోత్తముఁడ వోయీ ప్రతాప! 7

గీ॥ భవదుదార శౌర్యమును భావన మొనర్చి
రసమునను జొక్కి గ్రంథంబు వ్రాయునపుడు
త్వద్వశుండనై యానంద బాష్పములను
నాణిముత్యాల వలె రాల్తు నహరహంబు. 8

గీ॥ నా మహోదాత్త నాయకస్వామి వీవు
భవదనఘ కీర్తిఁ గొనియాడు కవిని నేను
త్వత్కథామృత రుచిర కావ్యంబు తోడ
హృదయ కుసుమంబు నీకు నర్పించుకొందు. 9

క॥ ఉత్తమ ధీరోదాత్త నృ
పోత్తరుఁడవు నిన్నుఁ బొగడ యోగ్యంబని రే
కెత్తుతమి హృదయరస మే
నెత్తితి దుత్తల కొలంది నీ చరితమునన్. 10

క॥ వరలోకోత్తర సుగుణో
త్తర నాయక చక్రవర్తి! త్వత్కీర్తికళల్
స్థిరమయ్యెడుఁ గాత ముదా
హరణములై చంద్రతారకార్క స్థాయిన్. 11

మ॥ కరమున్ భక్తిని నా రచించిన మహాగ్రంథంబు నందెంచి నీ
చరితం బాంధ్రులు నిత్యమున్ జదివి నీ స్వాతంత్ర్యమున్ ద్యాగ వి
స్ఫురణంబున్ సముదార విక్రమకళా పూర్ణత్వమున్ నేర్వఁగ
ల్గిరయేనిన్ ననుఁ బోలు ధన్యులిలలో లేరంచు హర్షించెదన్. 12

ఉ॥ పూలును సౌరభంబు మధువున్ జెడు వృక్షము పోయినంత! శం
పాలతదాని శోభలును బాయు నిమేషములోన! నీజగ
జ్జాలము లర్పనేయు పటుశౌర్య పరాక్రమరాశి వైన నిన్
బోలిన ధీరకీర్తి పొలిపోవదు లోకము గ్రుంగిపోయినన్.

సీ॥ నీవలెనే సర్వనృప చంద్రులు స్వధర్మ
నిరతులై దేశ మూనెదరుగాక

శ్రీసలుంబ్రా కృష్ణసింహుఁబోల్ స్వామి భ
క్తి పరులు పేరు చెందెదరు గాక
పాటేశ్వరిని బోలి భారతాంగనలు సా
ధ్వులటన్న యశము నొందుదురు గాక
యమరసింహుని మాడ్కి నాంధ్ర యువకులెల్ల
గురు విక్రమమున వెల్గుదురు గాక

గీ॥ కమల వనమట్టి భారతఖండ మెల్ల
వీర రసఖండమై ధాత్రి వెలయుఁ గాక
యాంధ్రులను పేరు ఖండ ఖండాంతరములఁ
దక్షు లందఱు శిరములఁ దాల్తురి గాక.

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్ష సమాసాదిత రసవత్కావ్య నిర్మాణ చాతురీ ధురీణ, సుగుణ గణపారీణ, దుర్భాక వంశ దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర, సుజన జనానుగ్రహ పాత్ర, వేంకటరామార్య పుత్ర, కవి సార్వభౌమ—సాక్షాద్వీర ప్రతాపాది—వింశత్యధిక బిరుద విఖ్యాత, సుకవి రాజశేఖర రాజశేఖర కవి ప్రణీతంబైన రాణాప్రతాపసింహ చరిత్రంబను పద్య కావ్యంబు నందు పంచమాశ్వాసము.

సంపూర్ణము.

మారుతీప్రెస్, ప్రొద్దుటూరు.

శ్రీ

# "కవి సార్వభౌముని" కావ్యములు

| | |
|---|---|
| వీరమతి-800 పద్యములు-ఘూర్జరదేశ వీరనారీమణి చరిత్రము వెల | 1- 0-0 |
| చండనృపాల చరిత్ర. 750 పద్యములు- భీష్ముని కథ వంటిది. | 0 -12-0 |
| రాణాప్రతాప చరిత్ర 2000 పద్యములు-ఉత్తమ పద్యకావ్యము. | 4 -0-0 |
| సీతాకల్యాణము [నాటకము] | 0 -8-0 |
| సీతాపహరణము ,, | 0 -8-0 |
| పద్మావతీ విజయము ,, | 1 -0-0 |
| విలయ మాధుర్యము [స్వప్న చంపువు] | 0 -8-0 |
| అవధానసారము. (రాజశేఖర-వెంకటశేషకవులు) | 0 -8-0 |
| ఆర్యావర్త వీరనారీమణులు [ఆంగ్లేయ వచనము.] | 1 -0 0 |
| వృద్ధిమూల సంవాదము. | 0 4 0 |

ఇప్పుడే వెలువడినది.

| | |
|---|---|
| పుష్పాంతి, 1200 పద్యములు. ఉత్తమ శృంగారము నిండు హాస్యము కడుపంతయు నవ్వు, దేహమంతయు నవ్వు, దేశమంతయు నవ్వు. చెళ్లపిళ్లవారు తొలిపలుకును శ్రీ విశ్వనాథవారు పోద్ఘాతమును వ్రాసిమెచ్చినది. వెల | 2 -0-0 |
| అమరసింహ చరిత్ర. 1700 పద్యములు ఉత్తమ వీరరసకావ్యము | 3 -8-0 |
| గోదానము. | 0 -4-0 |
| స్వయంవరము. | 0 -4-0 |
| త్రివేణి [శి. వి. సుబ్బన్న శతావధాని.] | 0 -8-0 |
| చెంచులక్ష్మి (నాటకము) | 1 -0-0 |

వలయువారు:—

ది. రాజశేఖర శతావధాని,

గంభీర విలాస్, ప్రొద్దుటూరు.